# హిందూ దేశ కథా సంగ్రహము

## ప్రథమ భాగము

# హిందూమహాయుగము

ఇయ్యది
కొమఱ్ఱాజు - వేంకట లక్ష్మణరావు, ఎం. ఏ. గారిచే
రచియింపఁబడియె

ప్రకాశకులు:
లక్ష్మణరాయ పబ్లిషింగు కంపెనీ
గవర్నరుపేట, బెజవాడ

---

బెజవాడ
ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల (లిమిటెడ్) యందు
క. కోదండరామయ్యగారిచే
ముద్రింపఁబడియె

1925

 [వెల 1-8-0

మొదటి కూర్పు. 1907
రెండవ కూర్పు. 1908
మూఁడవ కూర్పు. 1909
నాల్గవ కూర్పు. 1910
అయిదవ కూర్పు. 1912
ఆరవ కూర్పు. 1925

# ఆఱవకూర్పు పీఠిక.

ఈగ్రంథరాజమును కీర్తిశేషులైన కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారు 1907 నందు రచించి తరువాత అయిదు కూర్పుల నచ్చొత్తించిరి. ఎప్పటికప్పుడేఁ బెక్కు నూతనాంశములు జేర్చి ముద్రించవలయునని వారు తలపోయుచు వ్యవధిఁ జిక్కనందున నేమియు మార్పులు చేయలేకపోయిరి. వారి మరణానంతర మీగ్రంథము నచ్చొత్తించుభారము నాపైఁ బడుటవలన ఈకూర్పునందైనను చారిత్రకపరిశోధకుల సాహాయ్యమున వలయు మార్పులు కలిగించవలెనని తలంచితినిగాని నాకుఁగూడ తీరిక జిక్కనందునను, పరిశోధకుల కృపావీక్షణమున కీగ్రంథము గుఱిగాకపోవుటవలనను, గ్రంథమును త్వరలో బ్రచురింపవలసిన యావశ్యకత మిక్కిలిగ నుండుటఁ జేసియు తొందఱ తొందఱగా నీగ్రంథమును ముద్రించవలసి వచ్చినది. కావున నిందేవైన సవరణలు జేయవలసియున్నచోఁ జారిత్రకపరిశోధకులు దయయుంచి తెలిపినయెడల రాబోవు కూర్పునందు వానిం జేర్చి వారికృతజ్ఞతకుఁబాత్రుఁడ నయ్యెదను.

ఈగ్రంథమును త్వరలో ముద్రణము గావించి గ్రంథముద్రణకాలమందు జరిగిన కష్టనష్టములకు బాధ్యులై మిక్కిలి సాహాయ్యముఁ గావించిన ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలాధిపతులకు నాకృతజ్ఞతా వందనము లర్పించుచున్నాను.

బెజవాడ,
కృష్ణాజిల్లా,
20-10-1925.

కానూరు వీరభద్రేశ్వరరావు.

## ఐదవ కూర్పు పీఠిక

ఒక్కొక్కముద్రిణమున కొక్కవత్సరమైన వ్యవధి నీయక యచ్చొత్తింపఁజేయు సావకాశముగల్పించెడు ఆంధ్ర మహాశయులకును పాఠశాలల పఠనీయగ్రంథముగ గైకొనిన విద్యాశాఖాధికారులకును నేను కృతజ్ఞుఁడ. అనతికాలములో అత్యంతాభివృద్ధిని గాంచిన నాయీగ్రంథరాజము నాచంద్రార్కముగా నీశ్వరుఁడు బ్రోచుగాక!

5-10-1912. గ్రంథకర్త.

---

## నాల్గవ కూర్పు పీఠిక.

ఇది యీగ్రంథముయొక్క నాల్గవకూర్పు. ప్రతి సంవత్సరమును ఒక క్రొత్తకూర్పు అచ్చుపడులాగునఁజేసి యాంధ్రజనులు ఈ గ్రంథమునకు అనన్యసామాన్యమైన గౌరవముఁ గలుగఁజేసిరి. కావున వారియెడ నేనెప్పుడును కృతజ్ఞుఁడ.

ఈ నాల్గవకూర్పులోఁ బెక్కువిషయములు క్రొత్తగాఁ జేర్పఁదలచితిని. కాని నాకు వ్యవధిచిక్కనందునను, చరిత్ర సాధనములేని పల్లెలో నేను నాలుగైదు మాసములనుండి యుండుట తటస్థించినందునను, ఈ గ్రంథము కావలయునని ప్రతిదినమును అసంఖ్యలేఖలు వచ్చుచున్నందునను, విజ్ఞాన చంద్రికాపరిషత్తువారు తమచే నియమింపఁబడిన తెలుఁగు పరీక్షనిమిత్తమై యీ గ్రంథమును పఠనీయముగా నియమించినందునను, మార్పులు లేకయే యీ కూర్పు అచ్చొత్తింపఁ బడినది.

అనేక సవరణలుచేసి గ్రంథమును త్వరలో ముద్రణము గావించినందులకు జ్యోతిష్మతీ ముద్రాయంత్రాధికారులగు బ్రహ్మశ్రీ వేదము- వేంకటరాయశాస్త్రులవారికి నాకృతజ్ఞతా వందనములు సూచించుచున్నాను.

నడిగూడెము,
కృష్ణాజిల్లా,
14-9-1910.

గ్రంథకర్త.

---

## మూఁడవకూర్పు పీఠిక

ఈగ్రంథముయొక్క మొదటికూర్పు పీఠిక 3-10-1907 తేదిని వ్రాయఁబడినది. అనఁగా దీనియొక్క మొదటికూర్పు ప్రకటింపఁబడి నేఁటికిఁ బూర్తిగ రెండు సంవత్సరములయినను కాలేదు. ఇంత స్వల్పకాలములో ఈ గ్రంథము యొక్క కూర్పులు రెండును అయిపోయినందున నీ మూఁడవకూర్పు ప్రకటింపఁబడినది. ఇట్లు రెండేండ్లలో మూఁడుకూర్పులచ్చు పడిన తెలుగుపుస్తకములు మిక్కిలియుండవు. కావున నిది యీగ్రంథమున కొక గౌరవవిశేషముగా నెంచవలసియున్నది. మాయుద్యమమున కన్నివిధములఁ దోడ్పడి, మాగ్రంథములఁ బ్రేమతో నాదరించి, వాని రెండవకూర్పును, మూఁడవకూర్పును త్వరత్వరగా నచ్చుపడునట్లుగాఁ జేసిన యాంధ్రపాఠక ప్రపంచమునకు మేము కృతజ్ఞతాపూర్వక వందన- కంటె నేమి యీయగలము?

అచ్చటచ్చట ప్రాథమికపాఠశాలలలో కేర్త. బాలురకుఁ బఠనీయముగాఁ బెట్టి కొంద

మాకుఁదోడ్పడిరి. ఇట్టివారికిఁగృతోపకారమునకై వందనములాచరించుచు, ఇఁక ముందును విజ్ఞానచంద్రికామండలివారిచేఁ బ్రకటింపఁబడు గ్రంథములను ఇట్లె యాదరింపుదురు గాతమని కోరుచున్నాఁడను.

ఈపుస్తకములోని కొన్ని భాగములు 1909 వ సంవత్సరము ప్రవేశపరీక్షకుఁ (Matriculation) బోవు విద్యార్థులకుఁ బఠనీయముగా నేర్పఱచి, చెన్నపురి సర్వకళాశాలవారు విజ్ఞానచంద్రికాగ్రంథమాలను సత్కరించిరి. ఇట్లు లోకాశ్రయము, విద్వదాశ్రయము ఈ రెండును తమకబ్బినందుకు 'మండలి' వారెంతయు సంతసించుచున్నారు.

ఈ కూర్పువిషయమై బ్రహ్మశ్రీ మ. రా. రా. శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారును, కనుపర్తి మార్కండేయ శాస్త్రిగారును నాకు మిక్కిలి సాయముచేసిరి. కావున వారియెడఁ గృతజ్ఞతఁ జూపుచున్నాఁడను.

35, స్వామినాయక వీధి,
చింతాద్రిపేట,
చెన్నపట్టణము.
17—7—1909

గ్రంథకర్త.

---

## రెండవకూర్పు పీఠిక.

పరి[illegible]
నందున[illegible]గ్రంథము యొక్క మొదటికూర్పు వేయి ప్రతులును
బడినది. [illegible]రించిన యైదు నెలలలోనే కర్చయినందున ఈ రెం
[illegible]వేయింపఁబడినది. ఆంధ్రదేశమండలి పండితు

లును, పత్రికాధిపతులును, ఇతరజనులును ఈ హిందూదేశచరిత్రనుగుఱించి తమతమ యనుకూలాభిప్రాయములను దెలిపి నన్ను ఎంతయో ప్రోత్సాహ పఱిచినందుకు నేను వారియెడఁ గృతజ్ఞుఁడను. అనుదినమును గ్రంథములు కావలయునని యుత్తరములు వచ్చుచుండుటచే నీరెండవకూర్పింత త్వరలో అచ్చు వేయింపఁబడినది. కావున నేను తలంచినన్ని క్రొత్తయంశము లిందుఁజేర్చుటకు వీలులేకపోయెను. అయినను ఇందుఁ గొన్ని ముఖ్యమైన నూతనాంశములు చేర్చఁబడినవి. నూతన పటము కూడ నొక్కటి చేర్చఁబడినది. పుస్తకములన్నియుఁ గ్యాలికో యనబడు బట్టతో నట్టకట్టింపఁబడినవి.

ఇదివఱకుఁ దెనుఁగు పాత్తంబుల యట్టమీఁద నాంగ్లేయాక్షరములతోఁ జేళ్ళు వేయు నాచారముండెను. కాని యందు వలన నవి యింగ్లీషుగ్రంథములేమోయని సామాన్యజనులు భ్రమపడుచుండిరి. కావున నీగ్రంథములో నాయాచారము మాని యట్టమీఁద నాంధ్రాక్షరములే వేయించినాఁడను.

మ-రా-రా-శ్రీ రావుబహదరు కందుకూరి వీరేశలింగము పంతులుగారును, బ్రహ్మశ్రీ కనుపర్తి మార్కండేయ శర్మగారును, ఈ రెండవకూర్పు నచ్చొత్తించుటలో నాకు మిక్కిలి సాయమొనర్చిరి. కావున వారికిఁ గృతజ్ఞతాపూర్వక వందనము లాచరించెదను.

ఇట్లు,

15-5-08. గ్రంథకర్త.

## మొదటి కూర్పు పీఠిక

మిక్కిలి పెద్దదిగాకుండగను మిక్కిలి చిన్నదికాకుండగను హిందూదేశచరిత్ర మొకటి వ్రాయవలయునని యిచ్చ నామనస్సులో నెన్నియో దినములనుండి యుండెను. విజ్ఞానచంద్రికామండలివారి ప్రోత్సాహముకతన నేఁటి కాకోర్కె ఫలించినది.

అత్యంత పురాతనకాలమునుండి నేఁటివఱకు జరిగిన హిందూదేశచరిత్ర మంతయు నేడెనిమిదివందల పుటలలో వ్రాయ నిశ్చయించితిని. అందిది ప్రథమభాగము. హిందూ మహాయుగము(Hindu period)నుగుఱించిన కథాభాగ మిందు ౨౨౮ పుటలలో ముగింపఁబడినది. పెద్దయక్షరములతో నచ్చు వేయించినయెడల పుటలసంఖ్య హెచ్చి చదువరులకు నధిక ధనవ్యయమగునని యెంచి చిన్న యక్షరములతోనే గ్రంథము ముద్రింపించినాఁడను.

ఈగ్రంథము వ్రాయుటలో నాకు శ్రీ రమేశచంద్రదత్తుగారి గ్రంథము ముఖ్యాధారమైనప్పటికిని హిందూదేశ చరిత్రసంబంధమైన యింగ్లీషు, హిందీ, మరాటీ మొదలగు భాషలలో వ్రాయఁబడిన గ్రంథము లన్నియుఁ గాకపోయినను ముఖ్యమైన వన్నియుఁ జదివి వానిలోని సారమంతయు నిందుం జేర్చి శ్రీ దత్తుమహాశయుగారి గ్రంథములో లేని యనేకాంశము లీగ్రంథమున వర్ణించినాఁడను. ఇందువిషయమై నేను చూచిన యన్ని గ్రంథముల పేళ్ళిచట నిచ్చుట యనావశ్యకము.

ఋగ్వేదసూత్రయుగముల చరిత్రకురుం టేకృతమైన 'విసిసిట్యూడ్స్ ఆఫ్ ఆర్యన్ సివిలిజేషణ్ ఇణ్ ఇండియా' (Vicissitudes of Aryan civilization in India) యను గ్రంథమును, బౌద్ధయుగచరిత్రకు విన్ సెంటు స్మిత్ కృతమగు 'అర్లీహిస్ట్రీ' అను గ్రంథమును, రామాయణీయ స్థలనిర్ణయముఁజేయ మరాటీభాష లోని 'కావ్యసంగ్రహానుబంధము'ను ముఖ్యమైన యాధారములని చెప్పఁ జాలును. ఇవియుఁగాక ఋగ్వేదాదిక సంస్కృత గ్రంథములలోని వాక్యములు స్వయముగాఁజూచి వ్రాయఁబడినవి. వ్యాకరణ మహాభాష్యముయొక్క యచ్చుప్రతి నాకు లభింపనందున నందలి వాక్యములు రుంటేకృతగ్రంథము నుండి యుదాహరింపఁబడినవి.

హిందూ మహాయుగములోని ఋగ్వేద సూత్రసూత్ర యుగములయందలి కథాంశము లంతగాఁ దెలియవు. కావున నవి విశేషముగాఁబెంచి వ్రాయలేదు. బౌద్ధపౌరాణిక యుగములలోని చరిత్ర తెలిసికొను సాధనంబు లనేకము లున్నందున ఆభాగము విశేష వివరముగను, మన పూర్వుల యశో విభవము చక్కఁగఁ దెలియునటులును వర్ణింపఁబడినది.

ఈ గ్రంథమును గుఱించి నింక నధికముగ వ్రాయుట కంటె నీగ్రంథము చదివి తెలుఁగు చదువరులే దీని యోగ్యతా యోగ్యతలు నిర్ణయింతురు గాతమని విరమించుటయే మేలు. ఈ ప్రథమభాగము చదువరులకురుచించెనేని రెండవ మూడవ భాగములు త్వరలో వెలువడఁగలవు.

తమకు వేలుపనుల తొందరలున్నను శ్రీమయనక యీ గ్రంథముయొక్క యచ్చుచిత్తులు (Proofs) దిద్దుటలో నాకు

సహాయ మొనర్చినందుకు నామిత్రులగు మ - రా - రా - శ్రీ కనుపర్తి మార్కండేయ శర్మ శాస్త్రిగారికి వందనము లొనర్చుచున్నాఁడను.

రంగులతో దేశపటము [Map] వేయుపద్ధతి మిక్కిలి కష్టమైనదియు, స్వదేశీయులకు విశేషముగాఁ దెలియనిదియు నైనను మిక్కిలి కష్టపడి యావిద్యను సాధించి మాకొఱకు నెంతయు శ్రద్ధతో నైదురంగులపటము సిద్ధముచేసి యిచ్చినందుకు 'పవార్ అండుకో, మౌంటురోడ్, మద్రాస్' అను ఎన్‌గ్రేవరు (Engraver) సంఘమువారిని నెంతయుఁ గొనియాడవలసియున్నది.

ఈగ్రంథమునందు వాడఁబడిన శకములు.

ఈగ్రంథమునందు 'క్రీ. శ.' మఱి 'క్రీ. పూ.' అని రెండు శకములు ముఖ్యముగా వాడఁబడినవి. క్రీ. శ. యనఁగ క్రీస్తు. శకము. ఇది క్రైస్తవ మతాచార్యుఁడగు జీసస్ క్రైస్తువు యొక్కపుట్టుక యొద్దనుండి లెక్కవేయఁబడును. క్రీ.పూ.అనఁగాఁ గ్రీస్తునకుఁ బూర్వమని యర్థము. దీనిని ఇంగ్లీషులో బి.సి. (B. C.) అనియెదరు. ఇది క్రీస్తువు పుట్టినప్పటినుండి వెనుకకు లెక్క వేయఁబడును. ఇందు కుదాహరణము:—క్రీ. పూ. ౫౫౭ లో బుద్ధుఁడుపుట్టెననఁగా క్రైస్తువు యొక్క జన్మమునకుఁ బూర్వము ౫౫౭ ఏండ్లకిందటనే బుద్ధుఁడు పుట్టెనని యర్థము. ఇట్లీరెండుశకములును క్రైస్తువు పుట్టినసమయమును ఆధారము చేసికొని యొకటి (క్రీ.పూ.) వెనుక వెనుకకు లెక్కవేయఁగ వచ్చును; రెండవది (క్రీ.శ) ముందుముందునకు లెక్కవేయఁగ వచ్చును.

ఒకానొక సమాచారము ఈశకములోని యిన్నవ సంవత్సరమున జరిగినదని చెప్పుట యెందులకు? ఆ సమాచార మిప్పటికి నిన్ని సంవత్సరములక్రింద జరిగెనని చదువరులకు దెల్పుటకే. నేటికి (ప్లవంగనామసంవత్సర భాద్రపద బహుళమువఱకు) క్రీస్తుశకము ౧౯౦౭ సంవత్సరము లని యందఱికిఁ దెలిసియే యున్నది. కావున నేదియోసమాచారము క్రీ.శ. ౧-లో జరిగినదని చెప్పినయెడల నేఁటికి ౧౯౦౭ సంవత్సరములక్రిందట జరిగినదనియర్థము. శ్రీహర్షుఁడు క్రీ.శ. ౬౦౬-లో రాజ్యమునకు వచ్చెననఁగాఁ గ్రీస్తువు పుట్టినతరువాత నిన్ని యేండ్లకు రాజయ్యెనని యర్థము. అనఁగాఁ బ్రస్తుతపు క్రీస్తుశకమగు ౧౯౦౭లోనుండి ౬౦౬ తీసివేయఁగా మిగిలిన ౧౩౦౧ సంవత్సరముల క్రింద శ్రీహర్షుఁడు రాజుగా నుండెనని మనము తెలిసికొనవలెను. ఇట్టులే క్రీస్తువునకుఁ బూర్వమొకయేట నొకానొకసమాచారము జరిగెననఁగా నేఁటికి ౧౯౦౮- సంవత్సరముల క్రింద నది జరిగెనని యర్థము. ఇందుల కుదాహరణము: అశోకమహారాజు క్రీ. పూ. ౨౭౨-లో రాజ్యమునకు వచ్చెనని యున్నది. ఇది యెన్ని యేండ్లక్రింద జరిగెనని కనుగొనుటకు మన మేమిచేయవలెను? ఇప్పటి క్రీస్తుశకసంఖ్యయగు ౧౯౦౭-లో ఈ ౨౭౨ కలపవలెను. ఇట్లు ౨౧౭౯ సంవత్సరములు వచ్చును. ఇన్ని యేండ్ల క్రింద అశోక చక్రవర్తి రాజయ్యెనని యర్థము.

సూత్రము.—ఇప్పటికాలపు క్రీస్తుశకసంఖ్యలో (౧౯౦౭) ఇష్టకాలపు క్రీ. పూ. సంఖ్య కలిపినయెడలను, క్రీ. శ. సంఖ్య తీసివేసినయెడలను, ఇష్టసమాచారము నేఁటి కెన్నిసంవత్సరములక్రింద జరిగినది వచ్చును.

క్రీ. పూ. శకమునుగుఱించి యొక వింతకలదు. ఇందలి పూర్వసంవత్సరసంఖ్యకంటెఁ బరసంవత్సరసంఖ్య తక్కువగ నుండును. అనఁగా క్రీ. పూ. ౩౨౧-కి దరువాత వచ్చునది క్రీ. పూ. ౩౨౦-వ సంవత్సరము. ఇందువలననే బుద్ధుఁడు క్రీ పూ. ౫౫౭-వ సంవత్సరమునజన్మించి యెనుబదియేండ్లుబ్రతికిక్రీ. పూ. ౪౭౭లో దేహము విసర్జించెనని వ్రాయుట తటస్థించుచున్నది. క్రీస్తుపుజన్మము గుర్తుగాఁ బెట్టుకొని వెనుకకు ౧, ౨, ౩ అని పూర్వపూర్వ సంవత్సరములు లెక్కగా వేయుచుఁ బోయినందున క్రీ. పూ. శకమునకు ఈవైచిత్ర్యము కలిగినదని చదువరులు జ్ఞాపక ముంచుకొని యెదరుగాత.

ఈగ్రంథమునందు 'శతాబ్ద' మను శబ్దమనేకస్థలములందు నుపయోగింపఁబడినది. శతాబ్ద మనఁగా నూఱుసంవత్సరముల సమూహము. క్రీ. శ. ప్రథమశతాబ్ద మనఁగా ౧-వ సంవత్సరము మొదలు ౧౦౦-వ సంవత్సరమువఱకు, ద్వితీయశతాబ్దమనఁగా ౧౦౧ మొదలు ౨౦౦-ల సంవత్సరమువఱకు అని యర్థము. ఈలాగుననే యితర శతాబ్దంబుల విషయమై యెఱుఁగునది.

ఈగ్రంథమునందు హిందూదేశశకముల నుదాహరింపక క్రీస్తుశకము వాడుటకుఁగారణమేమియనికొందఱడుగవచ్చును. 'సంవత్' అనఁబడు విక్రమశకమును 'శక' మనఁబడు శాలివాహనశకమును హిందూదేశములో వాడుకలో నున్నమాట వాస్తవమే. కాని వీనిలో దేనికిని అంతటఁ బ్రచారములేదు. నర్మదానదికి నుత్తరమున శాలివాహనశకము నెఱుఁగరు. ఆనదికి దక్షిణమున విక్రమశక మంతగా వాడుకలోలేదు. ఇదియుఁ గాక యాంధ్రదేశములో సంవత్సరపుఁబేరుతో వ్యవహా

రించు నాచారముగలదు. శకసంఖ్యనుదాహరించు నాచారము లేదు. మా వాఁడు ప్రమోదూతనామ సంవత్సరములోఁ బుట్టె నందురుగాని శా. శ. అముకసంఖ్యగల యేటఁబుట్టెనని చెప్ప రు. ప్రతిదినముపంచాంగము చెప్పిబ్రతికెడిబ్రాహ్మణుఁడుకూడ పంచాంగము చూడనిది శాలివాహన శకసంఖ్య చెప్పనేరఁడు. ఇప్పటిసంఖ్య యెంతో జనసామాన్యమునకుఁ దెలియని శక మును గ్రంథములో నుపయోగించుటవలన నేమిలాభము?

ఇఁకఁ గ్రీస్తుశకముయొక్క ౧౯౦౭ వ సంవత్సరము ప్రస్తు తము జరుగుచున్నదని ప్రతిపల్లెకరణమునకును దెలిసియున్నది. కావున బహుజనులకుఁ దెలిసియున్న శకమే గ్రంథములో నిచ్చుట యుపయోగకరముగ నుండునని తలఁచి క్రీ. శ. మే యీగ్రంథములో నుపయోగింపఁబడినది. అయినను విక్రమ శాలివాహనశకవర్షంబులు కావలయునా రీక్రిందిసూత్రము ననుసరించి యిందలి క్రీ. శ. వర్షంబులు మార్చుకొనవచ్చును.

సూత్రము.—క్రీ. శ. సంఖ్యలో ౫౭ కలిపిన విక్రమ శకము వచ్చును; క్రీ. శ. సంఖ్యలోనుండి ౭౮ తీసివేసిన శాలి వాహన శకవర్షంబులు వచ్చును.

౧ సుంకువారి అగ్రహారము,
చింతాద్రిపేట, చెన్నపట్టణము.
3—10—07

కొమఱ్ఱాజు - లక్ష్మణరావు.

# విషయసూచిక.

---

## మొదటి ప్రకరణము.



---

## రెండవ ప్రకరణము.

---

## మూఁడవ ప్రకరణము.



---

## నాల్గవ ప్రకరణము.



---

## అయిదవ ప్రకరణము.

---

ఐదవ ప్రకరణము

# పటముల సూచిక

# A Short History of India.

# హిందూదేశ కథాసంగ్రహము.



## మొదటి ప్రకరణము.



### హిందూదేశము, అందలి జనులు.

హిందూదేశ చరిత్రఁ దెలిసికొనుటకుఁ బూర్వము హిందూదేశమన నెద్దియో, దానికెల్ల లెవ్వియో, తద్దేశవైశాల్య మెంతయో, అందలిజను లెట్టివారో, యచ్చటి మతభాషావిశేషంబు లెట్టివియో కనుఁగొనుట యావశ్యకము.

ప్రస్తుతము హిందూస్థాన మనఁబడు దేశమునకు మన పురాణాది గ్రంథములందు 'భరతఖండ' మనుపేరు వాడఁబడియున్నది. చంద్రవంశపు రాజయిన దుష్యంతుని కుమారుఁడగు భరతునిచేఁ బరిపాలింపబడినందున నీదేశమునకు నీపేరు వచ్చెను. హిందూస్థాన మను పేరు మన పురాతన గ్రంథములలో నెచ్చటను గానరాదు. ఇది పారసీకులు, రోమకులు, హూణులు మొదలయిన పరదేశీయులచే మన దేశమునకుఁ బెట్టఁబడిన పేరు. ఈ నామముయొక్క వ్యుత్పత్తిని గురించి యనేకు లనేకములైన యూహలు పన్నిరి. వానిలో నీక్రింది

వ్యుత్పత్తి నమ్మఁదగినదిగా నున్నది. ఈదేశములో మిక్కిలి గొప్పదియగు సింధునదమును జూచి పరదేశీయులు దీనిని సింధుదేశ మనఁజొచ్చిరి. 'సింధు' శబ్దమే 'హిందు' శబ్దముగాఁ బారసీకభాషను మాఱెను. పారసీకుల వేదమగు 'జందవేస్తా'లో సింధునదిని, దానిలోఁ గలిసిన యుపనదులను నుద్దేశించి "హప్తహెందు' అని చెప్పఁబడి యున్నది. ఈ శబ్దము 'సప్తసింధు' శబ్దభవము గాన ఈ వ్యుత్పత్తియే నమ్మఁదగినదని చెప్పవచ్చును.

## హిందూ దేశపు టెల్లలు.

హిందూదేశమున కుత్తరమున నాకాశమెత్తు పెట్టిన గోడవలె యనఁ బ్రచండహిమాలయ పర్వతరాజ మొప్పు. ఎత్తున దీనినిమించిన పర్వతము మఱియొక్కటి భూమండలమున నెచ్చటను లేదు. ఎడతెగని మంచునకు నివాసస్థలమై, సకలౌషధులకు నాకరమై, పదునైదువందలమైళ్ళ పొడవు గల్గి, యాఱుమైళ్ళ యెత్తుగల శిఖరములచే శోభితమై, గంగా యమునా సింధు బ్రహ్మపుత్రాది మహానదులకుఁ బుట్టినిల్లగుచు, నీనగాధిరాజము హిందూదేశమునకు నుత్తరసీమగా విలసిల్లుచున్నది. ఈపర్వతమునకు నచ్చటచ్చటఁ గనుమలనగాఁ గొండదారులు కలవు. అందు బోలన్‌కనుము, ఖైబర్‌కనుము అనునవి ముఖ్యమైనవి. ఈ పర్వతమునకు నిట్టికనుములు లేక యుండిన హిందూదేశమున కుత్తరమున నుండువా రెవ్వరును దేశమునకు వచ్చుటకు వీలుండదు. పారసీకులు, హూణులు,

గ్రీకులు, తురుష్కులు, అఫ్గానులు మొదలగువారు మనదేశముయొక్క ధనమును, ఐకమత్యమును, స్వాతంత్ర్యమును, యశస్సును, హరింపవలయునని ఈ దేశమునకువచ్చుట యీ కనుమలనుండియే.

ఉత్తరమున నీ దేశము మిక్కిలి వైశాల్యముకలదియై దక్షిణమునకు బోయినకొలఁదిని దీని వైశాల్యము త్రిభుజాకృతిగాఁ దగ్గి రామేశ్వరమునకు దక్షిణమునఁ గన్యాకుమారి యను (Cape Comorin) అగ్రమునొద్ద మిక్కిలి చిన్నదియై యొక మైలయినను వైశాల్యము లేకయున్నది. అగ్ర మనఁగా సముద్రములోనికి గొనవలెఁ జొరఁబడిన భూభాగము. 'కన్యాకుమారి' హిందూదేశముయొక్క యత్యంత దక్షిణ భూభాగము. దానికి దక్షిణమున సముద్రమున్నది. ఈ సముద్రమునే మనవారు మహోదధి యని యు, దక్షిణసముద్రమనియు వ్రాసియున్నారు. ఇప్పటివారు దీనిని హిందూమహాసముద్రమనియెదరు.

హిందూదేశమునకుఁ దూర్పున బంగాళాఖాతమును (Bay of Bengal) బ్రహ్మదేశమును గలవు. బంగాళాదేశము నుండి రామేశ్వరము వరకుఁగల హిందూదేశపుఁ దూర్పుభాగమంతయు సముద్రము నంటియున్నది. ఈ సముద్రమునకుఁ బ్రస్తుతము బంగాళాఖాత మనియుఁ బూర్వము తూర్పుసముద్రమనియు నామములు. కలకత్తాపట్టణము నుండి మనము బయలుదేరి సముద్రపు టొడ్డుననే దక్షిణమునకుఁ బ్రయా

ణాము చేసిన కటకము, బర్హాంపురము, శ్రీకాకుళము, విశాఖపట్టణము, కాకినాడ, మచిలీబందరు, నెల్లూరు, చెన్నపట్టణము, కడలూరు, నాగపట్టణము, రామేశ్వరము, తూత్తుకుడి, కన్యాకుమారి ఈ పట్టణములును స్థలములును ఒకదాని తరువాత నొకటి ప్రకృతిమూలగా మనకు సముద్రపు టొడ్డుననో సముద్రమునుండి కొంతదూరముననో తగులఁగలవు.

కన్యాకుమారికి దక్షిణమున సముద్రము తప్ప భూమి లేదని పైనివ్రాసియే యున్నారము. కాన నచ్చటనుండి మనము పశ్చిమ సముద్రపు టొడ్డున నుత్తరముగాఁ బోయిన యెడల నొకదాని కొకటి యుత్తరమున టిర్రివెండ్రము (అనంతశయనము), ఎర్నాకులము, కళ్లికోట (కాలికట్), కన్ననూర్, మంగళూరు (మ్యాంగలోర్), గోవా, రత్నగిరి, బొంబాయి, సూరత్, సోమనాథ్, ద్వారక, కరాచి, ఈ పట్టణములు కానవచ్చును. ఈయొడ్డునకుఁ దగిలియున్న సముద్రమునకుఁ బశ్చిమసముద్రమనియు, రత్నాకరమనియుఁ బూర్వనామములు. అరేబియన్ సముద్ర మని ప్రస్తుత నామము.

ఇట్లు హిందూస్థానము ఉత్తరమున మిక్కిలి వైశాల్యము కలిగి దక్షిణమునకుఁ బోయినకొలఁదిని వైశాల్యము తగ్గుచుఁ ద్రిభుజాకృతిఁ జెందిన దేశమనియు, దీనికి ముఖ్యమైన యెల్లలు ఉత్తరమున హిమాలయము, దక్షిణపూర్వ పశ్చిమ దిశలయందు సముద్రమనియుఁ జదువరు లెఱుంగుదురు గాక!

కుందువలననే "హిందూ దేశ మంతయు" నని చెప్పుటకు మన వారు "ఆ సేతుహిమాలయము" మని చెప్పెదరు. సేతు వనఁగాఁ గన్యాకుమారికి మిక్కిలి సమీపమునందున్న రామేశ్వరము నొద్ద దక్షిణ సముద్రము.

ఈ దేశము యొక్క యుత్తర దక్షిణపు కొలత ౧౯౦౦ మైళ్ళుండును. ఎక్కువతో నెక్కువది యగు పూర్వపశ్చిమముల కొలతయు ౧౯౦౦ మైళ్ళున్నది. ఈ దేశపు వైశాల్యము సుమా రేడు లక్షల చదరపు మైళ్ళు. అనఁగా హిందూ దేశమంతయుఁ బూర్వపుఁ గృష్ణాజిల్లాకు రెండువందల రెట్లుండును.

## మూఁడు స్వాభావిక విభాగములు.

విమానమెక్కి యాకాశములో నెత్తుగఁబోయి క్రిందఁ జూచిన హిందూదేశమంతయు స్వాభావికముగా మూఁడువిభాగములు కలదిగఁ గానవచ్చును. అందు మొదటిది హిమాలయా ప్రదేశము. ఈ ప్రదేశము ౧౬౫౦ మైళ్ళవఱకు పొడుగు గలదియై ౧౫౦ మొదలు ౨౫౦ మైళ్ళ వఱకు వెడల్పుగలిగి యున్నది. హిమాలయాపర్వతమున ననేక శిఖరము లున్నవి. "ఎవరెస్టు" అనఁబడు శిఖరము ౨౯౦౦౨ అడుగు లనఁగా సుమారు ఆఱుమైళ్ళెత్తున్నది. ఈ పర్వతము రెండు పర్వతమాలికలతో నొప్పి జంట గోడవలె నుండును.

ఈ మొదటి ప్రదేశమునకు దక్షిణమున రెండవ ప్రదేశ మున్నది. దీనిని మహానదుల ప్రదేశమన వచ్చును. హిమా

ఉత్తరము

పశ్చిమము




దక్షిణము

లయ పర్వతములోనుండి యుద్భవించిన సింధు, గంగా, యమునా, బ్రహ్మపుత్రాదినదులచే స్థిరోడవ ప్రదేశము జలపూరితంబుగను, సస్యప్రదంబుగను ఉండును. ఈప్రదేశమునకు దక్షిణమున వింధ్యపర్వతమే సరిహద్దు.

మూఁడవప్రదేశ ముత్తరమున వింధ్యపర్వతమును, తూర్పున తూర్పుకనుమ లనఁబడు మహేంద్రపర్వతములును (Eastern Ghats), పశ్చిమమున పడమటికనుమ లనఁబడు సహ్యాచలయు పర్వతములును (Western Ghats), దక్షిణమున సముద్రమునుగల త్రిభుజాకృతి ప్రదేశము. ఈప్రదేశము నర్మద, గోదావరి, కృష్ణ, తుంగభద్ర, కావేరి మొదలైన నదులచే శోభిల్లుచున్నది. మహారాష్ట్రము (మరాటీ), ఘూర్జరము (గుజరాత్), కర్ణాటకము (కన్నడము), ఆంధ్రము (తెనుగు), ద్రావిడము (అరవము), మళయాళము మొదలైన భాషలు మాటలాడువారి దేశము లన్నియు నీమూఁడవ ప్రదేశమునసే యున్నవి.

## ఇప్పటి రాజకీయ విభాగములు.

ఇట్లు సృష్టిచేఁ బర్వతములు, నదులు అను నెల్లలవలన మూఁడు ప్రదేశములుగా విభజింపఁబడిన యీహిందూదేశము ప్రస్తుత మీదేశమును బరిపాలించుచున్న యింగ్లీషువారిచేఁ బరిపాలనకు వీలు కలుగవలయునని యనేకప్రాంతములుగా విభజింపఁబడినది. ఉత్తరమునుండి మన మీప్రాంతముల లెక్కవేయుదుమేని వాయవ్యపు పొలిమేర పరగణా(North- West

Frontier Province) యనునది మొదటఁ గానిపించును. ఇందునకు రాజధాని పెషావర్ అను పట్టణము. హిందూ దేశముయొక్క యుత్తరపు సరిహద్దుమీఁద నున్న పర్వతారణ్య ప్రాంతములోని యనాగరికజనులు తిరుగుబాటు చేయకుండుటకుగాను ఈ పరగణా యొకటి యేర్పఱిచి యచ్చట లెఫ్టినెంట్ గవర్నర్ అను నధికారి యుంపఁబడెను. దీనికి నాగ్నేయమునఁ బంజాబుదేశము గలదు. దీనికి లాహోర్ అనునది ముఖ్యపట్టణము. ఇందు సిక్కుమతస్థులును, హిందూ మతస్థులును ఉందురు. పంజాబునకు వాయువ్యమున ఆగ్రా అండ్ ఔధ్ సంయుక్తపరగణాలు (United Provinces of Agra and Oudh) అను ప్రాంతము కలదు. ఆగ్రా అనఁగా ప్రయాగప్రదేశము. ఔధ్ అనఁగా అయోధ్యాప్రదేశము. ఈపరగణాలలోనే కాశి, ప్రయాగ, అయోధ్య అను పుణ్యక్షేత్రములును గలవు. ఈపరగణాలకు రాజధాని అలహాబాద్ అను మాఱుపేరుగల ప్రయాగపట్టణము. ఈపరగణాలకు నాగ్నేయమున బంగాళాదేశము కలదు. అది యిదివరకు నొక్క పరగణాగానే యుండెను. కాని 1900 సం॥లో నందు అసామ్ (కామరూపము) అను దేశమును గలిపి దీనినంతను పూర్వ బంగాళము, బంగాళము అని రెండు పరగణాలుగా విభజించిరి. మరల ఈరెండు పరగణాలును మన సార్వభౌముఁడగు నైదవ జార్జిగారి 1911 ఢిల్లీదర్బారుసమయమున వారిచే మఱలనొక్క పరగణాగ నిర్మింపఁబడెను. ఈపరగణాకుఁ గలకత్తాయును భరత వర్షమున కంతటికిని ఢిల్లీనగరంబును రాజధానులుగ నిర్ణ

యింపఁబడినవి. 1911 సం॥ వరకు కలకత్తానగరము హిందూదేశ మున కంతటికిని రాజధానిగ నుండెను. తరువాత ఢిల్లీ రాజధాని యాయెను. ఇప్పుడు హిందూదేశములోని యింగ్లీషువారి రాజ్యమున కంతకును నధికారియు, రాజప్రతినిధియు నగు గవర్నర్ జనరల్ అందు వైస్రాయ్ అను బిరుదుగల యుద్యోగస్థుఁ డుండును. బంగాళమునకు నైరృతిదిక్కున మధ్య పరగణాలు (Central Provinces) గలవు. వీనికి రాజధాని నాగపూరుపట్టణము. ఉపరగణాలకుఁ జుట్టు వేఱు పరగణా లుండుటవలన వీనికి మధ్యపరగణాలను పేరు పెట్టిరి. పరగణాలకు నైరృతమున వర్హాడ్ (బేరార్ :Berar: విదర్భదేశము) అను నొక చిన్న పరగణా యిదివరకు విడిగానుండెను. కాని దాని నిటీవల, మధ్యపరగణాలలోఁ జేర్చిరి. ఈవర్హాడ్ అను నది నైజామునొద్దనుండి మరల నిచ్చు పద్ధతిమీఁద నింగ్లీషువారు తీసికొనిరి. కాని మరల నియ్యనక్కఱలేని పద్ధతి ప్రస్తుత మేర్పఱుచుకొన్నారు. మధ్యపరగణాలకుఁ గొంచెము భాగము తూర్పుగను బంగాళమునకుఁ గొంచెముభాగము మాత్రము దక్షిణముగను, తూర్పు సముద్రము నంటుకొని దక్షిణ సముద్రము వరకును, నచ్చటినుండి కొంచెము పశ్చిమ సముద్రమువరకును వ్యాపించియున్నది మన చెన్నరాజధాని. దీనికి చెన్నపట్టణము ముఖ్యస్థలము. ఈ రాజధానిలో ఉత్తరమున గంజాముజిల్లా మొదలుకొని దక్షిణమునఁ జెన్నపట్టణము వఱకును, పూర్వసముద్రము నంటుకొని పశ్చిమమునకు గోంతవఱకును బ్రసరించియున్నది. మన యాంధ్రదేశము; అనఁగా

తెలుఁగుసీమ. పశ్చిమసముద్రము నంటుకొని హిందూదేశ
మునకుఁ బడమర నున్నది బొంబాయి రాజధాని. దీనికి బొం
బాయి ముఖ్యపట్టణము. పశ్చిమ సముద్రపువైపునఁ జెన్న
రాజధానికిఁ దగిలియే కూర్గు అను మిక్కిలి చిన్న పరగణా
యొకటి కలదు. మర్కారా దీనికి ముఖ్యపట్టణము. ఇందలి
విశేషం బేమన, హిందూదేశములోని యితర ప్రాంతముల
వారినందఱను ప్రభుత్వమువారు నిరాయుధులఁ జేసినను వీనినిమా
త్రము నిరాయుధులను జేయ లేదు. అనఁగా నధికారుల యాజ్ఞ
దీసికొనక తుపాకులు మొదలయిన యాయుధముల జను లుప
యోగింపఁ గూడ దను నిర్బంధ మిచ్చుటలేదు. ఈప్రాంతము
లన్నియు హిందూదేశములోనివి. బంగాళాదేశమునకును తూ
ర్పుననున్న బ్రహ్మదేశము (బర్మాదేశము: Burma) హిందూ
స్థానములోనిది గాకపోయినను దొరతనమువారు వ్యవహారము
నందు దానినికూడ నీదేశములోనిదిగానే భావించుచున్నారు.
ఇవి యన్నియు నింగ్లీషువారిచే స్వయముగాఁ బరిపాలింపఁబడు
చున్న ప్రాంతములు.

## స్వదేశ సంస్థానములు.

ఇవిగాక హిందూదేశములో నింగ్లీషువారికి సామంత
రాజులుగా నున్నవారి రాజ్యములు కలవు. సామంతరాజు లనఁ
గా నొకానొక చక్రవర్తి యొక్క రాజ్యమునకు సమీపమున
నుండి యాతనికి లోఁబడిన రాజు లని యర్థము. ఈస్వదేశ
సంస్థానములను నిప్పుడు సంరక్షితరాజ్యము లనియెదరు. సంర

క్షిత రాజ్యములనఁగా నింగ్లీషువారిచేఁ గాపాడఁబడుచున్న రాజ్యములని యర్థము. అట్టి రాజ్యములలోఁ బంజాబునకుఁ గూడ నుత్తరముననున్న కాశ్మీరదేశ మొకటి. హిమాలయ సంబంధమైన పర్వతములతోను, అరణ్యములతోను, ఉపవనములతోను నిండియున్న యీ రాజ్యమును జక్కఁదనమున భూమి మీఁది నందనవన మని చెప్పెదరు. దీనికి రాజధాని శ్రీనగరమనుపట్టణము. పంజాబునకు దక్షిణమున రాజపుతానా (రాజపుత్రస్థానము) అను స్వదేశసంస్థానముల సమూహముగల దేశ మొకటి కలదు. ఇందు జయపూర్, జోధ్‌పూర్, ఉదయపూర్ మొదలయిన యనేక రాజపుత్రులసంస్థానములుగలవు. ఈ రాజపుత్రులు పౌరుషమే ప్రధానముగాఁ గల శూరాగ్రేసరులు. మధ్యహిందూస్థానమునందు గ్వాలియర్, బడోదా (దీనినే యింగ్లీషులో బరోడా అని వ్రాయుదురు), ఇందోర్ —ఈమూఁడుస్వదేశ రాజ్యములు ముఖ్యమైనవి. దక్షిణమున నైజామ్ హైదరాబాదు రాజ్యము తెలుఁగువారికిఁ దెలిసినదియె. హైదరాబాదు రాజ్యములోని తూర్పు సగము భాగమంతయుఁ దెలుఁగు సీమలోనిది. హిందూదేశములోనున్న సంరక్షిత రాజ్యములలో నన్నిటిలో హైదరాబాదు రాజ్యము మిక్కిలి పెద్దది. ఇచ్చట రాజ్యము చేయు రాజు మహమ్మదీయ మతస్థుఁడు. దక్షిణముననుండు స్వదేశసంస్థానములలో మైసూరు, ట్రావన్కూరు, కొచ్చి అనునవి యెన్నఁదగినవి. పైని జెప్పినవిగాక మఱెన్నియో చిన్న చిన్న స్వదేశసంస్థానములు హిందూదేశంబున గలవు.

## స్వతంత్ర రాజ్యములు.

ఇట్లు ఇంగ్లీషువారు స్వయముగాఁ బరిపాలించుచున్న పంజాబుప్రభృతి పూర్వోక్తప్రాంతములును, వారికి లోఁబడిన స్వదేశసంస్థానములును గాక, యింగ్లీషువారికి లోఁబడక స్వతంత్రములయి సర్వాధికారములు కలిగి యింగ్లీషువారితోఁ జేరి సమానముగానుండు చిన్నసంస్థానములు కొన్ని హిందూదేశమునఁ గలవు. అందు నేపాల్, భూతాన్ అనునవి అయోధ్యా ప్రాంతమునకును బంగాళాదేశమునకును ఉత్తరమున హిమాలయప్రాంతమునం దుండును. నేపాల్ రాజులు హిందూమతస్థులు. తూర్పుసముద్రతీరమునఁ జెన్నపట్టణము నొద్దనున్న పాండిచేరి (పుదుచ్చేరి) యను గ్రామమును, కలకత్తాయొద్దనున్న చంద్రనగరమును, మఱికొన్ని స్థలములను ఫ్రెంచివారు నిరంకుశాధికారముగఁ బరిపాలించుచున్నారు. ఈఫ్రెంచి రాజ్యములలోనున్న హిందువులకు, ఫ్రెంచివారికిఁ గల యధికారము లన్నియు హక్కులన్నియు నియ్యఁబడి యున్నవు ఫ్రెంచివారును హిందువులును ఒకరీతిగఁ జూడఁబడుదురు. పశ్చిమసముద్రతీరమున గోవాయను పట్టణమున బుడతకీచులని మనవారిచేఁ బేర్కొనఁబడిన పోర్చుగీస్ వారు స్వాతంత్ర్యాధికారము చెల్లించుకొనుచున్నారు.

## జనుల మతములు.

పైని వర్ణించినట్లు పదునేడు లక్షల చదరపు మైళ్ళ వైశాల్యముగల యీదేశములో రమారమి ముప్పదికోట్ల జనులు

వాసము చేయుచున్నారు. ఇందు అనేక మతస్థులు గలరు. హిందువుల సంఖ్య యిరువదికోట్ల డెబ్బదిలక్షలను మించి యున్నది. మహమ్మదీయ మతస్థులాఱుకోట్లు గలరు. బౌద్ధులు తొంబది యైదు లక్షలవఱకున్నారు. జైనులు ఇరువదితొమ్మిది లక్షలును, జరతృష్టమతస్థులు (పారసీలు) తొంబదినాలుగు వేలును గలరు. వీరుగాక యితర మతస్థులును నీ దేశమందుఁ గలరు. కాని వారిసంఖ్య మిక్కిలి తక్కువ యగుటచే నిచ్చట చెప్పనక్కఱలేదు.

## భాషలు.

విశేష వైశాల్యముఁగల దేశముగాన నిందు నొక్కభాషగాక పెక్కుభాషలు గలవు. ఈదేశములోని భాషలన్నియు సాంస్కృతికభాష లనియు, ద్రావిడభాష లనియు రెండు శాఖలుగా విభజింపఁబడి యున్నవి. ఇందు నుత్తర హిందూదేశంబున వాడుకలోనున్నవి హిందీ, బంగాలీ, మరాఠీ, గుజరాతీ, ఉరియా (ఓఢ్రము) మొదలగు భాషలు సాంస్కృతికములు; అనఁగా సంస్కృతమునుండి పుట్టినవి. దక్షిణమున వాడుకలోనున్న ద్రావిడము (అఱవము), కర్ణాటకము (కన్నడము), ఆంధ్రము (తెనుఁగు), మళయాళము అనునవి ద్రావిడభాషలు. అనఁగా నివి సంస్కృతములోనుండి పుట్టని ద్రావిడభాషాభవము లని యాధునిక విద్వాంసుల యభిప్రాయము. మన పూర్వగ్రంథకారులు వ్రాసినట్లు మనయాంధ్రభాష సంస్కృతభవము కాదనియు ద్రావిడభాషలోనుండిగాని, దానికి

మాతృకగానుండిన మఱియొకభాషలోనుండిగాని పుట్టినదనియు వారి యభిప్రాయము. పైని చెప్పఁబడిన భాషలు ముఖ్యమైనవి. ఇవిగాక రమారమి నూఱుభాష లీదేశంబున మాటలాడెదరు. ఈ దేశభాష లన్నిఁటిలో హిందీభాష మాటలాడువా రధికముగాఁగలరు. వీరి సంఖ్య తొమ్మిదికోట్లను మించియుండును. హిందీకిఁ దరువాతిది బంగాలీ. దీనిని మాటలాడువారు నాలుగుకోట్లకంటె నధిక జనులు కలరు. మూఁడవది మన మాతృభాషయగు తెలుఁగు. తెలుఁగువారి సంఖ్య రెండుకోట్లను మించియున్నది. "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యని మనవారు వ్రాసినదిగాక యీదేశములోని యితరభాషల నన్నింటిని నభ్యసించిన యూరపుదేశస్థులుకూడ నదియన్నిభాషలకంటె నధిక శ్రవణానందకరమని చెప్పియున్నారు. మరాఠీ మాటలాడువారు కోటి యెనుబదిరెండు లక్షలును, ద్రావిడులు కోటి యఱువదియైదు లక్షలును, కన్నడమువారు కోటి మూఁడులక్షలును, ఘూర్జరభాష మాటలాడువారు తొంబది తొమ్మిది లక్షలును, ఓఢ్రము మాటలాడువారు తొంబది యాఱు లక్షలును, మళయాళమువారు అఱువది లక్షలును గలరు. ఇవి ముఖ్యభాషలు.

## ఒక్కదేశమా? పెక్కుదేశములా?

ఇట్టినన్ని రాజ్యంబులును, మతంబులును, భాషలును గల యీఖండంబును పెక్కుదేశము లని చెప్పక యొక్కదేశ మని చెప్పుటకుఁ గారణమేమి యని చదువరులకు సంశయము

కలుగ వచ్చును. ఇంకెన్ని మతములును, ఎన్ని భాషలును గలిగినను ఇందుండువారిలో విశేషజనులు హిందువులు. బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్య శూద్రులను చాతుర్వర్ణ్యవ్యవస్థయు, నందుండి పుట్టిన యిప్పటి యసంఖ్యాజాతులును ఈ దేశమందుఁ దప్ప మఱి యేదేశమందును గానరావు. ఇట్లు పుట్టుకవలనఁ గల్గు వర్ణవిభేదమును బాటించు హిందువులలో నందఱికిని నాల్గువేదములును, కల్పసూత్త్రములును, స్మృతులును బ్రమాణగ్రంథములు. హిందువులందఱకు నిట్టి సామాన్య లక్షణము లుండుటవలన ఈ దేశము మొదటినుండియు నొక్క దేశముగానే యెంచఁబడుచువచ్చెను. ఇదియుఁగాక ప్రస్తుతమాసేతుహిమాలయమంతయు నొక రాజుచేఁ బరిపాలింపఁబడుటవలన నుత్తరమునందలి పంజాబ్ దేశస్థుఁడును, దక్షిణమునందలి యఱవదేశస్థుఁడును, నొక్క దేశములోని వారే యనినమాట లోకులకుఁ దిన్నఁగాఁ దెలియుచున్నది.

ఈ ప్రకార మీదేశముయొక్క యాకారమును, వైశాల్యమును, ఇందలి జనుల వివరణంబును, రాజ్యంబుల యునికియు, గనుఁగొనిన పిదప నీదేశమునకు ఈ వివిధ జనంబులెప్పు డెప్పు డెచ్చటినుండివచ్చినది మనము కనుఁగొనవలసి యున్నది. అనఁగా ఈ దేశపుఁ జరిత్ర మనము తెలిసికొనవలయును.

## చరిత్ర విభాగములు.

హిందూదేశచరిత్ర యంతయు మూఁడు మహాయుగములుగ విభజింపవచ్చును.

౧. హిందూ మహాయుగము (Hindu Period):—ఇది హిందూరాజులు ప్రభుత్వము చేసినకాలము. ఈ మహాయుగముయొక్క వ్యాప్తి క్రీ. పూ. ౨౦౦౦ మొదలు క్రీ. శ. ౧౨౦౦ వఱకు, అనఁగా మూఁడువేల రెండువందల యేండ్లని చెప్పనగు.

౨. మహమ్మదీయమహాయుగము (Muhammadan Period):— ఇది మహమ్మదీయులు ప్రభుత్వము చేసినకాలము. క్రీ. శ. పదుమూఁడవశతాబ్ద ప్రారంభమునుండి పదునెనిమిదవశతాబ్ద మధ్యమువఱకు అనఁగా రమారమి యైదువందల యేఁబది సంవత్సరములు ఢిల్లీశ్వరులు నిరంకుశాధికారము చేసిరి.

౩. బ్రిటిషు మహాయుగము (British Period):— ఇది యింగ్లీషువారి ప్రస్తుతప్రభుత్వకాలము. ఇది క్రీ. శ. పదునెనిమిదవశతాబ్దమధ్యమునఁ బ్రారంభమై నేఁటివఱకు జరుగుచున్నది. అనఁగా నూటయేఁబదియేండ్లకంటె నెక్కుడు వయస్సు కలదని యర్థము.

ఈ మూఁడు మహాయుగంబులలోని హిందూదేశచరిత్రయొక్క వేర్వేఱ వర్ణింపఁబడును.

---

## ౧. హిందూ మహాయుగము

క్రీ. పూ. ౨౦౦౦—క్రీ. శ. ౧౨౦౦

నాలుగు వేలేండ్ల క్రిందట మనపూర్వు లగు నార్యు లను వా రీదేశమునకు వచ్చినది మొదలు, ఏడువందల సంవత్సరములకుఁ బూర్వము తురుష్కు లీదేశమును జయించిన కాలము వఱకును జరిగిన సమాచారములన్నియు నీ మహాయుగమును వర్ణించుటలో రాఁగలవు. ఈ మహాయుగమును జరిత్రకారు లయిదు యుగములుగా విభజింతురు. అవి యెవ్వియన:—

౧. ఋగ్వేదయుగము (Vedic Age):—(క్రీ. పూ. ౨౦౦౦-౧౪౦౦). ఇది మన దేశచరిత్రలో నాదిమయుగము. ఈకాలపుఁ జరిత్ర తెలియుటకు ముఖ్యాధారమైన గ్రంథము ఋగ్వేద మయినందున దీనికి ఋగ్వేదయుగమని పేరు పెట్టఁబడియె. వేదములు నాలుగని హిందువులందఱకుఁ దెలిసిన విషయమే. అందు ఋగ్వేదము మొదటిది. ఇతర వేదముల కంటెఁ బూర్వము వ్రాయఁబడినది. దీని ననుసరించియే యితర వేదములు తరువాత వ్రాయఁబడినవి. ఋగ్వేదములోని యాదిసూక్తములు క్రీ. పూ. ౨౦౦౦ యేండ్లనాఁ డనఁగా నేఁటికి రమారమి నాలుగు వేలేండ్లక్రిందటనే వ్రాయఁబడినవని విద్వాంసుల యభిప్రాయము. ఇటీవలఁ గొందఱు మనదేశపు విద్వాంసులును బరదేశపు విద్వాంసులును ఋగ్వేదసూక్తములు కొన్ని యేడు వేలయేండ్లక్రింద వ్రాయఁబడినవని

సిద్ధాంతీకరించుచు గ్రంథముల వ్రాసియున్నారు. కాని వీరి సిద్ధాంతము లింకను వాదవివాదస్థితిలో నున్నవి; ఇతర విద్వాంసులచే నంగీకరింపఁబడలేదు. కావునఁ బ్రస్తుతము మనము ఋగ్వేదసూక్తములు నాలుగువేలేండ్ల క్రిందటివి యనియే యనుకొందము. ఋగ్వేదమంత్రములు చరిత్ర తెలుపుటకు వ్రాయఁబడినవి కావు: అప్పటి ఋషులచేఁ జేయఁబడిన దేవతాది ప్రార్థనలు. అయినను ఆ మంత్రములలోని వర్ణనాదికములవలన నప్పటి దేశస్థితియు, నాచార వ్యవహారంబులును, జనుల నాగరికతయు మనము కనుఁగొనవచ్చును. కాన నీ యుగపువర్ణన ఋగ్వేదము ననుసరించియే వ్రాయఁబడును.

౨. క్షాత్త్రయుగము (Epic Age):— (క్రీ. పూ. ౧౪౦౦-౧౦౦౦). ఈ యుగమునందు నార్యులు కురు పాంచాల విదేహాది రాజ్యంబుల స్థాపించి, యొకరితో నొకరు ఘోరముగాఁ బోరుచు శౌర్యపౌరుషములే ప్రధానముగాఁ గలిగి యుండిరి. కావున దీనికి క్షాత్త్రయుగ మని పేరు. ఈకాలముననే యజుస్సామాథర్వవేదములును, ఐతరేయ తైత్తిరీయాది బ్రాహ్మణములును, రామాయణ మహాభారతేతిహాసంబులును రచింపఁబడెను. ఈ యుగచరిత్రకు నీ గ్రంథములే యాధారములు.

3. సూత్రయుగము (Sutra Age):— (క్రీ. పూ. ౧౦౦౦-౫౫౭) ఈ కాలమందుఁ గల్పసూత్రంబులును, వ్యాకరణాదిసూత్రములును, షడ్దర్శనసూత్రములును రచియింపఁ

బడియె. కాఁబట్టి దీనిని సూత్రయుగమందురు. ఇది హిందువులు తమ బుద్ధివైభవముఁ గనఁబఱిచిన కాలంబగుటచే దీనిని బుద్ధివైభవయుగమనియుఁ (Rationalistic Age) జెప్పవచ్చును.

౪. బౌద్ధయుగము (Buddhist Age):—(క్రీ. పూ. ౫౫౭-క్రీ. శ. ౫౦౦) గౌతమ బుద్ధుఁ డుదయించి బౌద్ధధర్మమును స్థాపించినది మొదలు రమారమి వేయిసంవత్సరములవఱకు నీయుగము వ్యాపించి యుండె. బౌద్ధధర్మగ్రంథములును, బౌద్ధరాజుల శాసనములును, ఈ కాలమందు హిందూదేశమునకు వచ్చిన గ్రీకువారును చీనావారును నీదేశమును గుఱించి వ్రాసియుంచిన వర్ణనలును ఈ బౌద్ధయుగచరిత్రకు సాధనములయి యున్నవి.

౫. పౌరాణికయుగము (Pauranic Age):—(క్రీ. శ. ౫౦౦-౧౨౦౦) ఈ కాలమునఁ బురాణములు రచింపఁబడియె. కావున దీనికిఁ బౌరాణికయుగ మనిపేరు. ఈ కాలములోని రాజులచే నిర్మింపఁబడిన శిలాశాసనములవల్లను, బురాణములలో భవిష్యద్వార్తలని వ్రాయఁబడిన భూతపూర్వరాజుల వంశావళులవలనను మన కీకాలపు రాజ్యములను గుఱించిన చరిత్ర తెలియుచున్నది.

ఇట్టి యైదుయుగంబులను గుఱించిన చరిత్ర యైదు ప్రకరణంబులలో వేఱువేఱుగ వర్ణింపఁబడును.

---

రెండవ ప్రకరణము.



# ఋగ్వేదయుగము

(క్రీ. పూ. ౨౦౦౦ నుండి ౧౪౦౦ వఱకు.)



## ఆర్యుల మూలప్రదేశము.

ఎన్నియో వేల సంవత్సరములకుఁ బూర్వము 'ఆర్యులు' అను జనులు హిమాలయమునకు నుత్తరమున మిక్కిలి దూరమున ఆసియాఖండముయొక్క మధ్యభాగమందు నివసించి యుండిరి. వీరు మిక్కిలి నాగరికతఁజెందినవారు గాకపోయినను పశుగణంబుల సంపాదించి వానిని గాపాడుటకును, వ్యవసాయము చేయుటకును, కొన్ని లోహముల నుపయోగించుటకును, చిన్ని పడవలనిర్మించుటకును నేర్చియుండిరి. ఆకాశము, మేఘము, మేఘగర్జన, చంద్రుఁడు, సూర్యుఁడు, గొప్ప పర్వతములు, నదులు మొదలయిన సృష్టిలోని వినోదకరములగు వస్తువుల నీశ్వరభావమునఁ బూజించుచుండిరి.

## ఆర్యులు నానాదేశంబులఁ బ్రసరించుట.

ఇట్లుచ్చట నెన్నియో వేల యేండ్లుండఁగఁ జనసంఖ్య హెచ్చినందున నచ్చటనుండుటకుఁ దావును, దినుటకు నన్నాదిసామగ్రియును జాలక యప్పుడప్పు డచ్చటిజనులు మాతృభూమిని

విడిచి ఆసియా యూరోపుఖండములలోని యనేక దేశముల లోఁ జొరఁబడి యచ్చటి జనుల గెలిచి తమ భాషయుఁ దమ నాగరికతయు వారికి నేర్పిరి.

మనపై రాజ్యముఁజేయు నింగ్లీషువారును, జర్మనీదేశపువారును, వళందులనఁబడు డచ్ వారును, స్వీడన్ దేశస్థులును, పైని చెప్పినప్రకారము మధ్యాసియానుండి యప్పుడప్పుడు లేచి యూరోపు దేశమునకు వెళ్ళిన యొక తెగవారైన యార్యులు. వీరికి ట్యూటన్ ఆర్యులని పేరు. స్పేన్, ఫ్రాన్సు, ఐర్లండ్ దేశములలోని జనులు మఱియొక తెగవారగు నార్యులు. వీరికి కెల్టిక్ ఆర్యులని పేరు. రష్యాదేశస్థులు స్లావ్ ఆర్యులు; ప్రష్యాదేశస్థులును ఇటలీదేశస్థులును ఇటాలిక్ ఆర్యులు; గ్రీసు దేశపువారు హెలనిక్ ఆర్యులు: వీరందఱును యూరోపు ఖండములోని యార్యులు.

## హింద్వార్యులు; పారసీకార్యులు.

ఇఁక నాసియాఖండములోని యార్యులనుగుఱించి విచారింతము. ఈఖండములో హిందూదేశపు ఆర్యులనియుఁ, బారసీకార్యులనియు నార్యులముఖ్యశాఖలు రెండు. ఈ యిద్దఱును మొట్టమొదట నొక్కసారియే మధ్యాసియాలోని తమ పూర్వస్థానమునుండి బయలుదేఱి పెషావరు నొద్దికనుమల మార్గమున నీదేశములోనికిఁ జొచ్చి సింధునదమునకుఁ బశ్చిమమునఁ గొంతకాలమువఱకు నొక్క తెగవారివలెనే గలిసియుండిరి. కాని కొన్నిదినములకు వారి యాచారవ్యవహారభేదములను

బట్టి వారిలో రెండు తెగ లేర్పడెను. ఒక తెగవారు తా మా రాధించు దేవతలకు సురలని పేరు పెట్టిరి; పశుయాగమును సో మపానమును స్వీకరించిరి. వీరు హిందూ దేశములోని మన పూర్వులగు నార్యులు. రెండవ తెగవారు తమ దేవతలను అ సురు లనిరి; పశు మేధమును సోమపానమును వర్జించిరి. వీరే పారసీకార్యులు. హిందూదేశపు ఆర్యులకును పారసీకార్యుల కును గలహము మెండయ్యె. ఒకరు పూజనీయ దేవతలుగా నెంచినవారిని రెండవవారు నిందనీయులు లగు దయ్యములుగా నెంచఁదొడంగిరి. హిందూదేశపు టార్యులకుఁ బూజ్యులగు ఇంద్రుఁడు, శర్వుఁడు మొదలగు న వైదిక దేవతలు పారసీకా ర్యుల గ్రంథములలో దయ్యములుగా వర్ణింపఁబడిరి. ఇట్టిరెండు తెగల యార్యులకును గలహము ముదిరి రెండవతెగవారు పారసీకమునకు వెడలి పోయిరి. మొదటి తెగవారు పంజాబు దేశములో సింధునదమునొద్ద నుండిరి. ఇట్టిరెండు తెగల యార్యులును జీలి హిందూదేశములోని యార్యులు పంజాబులో స్వతంత్రముగాఁ గాపురముఁజేయ మొదలుపెట్టిన కాలము క్రీస్తుశకమునకుఁ బూర్వము రమారమి ౨౦౦౦ సంవత్స రములక్రింద ననఁగా నేఁటికి రమారమి ౪౦౦౦ సంవత్సరముల క్రిందటనై యుండును.

## అనార్యులతో సంగ్రామము.

ఆర్యులు పంజాబు దేశమును సులభముగా గెలువ లేదు. అంతకుఁ బూర్వ మా దేశమునఁ జెంచులు, కోయలు,

ఎఱుకలు, భిల్లులు, మొదలగు నారణ్యకజాతులవంటి యనాగరిక జను లచ్చటచ్చట గ్రామములు లేర్పఱుచుకొని వాసము చేయుచుండిరి. వీరు నల్లగను, బుఱ్ఱముక్కు గలవారుగను, పొట్టిగను, జూచుటకుఁ గురూపులుగను ఉండిరి. వీ రార్యులవలె నాగరికులుగాక మోటువారుగ నున్నందున ఆర్యులు వీరికిఁదిరస్కారభావముతో 'దస్యు' లనియు 'దాసు'లనియు 'అనార్య' లనియుఁ బేళ్ళుపెట్టిరి. ఆర్యులకు వీరిభాష తెలియనందున వీరిని భాషలేనివా రనిరి; ఆర్యులవలె వీరు క్రతువులు చేయనందున వీరిని నిరీశ్వరు లనిరి * ఈ దేశములోని పూర్వనివాసులగు నీయనార్యులు క్రొత్తగా వచ్చిన మనపూర్వు లైన యార్యులత్రోవ నడ్డగించుచు వారిని మిక్కిలి బాధలు పెట్టుచుండిరి. ఈ విషయములు ఋగ్వేదములోని యీక్రింది ఋక్కులవలనఁ దేటపడఁ గలవు.

౧ "ఓ పూషుఁడా! మా ప్రయాణముఁ బూర్తిచేయుటకు మాకుసాయమొసంగుము. అన్ని సంకటములు నివారింపుము.

౨ "ఓ పూషుఁడా! మమ్ముఁ బెడత్రోవను తీసికొనిపోవు వానిని, మమ్ముఁ గొట్టువానిని, దోఁచుకొనువానిని, మాకుఁ గీడొనరించువానిని, మాత్రోవనుండి తొలఁగింపుము.

---

* (ఋగ్వేదము. ౧౦-౨౨-౮).

3 'ప్రయాణము నడ్డగించెడి యా మోసగానిని దూర ముగఁ దఱిమివేయుము.

౭. 'మమ్ము శత్రువు లడ్డగించి బాధఁ గలుగఁజేయకుండ మాకు మార్గము జూపుము. సులభమైనట్టియు సంతోష కరమైనట్టియు మార్గమున మమ్ముఁ దీసికొనిపొమ్ము.' [౧-౮-౨]

౮. 'ఓ యింద్రా! మా చుట్టును దస్యులున్నారు; వారు క్రతువులు చేయరు; వారేమియు నమ్మరు; వారసుర ప్రకృతులు. ఓ శత్రుసంహారకుఁడవైన యింద్రా! ఈ దాసుల సంహారింపుము.' [౧౦-౨౨]

ఆర్యులు దేశము నాక్రమించుట.

ఆర్యులలో ననేక నాయకులు వేర్వేఱుగాఁ గొందఱు జనులను గూర్చుకొని స్వతంత్రముగా ననార్యుల నాయకులతోఁ బోరుచుండిరి. 1 వారి సైన్యములోఁ బదాతులును గుఱ్ఱపురౌతులును ఉండిరి. 2 ఋగ్వేదములో (౧-౬౫-౩) గుఱ్ఱపురౌతులు సైనికులతోఁ బోరాడినటు లున్నది. మఱియొక్కచోటఁ (౧-౭౩-౯) బదాతులు పదాతులతోను, అశ్వీయు లాశ్వీయులతోను బోరాడినటు లున్నది. నాయకుఁడు గోచర్మముతోఁ గప్పబడిన రథము నెక్కి యుద్ధమునకుఁ బోవును. 3 వానియనుచరులు చేతఁ గేతనంబు ధరించి 4 తమ పూర్వులయశంబును నిందరి బృహస్పతులు తమకో

1 (౧-౫౧-౬) 2 (౧-౭౩-౯) 3 (౬-౪౭-౮౬) 4 (౧-౧౦౩-౧)

సంగిన సాహాయ్యంబును బాటలుగఁ బాడుచు,5 శంఖంబుల నూఁదుచు6 సంగరము చేయుచుండిరి. శత్రుగ్రామములు స్వాధీన పఱచుకొన్నప్పుడు పెక్కుపర్యాయము లీయార్యులు గ్రామములో నందఱను జంపుచుండిరి. ఒక్కొక్కప్పుడు గ్రామములో ధనము దోఁచుకొని 7 యంతటితో సంతుష్టిఁజెంది జనుల కపాయముఁ జేయక వెళ్ళుచుండిరి. గ్రామము స్వాధీన పడినప్పుడు అచ్చటఁ దమ యాచారవ్యవహారములను ధర్మ కల్పనలను బాదుకొల్పుచుండిరి. ఒకానొకప్పు డార్యనాయకుఁడు విశేషసంఖ్యగల శత్రువులకు నోడి ధైర్యము చెడిన యెడల, వానిపూర్వుల యశస్సును బాడి మంత్రద్రష్టలు వాని కుత్సాహముఁ గలిగించుచుండిరి. గెలువఁబడిన యనార్యులను వారి సుక్షేత్రభూములనుండి వెడలఁగొట్టి యార్యు లాభూమి నాక్రమించిరి.

బయల జరిగిన యుద్ధములలో నార్యుల భుజబలంబునకుఁ దాళలేక యనార్యు లరణ్యములలోను, పర్వతగుహలలోను దాఁగియుండి రాత్రివేళల నార్యుల నివాసస్థలంబులపైఁబడి పశుధాన్యాదులఁ దోఁచుకొనుచుఁ దోవలఁ గొట్టుచు నార్యులఁ బెక్కు తెఱంగులఁ బీడించుచుండిరి. మఱియు నార్యులతో ద్వంద్వయుద్ధమున గెలువలేక యనార్యులు నదులచేతను, సెలయేళ్లచేతను సురక్షితములైన చోటులయందుఁ దమ నివాసస్థలము లేర్పఱుచుకొని పట్టణవాసులగు నార్యులఁ

---

5 (౧-౪౦;౧-౧౦౭) 6 (౧-౧౦౭-౧) 7 (౬-౭౫)

బిడింపఁజొచ్చిరి. కుయవుఁడని విఖ్యాతిఁ జెందిన వల్లని యనా ర్యుఁడొకఁడు, సిఫా, అంజసీ, కులిసీ, వీరపత్ని యను నాలుగు నదులతీరమున బస నేర్పఱచుకొని యార్యుల నివాసస్థల ములఁ గొల్లగొట్టుచుండె (౧-౧౦౪-౩, ౪.) కృష్ణుఁ డను మరి యొక యనార్యవీరుఁ డంశుమతీ నదియొడ్డునఁ బదివేలబల ముతో విడిది యేర్పఱుచుకొనియె. ఆర్యులు వానిఁ గనిపట్టి సంహరించిరి. [౮-౯౬]

## అప్పటి రాజ్యములు

ఋగ్వేదయుగమునందు (౩-౫౩-౧౪) ననార్యులది యగు కీకటదేశము వర్ణింపఁబడినది.

'నీ యావులు కీకటములో నేమి చేయుచున్నవి? అవి హవ్యునకై పాలియ్యవు; అగ్నిని బ్రజ్వలింపఁ జేయవు. ప్రమ గందుని సంపద మాకుఁ దీసికొనిరమ్ము. ఓ యింద్రా! నీచ మనుష్యుని మాస్వాధీనము చేయుము.'

ఈ ఋక్కులోని 'కీకట' 'ప్రమగంద' శబ్దములు ముఖ్యమైనవి. 'కీకటోనామ దేశోఽనార్యనివాసః' (నిరుక్త ము ౬-౩౨) అని యాస్కాచార్యులవారు వ్రాసియున్నారు. ప్రమగందుఁడను వాఁడు రాజని వ్రాసియున్నది. త్రికాండశేష మనుకోశములో (భూమివర్గము శ్లో॥ ౧౧) 'మాగధా కీకటా మతాః' అనివ్రాసి యున్నది. కాన వైదిక కాలములో గంగకుఁ దూర్పువైపునఁ గీకట మను ననార్యజన నివాసం

బును, ఆర్యజనులచే నాక్రమింపఁ బడనిదియు నగు దేశమొక్కటి యుండెనని మనము నిశ్చయింపవచ్చును.

ఆర్యులలోఁ గుత్సుఁ డనువాఁ డనార్యుల విధ్వంసకుఁ డని మిక్కిలి విఖ్యాతిఁ జెందిన శూరాగ్రసరుఁడు. అత డేఁబది వేల నల్లని శత్రువులఁ జంపెనట! ఇట్లే సుదాసుఁడను వాఁడు శత్రునాశనమునకై ఖ్యాతిఁ గాంచె. ఇతఁడు వసిష్ఠ, విశ్వామిత్రులకు నాశ్రయదాత. ఇట్లార్యులు పంజాబులో నచ్చటచ్చట గొండలను, హిమాలయ పర్వతప్రాంతమునఁ గొండలను, సింధునదమునకు నుపనదులగు వితస్థా (జీలమ్), అసిక్ని (చీనాబ్) పరుష్ణి (రావి) అర్జికీయా (బియాస్) శుతుద్రి (సట్లజ్) నదులయొడ్డునఁ గొండలను, సింధునద ముఖమునొద్దఁ గొండలను, యమునానదియొడ్డునఁ గొండలను, వేలు వేలుగా ననార్యులతోఁ బోరాడి చిన్నచిన్న స్వతంత్రరాజ్యముల స్థాపించిరి. హిమాలయములోని పెషావరునొద్ది గుట్టలకును యమునానది పుట్టినస్థలంబునకును నడుమనుండు హిమాలయ ప్రదేశంబు క్రమక్రమముగా 'ఉత్తరకురుదేశము,' 'ఉత్తరమాద్రదేశము' అను పేళ్లతో నేర్పడెను. సింధునదము, దానియొక్కయైదు ఉపనదులును, సరస్వతియు, ననునేడునదులలోని ప్రదేశము 'సప్తసింధు' దేశమయ్యెను*. ఋగ్వేదమునందుఁ బంజాబులోని సింధునద

* సింధునదమునకు నుపనదులును పంజాబులోనివియు నగు నైదునదులకు భిన్నభిన్న కాలములయందు భిన్నభిన్న నామములుండెను. వాని నన్నిటిని ఇచ్చట సంగ్రహించుచున్నాఁడను: ప్రస్తుతము జీలమ్ లేక జెహలమ్ అనఁబడునది యన్నిటికంటెఁ బశ్చిమమున నున్నది. దీనికి ఋగ్వేద శాస్త్రయుగ

మునకును, దానియుపనదులకును సంబంధించిన వర్ణనలు విశేష ముగా నుండినందునను, గంగాయమునానదులపేళ్ళు రెండు మూఁడుసార్లుమాత్రము వచ్చినందునను, ఋగ్వేదకాలమున, నార్యులు ముఖ్యముగాఁ బంజాబులో నివసించియుండి రనియు, గంగా యమునల యొద్దనకుఁ గ్రమక్రమముగా రాఁ బ్రారంభిం చిరనియు నూహింపవలసియున్నది.

సింధు యమునానదుల మధ్యనుండు ప్రదేశ మేయార్యుల ప్రథమనివాసస్థల మని స్మృతిగ్రంథముల వల్లను నూహిం పవచ్చును. 'సరస్వతి' 'దృషద్వతి' యను దివ్యనదుల నడుమ

---

ములలో వితస్తా యనిపేరు. దీనికి గ్రీకువారు హైడాస్పస్ (Hydaspes) అని పేరు పెట్టిరి. ప్రస్తుతము చీనాబ్ అనఁబడు నదికి ఋగ్వేదకాలములో అసిక్నియని పేరుండెను; గ్రీకులు దీనికి అకెసినాస్ (Akesinos) అని పేరిడిరి. ఈ రెండు నదులును కలిసి పెద్దనదియై కొంతదూరము పాఱి సింధు వులోఁ గలియును. రెండునదులు గలిసిన యీ పెద్దనదికి వైదిక కాలములో 'మరుద్వృధ' యనియుఁ దరువాతి కాలములో 'చంద్రభాగ' యనియుఁ బేరుండెను. దీనికి గ్రీకువారు స్యాండ్రోఫాగస్ (Sandrophagus) అనిరి. ఈ గ్రీకుమాటకు అలెగ్జాండరును మ్రింగునది యని యర్థమువున్నందున అలెగ్జాం డరు భయపడి నది దాఁటకనే తిరిగి వెళ్ళినట్లు చెప్పెదరు. తరువాతిది యగు రావియను నదికి వైదిక కాలములో "పరుష్ణి"యనియుఁ, దరువాతికాలములో "ఐరావతి" యనియు, గ్రీకులో 'హైడ్రోఏటస్' (Hydroates) అనియుఁ బేళ్ళుండెను. బియాస్‌నదికి వైదికకాలమందు "అర్జికీయ" యనియుఁ, దరు వాత "విపాశ"యనియు గ్రీకుభాషలో హిపాసిస్ (Hypasis) లేకహిపా నిస్ (Hypanis) అనియుఁ బేళ్ళు గలవు. సట్లెజ్ నదికి వైదికకాలమున "శుతుద్రి" యనియుఁ దరువాతి కాలమందు "శతద్రు" అనియు, గ్రీకున జడడ్రిస్ అనియు నామాంతరములు.

నుండు ప్రదేశము బ్రహ్మావర్తమనియు నచ్చటి యాచారమే గ్రాహ్యమనియు మనుస్మృతియందు (౨-౧౭) జెప్పఁబడి యున్నది. ఈ సరస్వతీ దృషద్వతీనదులు ఢిల్లీపట్టణమునకు వాయువ్యమున రమారమి నూరుమైళ్ళమీఁద నుండును. తురుష్కుల యెడతెగని సహవాసమువలన పంజాబుదేశమువారి యాచారము లనేకములు మాఱిపోయినను హిందూదేశములో నెచ్చటనులేని యార్యాచారములు కొన్ని యచ్చట నిప్పటికిని గానవచ్చెడిని. అందొక యాచార మిచ్చట వర్ణించెదను. పంజాబువా రాహారార్థమై చంపెడి గొఱ్ఱెను తెచ్చి దానిపై మొదట నీరు చల్లెదరు; కొన్ని పుష్పముల నుంచెదరు. దానిని సంకల్పమాత్రమున దేవి కర్పించెదరు. తరువాత నొక్క దెబ్బన దానితలఁ ద్రుంచెదరు. ఒక్కదెబ్బకుఁ దెగనియెడల దానిమాంసమును భుజింపరు. ఇది యంతయు నాదిమార్యులు యజ్ఞపశువిషయమై చేయుక్రియల యనుకరణమని వేఱుగఁ జెప్పనక్కఱలేదు.

## సంఘవిభజనము

అప్పటి యార్యులలోఁ గులపతులు, క్రతుకర్తలు, నాయకులు, జనసామాన్యము అని నాలుగు తెగలుండెను. ఇవి జాతిభేదములుకావు. ఒక్కఁడే కులపతిగను, క్రతుకర్తగను, నాయకుఁడుగను నుండిన నుండవచ్చును. గౌతమ కాణ్వ వసిష్ఠాదులు కులపతులలోఁ బేరొందినవారు. ఋజ్రాశ్వాంబరీష

సహదేవాదులు విఖ్యాతకర్తలు. కుత్సపురుకుత్సదివోదాసాదులు ప్రఖ్యాతార్యనాయకులు.

### ఆర్యులలో నంతఃకలహములు.

ఆర్యులు నల్లవారగు ననార్యులతోఁ బోరాడుటగాక తమలోఁ దాము కలహించుకొనుచు, నొక తెగవారు మఱియొక తెగవారితోఁ బోరాడుచుండిరి.

ఆర్యనాయకులలో త్రిత్సువంశపు రాజులును, పురువంశపు రాజులును మిక్కిలి విఖ్యాతిఁ జెందినట్లు గానవచ్చెడిని. వీరుగాక అను యదుతుర్వసు లనుమూఁడువంశముల రాజులును బేరొందిరి. వీ రొకరితోనొక రాధిక్యమునకై ఘోరముగఁ బోరాడుచుండిరి. ఋగ్వేదకాలమున త్రిత్సువంశజుఁ డగు, దివోదాసుఁడును, నాతనికుమారుఁడో వంశజుఁడోయైన సుదాసుఁడును సుప్రసిద్ధిఁ జెందిరి. ఈవంశమువాఁడగు దివోదాసుఁడు పర్వతములోని యనేకదస్యుల జయించి, కఱ్ఱతోఁ గట్టబడిన వారి కోటల ననేకములను గాల్చి నీరుచేసెను. వీరికిఁ బురోహితుఁడు వసిష్ఠుఁడు పురువంశమునఁ గుత్సుఁడనువాఁడు రాజర్షి. ఈతఁ డింద్రునియంత చక్కనివాఁడు (౮-౧౬౧౦.) ఈతఁ డింద్రభక్తుఁడై కృష్ణుఁడు, కుయవుఁడు మొదలగు ననేక

1. ౬-౩౩; ౬-౬౦-౬; ౧౦-౩౮-౩; ౧౦-౬౯-౬.

దస్యులఁ జంపెను.[1] ఈతఁడు దస్యులకోటలను గాల్చి, వారిసైన్యములఁ జెల్లాచెదరు చేయఁగా వా రనేకపర్యాయములు తమ ధనధాన్యాదికము లన్నియు వదలి పాఱిపోయిరి. ఈతనికి విశ్వామిత్రఋషి పురోహితుఁడుగా నుండెను. ఈవిశ్వామిత్రుఁడు మొదట సుదాసునకుఁ బురోహితుఁడుగా నుండి, యేకారణముచేతనో వారి పౌరోహిత్యమును వదలి పురుభారతుల పౌరోహిత్యము నంగీకరించినట్లు గానవచ్చెడిని. 2. ఋగ్వేదమునందు విశ్వామిత్రకృతములైన కొన్ని శాపమంత్రములుకలవు. అవి యెవరిని గుఱించి వ్రాసినవో తెలిసికొనుటకు ఋగ్వేదమునందు నేమియు నాధారములేదు; కాని యివి వసిష్ఠునిఁ దిట్టిన ఋక్కులనియు, నీయభిశాపరూపము లయిన ఋక్కులు వసిష్ఠగోత్రులు చదువరు విన రనియు సాయనాచార్యులవారు తమ భాష్యమునందు వ్రాసియున్నారు. 3. మొత్తముమీఁద త్రిత్సువంశస్థులు వసిష్ఠు నెక్కువగా గౌరవించినందువలన నీ ద్వేషము గలిగినట్లు గానవచ్చెడిని. ఈ ద్వేషము పురోహితులతోనే పోక వారివారి రాజులవఱకు నల్లుకొనియె: త్రిత్సువంశజుఁడయిన సుదాసునకును, పురువంశజుఁడయిన కుత్సునకును పోరు కలిగె. ఈపోరును గుఱించి ఋగ్వేదమందు సప్తమమండలాంతర్గతమయిన పదునెనిమిదవ సూక్తమునందును, ఎనుబదిమూఁడవ సూక్తమునందును, మఱియుతర సూక్తములందుఁ జెప్పఁబడియున్నది.

---

1. (౪-౧౬-౧౮) 2. (౩-౫౩) 3. (౩-౫౩-౨౩ మీఁది సాయన భాష్యపీఠిక చూడనగు).

త్రిత్సునాయకుఁ డగు సుదాసుఁడు సరస్వతీతీరమునందున రాజ్యము చేయుచుండె. పురువంశజుఁ డయిన కుత్సుఁడు పరుష్ణి (రావి) నదికి నుత్తరమున నుండెను. అచ్చట నాతఁడు సుదాసునిమీఁదికి దండు వెడలవలె నని సైన్యమును సిద్ధపఱిచి నదియొద్దున విడిసె. ఈతనికి నార్యులును, అనార్యులును అనేకులు సహాయు లయిరి. వీరికిని సుదాసునకును నడుమ విపశ (బియాస్), శుతుద్రి (సట్లజ్) యను రెండునదు లుండినందున వారానదుల దాఁటుటకు యత్నించిరి. కాని యీసంగతి తెలిసికొని సుదాసుఁడు తనకు సాహాయ్యమునకు వచ్చిన రాజులతో ఆనదులను దాఁటి శత్రువులమీఁద బడెను. శత్రువు లకస్మాత్తుగా వచ్చినందున పురువంశపు రాజును, సైనికులును, అతనికి సహాయులగు భరత, తుర్వస, వైకర్ణ, కవశ, ద్రుహ్యు, భేద ప్రముఖులయిన యార్యానార్యులగు దశవిధనాయకుల సైన్యంబులును బెదరి నదిలోనికి నుఱికి యనేకులు హతులైరి. అనేక వీరులు శత్రువులచేఁ జంపఁబడిరి. శత్రువుల ధనము దోఁచుకొనఁబడియె. సుదాసుని వెంట వసిష్ఠుఁడుండి వాని యశస్సునకై దేవతలఁ బ్రార్థించుచు వాని యశోగానము మంత్రిరూపమునఁ జేసి మనకుఁ జెప్పెను. అందు కతనికి సుదాసుఁడు రెండువందల యావులను, రెండు రథములను, హిరణ్యాలంకారయుక్తములయిన నాలుగు గుఱ్ఱములను నిచ్చెను.

పైని వర్ణించిన యుద్ధములోఁ గుత్సుఁ డేమయినదియుఁ దెలియదు. కాని యాతని మనుమఁడు "కురు" వనువాఁడనియు,

అతనివలననే భరతవంశజులయిన కౌరవులందఱుఁ గలిగి రనియుఁ బురాణాదులవలనఁ దెలియుచున్నది.

## ఆర్యుల వృత్తులు.

ఆదినములలో నార్యుల ముఖ్యవృత్తి వ్యవసాయము. ఋగ్వేదసంహితలో వ్యవసాయమునకు సంబంధించిన సూక్తము లనేకములు కలవు. అవి చదువుటకు వింపుగ నుండును. అందు నొకటి రెండు సూక్తముల యర్థ మిచ్చుటఁ బొందుపఱచుచున్నాఁడను:

"ఎద్దు సంతోషముతోఁ బనిచేయుఁగాక ; మానవులు సంతోషముతోఁ బనిచేయుదురుగాక; సంతోషముతో చాలు దున్నుఁడి. ములుకోల నానందముతో నుపయోగింపుఁడి."

౫. "ఓ సునాసీర దేవతలారా! ఈప్రార్థన నంగీకరింపుఁడు. మీ రాకసమున నిర్మించిన వర్షముతో నీభూమిని దడుపుఁడు."

౬. "ఓభాగ్యశాలినీ సీతా(నాఁగేటి చాలా)! ముందుకు నడువుము. మేము నీకు వందనము జేయుదుము. నీవు మాకు నెక్కుడుగాఁ బంటయు, ధనంబును నొసంగుము."

౭. "ఇంద్రుఁడు సీతను గ్రహించుఁగాక! పూషుఁడు దానిని ముందుకు నడుపుఁగాక! అది నీటితో నింపఁబడి మాకుఁ బంట నిచ్చుఁగాక!" [౪-౫౭.]

౨౧. "ఓ అశ్వులారా! ఆర్యులకు నాఁగటితో వ్యవసాయము చేయుట, విత్తునాటుట నేర్పియుఁ, బైరునకు వర్షములొసంగియు, మీ వజ్రాయుధమున దస్యుల నాశముఁజేసియు మీ తేజోమాహాత్మ్యమును గనఁబఱిచితిరి." [౧-౧౧౭.]

౬. "కాఁడి తగిలించి అరక కట్టుఁడి. సిద్ధముచేయఁబడిన యీభూమిలో విత్తు నాటుఁడి. మంత్రములఁ జపించి పైరు పెరుగనిండు. పైరు సిద్ధముగానున్న పొలములోఁ గొడవండ్ల నుపయోగింపుఁడి."

౫. "పశువులు నీరు త్రాగుటకు తొట్టి చేయుఁడి. తోలుతోఁ జేయఁబడిన త్రాడు గట్టుఁడి. ఎప్పుడును నెండి పోక లోతుగలిగి చక్కఁగనున్న యీబావిలోనుండి నీరు తోడెదము."

౮. "పశువులకొఱకుఁ దొట్లు చేయఁబడినవి. ఎప్పుడు నెండిపోక లోఁతుగలిగిన చక్కని బావిలోఁ దోలుత్రాడు శోభించుచున్నది. నీళ్ళు సులభముగాఁ బైకివచ్చినవి."

౭. "గుఱ్ఱములకు విశ్రాంతిఁ గలుగఁజేయుము. పొలములోఁ గుప్పవేసియున్న ధాన్యమును దీయుము. దానిఁదీసి కొనిపోవఁ బండిచేయుఁడు. పశువులకు నీరుద్రావ నీబావి సమృద్ధిమైనది; 'ద్రోణ' వైశాల్యము కలది. దానికి ఱాతిగిలక కలదు. మనుష్యులు త్రాగు జలసంగ్రహము స్కంధవైశాల్యముఁగలది. దానిని నీళ్ళతో నింపుడు." [౧౦-౧౦౧]

నీటి యాధారము లేక వ్యవసాయము జరుగుట దుర్లభము; కావున నార్యులు బావులు త్రవ్వుటయు, వానిలోనుండి ఘటయంత్రములద్వారా నీరుతోడి కాలువలగుండ నీటిని బాఱించుటయు నేర్చిరి (౭-౮౯-౭). ఘటచక్రమున, నొక త్రాటికిఁ బెక్కుకుండ లొకటి క్రింద మఱియొకటి కట్టి బావి మీఁదిచక్రముపై వేసి, చక్రముఁ ద్రిప్పినకొలఁది నొక్కొక్క కుండ నీటిని బయటికిఁ దెచ్చి కుమ్మరించి, మరల బావిలోనికిఁ బోవుచుండును. ఇట్టిచక్ర మిప్పటికిని ఉత్తరహిందూదేశమున నుపయోగింపఁబడుచున్నది.

పశువుల మందలను సంగ్రహించుట యార్యులకు మఱియొక వృత్తియైయుండెను. పశువులే ధనముగా నెంచఁబడుచు నెవ్వని కెక్కువపశువులుండునో వాఁడు మిక్కిలి ధనవంతుఁడుగా గణింపఁబడుచుండెను. ఆఱుపాఁడియావులైనను లేని వాఁడు బీదవాఁడు. గోధన మనుశబ్ద మాకాలములోఁ బుట్టినదియె. ఆవులు, మేఁకలు, గొఱ్ఱెలు, బఱ్ఱెలు ఇవన్నియు గోధనములోఁ జేరియుండెను. వ్యవసాయమునకును యుద్ధమునకును గూడ గుఱ్ఱములను, మూటలు మోయుటకు ఎడ్లను, కావలి కాచుటకుఁ గుక్కలను ఉపయోగించుచుండిరి.

## విద్యలు, నాగరికత.

దారము వడుకుట, పేక పడుగులువేసి బట్టనేయుట, రంగువేయుట, ఈవిద్యలను పంజాబులోని యార్యులు నేర్చి

యుండిరి.[1] రాతితోఁ గట్టబడిన నూరు పురము లున్నట్లు ఋగ్వేదములోఁ జెప్పఁబడి యున్నది.[2] కావున వారు రాతి కోటలు కట్టుచుండిరని యూహింపవలసి యున్నది. అప్పటి వారి యిండ్లు పెద్దవి గాకపోయినను చూచుట కింపుగను పరిశుద్ధముగను గాలి విచ్చలవిడిగ నాడునవిగను ఉండెను. అప్పటి వారు గృహము ముందటను వెనుకను ఇరుపార్శ్వముల పుష్ప వృక్షములచే శోభితంబు లగు బాటలు నిర్మించుచుండిరని వాస్తోష్పతికి సంబంధించిన మంత్రములవలన గ్రహింపవలసి యున్నది. ఇంటినడుమ యజ్ఞశాల యుండును.

అప్పటి యార్యులు లోహముల యుపయోగమును జక్కఁగ నెఱిఁగియుండిరి. ధరించు నగలును యుద్ధములో నుపయోగించు శస్త్రాస్త్రంబులును వారు బంగారము, ఇనుము, మొదలయిన లోహములతోఁ జేయుచుండిరి.[3] కవచము, శిరస్త్రాణము, డాలు, కత్తి, గండ్రగొడ్డలి, విల్లు, అమ్ముల పొది మొదలైనవాని నార్యులు యుద్ధములో నుపయోగించుచుండిరి. యోధులు రథము నెక్కి యుద్ధము చేయుచుండిరి. అరదాశ్వముల శరీరములు బంగారునగలచే శోభిల్లుచుండెను.[4] వీరులుగూడ స్వర్ణ శిరస్త్రాణంబులును, కిరీటంబులును, కంఠ కర్ణ భూషణంబులును ధరించెడువారు.[5] ఇతరులుగూడ కడియములు, హారములు మొదలయిన నగలు ధరించుచుండిరి.

---

1 (౭-౩-౬; ౩౮-౪; ౧౦-౮౬-౬; ౬-౯) 2. (౪-౩౦-౮౦); ౩ (౬-౭౫) 4. (౧-౧౯౬-౪) 5. (౫-౫౪-౧౧)

జ్యోతిషశాస్త్రమును ఆర్యులు కొంతవఱకు సాధించినట్లు గానవచ్చెడిని. మన ముందుభూమి మిక్కిలి చిన్నదనియు విశ్వమంతయు దీనికంటె నెన్నియోరెట్లు పెద్దదనియు,1 సకల భువనములు సూర్యుని నాశ్రయించుకొనియే యున్నవనియు2 ఋతుభేదమునకు సూర్యుఁడే కారణమనియు,3 సూర్యుని కంటెఁ జంద్రుఁడు క్రిందను మనకు సమీపమునను ఉన్నాఁడనియు4 సూర్యుఁ డొక్కఁడే యనియు ఉషయు నొక్కతెయ యనియు,5 భూమి గుండ్రముగా నున్నదనియు,6 సూర్యుఁడు భూమిమీఁదఁ గొన్నిస్థలములకు వెలుతురును, కొన్ని భాగములకుఁ జీకటియు నేకకాలమందు నిచ్చుచుండుననియు,7 సంవత్సరమునకు మున్నూట యఱువది దినములును, పండ్రెండు నెలలును మూఁడుకాలములును గలవనియు,8 పదుమూఁడవ మాస మొకటి యధికముగా వచ్చుననియు,9 ఋగ్వేదకాలపు టార్యు లెఱిఁగియుండిరి. ఇరువదియేడు నక్షత్రముల పేళ్ళు లేకపోయినను కొన్ని నక్షత్రముల నామములు ఋగ్వేదమందుఁ గానవచ్చుచున్నవి.10

క్రయవిక్రయ సంబంధములైన నియమములు అప్పటికే యేర్పడినటుల నీక్రింది ఋక్కులవలనఁ దెలియుచున్నవి.

---

1.(౧-౫౭-౧౧) 2.(౧-౧౬౦-౭) 3 (౧-౯౫-౩). 4. (౧-౧౦౫-౧౧)
5. (౮-౪౮-౭) 6. (౧-౩౩-౮) 7. (౪-౫౩-౩;) 8. (౧-౧౬౪-౪౮)
9. (౧-౭౫-౮) 10. (౧౦-౮౫-౭; ౪-౫౧-౭, ౪-౫౧-౪౭; ౧౦-౮౫-౧౩)

౯. "ఒకఁడు మిక్కిలి వెలగల తనవస్తువును, మొదటఁ గొద్ది వెలకమ్మి తరువాత కొన్నవానియొద్దకుఁబోయి యెక్కుడు వెల యీఁడిగినేని వానికి మొదట స్థిరపడిన వెలకంటె నెక్కుడు వెల యియ్యనక్కఱలేదు. తక్కువ కాని ఎక్కువ కాని యొప్పుక మున్న నిర్ణయించిన వెలయే నిశ్చితము." (౮-౨౮)

అప్పటివారు రోడఁలుచేయుట నేర్చి సముద్రయుద్ధానఁ బోవుచు, దేశదేశములనుండి సరకులఁ దెచ్చుచు, వర్తకము చేసి ధనము సంపాదించుచుండిరి. 'లాభము సంపాదింపఁ గోరెడి వసంఖ్యావర్తకులోడలెక్కి సముద్రమును నింపెదరు. (౧-౫౬-౭) అనెడి శ్రుతివచన మిప్పుడు శ్రోత్రియుల మనిపించుకొను వారు చదువఁదగియున్నది. శ్రుతు లిట్లు స్పష్టముగా సముద్ర యానమును నంగీకరించుచుండఁగా నేఁడు సముద్రయానము వలదని శ్రోత్రియులు చెప్పుట వింతగదా?

యవలును, గోధుమలును అప్పటి ముఖ్యాహారధాన్యము లు. వరిపంట యప్పుడు లేదు. అప్పటివారు మాంసము నిరాటంకముగా భుజించుచుండిరి. సోమము వారికిఁ బ్రీతికర మైన పానీయము.

## వర్ణవ్యవస్థ.

అప్పటివా రిప్పటి జాతిభేద మెఱుంగరు. ఆర్యు లనా ర్యులన్న భేదముతప్ప మఱే యేవర్ణభేదమును అప్పుడు లేదు. వృత్తినిబట్టి యప్పుడు జాతు లేర్పడలేదు. 'చూడుఁడి నేను వేదమంత్రముల రచించువాఁడను. నాతండ్రి వైద్యుఁడు; నా

తల్లి పిండివిసరును (౯-౧౧౨-౩)' అని యొక మంత్రద్రష్ట చెప్పియున్నాఁడు. అనేక ఋషులు శూరులగు కుమారుల నిమ్మని దేవతలఁ బ్రార్థించుచుండిరి. కాన నాయుగంబున వృత్తినిబట్టిగాని జన్మమును బట్టిగాని వర్ణవ్యవస్థ లేదనుటయే నిశ్చితంబు. ఇటులీ జాతు లాయుగమున లేక తర్వాతఁ బుట్టిన వని విష్ణుపురాణము, వాయుపురాణము, హరివంశము అను పురాణములుగూడఁ జెప్పుచున్నవి. కానఁ జాతుర్వర్ణ్య వ్యవస్థ మధ్యఁ బుట్టినదని చెప్పెడిమాట క్రొత్తదిగాదు. పురాణకారులు గూడ నొప్పుకొన్న విషయమే.

## సంఘస్థితి.

ఋగ్వేదకాలములో స్త్రీలను మిక్కిలి గౌరవించుచుండిరి. ఋషులవలెనే ఋషిపత్నులును, ఋషిమాతలును, వారి కన్యలును వేదమంత్రములను రచించుచు యజ్ఞయాగాది క్రతువులఁ జేయుచుండిరి. ఋగ్వేదములో స్త్రీలచే రచింపఁబడిన మంత్రము లనేకములు గలవు. ఇట్టి స్త్రీలలో విశ్వవార యను నామె మిక్కిలి విఖ్యాతిఁ జెందెను.[1]

స్త్రీలును ఋషులతోఁ గూడి యజ్ఞయాగాదిక్రతువులు చేయుచుండిరి (౧-౧౩౦-౩: (౫-౪౩-౧౫). ఈ సందర్భమున నీ క్రింది ఋక్కులు చదువఁదగినవి:

---

1. (౭-౧౧-౩; ౪-౫౪)

౫ "ఓ దేవతలారా! సమానమనస్కులయిన యీ దంపతులు కలిసి సోమరసమును దీసి, దానిని శుద్ధిపఱిచి క్షీరముతోఁ గలిపిరి."

౬ "ఈ దంపతులు సర్వదా సమృద్ధాన్నమును ధనమును గలవారయి కలిసి యజనము చేయుదురుగాక."

౭ "ఈ దంపతులు మీ కసత్యములయిన మ్రొక్కులు మ్రొక్కరు. మిమ్ముఁ బ్రార్థింపక యుండరు. ఉత్తమపదార్థముల మీ కొసంగెదరు."

౮ "పుత్త్రపుత్త్రికలతోను ఆభరణములతోను నీదంపతులు పూర్ణాయువు గలవారలయి యుందురు." [౮-౩౧]

ఇంటి పనులయందు నాకాలపు స్త్రీలు మిక్కిలి దక్షత గలిగియుండిరి. ప్రస్తుతపు హిందూస్త్రీ లేయే సద్గుణములకై ప్రఖ్యాతిఁ గాంచుచున్నారో యా సద్గుణముల యంకురములన్నియు నప్పుడు నాటఁబడినవి.

అతిబాల్యవివాహ మప్పటివారికిఁ దెలియదు. స్త్రీలు ముసలివారగు వఱకుఁ గూడ నవివాహితలుగా నుందురు. తమ కనుకూలుఁడగు పతిదొరికిన వివాహ మాడుచుండిరి (౧౦-౮౫-౨౨). లేనిచో బ్రహ్మచర్యవ్రతమును బాలించుచునే దేహమును త్యజించుచుండిరి. వితంతువునకు మఱల వివాహమువలదనిన నిబంధన యప్పుడులేదు. 1 చచ్చిన

1. (౧౦-౧౮-౮)

పతితో సహగమనము చేయుపద్ధతి అప్పటివా రెఱుంగరు. అప్పుడు స్వయంవర పద్ధతి యున్నటు లీక్రిందిఋక్కు వలనఁ గానవచ్చెడిని:

"అనేక స్త్రీలు పురుషుని ధనమును జూచి మోహింతురు; కాని చక్కనిదియుఁ గల్యాణగుణము గలదియు నగు స్త్రీ యనేక పురుషులలోఁ దనకనుకూలునే వెదకి కొనును."

[౧౦-౨౭-౧౨]

అప్పటి స్త్రీలు యుద్ధమునకుఁ బోయి శత్రువులతోఁ బోరాడుచుండిరి. వధ్రివతి యనునామె యుద్ధము చేయుచుండఁగా నామెచేయి విరిగెను. 2 "అగస్త్యుఁడు పురోహితుఁడుగాఁగల ఖేలునిభార్య విశ్పల యను నామె యుద్ధముచేయఁగా నామెపిక్కను శత్రువులు నఱికిరి."

దాయభాగ సంబంధమైన నియమములుకూడ అప్పుడే స్థిరమైనటుల నీక్రింది ఋక్కువలనఁ గానవచ్చెడిని.

౧. "కుమారుఁడు లేనివాఁడు తన బిడ్డయొక్క కుమారుని నమ్మి సుఖముగ నుండును."

"కుమారుఁడు తన సహోదరికి భాగ మియ్యఁడు. దాని నింకొకనికిచ్చి వివాహముచేయును. ఒక్కనికే కుమారుఁడును కుమారికయుఁ బుట్టినయెడలఁ బుత్త్రుఁడు పిండదానాదికములకుఁ గర్తయగు; పుత్త్రిక వస్త్రాభరణములచే గౌరవింపఁబడుటకు మాత్రము తగినదియగును."

[౩-౩౧]

2. (౧-౧౧౬).

పిండదానాదికములు చేయువాఁడు గనుక పుత్త్రికే దాయార్హుఁ డనియుఁ బరపక్షమునకుఁ బోవునది గాన పుత్త్రికకు దాయార్హత లేదనియుఁ గుమారుఁడు లేని మొదల బుత్త్రికకును దౌహిత్త్రునకును దాయార్హత కలదనియుఁ బ్రస్తుతపు హిందూధర్మశాస్త్రములోఁ గానవచ్చెడిసిద్ధాంతము లన్నియు నీఋక్కులోనుండియే పుట్టినవనియుఁ జెప్పవచ్చును. అవివాహితగా నుండిన కూఁతునకు భాగార్హత యుండినట్లు ఈ క్రింది ఋక్కువలనఁ గానవచ్చుచున్నది.

'అవివాహితగా యావజ్జీవము తండ్రియింటనే యుండి భాగమును గోరుపుత్త్రికవలె నేను నిన్నుఁ బొందను. నాకు ధనం బొసంగుము.' [౨-౧౭-౭.]

1 చచ్చినవారిఁ బాతివేయు నాచారము మొదట నుండెను. 2 కాని శవమును గాల్చు నాచారము త్వరలోనే ప్రబలెను. 3 కాల్చినవెనుక నా బూడిదను మంత్రపూర్వకముగాఁ బాతివేయుచుండిరి.

## ధర్మమతములు.

ఇఁక నప్పటి యార్యుల ధర్మ మతముల గుఱించి విచారింతము. అప్పటివారు సృష్టిలోని చిత్రవిచిత్రసామర్థ్యంబులను జూచి యెందొక్కొక్క దానిలో నధిష్ఠాతగ నొక్కొక్క దేవుఁడున్నాఁడని భావించి యట్టిదేవతలను బూజించుచుండిరి. సూర్యచంద్రనక్షత్రాదులచే వెలుంగుచున్న యాకసమునకు

1. (౧-౭౩౦). 2. (౧౦-౧౫-౧౧). 3. (౧౦-౧౬)

సంబంధించిన దేవతకు ద్యుఃపిత యని నామంబిడిరి. యూరపు దేశములోని యార్యులును, ఆసియా ఖండములోని యార్యులును జేలుటకుఁ బూర్వమే ఈద్యుఃపితరుని నార్యులు భజించుచున్నట్లు కానవచ్చు చున్నది. ఎందుకన సంస్కృతములోని ద్యుఃపితృశబ్దమును ఐరోపాఖండములోని జుపిటర్ శబ్దమును నేకశబ్దోద్భవములే యై యున్నవి.

ఋగ్వేదములో నెచ్చటను మన మిప్పుడు గొల్చెడి శివ విష్ణువిఘ్నేశ్వరాది దేవతల మాహాత్మ్యము లేదు. శివనామము గల దేవత ఋగ్వేదములో లేనేలేదు. రుద్రుఁడున్నాఁడు, కాని యాతఁడచ్చట మేఘగర్జనకు సంబంధించిన దేవత. విష్ణుదేవత కలఁడు. కాని యప్పటి గొప్పదేవతలలో నొకటికాదు. ఋగ్వేదములో నితర దేవతలకుఁ గల గౌరవ మీ దేవతలకు లేదు.

ఋగ్వేదకాలమునాఁటి యార్యు లుపాసించుచుండిన ముఖ్యదేవతలు ముగ్గురు— అగ్ని, ఇంద్రుఁడు, సూర్యుఁడు.

అగ్ని—సర్వవేదములకును మూలమగు ఋగ్వేదము "అగ్నిమీళే పురోహితమ్" (పురోహితుఁడగునగ్నిని బ్రస్తుతింతు) అనుమంత్రముతోఁ బ్రారంభింపఁబడును. దేవతలకు నగ్నిభట్టారకుఁడు పురోహితుఁడనియు, అతని ద్వారా దేవతలాహుతులు గొందురనియు వారి నమ్మిక. ఋగ్వేదమునందు నగ్నిదేవతాకంబులగు సూక్తంబులు పెక్కులుగలవు.

ఇంద్రుఁడు—ఇంద్రుఁడనఁగా వర్షము నిచ్చు వాఁడు. అప్పటియార్యులకు వ్యవసాయమే ముఖ్యవృత్తియైనందున వారి

సస్యాభివృద్ధికిఁ గావలసిన వర్షము నిచ్చు నింద్రుఁడు వారికి ముఖ్యదేవత యయ్యెను. అట్టి దేవతను గుఱించి వారెన్నియో కథలు గల్పించిరి. తనశత్రుఁడును మేఘరూపుఁడును నగు వృత్రాసురునిఁ జంపి యింద్రుఁడు జనులకు సువృష్టి నిచ్చెనని చెప్పికొనుచుండిరి. ఋగ్వేదమునందు నింద్రదేవతాక సూక్తము లితరదేవతాకము లగు సూక్తములకంటె నెక్కుడుగ నుండును.

సూర్యుఁడు—సవితృ, పూషణ మొదలైన నామములతో నార్యు లీదేవతను గొలుచుచుండిరి. పండ్రెండు నెలలకుఁ బండ్రెండు సూర్యు లుండునట్లు భావించి వారికి వేఱు వేఱు నామములిడిరి. అందు విష్ణు వొక సూర్యుఁడు.

ఈ ముఖ్యదేవతలు గాక ఋగ్వేద కాలమందితర దేవతలను గూడఁ బూజించుచుండిరి. అందుఁ గొన్ని దేవతల నిచటఁ దెల్పెద.

మరుద్దేవతలు—వీరు వాయుసంబంధమైనవారు. వృత్రుని సంహరించునప్పు డింద్రునికి వీరు సాయము నొసంగుదురు. అనఁగా మేఘరూపుఁడైన వృత్రునిఁ జెల్లాచెదరు చేయుదు రని యర్థము.

బ్రహ్మణస్పతి—యజ్ఞసంబంధమైన మంత్రాధిదేవత.

రుద్రుఁడు—మేఘగర్జనసంబంధమైన దేవత. రుద్రుఁ డొక్కఁడుగాక యనేకరుద్రు లున్నట్లు ఋగ్వేదమునందుఁ జెప్పఁబడి యున్నది.

మిత్రావరుణులు—వీరు మొదట దివారాత్రముల కధిపతులు. తర్వాత వరుణుఁడు సముద్రాధిపతిగా నెంచఁబడియెను.

సోముఁడు—ఇతఁడు సోమలతాసంబంధమైన దేవత.

యముఁడు—పురాణాదులలో వర్ణింపఁబడిన యముని వలెను యమలోకముచలెను ఋగ్వేదములోని యముఁడును అతని లోకమును భయంకరములు గావు. వైదిక యముఁడు దర్శనీయుఁడు. మరణానంతరము సజ్జనులందఱు యమలోకము నకుఁబోయి దివ్యకాయులై తేజోమండలములో శాశ్వత సుఖము ననుభవించుచు యమునిసరస నుందురని ఋగ్వేదకాలపు టార్యుల యభిప్రాయమై యుండెను.

స్త్రీదేవతలలో ఉషస్సు, సరస్వతియు ముఖ్యమైనవి. ఉషస్సు ఉషఃకాలసంబంధమైన దేవత. ఉషస్సంబంధమైన ఋక్కులు బహువినోదకరములుగను, రూపకాలంకారయుతంబులుగను ఉండి చదువువారిమనంబులకు మిక్కిలి యానందము గలుగఁజేయును. సరస్వతి మొదట సరస్వతీనదీసంబంధమైన దేవతగ నుండెను. తరువాత వాక్సంబంధమైన దేవతగ మారెను.

ఇటులు సృష్టిలోని యుపయోగకరములైనట్టియు, ప్రకాశవంతములైనట్టియు, జనహితకరములైనట్టియు, స్వాభావిక శక్తులను జూచి యార్యులు దేవతాభావమునఁ బూజించిరి. కాని యహితకరంబులైన దుష్టస్వాభావికశక్తులను, అనఁగా

ప్రస్తుతపువారు ముత్యాలమ్మనియుఁ బోలేరమ్మనియుఁ బూజిం
చునట్లు పూర్వపుటార్యులు పూజించినవారు కారు. అందు
వలన నప్పటియార్యుల యత్యున్నతమైన నీతిసంపన్నతయును,
సహజమైన యమాయకత్వమును తేటపడుచున్నవి.

ఇట్లు సూర్యుఁడు, మేఘము, వాయువు, ఉషస్సు మొద
లయిన సృష్టిలోని స్వాభావిక చమత్కారములను భిన్న దేవత
లని యార్యులు గణించినను, ఈభౌతికశక్తులకన్నిటికిఁ బరుం
డగు నీశ్వరుఁ డొక్కఁడే కలఁడని క్రమక్రమముగఁ దెలిసి
కొనిరి. [౧౦-౮౨-౩.]

## క్రతువులు.

అగ్నిహోత్రాదిక్రతువులఁ జేయుట యప్పటియా
ర్యులకొక గొప్ప ధర్మకృత్యమని తలంచుచుండిరి. అందుచే
నొకరితో నొకరు పంతమును వేసికొనినట్లు, ఒకరుచేసిన క్రతువు
కంటె మఱియొక రెక్కుడు వైభవముతోఁ జేయుచుండిరి.
యజ్ఞసమయమునందే వీరులయశస్సు గానము చేయఁబడు
చుండెను. క్రొత్తగా మంత్రములు రచించిన ఋషులు తమ
నూతనకావ్యముల నచ్చటఁ జదివి సన్మానమును బొందు
చుండిరి. క్రొత్తగా నేర్చినవిద్యను జూపుటకు యజ్ఞమే యోగ్య
మైన స్థలమైయుండెను. అచ్చట విద్వాంసులు చక్కఁగఁ బరీ
క్షింపఁబడుచుండిరి. శ్రద్ధతో విద్య నేర్చుకొననివారికి
యావు చేయుశిక్ష విధింపఁబడు చుండె. వసిష్ఠ
వంటి ఋషులు మంత్రములు రచించువారై

జేయించు పురోహితులనియుఁ బేరొందిరి. ధనవంతులును, రాజులును ఇట్టివారిచేఁ నయింటి శ్రౌతకార్యములఁ జేయించు కొనుచు వారిని మిక్కిలి గౌరవించుచుండిరి. కాని యితర జనులందఱు తమకుఁ దామే పురోహితులగుచు నిత్యకర్మలఁ దామే నెఱవేర్చుకొనుచుండిరి.

వారు చేయు దేవతాప్రార్థనలు మిక్కిలి సులభములైనవియు, స్వాభావికముగను మనఃపూర్తిగను వచ్చినవియునై యుండెను. వారి దేవతలను వాగు రావలసినదనియు, హవిర్భాగమును గొనిపొమ్మనియుఁ దమకు నాయువు, ఆరోగ్యము, పశువులు, సంతతి నిండనియుఁ, దమశత్రువులపైఁ దమకు జయ మొసంగుఁడనియుఁ బ్రార్థించుచుండిరి.

పశుమేధము, సోమపానము ఈ రెండును ఆర్యులకు విశేషప్రియంబులైయుండె. సోమరసము త్రాగుట కందఱు నర్హులు గాకుండిరి. విద్యాదిగుణములచే భూషితులగువారును క్రతువులు చేసినవారును మాత్రము సోమపానమున కర్హులుగా నెంచఁబడుచుండిరి. "యే బ్రాహ్మణా స్త్రిసువర్ణం పఠన్తి, తే సోమం ప్రాప్నువన్తి" (త్రిసువర్ణ మను బఠించు బ్రాహ్మణులకు సోమము ప్రాప్తమగును) అను మంత్రము మన దేశపు బ్రాహ్మణు లెప్పుడును బఠించుచున్నదియే.

## ద్యూతము.

...కాలమున ద్యూతవ్యసనము విశేషముగా నున్న
...ది. ఋగ్వేదసంహితయందు ద్యూతమును

గుణించియు, నక్షత్రములను గుణించియు ననేకవర్ణ్యాంశములు వ్రాయఁబడినది. అందు తనయొక్క దుర్దశను వర్ణించుచు నొకజూదరి చెప్పిన సూక్తమొకటి కలదు. అది వింతగను బోధప్రదముగను ఉన్నందున దాని నిచ్చుటఁ బెనిఁగించుచున్నారము.

౧. "ముజవంత పర్వతముమీఁదఁ బుట్టిన సోమము యొక్క పానము యజమానునికి మైకము కలుగఁ జేసినట్లు, గొప్ప విభీతక వృక్షము (తాండ్రిచెట్టు) లలోఁ బుట్టి కదలుచున్న యీయక్షములు (పాచికలు) నాకు నానందమును గలుగఁ జేయుచున్నవి.

౨. "నా భార్య నామీఁదఁ గోపపడలేదు. నన్ను వెక్కిరింపలేదు. నన్నును నామిత్రులను బాగుగనే చూచును. అయినను అట్టి యనుకూలపతిని నేను రెండవమాట దలఁప సీయుని యీ ద్యూతమునకై వదలితిని.

౩. "ఇప్పుడు నా యత్త నన్ను ద్వేషించును; నా భార్య నన్ను రానియ్యదు. జూదరికి సౌఖ్యము నొసంగువా రెవరును లేరు. వెలగల గుఱ్ఱమైనను ముసలిదయిన తరువాత గవ్వకుఁ గొనఁగానిదయినటులు జూదరి యెందులకుఁ బనికిమాలినవాఁ డగును.

౪. "ఎవఁడు ధనమంతయు జూదమునఁ బెట్టునో వాని భార్యను అన్యులు పట్టుకొనియెదరు. వాని తల్లిదండ్రులను

అన్నదమ్ములును "వీడు మావాఁడుకాఁడు, వీనిని బంధించి కొనిపొండు" అని పలికెదరు.

౯. "నావాండ్రు నన్ను విడుతురుగాన పాచికలను ముట్టనని మనోనిశ్చయము చేసికొనినను, పచ్చనిపాచికల ధ్వని వినినతోడనే జారస్త్రీ సంకేతస్థానమునకు వెళ్ళినట్లు వెళ్ళెదను.

౬. "దీవ్యమానుఁడగు జూదరి "నేను గెలిచెద" నని చెప్పుచు ద్యూతసభకుఁ బోవును. కాని యక్షములు వానిధనమును బ్రీతి కితవునికి నొడ్డుపెట్టించి వాని ద్యూతేచ్ఛను వృద్ధి పఱచును.

౭. 'ఈ యక్షములు (పాచికలు) అంకుశములు గలవియు, గాలములు గలవియు, మోసము చేయునవియు, సంతాపకరములును అయి యున్నవి. మొదటఁ గొంచెము గెలుపును ధనమును గనఁబఱిచి, తుదకుఁ గితవుని సర్వస్వముఁ హరించి వానిని నశింపఁ జేయును.

* * * * *

౯. 'ఈ పాచికలు క్రిందనుండినను జూదమాడువాని హృదయముపై నుండును. చేతులు లేనివయ్యును చేతులుగల జూదరిని గెలుచును. అంగారసదృశములగు నీ దివ్యాక్షములు చల్లఁగానుండియు జూదరిహృదయమును దహించును.

౧౦. 'ఎచ్చటనో తిరుగుచున్న జూదరియొక్క భార్య పెనిమిటిచే విడువఁబడినదై తపించుచుండును; తల్లి దుఃఖించు

చుండును. ఋణముగలవాఁడై యుండుటకు భయపడి జూదరి ధనముకొఱకు రాత్రి పరులయింటికిఁ బోవును.

౧౧. సుఖముగానుండు నితరుల గృహమును భార్యను జూచి జూదరి తన భార్యను దలఁచి దుఃఖించును. మరల పగలు జూదమాడును. రాత్రి కాఁచుకొనుట కగ్నిసమీపమునఁ బడును.

౧౨. 'ఓ అక్షములారా! మీలో ముఖ్యుఁ డెవఁడో వానికి నంజలి మొగిడ్చెద. ఇఁకమీఁద జూదమునకై ధనమును సంపాదింపను. నా పదివ్రేళ్ళను జూపి సత్యము చెప్పుచున్నాను.

౧౩. 'ఓజూదరీ! నీవు నామాటలయందు నమ్మికయుంచి జూద మాడవలదు. కృషిచేసికొనుము. అందువలన నార్జించిన ధనమును అనుభవింపుము. కృషిచేసినందున నీకుఁ బశువులును ధనమును గలుగఁగలవు. భార్య రాఁగలదు. అని యీశ్వరుఁ డయిన సవిత నాకు బోధించెను.' [౧౦-౩౪.]

ప్రస్తుతము చీట్లరూపమున జూదమాడువారును, 'వ్రివిడెంటుఫండ్లు' అని పేళ్లుపెట్టి దేశమునందలి యనేక జనుల జూదరులుగఁ జేయువారును, ఈశ్రుతిలోని బోధనుజదివియైనను బుద్ధి తెచ్చుకొనియెదరుగాక!

ఋ గ్వే ద ము.

ఈ రెండవ ప్రకరణములో వర్ణింపఁబడిన యంశము లన్నియు ఋగ్వేదమును అనుసరించి వ్రాయఁబడినవని చదు

వరు లచ్చటచ్చట నుదాహరింపఁబడిన వాక్యములవలనఁ గనుఁగొనియుందురు. కావున నట్టి ఋగ్వేదమును గుఱించి యిచ్చటఁ గొంత వ్రాయుట యుచితము.

ఋగ్వేదమునందు ౧౦౫౮౦ మంత్రములు కలవు. వీనికే ఋక్కులని పేరు. ఈమంత్రములలో ననేకవిషయము లుండును. ఒకమంత్రములో నొకానొక దేవతయొక్క స్తుతియుండును. ఒకమంత్రములోఁ బూర్వవృత్తకథనమును, ఒక మంత్రములో నుపదేశమును, ఒక మంత్రములోఁ గోర్కులును, ఒకమంత్రములోఁ బ్రశ్నలును ఇట్లు అనేకవిషయము లుండును. ఆవర్ణనలఁబట్టి మన మప్పటి చరిత్రాంశములను దెలిసికొనవలయును.

ఋగ్వేదము రెండువిధములుగా విభజింపఁబడినది. మంత్రము లేక ఋక్ అనునది యన్నిటికంటెఁ జిన్నవిభాగము. కావ్యగ్రంథములోని శ్లోకమువంటిది. కొన్ని ఋక్కులుగలిసి యొక సూక్తమగును. ఒకసూక్తమునకు నొక్కఁడే ఋషి; దేవత యొక్కటిగాని పెక్కులుగాని యుండును. ఇట్టి సూక్తములు ఋగ్వేదమునందు ౧౦౨౮ కలవు. ఇట్టికొన్ని సూక్తములు కలిసి కొన్నియనువాకము లగును. అనువాకముల సంఖ్య ౮౫. కొన్ని యనువాకముల సమూహమునకు మండలమని పేరు. ఋగ్వేదమంతయు దశమండలాత్మకము. ఇదియొక విభజనపద్ధతి. ఇదిగాక యీవేద మెనిమిది యష్టకములుగను, ప్రతియష్టక మెనిమిది యధ్యాయములుగను, అధ్యాయము

ప్రాయశః ముప్పదిమూఁడు వర్గములుగను, వర్గము కొన్ని మంత్రములుగను విభజింపఁబడియున్నది. ఈవిభజనము ననుసరించి ఋగ్వేదములో ౮ అష్టకములును, ౬౪ అధ్యాయములును, ౨౦౦౬ వర్గములును గలవు. ఈవేదమునందు ౧౫౩౮౨౬ పదములును, ౪౩౨౦౦౦ అక్షరములును ఉన్నవి. ఇందు ౧౦౫౮౦ ఋక్కులున్నవని యిదివఱకే వ్రాసియున్నారము. కాని కొందఱిమతమున ౧౦౪౦౨ ఋక్కులును, ఇతరులమతమున ౧౦౬౨౨ ఋక్కులును గలవు.

ఋగ్వేదములోని మంత్రముల రచించినవారు ఋషులు. అట్టివారనేకులుండిరి. వేదములపౌరుషేయములనియెడువారు వీరిని మంత్రకర్తలనక మంత్రద్రష్టలనియెదరు. ప్రథమదశమ మండలములకు ఋషులనేకులుకలరు. అందు స్త్రీలును పలువురు గలరు. వాక్, విశ్వవారా, శ్రద్ధా, సూర్యా, మొదలయిన స్త్రీలు ఋగ్వేదములో కొన్ని సూక్తములను రచించిరి. ఋగ్వేదముయొక్క రెండవమండలమునకు గృత్సమదుఁడును, మూఁడవమండలమునకు విశ్వామిత్రుఁడును, నాల్గవమండలమునకు వామదేవుఁడును, అయిదవమండలమునకు అత్రియు, ఆఱవమండలమునకుఁ భారద్వాజుఁడును, ఏడవమండలమునకు వసిష్ఠుఁడును, ఎనిమిదవమండలమునకుఁ గణ్వుఁడును, తొమ్మిదవమండలమునకు అంగిరసుఁడును ఋషులు. గృత్సమద విశ్వామిత్రాది శబ్దములవలన నొక్కొక్క ఋషియే యని గ్రహింపఁ గూడదు. ఆసంతతివారనేకులని యెఱుఁగునది.

ఈ ఋగ్వేదమును ఇతర వేదములును హిందూధర్మము నకు మూలాధారములు. కావున వీనిలో నొకయక్షరముకూడ ఇటుదియటుగాకుండ బ్రాహ్మణు లీవేదములను ముఖస్థముచేసి, యంతటితోఁ దృప్తినొందక, వేదమంత్రములలోని యొక్కొక్క శబ్దము తమకు గట్టిగా జ్ఞప్తియుండవలయునని సంహితా పాఠమును, పద, క్రమ, జట, ఘనపాఠములుగా నేర్పఱిచి యీట్టిపాఠములను వల్లించెదరు. చదువరులకు నీ భిన్నభిన్నపాఠ ముల స్వరూపముఁ దెలియుటకును, మేము జటాపాఠుల మనియు, ఘనపాఠులమనియుఁ జెప్పుకొనువారు పడిన పరిశ్రమ స్వరూపము దెలియుటకును, ఒక ఋక్కును దీసికొని దాని యొక్క వివిధపాఠములను ఈక్రిందఁ జూపుచున్నాఁడను:—

మూలఋక్ — పవస్వ వాజసాతయే। విప్రస్యగృణతో వృధే।
సోమరాస్వ సువీర్యమ్॥*

పదపాఠము—పవస్వ। వాజసాతయే। విప్రస్య। గృణతః। వృధే।
సోమ। రాస్వ। సువీర్యమ్॥

క్రమపాఠము-పవస్వవాజసాతయే। వాజసాతయే విప్రస్య। వా
జసాతయ ఇతి వాజసాతయే। విప్రస్య గృణతః। గృణతో
వృధే। వృధ ఇతి వృధే। సోమరాస్వ। రాస్వ సువీర్యం।
సువీర్య మితి సువీర్యమ్॥

* ఓసోమ! మాకు సన్నలాభముకొఱకు నిన్ను స్తుతించుచున్నట్టి విప్రుఁడ నగు నాకు నభివృద్ధియగుటకు రసమిమ్ము; వీర్యవంతుఁడగు మంచి పుత్రుని నాకు నిమ్ము.

జటాపాఠము – పవస్వ, వాజసాతయే వాజసాతయే, పవస్వ పవస్వ, వాజసాతయే। వాజసాతయే, విప్రిస్య విప్రిస్య, వాజసాతయే వాజసాతయే, విప్రిస్య।వాజసాతయ ఇతి వాజసాతయే। విప్రిస్య, గృణతో గృణతో, విప్రిస్య విప్రిస్య, గృణతః। గృణతో, వృధే వృధే, గృణతో గృణతో, వృధే। వృధ ఇతి వృధే॥

సోమ, రాస్వ రాస్వ, సోమసోమ, రాస్వ। రాస్వ సువీర్యగ్ం సువీర్యగ్ం, రాస్వ రాస్వ, సువీర్యం। సువీర్యమితి సువీర్యమ్॥

ఘనపాఠము–పవస్వ, వాజసాతయే వాజసాతయే, పవస్వపవస్వ వాజసాతయే, విప్రిస్య విప్రిస్య, వాజసాతయే, పవస్వ పవస్వ, వాజసాతయే, విప్రిస్య।వాజసాతయే, విప్రిస్య విప్రిస్య, వాజసాతయే వాజసాతయే, విప్రిస్య,గృణతో, గృణతో, విప్రిస్య, వాజసాతయే వాజసాతయే, విప్రిస్య గృణతః। వాజసాతయ ఇతి వాజసాతయే। విప్రిస్య, గృణతోగృణతో, విప్రిస్య విప్రిస్య, గృణతో, వృధే వృధే, గృణతో, విప్రిస్య విప్రిస్య, గృణతో, వృధే। గృణతో, వృధే వృధే,గృణతో గృణతో, వృధే। వృధ ఇతి వృధే॥

సోమ,రాస్వరాస్వ,సోమసోమ ,రాస్వ,సువీర్యగ్ం సువీర్యగ్ం, రాస్వ, సోమసోమ, రాస్వ, సువీర్యం। రాస్వ,

సువీర్యగ్ం సువీర్యగ్ం, రాస్వరాస్వ, సువీర్యం।
సువీర్యమింతి సువీర్యమ్॥ ఋ॥ ౯॥ ౪౪॥ ౬౦

వేలకొలంది ఋష్యులచే శోభితంబగు ఋగ్వేదమంతయు నొక్కసారి రచింపఁబడెననిగాని, దాని ననుసరించిన వైదిక కాలములోని యార్యులనుగురించి పైఁ జెప్పఁబడిన యంశము లన్నియు నొక్కకాలమునం దుండెననిగాని చదువరు లనుకొనఁ గూడదు. ఋగ్వేదములో వర్ణింపఁబడిన యంశములన్నియు నొక్కసమయమున జరిగినవి గావు. ఆర్యులు హిందూదేశము నకు వచ్చి సింధునదము మొదలు గంగాయమునలవఱకుఁ దమ నివాసస్థలముల నేర్పఱుచుకొనుటకుఁ దక్కువలోఁ దక్కువ యాఱువందల సంవత్సరములైనను బట్టియుండును. కాన నిన్ని సంవత్సరములలో జరిగిన సమాచారము లన్నియు ఋగ్వేదము నందు వర్ణింపఁబడినవి.

మూఁడవ ప్రకరణము.



# క్షాత్రయుగము.

(క్రీ. పూ. ౧౪౦౦-౧౦౦౦).



ఆర్యులు సింధునద తీరమునకు జుట్టుప్రక్కలను ఉండు ప్రదేశములను నాక్రమించి నివాస మేర్పఱుచుకొన్న సమాచారము క్రిందటి ప్రకరణములో వర్ణింపఁబడినది. ఈయార్యులంతటితో నూరకుండలేదు. అచ్చటినుండి క్రమక్రమముగా నార్యావర్తము నాక్రమించుకొన్నవిధమును, ఆకాలమునందలి యాచారవ్యవహారములును, ఈ ప్రకరణమునందు వర్ణింపఁబడును.

## ఆ కాలపు వాఙ్మయము.

ఈ కాలమునందే యజుర్వేదంబును, సామవేదంబును రచింపఁబడినవి. యజుర్వేదము గద్యపద్యాత్మకము. అందలి పద్యములు ఋగ్వేదమునుండి గ్రహింపఁబడినవి. గద్య భాగమునందుఁ గ్రతువులలో ఋగ్వేదమంత్రము లుపయోగించు విధములు వర్ణింపఁబడి యున్నవి. తైత్తిరీయ సంహితయనియు, వాజసనేయ సంహితయనియు, యజుర్వేదము రెండువిధములు. తైత్తిరీయసంహితకే కృష్ణయజుర్వేదమని పేరు; వాజసనేయమునకు శుక్లయజుర్వేదమని పేరు. ప్రథమశాఖవారిది శుక్ల

యజుర్వేదము. వాజసనేయ సంహితకంటెఁ దైత్తిరీయసంహిత యధికప్రాచీనమని పూర్వపశ్చిమపండితుల యభిప్రాయమై యున్నది. యజ్ఞసమయమునందు గానముచేయఁబడు మంత్రసంగ్రహము సామవేదముగా నేర్పడెను. మొట్టమొదట నీ మూఁడు వేదములే యుండెననియుఁ దరువాత నెంతో కాలము నకు అథర్వవేద మేర్పడెననియు విద్వదభిప్రాయము. సంహితల తరువాత బ్రాహ్మణము లనుగ్రంథములును ఆరణ్యకము లును రచింపఁబడిరి.

వేదములు నాలుగనియు, సమస్త శ్రుతివేదమును సంహితాబ్రాహ్మణము లను రెండుభాగములుఁ గలిగియుండు ననియుఁ జదువరు లెఱుంగునది. సంహితాభాగమనిగాని బ్రాహ్మణభాగమనిగాని చెప్పక కేవలము 'ఋగ్వేదము' 'యజుర్వేదము' అని చెప్పినయెడల ఋగ్యజుర్వేదముల సంహితాభాగములని తెలిసికొనవలయును. ప్రతి వేదమునకును పెక్కు బ్రాహ్మణములు గలవు. అందు ఋగ్వేదమునకు ఐతరేయ కౌషీతకీబ్రాహ్మణములును యజుర్వేదమునకు శతపథతైత్తిరీయ బ్రాహ్మణములును, సామవేదమునకు తాండ్యషడ్వింశ మంత్రబ్రాహ్మణములును, అథర్వవేదమునకు గోపథబ్రాహ్మణమును ముఖ్యములైనవి. ఈ బ్రాహ్మణములలో ఋగ్వేదాది సంహితలలోని మంత్రములకు నర్థములును, యజ్ఞయాగాది సంహితలలోని మంత్రములకు నర్థములును, యజ్ఞయాగాది క్రతువులు చేయవలసినవిధములును, అప్పటిరాజులయొక్కయు

రాజ్యములయొక్కయు నితిహాసంబులును వర్ణింపఁబడినవి. ఈగ్రంథములనుండియే మన మాకాలపుచరిత్రఁ గనుఁగొన వలసియున్నది.

ఈయుగముయొక్క చివరభాగమున రామాయణమహాభారతము లను ఇతిహాసగ్రంథములు రచింపఁబడినవి. ఈ గ్రంథము లీయుగమున రచింపఁబడలేదనియుఁ దరువాతి యుగమున రచింపఁబడినవనియుఁ గొందఱనియెదరు. ఈ యుగమునకుఁ దరువాత రచింపఁబడిన పాణినీయసూత్రములలో మహాభారతకథను గుఱించియు, పతంజలికృత మహాభాష్యములో రామాయణకథను గూర్చియు నుల్లేఖ (Reference) ముండుటవలన ఈగ్రంథము లీయుగముననే రచింపఁబడినటుల నిశ్చయింపవచ్చును. ఈ యితిహాసములు మొదట నింత పెద్దవిగా లేవు. వాల్మీకిరామాయణము మొదట నొక్కదినములోఁ బూర్తిగఁ జదువుటకు వీలయినంతదిగా నుండెను. వ్యాసకృతమహాభారతము మొదట నైదువేల శ్లోకములు గలదిగ నుండె. తరువాత నీగ్రంథములు క్రమక్రమముగాఁ బెఱుగుచు వచ్చినవి.

## అప్పటి రాజ్యములు.

ఇట్లాకాలంబున రచింపఁబడి యప్పటిచరిత్రమును గనుఁగొనుటకు సాధనభూతంబులగు గ్రంథములఁ దెలిపి యిఁక నప్పటిరాజ్యములను గుఱించి వ్రాసెదము.

ఆర్యులు సప్తసింధుప్రదేశము దాఁటి యనార్యులఁ గొండలలోనికిఁ దఱుముచుఁ గ్రొత్తదేశముల నాక్రమించుచు గంగా యమునా నదులయొద్దను గ్రొత్తరాజ్యముల నిర్మింపఁ దొడఁగిరి. ఇట్లు క్రొత్తగా నాకాలమందు నేర్పఱుపఁబడిన రాజ్యములలోఁ గురుపాంచాలదేశములును, కాశీకోసలవిదేహదేశములును మొదటివి. ఈదేశములను గుఱించియు, నచ్చటి రాజులను గుఱించియు బ్రాహ్మణములలో ననేకస్థలములఁ జెప్పఁబడియున్నది. కురుపాంచాలదేశములు గంగకుఁ బశ్చిమమునను కాశీకోసలవిదేహదేశములు గంగకుఁ దూర్పునను ఉండెను.

## కురుపాంచాలదేశములు.

కురుదేశము హస్తినాపురము రాజధానిగాఁ గలిగి యుండెను. ఈ రాజ్యము ప్రస్తుతపు ఢిల్లీనగరము చుట్టుప్రక్కలను వ్యాపించియుండెను. ఢిల్లీపట్టణమునకు నాతిదూరముననే ప్రసిద్ధమైన కురుక్షేత్రయుద్ధభూమి గలదు. కురుక్షేత్రముయొక్క యెల్లలు మహాభారతమునందు [1] నుత్తరమున దృషద్వతి యనియు దక్షిణమున సరస్వతియనియుఁ జెప్పఁబడినది. దీనినే మనుస్మృతికారుఁడు బ్రహ్మావర్తమనెను. [2] కాళిదాసుఁడును బ్రహ్మావర్తమునే కురుక్షేత్రమని చెప్పినాఁడు. [3] కాన 'కురుక్షేత్రము,' 'బ్రహ్మావర్తము' సమానార్థములుగాఁ గాన వచ్చుచున్నవి. ప్రస్తుతము ఢిల్లీకి వాయువ్యమున స్థానేశ్వ

1. ఆది. ౯౦-౪; ౨. మను. ౨-౧౭; ౩. మేఘ. శ్లో. ౪౯.

రము కలదు. దానియొద్దనుండియే సరస్వతీనది ప్రవహిం చును. ఇది రాజపుత్రస్థానపు ఎడారిలో నదృశ్యమగును. దృష ద్వతి మిక్కిలి చిన్నదిగానం బలమునందు సాధారణ ముగాం జూపంబడదు. ఈ సరస్వతీదృషద్వతీనదుల యొద్దను న్నందు ప్రదేశము పవిత్రమైనది యని ఋగ్వేదకాలములోను నమ్మిక గలిగియున్నట్లు గానవచ్చెడిని. 1 భారతయుద్ధముగాక భరతఖండము నెవ్వరు పాలింపవలసినది నిర్ణయించిన మూండు పానిపతయుద్ధములిటీవల ఈ కురుక్షేత్రముననే జరిగినవి పాంచాలదేశము పూర్వము పశ్చిమోత్తరపరగణా (North-West Provinces) లనబడుచుండిన దేశములోం గొంతభాగ ము. కాన్యకుబ్జమనంబడు కనౌజపట్టణమును, కౌశాంబియు, మధుర యనుపట్టణమును ఈదేశములోనివియే. మహాభార తములోం బాంచాలదేశము హిమాలయము మొదలుకొని చర్మణ్వతీ (చంబల్) నదివఱకు వ్యాపించియుండె నని వ్రాయంబడియున్నది. పాంచాలు లనువారికిం బూర్వము "క్రివి" యను పేరుండెనని శతపథబ్రాహ్మణము చెప్పుచున్నది (౧౩-౫-౪-౭). ఇట్టి పేరుగల జనులు సింధ్వసిక్నీనదుల ప్రదే శమున ఋగ్వేదకాలమున నున్నట్లు ఋగ్వేదములోని (౮-౨౦-౨౪) ఋక్కువలన మన మూహింపవలసి యున్నది. కావున నీ పాంచాలురు మొదట సింధునదముయొక్క యొద్దను నుండిరనియు నచ్చటనుండి చీనాబ్ నది యొద్దనకును, తరు

---

1. ఋగ్వే. ౩-౨౩-౪.

వారు క్రమక్రమముగాఁ దూర్పునకు గంగానది యొడ్డునకును వచ్చిరనియు, మనము నిశ్చయింప వచ్చును.

ఈ కురుపాంచాలదేశములు మిక్కిలి ఘనతకెక్కిన శూరులగు రాజులచేఁ బరిపాలింపఁబడి పరిషత్తు లనఁబడు గొప్ప విద్యాపీఠములు కలిగియుండి, శౌర్యమునకును, విద్యలకును, యజ్ఞయాగాదిక్రతువులకును నాకరములయి యుండిన ట్లనేక బ్రాహ్మణములలోఁ జెప్పఁబడి యున్నది. మొదటఁ గురుపాంచాలు రనఁగాఁ గురుదేశపురాజులును పాంచాలదేశపు రాజులును మిగుల స్నేహముగలవారయి తరువాతఁ బోరాడిరని బ్రాహ్మణగ్రంథములవలనఁ గానవచ్చెడిని. కురుదేశపు రాజగు దుర్యోధనునిపక్షమున నున్న కౌరవులకును, ధర్మరాజు పక్షముననున్న పాంచాలరాజునకును రాజపుత్త్రినకును ఘోర యుద్ధము జరిగెనని చదువరు లెఱిఁగియే యుందురు. ఆ యుద్ధమును నుద్దేశించియే బ్రాహ్మణగ్రంథములలోని కురుపాంచాలయుద్ధవర్ణనము వ్రాయఁబడియుండవచ్చునని యూహింప వలసినది.

ప్రస్తుత ముత్తరబిహార్ (North Behar) అనఁబడు దేశము పూర్వపు విదేహరాజ్యము. విజ్ఞానమునకై విఖ్యాతిఁ జెందిన జనకుఁడు మొదలగు రాజర్షు లిచ్చటి నృపతులే. శ్రీరామచంద్రుని భార్యయై మనదేశమందుఁ బతివ్రతాశిరోమణి యని పేరొందిన సీతయొక్క జన్మభూమి యీదేశంబే. ప్రస్తుతము ఔధ్ (అయోధ్య) అనఁబడు దేశము కోసలము.

అటుతరువాతికాలమున దక్షిణకోసల మను దేశ మొకటి యేర్పడినందున దీనిని ఉత్తరకోసల మనుచుండిరి. ఈ దేశము నకు రాజధాని అయోధ్య. సూర్యవంశపురాజు లిచ్చట రాజ్యము చేయుచుండిరి. కోసలదేశమునకును, విదేహ దేశము నకును గండకీనదియే పొలిమేర యని శతపథబ్రాహ్మణము చెప్పుచున్నది (౧-౪-౧). కోసల మానదికిఁ బడమటను, విదేహము తూర్పునను ఉండెను.

ఈవఱకుఁ జెప్పఁబడిన దేశములన్నియు సింధు, గంగా, యమునా, గండకీనదులయొడ్డున నున్నవి యని చదువరులు కని పెట్టియుందురు. నివాసమున కెప్పుడును నదీతీరములు మిక్కిలి ఏలయినవిగాన నార్యులు ప్రథమమున నదుల ననుసరించియే దేశముల గెలుచుచు వచ్చిరి.

ప్రథమమున విఖ్యాతిఁజెందిన యీ దేశములుగాక యార్యులు, ప్రస్తుతము దక్షిణ బెహార్ (South Behar) అను చోట మగధరాజ్యమును, మధ్యపరగణాలలోని బిలాసుపూర్, జబల్‌పూర్ జిల్లాలవైపునఁ జేదిదేశమును, నర్మదకు నుత్తరం బున దక్షిణమాళవదేశప్రాంతమున నిషధదేశమును, స్థాపించి నట్లు గానవచ్చెడిని. క్రమక్రమముగా నార్యు లీకాలమున హిమాలయ వింధ్యపర్వతముల నడుమనుండు ప్రదేశము నంతను నాక్రమించుకొని దానికి ఆర్యావర్తమని పేరిడిరి. "ఆర్యా వర్తః పుణ్యభూమి ర్మధ్యం విన్ధ్య హిమాగయోః" అనుశ్లోకా ర్థము అమరకోశము చదివినవారికందఱకును దెలిసినదియే.

ఈ యార్యావర్తంబుననే యార్యు లుండవలెననియు, దానిని దాటి వెడలఁగూడదనియుఁ దలంచుచుండిరి.

ఇట్లార్యులచే స్థాపింపఁబడిన దేశములుగాక వింధ్యపర్వతమునకు దక్షిణమున పుళిందులు, శబరులు, ఆంధ్రులు మొదలగు అనార్యులును, ద్రావిడులును దండకారణ్యమున నున్నట్లు బ్రాహ్మణగ్రంథములు చెప్పుచున్నవి (ఐతరేయ బ్రాహ్మణము ౭-౧౮). అందువలన నీయుగపు చివరకాలమున నార్యులు కొంచెముకొంచెముగా దక్షిణమునకుఁ బోవ నారంభించినట్లు గానవచ్చెడిని.

## అప్పటి రాజ్యపద్ధతి.

పైని వర్ణింపఁబడిన రాజ్యములుగాక యైతరేయబ్రాహ్మణము "సర్వచరు, కురుక్షేత్ర, అవచత్నుక, ముష్టార్, ప్రాచీగుణ, వృతిఘ్నము" లను దేశముల నామములు కానవచ్చుచున్నవి. కాని వీని స్థలనిర్ణయము జేయుట దుష్కరము. ఆకాలమందు వేఱువేఱు దేశముల రాజులకు వేఱువేఱు పేర్లుండెనని యీ బ్రాహ్మణమువలననే తెలియుచున్నది. ఇప్పుడు జర్మనీ చక్రవర్తికి కైసరనియు, రషియారాజునకు జారనియు, పారసీకరాజునకు షహాయనియు, అఫ్గానిస్థాన్ రాజులకు అమీరనియు వేఱువేఱుబిరుదు లున్నట్లాకాలమందు హిందూదేశము లోని తూర్పువైపు రాజులకు సమ్రాట్టులనియు, దక్షిణపు రాజులకు భోజులనియుఁ, బశ్చిమమందున్న అనీచ్య, అపాచ్య దేశపు రాజులకు స్వరాట్టులనియు, ఉత్తరకురు ఉత్తరమద్ర

దేశముల నాయకులకు విరాట్టులనియు, మధ్యదేశమందలి కురు పాంచాలవశోశీనర దేశముల రాజులకు 'రాజు' లనియు వేఱు వేఱు పేర్లుండెను. ఇందలి ఉత్తరకురు, ఉత్తరమద్రదేశములను గుఱించి వ్రాయఁబడిన యీక్రిందివాక్యము ముఖ్యమైనది. "ఉదీచ్యాం దిశి యే కేచ పరేణ హిమవన్తం జనపదా ఉత్తరకురవ ఉత్తరమద్రాఇతి వైరాజ్యాయైవ తే౽భిషిచ్యన్తే విరాళిత్యేనానభిషిక్తానాచక్షత" (౩-౮). ఇందువలన నాకాలమందు నుత్తరకురు ఉత్తర మద్రదేశములు హిమాలయమునంటి యుత్తర దేశమునం దుండెననియు, అచ్చటిజనులు రాజులేకుండ స్వయముగనే రాజ్యము చేయుచుండిరనియు, రాజు లేకుండఁగనే రాజ్యము చేయుట వారికొర్కెయైనందున వారు తమ నాయకులుగా నేర్పరుచుకొనినవారికి విరాట్ (రాజులేనివారు) అని పేరుండె ననియు నూహింపవలసియున్నది. అందువలన నాకాలమందుఁ గూడ నీదేశమునఁ బ్రజాసత్తాక రాజ్యములు (Republics) కలవని తోఁచెడిని.

రాజపాలనము కల రాజ్యములందును రాజు నిరంకుశుఁడుగాక ప్రజాప్రతినిధులగు కొన్నిసభల యనుమతి ననుసరించి రాజ్యముచేయునట్లు గానవచ్చెడిని. అథర్వ వేదమందు "సభా" "సమితి" యను రెండు రాజసంఘము లున్నట్లును (౭-౧౩-౧), సభలో నుండువారు "సభ్యు" లనియు, సమితిలో నుండువారు "సామిత్యు" లనియు, "ఆమంత్రణీయము" (మంత్రి మండలము) లో నుండువారు "ఆమంత్రణీయు" లనియు,

(౮-౧౦-౮, ౯, ౧౦, ౧౧) చెప్పఁబడియున్నది. మఱియొక మంత్రములో "రాజు ప్రజల కనుకూలముగ నుండును. సభా సమితిసేనసురలు రాజునకు ననుకూలముగా నుందురు; ఇట్లిటిఁ గినవాఁడు సభాసమితిసేన సురలయొక్క ప్రియధాముఁగును" (౧౫-౯-౧,౨,౩) అని యథర్వవేదమందు స్పష్టముగాఁ జెప్పఁ బడియున్నది. ఇందువలనఁ బ్రస్తుత మింగ్లండులోని పార్లమెంటు సభవలెను, రాజమండలము (Cabinet) వలెను గొంతవఱకు రాజు నధికారమునకు నంకుశముగఁ గొన్ని సభ లుండెనని స్పష్టముగాఁ గానవచ్చుచున్నది. మఱియొక మంత్రములో (౭-౧౨-౨) 'ఓసభా! నీపేరు 'నరిష్టా' యని నేనెఱుఁగుదును. ఇందలి సభాసదులెవ్వరో వారు నాతోసమానముగా (నా కనుకూలముగా) సంభాషించువా రగుదురు గాక' యని రాజు చెప్పుచున్నాఁడు. ఇందు 'నరిష్టా' శబ్దము ముఖ్యము. ఇం దునకు సాయనాచార్యులవా రిట్లు భాష్యము వ్రాసిరి: 'బహవః సంభూయ యదేకం వాక్యం వదేయుః తద్ధినపరైరతిలఙ్ఘ్యమ్, అత అనతిలఙ్ఘ్యత్వాత్ నరిష్టేతినామసభాయాయుజ్యతే' అనఁగా ననేకులు కలిసి చెప్పినమాట జవదాఁటుటకు నెవరికిని తరము గాదు. కావున ఆసభకు 'నరిష్టా' యను సార్థకనామము వచ్చెను. సభాసదులవాక్య మనతిలంఘ్యమైనందుననే వారు తన కనుకూలురుగానుండవలెనని కోరుచున్నాఁడు. వైదికకాలములోని యీ 'సభా,' 'సమితి' మొదలగు ప్రజాప్రతినిధి సంఘములను గుఱించి యింకను శోధింపవలసియున్నది. తర్వాతి

కూర్పు వచ్చువరకు వీనిశోధనము పూర్తియగునని నమ్ముచున్నాఁడను.

## అయోధ్యనుండి లంకకు మార్గము.

రామాయణములో వర్ణింపఁబడిన శ్రీరామచంద్రుని కథ యందఱకుఁ దెలిసినదే యైనందున దాని నిచ్చట మరల వ్రాయుట యనావశ్యకము. కాని మొట్టమొదట నుత్తరము నుండి యత్యంత దక్షిణమునకు వెడలి యచ్చటనుండి లంకకు వెళ్లిన యార్యుఁడు శ్రీరామచంద్రుఁడే యని యనేక విద్వాంసుల యభిప్రాయమై యున్నందున నయోధ్యనుండి లంకవఱకును రాముని మార్గమును నిర్ణయించుట యావశ్యకము. కాన నిచ్చట వాల్మీకి రామాయణానుసారము రామమార్గమును వర్ణించెదను. ఇందువలన నాకాలపు టనేక దాక్షిణాత్య ప్రదేశముల స్థలనిర్దేశము కాఁగలదు.

అయోధ్యనుండి లంకవఱకును రామమార్గమును జూపు పటమిందుతోఁ జతపఱుపఁబడినది. ఈవర్ణన చదువునప్పుడు దానిని చదువరులు చూచుచుందురు గాక!

ప్రస్తుతము ఔధ్ (Oudh) అనఁబడు ప్రాంతములో నున్న యయోధ్యయొద్దనే పూర్వపు అయోధ్యయుండెననుట యందఱు నొప్పుకొను విషయమే. కాని ప్రస్తుతము సిలోన్ అనఁబడు సింహళము రావణాసురుని లంక కాదనియు నది వేఱుగ నెచ్చటనో యుండెననియుఁ గొందఱు తలంచెదరు. కాని పురాతనగ్రంథములు చూడఁగా మనవాండ్రు మొదటి

నుండియు సింహళమునే రావణాసురుని లంకగాఁ దలంచుచుండిరని తోఁచెడిని. చరిత్రాత్మకమైన రాజతరంగిణి యను గ్రంథములో సింహళ లంకాద్వీపముల యైక్యమే చెప్పఁబడియున్నది. సింహళములోని శాసనములలోఁ గూడ నిదియే లంకయని యున్నది. కానఁ బ్రస్తుతపు సింహళమే రామాయణీయలంక యని గ్రహింపవలెను. ♦

---

♦ సింహళము రావణాసురునిలంక కాదనువారికి నొకప్రబలప్రమాణము కలదు. దాని నిచ్చట నుదాహరించుట యుక్తమని తలఁచెదము. మనజ్యోతిష్కులు లంకకు "నిరక్ష" దేశ మని పేరుపెట్టిరి. అనఁగా నక్షాంశములు (Latitudes) లేని దేశమని యర్థము. అచ్చటి యక్షాంశములు సున్న అనఁగాఁ బ్రస్తుతమువారిచేఁ జెప్పఁబడెడు భూమధ్యరేఖ ( Equator ) యీ ప్రదేశము మీఁదుగా బోవునని తాత్పర్యము. కాని ప్రస్తుతపు నక్షాంశసంబంధమైన భూమధ్యరేఖ ( Equator ) సింహళమునకు దక్షిణమున నేడంశముల ( Degrees ) మీఁద నున్నది. అంశ మనఁగా డెబ్బదిమైళ్ళు. కాన నీలెక్క ప్రకారము సింహళమునకు దక్షిణమున ౪౯౦ మైళ్ళమీఁద లంక యుండవలయును. ఈ యంశమే భాస్కరాచార్యులవా రిట్లు చెప్పియున్నారు.

"నిరక్షదేశాత్ క్షితిషోడశాంశే, భవే దవన్తీ గణితేన యస్మాత్,
తదన్తరం షోడశసంగుణంస్యాత్, భూమాన మస్మాత్ బహుకింతదుక్తమ్.

[గోలాధ్యాయము].

అర్థము—నిరక్షదేశము (లంక)నుండి యవంతీపట్టణము భూమానము యొక్క పదియాఱవ యంశముమీఁద నున్నది. కాన నారెండుస్థలములలోని యంతరమును బదియాఱుచే గుణించిన భూమానము గాఁగలదు.

భాస్కరాచార్యులవారు వ్రాసిన ట్లవంతి ప్రస్తుతము క్షితిషోడశాంశము (1/16) న రమారమి $22\frac{1}{2}^{\circ}$ ఇరువది రెండునర యక్షాంశములపై

ఇఁక రాముని మార్గమును వర్ణించెదము. అయోధ్య నుండి ప్రయాగవఱకు రాముఁడుచేసిన ప్రవాసము సర్వవిదితమే.1 ఈ స్థలములు ప్రస్తుతకాలమందును ఆయానామములే కలిగియున్నవి. ప్రయాగలో భరద్వాజాశ్రమ ముండెను.

---

(Degrees of latitude) మున్నది. ఈ సంఖ్య ($22\frac{1}{2}°$) ను 16 తో హెచ్చించిన 360° అక్షాంశములు వచ్చుచున్నవి. ఇదియే భూమియొక్క మానము. ఇట్లు భాస్కరాచార్య మతమున నిరక్షదేశ మనఁగా లంక యవంతికి దక్షిణమున $22\frac{1}{2}$ డిగ్రీల యక్షాంశములదూరమున నుండవలెను. ప్రస్తుతపు సింహళము 16° అక్షాంశములమీఁదనే యున్నది. కాన నిది లంకకాదేమోయని సంశయింపవలసి యున్నది. కాని యీయూహలన్నియు, ప్రస్తుతపు ఈక్వేటరును (Equator) పూర్వపునిరక్షదేశము నొకటియే యనియు, మన జ్యోతిషికులం భూమధ్యరేఖ (Equator) మీఁదికిఁబోయి స్థలనిర్ణయము చేసిరనియుఁ, దరువాత వ్రాసిరనియు మనము గ్రహించినయెడల, నిజములగును. అవంతియొక్క యక్షాంశములను నచ్చటనే కనిపెట్టి, భూమియంతయు 360° యంశములని యీ జ్యోతిషికులకుఁ దెలిసిన విషయమే గనుక నవంతి 'క్షితిషోడశాంశ'మున నున్నదనిరి; సింహళ మవంతికి మిక్కిలి దక్షిణమున నున్నందున నది నిరక్షదేశముపై నున్నదనుకొని 'లంక' 'నిరక్షదేశము' అను శబ్దములను జ్యోతిష గ్రంథములలోఁ బర్యాయపదములుగా వాడుచు వచ్చిరని మాయభిప్రాయము. ఒకవేళ సింహళము లంకగాక దానికి దక్షిణమున నేడంశముల మీఁద నుండినను నయోధ్యనుండి రామేశ్వరమువఱకు మేము వర్ణించిన రామమార్గమునకు నేమియు బాధ రాదు. కాన లంకాస్థలనిర్ణయచర్చ నింతటితోఁ జాలించెదము.

1. (వాల్మీకిరామాయణము; అయోధ్యాకాండము, ౪౫ సర్గము మొదలు ౫౪ సర్గమువఱకుఁ జూడుఁడు.)

అచ్చట నొకరాత్రియుండి రాముఁడు చిత్రకూటమునకు వెళ్లెను. చిత్రకూటము ప్రయాగకుఁ బదికోశములమీఁదనుండెను. 1 ప్రస్తుతపులెక్క ననుసరించి ప్రయాగకుఁ జిత్రకూటము డెబ్బదియైదు మైళ్ళున్నది. కానఁ బ్రస్తుతపు పదున్నర మైళ్ళు రామాయణీయ క్రోశమునకు సరిగా నుండెనని మన మూహింపవలసి యున్నది. ఈ చిత్రకూటమునొద్ద మందాకిని యను నది యుండెను. 2 ప్రస్తుతము గూడ నాపేరుగల నది యే యాపర్వతమునొద్ద నున్నది.

కానఁ బ్రస్తుతము ప్రయాగపట్టణమునకుఁ బశ్చిమమున డెబ్బదియైదుమైళ్ల దూరముననున్న చిత్రకూట మను పర్వతమే రామాయణీయ చిత్రకూటమని మనము నిశ్చయింపవచ్చును. అచ్చటనుండి యాగ్నేయ దిక్కునకుఁబోయి రాముఁడు 'అత్రిఋషి' యొక్క యాశ్రమములోఁ బ్రవేశించెను. ఆ శ్రమమనఁగా నొక పర్ణశాలకాదు. కొన్ని మునిపల్లెల సమూహము. ఒకానొక గొప్పఋషి నాశ్రయించి, యనేక శిష్యులు చుట్టుపట్టున నెంతోదూరమువఱకుఁ గుటీరముల నిర్మించుకొని కాఁపుర ముండెడివారు. అట్టి మునిపల్లెలన్నియు నామహర్షి యొక్క యాశ్రమమని పేర్కొనఁబడుచుండెను. అత్ర్యాశ్రమము మిక్కిలి విశాలమైనదిగా నుండెను. ప్రస్తుతపు రేవా ప్రాంతముయొక్క దక్షిణసీమవరకును వ్యాపించెనని చెప్పవచ్చును. అత్రిఋషిభార్య అనసూయ. ఈమెకును సీతకును జరిగిన సంవాదము మిక్కిలి జ్ఞానప్రదము. ఇచ్చటఁ గొందఱు

1. (అయోధ్యా. ౫౪-౨౮) 2. (అయోధ్యా.౯౫).

ఋషులువచ్చి రాక్షసులవలనఁ గలిగెడి బాధను నివారణచేయుమని కోరఁగా రాముఁడొకమహారణ్యముఁ బ్రవేశించెను.[1] ఈయరణ్యమునకు దండకారణ్యమని పేరు. ఇది మిక్కిలివిస్తీర్ణమైన యరణ్యము. ఇందు నసంఖ్య ఋష్యాశ్రమములును, రాక్షస నివాసస్థలంబులును ఉండెను. ఈమహారణ్యమునకు నుత్తరమున గంగానదియొక్క దక్షిణతీరమును, వింధ్యపర్వతమును; పశ్చిమమున ఉత్తరవింధ్యము, అత్ర్యాశ్రమము, దక్షిణవింధ్యము, దక్షిణకోసలము, విదర్భదేశము, దక్షిణాపథము, మలయాద్రియు; దక్షిణమున ద్రవిడ పాండ్యదేశములును ; తూర్పున నుత్కల, కళింగ, ఆంధ్ర, చోళదేశములును ఉండెను. కాన నిప్పుడు సిరగుజాప్రాంత మనఁబడుచోట రాముఁడు దండకారణ్యమునఁ బ్రవేశించినటులు గానవచ్చుచున్నది. ఈదండకారణ్యములో రామునికిఁ ద్రోవచూపుటకుఁ గొందఱు ఋషులు వెంటనడచిరి.[2] రామునికి మొదట ననేక ఋష్యాశ్రమములు తగిలెను. తరువాతఁగొంతదూరమున విరాధవనము గానిపించెను. ఇది దండకాంతర్గతము. ఇది మధ్యపరగణాలలోని బిలాస్‌పూరు జిల్లాలో నీశాన్యదిక్కున నుండెను. ఇచ్చటనుండి యర్ధయోజనమువిూఁద ననఁగాఁ బదునైదుమైళ్ల దూరమున శరభంగాశ్రమ ముండెను.[3] ఇది విరాధవనమునకు దక్షిణమున బిలాస్‌పూరుజిల్లాలో ఉత్తరపువైపున ఈశాన్యమూల నుండినట్లు గానవచ్చుచున్నది. రామదర్శనానంతరము

---

1. (౬౧వ అయో. ౧౬-౨౨) 2. (అరణ్య. ౧వ సర్గము).
3. (౨వ-౩వ-౪వ సర్గము)

శరభంగుఁడగ్ని ప్రవేశము చేసెను. అచ్చట మును లనేకులు రా మునిఁజూడవచ్చి, రాక్షసులచేఁ జంపఁబడిన ఋషుల యస్థుల గుట్టలను జూపిరి. అందఱను రక్షించెదనని రాముఁ డభయ వచన మిచ్చెను. 1 అచ్చటనుండి రాముఁడు సుతీక్ష్ణాశ్రమ మునకుఁ బోయెను. అచ్చట నొకరాత్రియుండి యితరాశ్రమ ములఁ జూడఁబోయెను. త్రోవలో ననేక పర్వతములును, నదులును, అరణ్యములును దగిలెను. కొంతదూరమున గొప్ప సరోవర మొకటికానిపించెను. దానికిఁ బంచాప్సరస్సర స్సని పేరు. రామునకుఁ ద్రోవచూపుచున్న ధర్మభృతుఁడను ఋషి దానినిగుఱించి కొన్ని యితిహాసములు రామునకుఁ జెప్పెను. ఈసరోవరము మాండకర్ణిఋషి యొక్క తపస్సుచే నిర్మింపఁ బడెనఁట. 2 ఈస్థలము లెచ్చటనుండెనని మనము విచారింప వలసియున్నది. జనరల్ కన్నింగ్‌హ్యాం దొరవారు కొన్ని హేతువులను గనఁబఱచి 3 పంచాప్సరస్సరోవరము మధ్య పర గణాలలోని బిలాస్‌పూర్ జిల్లాలో నుండినట్లు నిశ్చయించి యున్నారు.అందువలన సుతీక్ష్ణాశ్రమమిప్పటి బిలాస్‌పూర్ జిల్లా యును రాయపూర్ జిల్లాలలోని యుత్తరభాగంబును వ్యా పించియుండెనని మనమూహింపవచ్చును. కాళిదాసునిచే మే ఘదూతమునందు వర్ణింపఁబడిన యక్షుని ప్రవాసస్థలమగు రామగిరి 4 యీ యాశ్రమ ప్రాంతముననే యుండె నని

1. (౬౫ సర్గము). 2. (౧౧ సర్గ ౧-౨౦). 3. (Archaeologi-al Reports Vol. XT.) 5. (మేఘదూతము ౧ వ శ్లోకము).

విద్వాంసుల యభిప్రాయమై యున్నది. సుతీక్ష్ణాశ్రమమునకు దక్షిణమున నాలుగు యోజనములమీఁద ననఁగా ౧౨౦ మైళ్ళమీఁద నగస్త్యమహాముని భ్రాతయొక్క యాశ్రమ ముండెను.[1] ఈ యాశ్రమము రాయపూరుజిల్లాయొక్క దక్షిణభాగమును, బస్తర్ సంస్థానముయొక్క యుత్తరభాగమును వ్యాపించియుండెనని రామాయణీయ వర్ణనవలన మన మూహింపవలసియున్నది. అగస్త్యభ్రాత యాశ్రమమునకు దక్షిణమున నొక యోజనము (౩౦ మైళ్ళ) మీఁద నగస్త్యులవారి యాశ్రమ ముండెను.[2] ఈ యాశ్రమము బస్తరుసంస్థానపు దక్షిణభాగమునం దుండెను. ఎందునకన అగస్త్యాశ్రమమునకు దక్షిణమున రెండామడల దూరమున ననఁగా ౬౦ మైళ్లదూరమునఁ బంచవటీప్రదేశమును గోదావరియు నుండెను.[3] పంచవటి యనునది కొంత యారణ్యప్రదేశము. ఇందు గోదావరికి సమీపమునఁ బర్ణశాల నిర్మించుకొని సీతారామలక్ష్మణులు కొన్నిదినములు నివసించియుండిరి. ప్రస్తుతము గోదావరిజిల్లాలో భద్రాచలమునొద్దనున్న పర్ణశాల యనుగ్రామములో శ్రీరాముని పర్ణశాల యుండెనని తెలుఁగుసీమవారి యభిప్రాయమై యున్నది. వాల్మీకిరామాయణములోని వర్ణనను ఆధునిక విద్వాంసుల యభిప్రాయములనుబట్టిచూడఁగా నీనమ్మికయు నిజమైనది యని తోఁచుచున్నది. మహారాష్ట్రదేశములోని "నాసికా" పట్ట

1. (అరణ్య. ౧౧-౩౭.) 2. (౧౧-౪౧) ౩. (౧౩-౧౧-౨౫ వఱకు)

ణము రామాయణీయ జనస్థాన మనియు నచ్చటనే పర్ణశాల యుండెననియు మహారాష్ట్రుల యభిప్రాయము. కొంద ఱా ధునిక గ్రంథకారులును నిటులే వ్రాసియున్నారు. కాని చిత్ర కూటమునుండి నాసికకుం బోయినయెడల వింధ్యపర్వతమును నర్మదానదియుం దగులకమానవు. ఈపర్వతమును, నదియు శ్రీరాముని మార్గమున నున్నట్లు వాల్మీకి వ్రాసియుండ లేదు. కావున నాసికాపట్టణమే పర్ణశాలాస్థల మని వాదించువారికి వాల్మీకిరామాయణము బాధకముగా నున్నది. అందు వర్ణింపఁ బడిన దిశలను జూచినను పర్ణశాల హిందూదేశపు తూర్పు వైపుననే యుండిన ట్లూహింపవలసి యున్నది.

రాముఁడు పంచవటిలో నుండఁగా శూర్పణఖ వచ్చి యాతనిని మోహించుట, దానిముక్కు గోయుట, ఖరాదు లను జంపుట మొదలయిన రామాయణీయ కథాప్రసంగము జరిగినది. ఈ ఖరాదులందఱును జనస్థానమునం దుండిరి. కాన ని జనస్థాన మెద్ది యని మన మాలోచింపవలసి యున్నది. మధ్యపరగణాలలోని రాయపూర్ జిల్లామొక్కయు, బస్తరు సంస్థానముయొక్కయుఁ బూర్వభాగము, సంబల్పూరు జిల్లా లోని చాలభాగము, చెన్నరాజధానిలోని జయపురసంస్థానాం తర్గతమైన గోదావరికి నుత్తరమందలి కొంతభాగము, గోదా వరికి దక్షిణమును, నైజామురాజ్యములోని చాలభాగము, ఈజనస్థానారణ్యములోనివిగా యున్నట్లు గానవచ్చెడిని. దీని కధిపతి రావణుని తమ్ముఁడగు ఖరుఁడు. వీని రాజధాని ఖరా

లయము. రాయపూరు జిల్లాలో ఖరియాల్ అనఁబడు స్థాన మిదియే. శంబరపురమని వాల్మీకిచే వర్ణింపఁబడినది ప్రస్తుతపు సంబలపూర్. పంచవటీప్రదేశముకూడ జనస్థానాంతర్గతముగఁ గానవచ్చెడిని.

పర్ణశాలనుండి రావణుఁడు సీత నెత్తుకొనిపోవుట మొదలయిన సమాచార మందఱకుఁ దెలిసినదే. సీతాహరణానంతరము రాముఁడు మరల దక్షిణయాత్రకు బయలుదేఱెను. గోదావరికి నుత్తరమునఁబంచవటీ ప్రదేశమునందును జనస్థానమందును సీతను వెదకి వెదకి, గోదావరియొడ్డునఁ గొంత దూరము వెళ్లి పర్ణశాలకుఁదూర్పున రెండామడల దూరమందున్న భద్రాచలమునొద్ద రామలక్ష్మణులు గోదావరి దాఁటిరి. ఈ నదికి దక్షిణమునఁ గొంతవఱకు జనస్థానములో నుండియే యన్నదమ్ములు ప్రవాసము చేసిరి.1 అచ్చటఁ గొంత దూరమున జటాయువు కలిసెను. అచ్చటనుండి వారు పశ్చిమదిశను నైరృతిదిశను గొంత నడచి,2 జనస్థానారణ్యమును దాఁటిన తరువాత వారు సూటిగ దక్షిణదిశను బోయిరి.3 జనస్థానానంతరమున మూఁడు క్రోశములమీఁద క్రౌంచారణ్యము తగిలెను. ఇది నైజాము రాజ్యమునకు నైరృతిదిశను ఉండెను. ఈ యరణ్యమును విడుచుటకుఁ బూర్వము మూఁడు క్రోశములు తూర్పుదిక్కునకుఁ బోయిరి. ఇచ్చట వీరికిఁ గబంధుఁ డడ్డుపడెను. వాఁడు చెప్పినంమన నచ్చటనుండి

1. (౬౨-౪-౫౬); 2. (౬౮-౧-౨). 3. (౬-౪).

పశ్చిమదిశను పంపకుఁబోయిరి. పంచవటినుండి పంపవఱకు వాల్మీకి రామాయణములో చెప్పిన యాదిశలను బట్టి చూచి నను, నవిభద్రాచలమునొద్ద పర్ణశాలకు ననుకూలముగా నున్న వేకాని, నాసికాపట్టణము జనస్థాన మనుకొనుటకు ననుకూల ముగా లేవు. రామాయణములోఁ బంపానది యని చెప్పఁబడి నది ప్రస్తుతపు తుంగభద్రానది. పంపా, పంపాసర స్సని రామా యణములో వర్ణింపఁబడినవి ప్రస్తుతము బళ్ళారి జిల్లాలో హంపి, హంపాసాగర మను పేరఁ బరఁగు చున్నవి. తరువాతఁ దగిలిన ఋశ్యమూకము, మాల్యవంతము, కిష్కింధ మొదల యిన ప్రదేశము లన్నియు హంపీవిరూపాక్షము నొద్ద యానె గొందికి సమీపమున నున్న కొన్ని పర్వతాదు లని యుండఁ ఋ యభిప్రాయమై యున్నది. కిష్కింధనుండి రాముఁడు కపిసైన్య ములతో బయలుదేఱి కొన్ని పర్వతారణ్యప్రాంతముల దాఁటి రామేశ్వరము నొద్ద సముద్రమును జూచుట సర్వవిదితమైన కథయే. కాన నీమార్గాన్వేషణ మింతటితోఁ జాలించెదము.

## సంఘస్థితి

ఇఁక నాకాలములోని సంఘస్థితిని విచారింతము. ఋగ్వే దయుగముకంటెను ఈ క్షాత్రియుగమునందు విద్యాసంపదయు, నాగరికతయు నధికములయ్యె. దేశమందు విస్తీర్ణమైన రాజ్యంబులును, ప్రచండసైన్యములును, ఘనతఁ జెందినరాజులును రాజధానులును, రాజసభలును, నభివృద్ధిం జెందెను. రాజ్య పరిపాలన నిమిత్తము లౌకికాధికారులు నియమింపఁ బడిరి.

జనుల కలహములఁ దీర్చ న్యాయాధికారు లేర్పఱుపఁబడిరి. అందువలన వ్యవసాయము, వాణిజ్యము మొదలగు వృత్తు లన్నియు నీ దేశమునందు నిరంతరాయముగా జరుగుచు దినదినాభివృద్ధిఁ బొందఁ జొచ్చెను.

కురు పాంచాలాది రాజుల యాస్థానములందు గొప్ప పండితులును, పురోహితులును ఉండి గౌరవింపఁబడు చుండిరి. ఇట్లు రాజాశ్రయ మున్నవారుగాక యనేక గ్రామములందు పరిషత్తులని పేర్కొనఁబడు విద్యాపీఠము లుండెను. ఇప్పుడు మనదేశమందు నింగ్లీషు విద్య నభ్యసించినవారికి బి. ఏ., ఎం. ఏ. బిరుదముల నిచ్చు యూనివర్సిటీలతో నీపరిషత్తులఁ బోల్ప వచ్చును. అన్నివిద్యలలోఁ బారీణులగు నాచార్యు లిరువది యొక్కరు గలది పెద్దపరిషత్తు; నలుగురాచార్యులు గలది చిన్నపరిషత్తు. విద్యను సంపాదింపఁదలఁచిన బ్రహ్మచారులందఱు నిట్టిపరిషత్తులకుఁ బోయి చదువుచుండిరి.

వంశము చెప్పుకొనునపు డిప్పటివలెఁ గేవలము తండ్రి తాతల పేళ్ళే చెప్పక తల్లుల పేళ్ళను ఋషులు చెప్పుకొను చుండిరి. బృహదారణ్యకోపనిషత్తులో (౬-౫) ఋషులు తమ గురుపరంపర మాతృపూర్వకముగాఁ జెప్పిరి. పైతృకనామముల వలెనే మాతృకనామములు కూడ ధరించు చుండిరి. భార్గవీపుత్త్రుఁడు భార్గవేయుఁడు. కద్రూపుత్త్రుఁడు కాద్రవేయుఁడు, మమతాపుత్త్రుఁడు మామతేయుఁడు, ఇతరాపుత్త్రుఁడు ఐతరేయుఁడు. ఐతరేయుఁడే యైతరబ్రాహ్మణకర్త.

పురుషులవలెనే స్త్రీలును బ్రహ్మవిద్యనుగూడ సంపాదించి, రాణీవాసము లేక రాజసభలలోనికి వచ్చి విద్వాంసపవంసులతో శాస్త్రార్థము ముచ్చటించు చుండిరి. ఇందునకు స్త్రీ చు జనకుని సభయందు యాజ్ఞవల్క్యునికిని గార్గీవాచక్నవికిని జరిగినా ను సంవాదమే దృష్టాంతము. ఈసంవాదము బృహదారణ్యకములనుకూ వివరముగా వర్ణింపఁబడి యున్నది. అప్పటి స్త్రీ లగ్నిహోత్రుబ్రాహ్మ్యాదికములు స్వతంత్రముగాఁ జేయు చున్నట్లును, సంధ్యావందనము చేయు చుండినట్లును రామాయణములో వ్రాయఁబడి యున్నది. ♦ గొడుగును చెప్పులును ఒకానొక స్త్రీ నిమిత్తమై మొదట చేయఁబడినట్లు మహాభారతమునవ్రాయఁబడి యుండుటచే నప్పటి స్త్రీ లెండవానలవలన స్వదేహము రక్షించుకొను నిమిత్తము పాదరక్షలను ఛత్రమును ఉపయోగపఱుచు చుండిరని కానవచ్చుచున్నది. అప్పుడు నిర్బంధ వైధవ్యము లేదు. గతభర్తృకలు మరల వివాహమాడు చుండిరి. బాల్యవివాహమప్పుడు లేదు. *

---

♦ (వాల్మీకిరామాయణము. అయోధ్యాకాండ, ౨౦౬వ సర్గ, ౧౪-౧౫ శ్లోకములు, సుందరకాండ ౧౪-౪౯).

* అప్పటికాలపు స్త్రీలస్థితినిగుఱించి యధికముగఁ గనుఁగొనఁగోరు వారు నాకు జ్యేష్ఠసహోదరియగు గీర్తిశేషురాలును నగు భండారు అచ్చమాంబ గారిచే రచింపఁబడిన అబలాసచ్చరిత్రరత్నమాలయొక్క రెండవభాగము చూడనగు. ఇది "సావిత్రీ" పత్రికలోఁ బ్రచురింపఁబడినది. అందు గౌసల్య స్వతంత్రముగా హోమము చేసినందునకును, సీత సంధ్యావందనము చేసినందునకును రామాయణాదికములలోని శ్లోకములుగూడ నుదాహరింపంబడియున్నవి. గ్రంథవిస్తరభీతిచే నవియన్నియు నిచ్చట నుదాహరించుటకు వీలు లేదు.

ఈకాలముననే గోత్రము లేర్పడెను. గోత్రమనఁగా వంశము; తెగ. ఒక కులపతియొక్క సంతతివారుగాని, అనుయాయులుగాని యేకగోత్రమువారైరి. ప్రతిగోత్రమువారును దమతమ గోత్రము శ్రేష్ఠమైన దనుకొని యితరులను దమలోనికి రానియ్యరయిరి. ఆంగిరసగోత్రపు చిన్నవాని భరత గోత్రమువారు పెంచుకొనుటకు వీలులే దనిరి. ఇట్లు గోత్రము లేర్పడెను.

జా తి భే ద ము.

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగుజాతులీకాలమునందే యేర్పడినవి. వేదమంత్రముల రచించిన ఋషుల సంతతివారును వేదాధ్యయనముచేసి యజ్ఞయాగాదిక్రతువులు చేయువారును, జేయించువారును, అరణ్యములలో నివసించి పరతత్వవిచారము చేయువారును బ్రాహ్మణులయిరి. దస్యులు మొదలగు శత్రువుల దండించి రాజ్యములు స్థాపించినవారు క్షత్రియులయిరి. వ్యవసాయము మొదలయినవృత్తులలో నున్నవారును, వాణిజ్యము చేయువారును నగు నితరార్యులందఱును వైశ్యులయిరి. ఆర్యులకు లోఁబడిన యనార్యులందఱును శూద్రులుగా నెంచఁబడిరి. ఇట్లు మొట్టమొదట గుణకర్మముల ననుసరించి వర్ణవిభేద మేర్పడినది. కాని యిప్పటివర్ణమువలె నప్పటిజాతి, ఇతరుల ముట్టినంత మాత్రమునను ఇతరులతోఁ గలిసి భుజించినంతమాత్రమునను జెడిపోవునది కాదు. తక్కువజాతులవారియొద్ద నెక్కుడుజాతి

వారు విద్య నేర్చుకొనుటయు, నొకరియొద్ద నొకరు భుజించుటయు, నొకరపిల్లల నొకరు చేసికొనుటయు, గుణకర్మములను బట్టి యొకవర్ణములోనివాఁడు మరియొకవర్ణములోఁ జేరుటయు సర్వము చెల్లుచుండెను. క్షత్రియుఁడగు విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షియై విశ్వామిత్రగోత్రులగు నిప్పటి బ్రాహ్మణుల కందఱకు మూలపురుషుఁ డయ్యెను. బ్రాహ్మణపుత్రికయగు దేవయాని, క్షత్రియుండగు యయాతిని వివాహమాడి క్షత్రియవీరులగు యాదవులకు మూలజననియయ్యె. బ్రాహ్మణులును, క్షత్రియుఁడగు కృష్ణుఁడును దాసీపుత్రుఁడగు విదురునియింట విందారగించిరి. శ్వేతకేతు ఆరుణేయుఁడు, సోమశుష్మ సత్యయజ్ఞి, యాజ్ఞవల్క్యుఁడు అను ముగ్గురు బ్రహ్మర్షులు అగ్నిహోత్రవిధానమంతయు జనకమహారాజు నొద్ద నేర్చుకొనిరనియు, జనకుఁడు బ్రాహ్మణుఁడాయె ననియు శతపథబ్రాహ్మణము చెప్పుచున్నది.* శ్వేతకేతుఆరుణేయుఁడును, అతని తండ్రియగు గౌతముఁడును, పాంచాలదేశపు పరిషత్తునకుఁబోయి ప్రవహానజైవలి యను రాజునొద్ద బ్రహ్మవిద్య సంపాదించిరనియు నంతవఱకు నావిద్య క్షత్రియులకే తెలియుననియు బ్రాహ్మణులకుఁ దెలియదనియు ఛాందోగ్యమునఁ జెప్పఁబడియున్నది. అయిదుగురు బ్రహ్మర్షులును ఉద్దాలక ఆరుణి యను మహోపాధ్యాయుఁడును, కైకయరాజగు అశ్వపతికి శిష్యులై యాశ్రయించి బ్రహ్మవిద్య

* (శతపథ. ౧౧-౬-౨-౧.)

సంపాదించిరి (శతపథము). రైక్వుఁడను బ్రాహ్మణుఁడు జానశ్రుతి పుత్రీయణుఁడను శూద్రుని కుమార్తెను వివాహమాడి యతనికి బ్రహ్మవిద్య నేర్పెను.[1] కవషుఁడను దాసీపుత్త్రుఁడు బ్రహ్మర్షిత్వమును జెందెను.[2] సత్యకామ జాబాలుఁడను కులగోత్రములెఱుకలేని పిల్లవానికి, వానిసత్యసంధత్వమును మెచ్చి ఋషులు బ్రాహ్మణత్వ మొసంగిరి. ఇందువలన సత్యప్రియత్వమును విద్యాసంపదయు నేమనుజునినైన నప్పటికాలములో బ్రాహ్మణత్వమునకు నర్హునిఁ జేయుచుండెనని స్పష్టమగుచున్నది.

## క్రతువులు.

ఈయుగమునందు యజ్ఞయాగాదికముల మాహాత్మ్యము హెచ్చెను. బ్రాహ్మణులు, క్షత్త్రియులు, వైశ్యులు క్రతువులుచేయుట యొక ఘనమైన కార్యముగా నెంచిరి. తమ వైభవమంతయు జనులకుఁ జూపి మిక్కిలి ఖ్యాతిఁజెందుటకును, కామ్యముల సాధించుటకును క్రతువులు సాధనములుగా నుండెను. కాన నప్పటి ధనవంతు లందఱును నెంతయోధనము వెచ్చించి క్రతువులఁ జేయుచుండిరి. అందుచే వింతవింత క్రతువులు పుట్టె. బ్రాహ్మణగ్రంథములలో నిట్టి క్రతువుల వివరము విశేషముగా వర్ణింపఁబడినది. ప్రతిదినమును గృహపతి చేయవలసిన అగ్నిహోత్రమును, పూర్ణిమలఅమావాస్యలకుఁ జేయవలసిన దర్శపూర్ణిమాసేష్టులు మొదలుకొని పండ్రెండు

1. (ఛాందోగ్య. ౪-౨౨). 2. (ఛాందోగ్య. ౪-౪).

సంవత్సరములు జరుగవలసిన ద్వాదశవార్షిక సత్రముఁవఱకును వేయికంటె నెక్కుడు విధములయిన క్రతువులు వర్ణింపఁబడి నవి. పశుయజ్ఞములనియు, పాకయజ్ఞములనియు, హావిర్యజ్ఞము లనియు, సోమయజ్ఞములనియు క్రతువు లన్నియు నాలుగు విధములు. వీని వివర మిచ్చుట వర్ణించుట యనావశ్యకము.

[1] క్రతువులు చేయుటకుఁ బ్రతివారికిని నొక పురోహితుఁడుండుట యావశ్యకం బయియుండె. పురోహితుఁడు లేని రాజుచేఁ బెట్టఁబడిన హావిర్భాగమును దేవతలు ముట్టుకొన రనియుఁ, గ్రతువులు చేయనోల్లని రాజుగూడ పురోహితుని నేర్పాటు చేసికొనవలయుననియు నైతరేయమునఁ జెప్పఁబడి యున్నది. [2] ఇట్లు బ్రాహ్మణులగు పురోహితుల మాహాత్మ్యము హెచ్చెను. ఈ పురోహితులే క్రతువిధానముల నేర్పఱచిరి. క్రమముతప్పక క్రతువులు జరిగిన నవి విశేష ఫలదంబు లగునని తలఁచినందునఁ గ్రతుకలాపమంతయు నత్యంతవివరముగ నిర్ణయింపఁబడియె. చేతిలోని చెంబు క్రింద పెట్టెడిక్రియ మొదలు క్రతువులోని యన్నిక్రియలును విధి యుక్తముగాఁ జేయవలసియుండె. కావున యజ్ఞసంబంధమైన పాత్రలు, హోమద్రవ్యములు, దర్భలు మొదలయినవానిని పూర్వపు ఋత్విజులు విధియుక్తముగా నెంతశ్రద్ధతో నమర్చి పెట్టుకొనుచుండిరో యంతశ్రద్ధతో నిప్పటి వైద్యులు (డాక్టరులు) కూడ శస్త్రక్రియఁ జేయఁబోవుటకుఁ బూర్వము తమ

1. (ఐతరేయ. ౭-౧౯). 2. (౮-౨౪).

శస్త్రముల నమర్చుకొనరని చెప్పిన నతిశయోక్తి కానేరదు. కాన నందుఁ బ్రవీణులగు బ్రాహ్మణులు రారాజులకుఁ గూడ పూజనీయులుగానుండి వారిని తమచేతులలో నుంచుకొనిరి.

## జ్యోతిషము.

ఆర్యు లీకాలమున జ్యోతిషశాస్త్రమును గొంతవఱకు నభివృద్ధిపఱచిరి. దృగ్ ప్రత్యయగోచర మగు నీశాస్త్రము మనదేశమందుఁ గ్రమక్రమముగా నభివృద్ధిఁ జెందినది. సంవత్సరమునకుఁ బండ్రెండుచాంద్రమాసము లనియు, మూఁడేండ్లకొకసారి యొక యధికమాసము లెక్కింపవలయు ననియు ఋగ్వేదకాలపు టార్యులే యెఱిఁగి యుండిరి (౧-౨౫-౮). పండ్రెండుమాసములకుఁ గ్రమముగా, మధు, మాధవ, శుక్ర, శుచి, నభస్సు, నభస్య, ఇష, ఊర్జ, సహస్, సహస్య తపస్, తపస్య లని నామము లిడి (౨-౩౬). ఇందుఁ గ్రమముగ రెండు రెండుమాసములు వసంతాది ఋతుసూచకములని తైత్తిరీయసంహితయందు వ్రాయఁబడి యున్నది (౪-౪-౧౧). ప్రస్తుతము మన మాలోచించుచున్న క్షాత్త్రియుగములో యాగాది క్రతువు లధికమైనందున, ఏ క్రతు వెప్పుడు ప్రారంభింపవలసినది, ఎప్పుడు ముగింపవలసినది, చక్కఁగఁ గనుఁగొనవలసి వచ్చినందునను, ఆకాశమందలి సూర్యచంద్రుల గతిని గుఱించి సూక్ష్మముగాఁ బరిశీలించుట యప్పటి వారికి యావశ్యక మయ్యెను. శతపథ బ్రాహ్మణములో (౧-౬-౩) నీయఁబడిన యీక్రింది యితిహాసమువలన జ్యోతిష

శాస్త్రాభివృద్ధికిని, క్రతువులకును గల సంబంధము తెలియుచు గలదు. "ప్రజాపతి ప్రజను పుట్టించిన తరువాత వాని పర్వములు శిథిల మయ్యెను. సంవత్సరమే ప్రజాపతి. అహోరాత్రముల సంధ్యలును, పున్నమయు, అమావాస్యయు, ఋతువులయారంభ కాలమును అనునవియే వాని పర్వములు. దేవత లిందులకు నుపచారము జేసిరి. అహోరాత్రములసంధులను అగ్నిహోత్రములతో బాగుచేసి యథాస్థానము దుంచిరి. పౌర్ణమాసేష్టి, దర్శేష్టి యనువానిచేఁబూర్ణిమామావాస్యలను చక్కబఱిచిరి. చాతుర్మాస్యయజ్ఞములచే ఋతుసంధులను బాగు చేసిరి." జ్యౌతిషశాస్త్రజ్ఞులకు నక్షత్రదర్శులనియు, గణకుల నియుఁ బేరుపెట్టిరి. (శుక్లయజుర్వేదము ३०-१०-६०; తైత్తిరీయ బ్రాహ్మణము ३-४-१). ఆకాశమునఁ జంద్రుఁ డెచ్చట నున్నాఁడో కనుఁగొనుటకు నాకాశమును నిరువదియేడు భాగములుగా విభజించి వానికి నశ్విని, భరణి మొదలయిన నామము లిడిరి. సూర్యుని యుత్తర దక్షిణగమనమును గనిపెట్టి సంవత్సరమును ఉత్తరాయణ, దక్షిణాయనములుగా విభజించుకొని, సాంవత్సరిక సత్రయాగములను దదనుగుణముగ రెండు సమానభాగములుగా విభజించిరి. ఇది యంతయు క్రీ. పూ. १४०० సంవత్సర ప్రాంతమున ననఁగా నేఁటికి రమారమి మూఁడువేలయైదువందల సంవత్సరములకుఁ బూర్వము జరిగి యుండవచ్చును.

## వేదాంతములు.

పైని వర్ణింపఁబడిన విద్యలేగాక యీయుగమున నార్యులధ్యాత్మవిద్యను నెక్కుడుగ సాధించిరి. వేదాంతము లను మాఱు పేరుగల యుపనిషత్తు లిందుఁకు దృష్టాంతములు. గొప్ప గొప్ప ఋషులును ఋషిపుత్రులును నొక్కచోటఁజేరి ఆత్మయన నేమి, అనాత్మయన నేమి, జీవుఁడన నెవ్వఁడు, జీవేశ్వరుల సంబంధ మెట్టిది, మన మెచ్చటినుండి వచ్చితిమి, ఎచ్చటికిబోయెదము, అను గహనప్రశ్నలను గుఱించి చర్చ చేయుచుండిరి. ఇట్టి గహనమైన ప్రశ్నలకు వారిచ్చిన యుత్తరములే యుపనిషత్తులు. ఈ యుపనిషత్తులలోని యాధ్యాత్మ విద్యను గౌరవముతో మనము మూఁడువేల సంవత్సరములనుండి యభ్యసించుచుండుటయే గాక పాశ్చాత్యపండితు లెందఱో వానిని భక్తితో నభ్యసించి వేయినోళ్లఁ గొనియాడి యున్నారు. విఖ్యాత పాశ్చాత్య పండితులును, గహనతత్త్వవేత్తలును నగు స్పైనోజా, స్కోపన్హార్, మ్యాక్సుముల్లరు, డ్యూసన్ మొదలగు వారీయుపనిషత్తులను బట్టులవలెఁ బొగడియుండుటఁ జూడ నుపనిషత్తుల యోగ్యత వేఱుగఁ జెప్పవలయునా?

ఉపనిషత్తుల సంఖ్య ప్రస్తుత మధికముగానున్నది. నూటయెనిమిది యుపనిషత్తుల పేళ్లొకచోట నీయఁబడినవి. కాని యాపట్టికలో లేని లింగోపనిషత్ అల్లోపనిషత్ మొదలయినవి

యనేకములు కానవచ్చుచున్నవి. ఇవి యన్నియుఁ బురాతనములు కావు. ఇందుఁ బదిమాత్ర మాదిశంకరాచార్యుల వారి కాలములో సర్వమాన్యత వడసినట్లు కానవచ్చుచున్నవి. అందుచేతనే ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యకము లను దశోపనిషత్తులమీఁదనే యాచార్యులవారు భాష్యములు వ్రాసిరి. మిగిలిన యుపనిషత్తు లిటీవలికాలములో నిర్మింపఁబడినవని యూహింపవలసి యున్నది.



# నాల్గవ ప్రకరణము.

## సూత్ర యుగము

(క్రీ. పూ. ౧౦౦౦-౫౦౦)

హిందూదేశములోని జనుల బుద్ధి వైభవము మిక్కిలి ప్రకాశించినది యీయుగమునందే. మానవబుద్ధికి సాధ్యములగు జ్ఞానవిషయము లెన్ని కలవో యన్నిటిని గుఱించియు నీయుగంబున నార్యులు కృషిచేసి యావిద్యలన్నిటిని సాధించిరి.

### కల్పసూత్రములు.

ఈ కాలమునందు రచింపఁబడినవి ముఖ్యముగా సూత్ర గ్రంథములు. సూత్రమనఁగా నెంతయో యర్థమును గొలఁదిలో నిమిడ్చి చెప్పెడి యొక చిన్న వాక్యము. సూత్రగ్రంథములలో మొదటిది శ్రౌతసూత్రము. ఒక్కొక వేదమునకుఁ బెక్కు బ్రాహ్మణము లున్నట్లు సూత్రములును బెక్కుగలవు. ఆర్యు లనేక దేశములలో వ్యాపించినకొలఁదిని, ఒక్కదేశపు టార్యుల యాచారము లింకొక దేశపు టార్యుల యాచారముకంటె భిన్నముగా మాఱుచు వచ్చెను. ఈయాచార వ్యవహార భేదములు బ్రాహ్మణముల కాలముననే ప్రారంభమయినట్లు గానవచ్చెడిని. దర్శపూర్ణిమాసేష్టులు చేయువిధము పైంగ్యులలో నొక విధముగను, కౌశలీకులలో నొక విధముగను ఉండెను. (ఐతరేయ ౭-౧౧). ఇందు వలన భిన్న సూత్రము

లును శాఖలును గలిగె. ఈ శ్రౌతసూత్రములయందు యజ్ఞ యాగాదిక శ్రౌత కర్మలు చేయువిధము వర్ణింపఁబడియున్నది. ఇవి గాక ప్రతి వేదమునకును గృహ్యసూత్రములు గలవు. ఇందు గృహస్థుఁడు చేయవలసిన షోడశకర్మలను గురించిన నిబంధనలుండును. నామకరణోపనయన వివాహాదులీషోడశ కర్మలలోనివే. ప్రస్తుతము హిందువులు వివాహాది కార్యము లేసూత్రము వారా సూత్రానుసారముగ జరుపుకొను చున్నారు. ఒక సూత్రమువారు తమ యాచారమును వదలి యన్యసూత్రమువారి యాచారమును స్వీకరించినఁ బతితు లుగా నెంచఁబడిరి. ఋగ్వేదమునకు నాశ్వలాయన హిరణ్య కేశీయ సూత్రములును, యజుర్వేదమునకు ఆపస్తంబ బోధా యనకృత సూత్రములును ముఖ్యమైనవి. ఆంధ్రదేశమునందలి వారికి నాపస్తంబసూత్రములు విశేషపూజనీయములు. ఎందుల కన, నీదేశమందుండు నాఱువేల నియోగులును, వైదికులలో నూటికి తొంబదిమందియును అనఁగాఁ దెనుఁగు సీమలో నుండు బ్రాహ్మణులలో నెక్కుడు మంది యాపస్తంబ సూత్రులు. ఆపస్తంబఋషి ఆంధ్రదేశము మహావైభవములో నున్నప్పుడు అచ్చట జన్మించి ధర్మశాస్త్ర గ్రంథము నిర్మించినవాఁడని విద్వాంసుల యభిప్రాయమైయున్నది. పైనివర్ణించిన శ్రౌత గృహ్యసూత్రములుగాక మూఁడవతెగసూత్రములు గలవు. వీనికి ధర్మసూత్రము లనిపేరు. దాయభాగము, దత్తస్వీకార విచారము, న్యాయవిచారణచేయు విధము మొదలగు వ్యవ హారధర్మములన్నియు నీసూత్రములందుండును. ఇట్టి సూత్రి

ముల ననుసరించియే తరువాతికాలములో మన్వాదిస్మృతులు వ్రాయఁబడినవి. పైని వర్ణింపఁబడిన శ్రౌత గృహ్య ధర్మ సూత్రములు గలిసినఁ గల్పసూత్రములని పేరు. ఇట్టి కల్ప సూత్రము లనేకములు వ్రాయఁబడియెఁ గాని వానిలోఁ గొన్ని మాత్ర మిప్పుడు గానవచ్చు చున్నవి.

## వ్యాకరణము.

సూత్రకాలములో వ్రాయఁబడిన గ్రంథములలో పాణిని కృతమైన యష్టాధ్యాయి యనఁబడు వ్యాకరణగ్రంథము మిక్కిలి ఘనత వహించినది. భాషలోని శబ్దము లన్నిటిని శాసించు, వాని వ్యుత్పత్తిని దెలుపుచు నింత విపులముగను, నింత నియమబద్ధముగను నున్న మఱియొక వ్యాకరణ మేభాష యందును నేఁటివఱకు వ్రాయఁబడలేదని చెప్పిన నీపాణినీయ వ్యాకరణముయొక్క ఘనత చదువరులకుఁ దెలియఁగలదు. ప్రతిభాషలోని పదము లన్నియుఁ గ్రియార్థసూచకములగు ధాతువు (roots) లలోనుండి పుట్టినవని యూరోపులోని వ్యుత్పత్తి శాస్త్రవేత్తలు (Philologists) నేఁటికి గనుఁగొనిరి. కాని యీయంశము నే మూఁడువేల యేండ్లక్రిందఁ బాణిన్యాచార్యులవారు తన యష్టాధ్యాయిలో సోదాహరణపూర్వకముగా సిద్ధాంతీకరించిరి. పాణిని క్రీ. శకమునకుఁ బూర్వ మేడవ శతాబ్దంబుననో, యెనిమిదవ శతాబ్దంబుననో వ్యాకరణము రచించె. పాణినికిఁ బూర్వముకూడ గొప్ప వ్యాకరణములున్నట్లు గానవచ్చెడిని. కాని యాగ్రంథములన్నియు శ్రేష్ఠ

నైన పాణినివ్యాకరణమువలన లోపించెను. పాణినికిఁ దరువాతివాఁడగు కాత్యాయనుఁడు పాణినీయసూత్రములపై వార్తికములు వ్రాసె. పాణినికిఁ దరువాత రమారమి రెండు వందల సంవత్సరములకుఁ బుట్టిన "పతంజలి" యను ఆచార్యుఁడు పాణినిసూత్రములపై భాష్యము వ్రాసెను. దీనికి వ్యాకరణమహాభాష్య మని పేరు. ఈ మహాభాష్యము కేవల వ్యాకరణము నేర్చుకొనువారికే కాక యందు సందర్భవశమునఁ జర్చింపబడిన యనేకవిషయములనుబట్టి, ఆకాలము నందలి దేశస్థితిని, సంఘస్థితిని, ధర్మకల్పనలను, ఆచారవ్యవహారములను గనుఁగొనుటకు నందఱకు నొక గొప్ప సాధనమై యున్నది. అందువలనఁ బాణినీయముకంటె నీ మహాభాష్యమునకు నధికపూజ్యత కలదు. పాణిని, కాత్యాయనుఁడు, పతంజలి ఈమువ్వురకు వ్యాకరణసంబంధమైన "మునిత్రయ" మని పేరు.

ఆకాలమందును దానికిఁ దరువాతికాలమందును ఉండిన యార్యుల మేధాశక్తియొక్క ప్రాభవమును గనఁబఱుచు సూత్రగ్రంథములు మఱికొన్ని గలవు. వానికి షడ్దర్శనము లని పేరు. వానినిగుఱించి ముందు వివరముగా వ్రాయుదుము.

## షడంగములు.

ఈకాలమునందే వేదములయొక్క షడంగములును నిర్మింపఁబడియె నని యూహింపవచ్చును. పైనివర్ణించిన కల్పసూత్రములు షడంగములలో నొక్కటి. శిక్ష, ఛందస్సు,

వ్యాకరణము, జ్యోతిషము, నిరుక్తము, కల్పసూత్రము లను నీయారింటికి వేదాంగములని పేరు. "శిక్ష"యందు వర్ణోచ్చారణ విధంబుండును. ఇది పాణినికృత మనియెదరు. ఛందస్సునందు వేదములలోని వృత్తంబులవిధము వర్ణింపఁబడు. కేవల వేదమునకు సంబంధించిన భాషావిషయిక వ్యాకరణములకుఁ బ్రాతిశాఖ్యలని పేరు. వేదాంగజ్యోతిష మెప్పుడు వ్రాయఁబడిన దనిన విషయమై విద్వాంసులు భిన్నాభిప్రాయులై యున్నారు. నిరుక్తమనఁగా వేదమంత్రములకర్థము. ఇది యాస్కాచార్యకృతము. అర్థము తెలియకుండ వేదమంత్రములను వల్లించెడి యాచారము ఋగ్వేదకాలమునుండియు నిందింపఁబడుచువచ్చెను. "పవిత్రమయిన మంత్రమును నర్థము తెలియక పఠించిన నేమిప్రయోజనము?" అని యొకఋషి చెప్పెను. (ఋగ్వేద ౧-౧౬-౪). బ్రాహ్మణములకాలమున వేదమంత్రముల యర్థమునుదెల్ప బ్రయత్నముచేసిరి. కాని ప్రాఁతవియైనకొలఁదిని ఋగ్వేదాదిమంత్రముల యర్థము లోకులకు నేమియుం దెలియకపోయె. అందువలన గ్రుడ్డిపాఠము లెక్కువయ్యెను. అప్పుడు "అర్థము తెలియక వేదము చదివినవాఁడు పట్టిమొద్దు; బరువుమోయు వెట్టివాఁడు" అని తలఁచి యాస్కాచార్యులవారు వేదములోని శబ్దముల వ్యుత్పత్తియు నర్థంబునుదెల్పుచు "నిరుక్తము" అను గ్రంథమునువ్రాసి వేదార్థమునకుఁ ద్రోవజూపిరి. ఇదియు నిరుక్తము. వేదముల కర్థముచేయు వారికీ నిరుక్తమును, నిఘంటు వనఁబడు వైదికకోశంబును, నిప్పటికిని మిక్కిలి యావశ్యకంబులు.

ఇట్లు పైని వర్ణింపఁబడిన గ్రంథములన్నియు నొక్కసారిగాని మేము వర్ణించిన క్రమమునఁగాని, వ్రాయఁబడియె నని చదువరు లనుకొనఁగూడదు. ఇవి యన్నియు సూత్రయుగమునందును, దర్వాతి బౌద్ధయుగమునందును మొత్తము మీఁద నెనిమిదివందల సంవత్సరములలో వ్రాయఁబడియెం. వానిలోఁ గొన్ని తప్ప నితరగ్రంథములలో నిది ముందు, ఇది వెనుక వ్రాయఁబడెనని చెప్పుటకు వీలులేదు.

## ఆకాలపు రాజ్యములు.

ఇఁక నాకాలపు రాజ్యములనుగుఱించి విచారింతము. వెనుకటి ప్రకరణములో నార్యులు దక్షిణమున వింధ్యము వఱకు దూర్పునఁ గోసలమువఱకును వ్యాపించిన సమాచారము వ్రాసియుంటిమి. ప్రస్తుతము వర్ణింపఁబడు యుగమున నార్యులు తూర్పున బంగాళమంతయు దక్షిణమున రామేశ్వరము వఱకును వ్యాపించి యచ్చటచ్చట రాజ్యముల స్థాపించిరి. అప్పటి అన్ని రాజ్యముల పేళ్లిచ్చట వ్రాయుట యనావశ్యకము. ముఖ్యమైనవానిఁ బేర్కొన్నఁ జాలును. ప్రస్తుతము దక్షిణబేహార్ అనఁబడు దేశప్రాంతమున మగధరాజ్యమును, పశ్చిమబంగాళమున నంగరాజ్యమును, పూర్వబంగాళమున వంగరాజ్యమును, ఒరిస్సా అనఁబడు ఓఢ్రదేశమున కళింగ రాజ్యమును ఏర్పడెను. ఇవి తూర్పు దేశములు. పశ్చిమమున అవంతి (మాళవ), సౌవీర, సౌరాష్ట్ర (గుజరాత్) రాజ్యములును, దక్షిణమునఁ గృష్ణాగోదావరుల నడుమ ఆంధ్ర

దేశమును, మిక్కిలి దక్షిణమునఁ బాండ్యరాజ్యంబును, దానికిఁ దగిలి తూర్పున చోళరాజ్యంబును, పశ్చిమమున చేరరాజ్యంబును, గ్రమక్రమముగ స్థాపింపఁబడియె. వింధ్యమునకు దక్షిణంబున నున్న దేశము లార్యులు గెలిచినవి కావు. అచ్చట ద్రావిడు లను జను లార్యులకంటెఁ బూర్వమే వచ్చి కొంత వఱకు నాగరికత గలిగియుండిరి. ఉత్తరదేశమునుండి యార్యులు కొందఱు దక్షిణమునకు రాఁగా నీద్రావిడులు వారి ధర్మమును, నాగరికతను నేర్చుకొన్నవారై వారిలోఁ గలిసి పోయిరి. కాన ఆంధ్ర, పాండ్య, చోళ, చేరరాజ్యము లార్యులచే స్థాపింపఁబడినవికావు. ఆర్యులు ద్రావిడులు కలిసినతరువాత నీ రాజ్యము లభివృద్ధిఁ జెందె. అంతకుఁ బూర్వము సాధారణ స్థితియందుండిన నుండవచ్చును.

## ద్రావిడులు.

దక్షిణమునం దున్న యీ నాగరిక ద్రావిడు లెవ్వరని చదువరులకు సంశయము కలుగవచ్చును. ఆర్యులకంటె నెన్నియో వేలయేండ్లకుఁ బూర్వము మధ్యాసియానుండి బయలుదేఱి, హిమాలయముదాఁటి యీ దేశమునకు వచ్చి సింధునద ప్రాంతమునుండి, గంగానది ప్రవహించెడు పల్లపు నేల మార్గమునఁ దూర్పునకు వచ్చి, వింధ్యమునకుఁ దూర్పువైపు త్రోవను దక్షిణవైపుగఁ దిరిగి తూర్పుకనుమలకును సముద్రమునకును నడుమనున్న సమభూమిమార్గమున ముందుముందునకు నడచుచు నీ ద్రావిడులు కన్యాకుమారివఱకును బోయి

చేరిరి. ద్రావిడులు దక్షిణమునకు వచ్చునపుడు అచ్చటచ్చట నిలిచిపోయినవారి వంశజు లిప్పటికిని మాటలాడుభాషల సామ్యమువలన వారు పయనమైవచ్చిన మార్గము నిశ్చయింపఁ బడినది.

ద్రావిడు లందఱకు మొట్టమొదట నొక్కభాషయే యైనను గాలక్రమమున వేర్వేఱు భాగములలో నుండినవారి భాషలు వేర్వే ఱయ్యెను. వానిలో అఱవము, తెలుఁగు, కన్నడము, మళయాళము ముఖ్యమైన ద్రావిడభాషలు.

ఆర్యులు దక్షిణమువఱకుఁ బ్రసరించినను ఆర్యావర్తమునుమాత్రము పుణ్యస్థలముగాఁ దలఁచుచుండిరి. ఆర్యావర్తముమాత్రము క్రతువుచేయుటకుఁ దగిన దేశమనియు, నితరదేశములు క్రతువునకుఁ దగవనియు వారి యభిప్రాయమై యుండెను. ఆర్యావర్తంబుననే విద్యాపీఠములును, విద్యావంతులయిన శిష్టులును ఉండిరి. అప్పటి యార్యావర్తమునకు నుత్తరమున హిమాలయమును, దక్షిణమున వింధ్యమును, పశ్చిమమున ఆదర్శావలి పర్వతములును, పూర్వునఁ గాలకవనపర్వతములును ఎల్లలుగా నుండెను. కాలకవన పర్వతములనఁగాఁ బ్రస్తుతపు రాజమహాల్ గుట్టలు. ఆదర్శావలి యనఁ బ్రస్తుతపు ఆరావలిగుట్టలు. ఆదర్శావళి యన అద్దములపంక్తి యని యర్థము. ఈ గుట్టలలో సంగమర్మరు (marble) అనఁ బడు తెల్లని చంద్రకాంతశిల లున్నందునవీని కీపేరువచ్చెను. పరిషత్తులును విద్యావంతులగు శిష్టులును ఆర్యావర్తంబుననే

యుండిరి. సింధునదమునకుఁ బశ్చిమమున నుండు బాహ్లీక దేశపు పశువుకూడ యజ్ఞమునకుఁ బనికి రాదనిరి. (మహా భాష్యము ౧-౧-౫).

వింధ్యమునకు దక్షిణమున నార్యులు క్రమముగాఁ బోయినమార్గమునకు దక్షిణాపథమని పేరుపెట్టిరి. దక్షిణములోని నాసికాపట్టణమును, కాంచీనగరమును పతంజలి కాలమునాఁటికే విఖ్యాతిఁ జెందినటులున్నవి. (మహా భాష్యము ౬-౧-౩; ౮-౨-౨).

ఈ కాలమున సాకేత దేశములపైని మధ్యదేశములపైని యవనులు దండెత్తి వచ్చినటులు గానవచ్చెడిని. (మహా భాష్యము ౩-౨-౨). ప్రస్తుతము కాబూ లనబడు కాంపిల్యయను పట్టణమునకును నావలనుండు ఉశీనర దేశములనుండి యూర్ణవస్త్రములు బాహ్లీక దేశమునకు వచ్చుచుండెను. బాహ్లీక మనఁ బ్రస్తుతపు పంజాబులోని పశ్చిమభాగమును కాబూలు లోని కొంతభాగమును.

పాణినికాలమందు సంస్కృతమునందే జనులు మాట లాడు చుండినటులు గానవచ్చెడిని. తూర్పువారి భాషలోను, పడమటవారి భాషలోనుగల భేదము పాణిని చూపియున్నాఁడు (పాణిని ౬-౨-౧౮). ఆయా దిక్కులవారు సంస్కృతము మాటలాడుచుండినఁ గాని యిట్టి శబ్దభేదములు కలుగనేరవు. పతంజలి కాలమునకు జనసామాన్యము ప్రాకృతము మాట లాడఁజొచ్చె. సంస్కృతముయొక్క యపభ్రంశము ప్రాకృ

తము. ఈ ప్రాకృతమే క్రమక్రమముగా మాఱి ప్రస్తుతపు హిందీ, మరాటీ, బంగాలీ మొదలయిన యార్యభాషలయ్యె.

## రాజ్యవ్యవస్థ.

ఈ కాలమున రాజు నిరంకుశాధికారియై యుండెనని కొందఱు వ్రాసియున్నారు. కాని యది నిజముకాదు. నిరంకుశాధికార మెంతవఱకు! న్యాయముగను, పక్షపాత రహితముగను, ప్రజాక్షేమమే పరమోద్దేశముగను రాజ్యము చేసినంతవఱకు. రాజులు ధర్మము నెఱిఁగి పక్షపాతము లేక యపరాధులఁ దగినట్లు శిక్ష చేయక యుండిన యెడలను, 1 రాజ్యములోని విద్వాంసులయెడ వినయ విధేయతతో నుండని యెడలను 2 వారు రాజ్యమును బోఁగొట్టు కొనియెదరని యప్పటివారు వ్రాసియున్నారు. గర్వాతిరేకమువలన వేనుఁడు, నహుషుఁడు, సుదాసుఁడు, సుముఖుఁడు, నిమియు నశించిరని ధర్మశాస్త్రకారులు రాజుల యుపయోగార్థము స్పష్టముగ వ్రాసియుంచిరి. 3 ఇంతియకాదు. ఇతఁ డపరాధము చేసిన యెడల నితరులకంటె నెక్కుడుగా దండనీయుఁడుగా భావింపఁబడియుండెను. ఇతర జనులకు నొకరూపాయి దండుగ విధించునట్టి యపరాధమే రాజు చేసిన యెడల నతని యొద్దనుండి వేయి రూపాయిలు దండుగ పుచ్చుకొనవలయునని ధర్మశాస్త్ర

(1. మనుస్మృతి ౭-౨౭-౨౮-౨౯). 2, (౭-౩౦). 3 (౭-౪౧)

కారులు విధించిరి.[4] ఇట్లు రాజు స్వతంత్రుఁడయినను నాతని స్వాతంత్ర్యము ప్రజలచేతఁ గొంతవఱకు నడ్డగింపఁ బడినట్లు గానవచ్చెడిని. రా జేడుగురను గాని యెనిమిదిమందినిగాని మంత్రుల నేర్పఱిచి యందొక విద్వాంసుఁడగు బ్రాహ్మణుని ముఖ్యమంత్రిగ నియమించి, యీ మంత్రిమండలమువారి (Cabinet) యాలోచన ప్రకారము రాజ్యము చేయుట యుత్తమముగాఁ దలంచిరి.[5] వీరుగాక రాజ్యముయొక్క సువ్యవస్థకై ప్రతిగ్రామమున కొక యధికారిని, దశగ్రామాధికారులపై నొక యధికారిని, నూఱుగ్రామములపై నొక యధికారిని, వేయి గ్రామముల కొకమండలేశ్వరుని నేర్పాటు చేయుచుండిరి.[6] వీరిప్పటి కరణము, సముద్దారు (Revenue Inspector), తహస్సీలుదారు, కలెక్టరు మొదలగున యధికారుల కూటస్థులని చెప్పవలసి యున్నది. ఈ యధికారులు పల్లెలకుఁ జుట్టు కోసెడు దూరమువఱకు బట్టణమునకుఁజుట్టు యోజనము వఱకును దొంగలు రాకుండ రక్షించుచుండిరి. ఈ సరిహద్దులలోపల వీరి యజాగ్రత్తవలన నేమిపోయినను వీ రచ్చుకొనవలయును.[1] గ్రామములో జరుగు నపరాధాది సమాచారములు క్రింది యధికారి పైయధికారికిఁ దెలుపుచుండ వలెను.[2] గ్రామస్థులు ప్రతిదినము రాజున కీయవలసిన మా

4. (౮-౩౩౬). 5. (౭-౫౪-౫౬-౫౭-౫౮). 6. (విష్ణుధర్మ సూత్రములు ౩-౭-౮, ౯, ౧౦).

1. (ఆపస్తంబధర్మ ౨-౧౦-౨౬-౩-౮). 2. (మను. ౭-౧౧౬-౧౧౭).

మరియు ధాన్యము, పానము, వంటసామగ్రి మొదలయినవి యొక గ్రామమునకు నధిపతియైనవాఁడు జీతముగాఁ దీసికొనవలయును. దశగ్రామాధిపతికి నొక కులము భూమి యనఁగా నొక కుటుంబమునకుఁ జాలినంత భూమియు, శతగ్రామాధికారికి నొక గ్రామమును, సహస్రగ్రామాధికారి కొకపురమును వేతనము క్రింద నీయఁబడుచుండెను.3 ఈయధికారులందఱుఁ దమతమ పనులు న్యాయముగను క్రమముగను జేయుచున్నారా లేదా యని విచారించుటకు ఘనతవహించి మిక్కిలి గొప్పగా నుండు నధికారులను గ్రామమునాఁడు నేర్పాటు చేయుచుండిరి.4 లంచములు దీసికొనిన యుద్యోగస్థుల ధనమంతయుఁ దీసికొని వారిని దేశమునుండి వెడలఁగొట్టుచుండిరి. 5 వ్యవసాయము చేసిన భూమికి నాఱవపాలును, పశువులు, బంగారము, బట్టలు మొదలగు వానికి నేఁబదియవపాలు, మాంసము, తేనెను, వనస్పతులు, సుగంధద్రవ్యములు, చర్మము మొదలగువానికి నాఱవపాలును, తనరాజ్యములో నమ్మఁబడిన సరకులకుఁ బదియవ పాలును, ఇతరరాజ్యములలో నమ్మఁబడిన సరకులకు నిరువదియవపాలును రాజు తనప్రజల యొద్దనుండి సుంకముగా గ్రహించుచుండెను. 6 పన్ను రాఁబట్టుకొనుట కేకాని రాజునకు భూమియందు వేఱె యధికారము లేదనియు, ప్రస్తుతము "జిరాయితీహక్కు" అనఁబడు క్షేత్రాధికారము అప్పుడు

3. (౭-౧౧౫-౧౧౯). 4. (౭-౧౨౨). 5. (౭-౧౨౮). 6. (విష్ణుధర్మ 3-3౯).

రాజునందు లేక రైతునందే యుండెననియుఁ దోఁచుచున్నది. అడవి కొట్టి భూమిని మన్నుకొన్నవాఁడే యా భూమికి నధిపతి యనియు, మొదట బాణము వేసినవాఁడే లేడికి యజమానుఁ డనియు మనువు స్పష్టముగా వ్రాసియున్నాఁడు.1

## యుద్ధములు

చారులవలనను రాయబారులవలనను బరరాజ్యముల వృత్తాంతములఁ దెలిసికొని రాజులు ఫాల్గున చైత్రమాసము లలో నైనను, లేక తనశత్రుఁ డెప్పుడు బలహీనుఁడుగా నుం డునో యప్పుడైనను యుద్ధమునకు బయలుదేఱుచుండిరి.2 సేనయంతయు సైన్యాధిపతి యాజ్ఞలో నుండును. పరరాజు యొక్క రాజ్యములోనికిఁ జొరఁబడి దేశమును గొల్లకొట్టుచుఁ దమకు ననుకూలమైన సంధి యాతఁడు చేసికొనునట్లు చేయు దురు.4 సంధికి రానియెడల యుద్ధము చేయుదురు. గెల్చిన రాజ్యములోని రాజవంశమును అంతమొందింపక యావంశపు వానిని దమకు వశునిగాఁ జేసికొని రాజ్యముపై వానినే యుంచుచు వచ్చిరి. శత్రుని మందిరమునుగాని, రాజధానిని గాని నాశము చేయుట తప్పుగా నెంచుచుండిరి.5 యుద్ధములో ధనముదొరికిన దొరికినవానిదే. విడిగా నొకనికి దొరకక మొత్తముమీఁద దొరకినయెడల నందఱు పంచుకొనుచుండిరి. అప్పటి యుద్ధధర్మములను జూచి యిప్పటి రాజులుగూఁడ

1. (మను ౯-౪౪). 2. (౭-౧-౧౬). 3. (౭-౬౫) 4. (౭-౧౧౦-౧౯౭ వచన). 5. (విష్ణుధర్మ ౩-౪౭-౫౩ వచన)

కొంత నేర్చుకొనవచ్చును విషముగాని నిప్పుగాని గల బాణములు వేయఁగూడదు. శస్త్రవిహీనులను, క్షతగాత్రులను, శరణుచొచ్చినవారిని దాఁకఁగూడదు. గుఱ్ఱముమీఁదఁగాని రథముమీఁదఁగాని కూర్చున్నవాఁడు కాలిబంటుతో యుద్ధము చేయఁగూడదు. శ్రమచేఁ గూర్చుండినవానితోను, నిద్రపోవు వానితోను, పాఱిపోయినవానితోను, ఇతరునితోఁ బోరాడుచున్న వానితోను బోరాడరాదు. క్రొత్తరాజ్యములో నా దేశపు ధర్మమును ఆచారమును నిలుపవలయును. ఆ దేశపు రాజవంశపువానినే రాజ్యాధిపునిఁ జేయవలయును.1

## న్యాయవిచారణ

రాజు స్వయముగాఁ గూర్చుండి, యితర విద్వాంసుల సహాయులుగఁ దీసికొని ప్రజల వ్యాజ్యములు తీర్చుచుండె 2. తనకుఁ దీఱనప్పుడు నలుగురు ధర్మశాస్త్రవేత్తలచే నీపని చేయించుచుండెను.3 రాజు నెదుట విచారింపఁబడిన యప్పును గుఱించిన వ్యాజ్యములోఁ బ్రతివాది మొదటనే అప్పు నొప్పుకొనిన యెడల నాతఁడు రాజునకు వ్యాజ్యమొత్తముమీఁద నూటికి నైదురూపాయలును మొదట నొప్పుకొనక తరువాత నప్పు ఋజువైనయెడల నూటికి బదిరూపాయలును నిచ్చుచుండెను 4. ఇది యప్పటి కోర్టుఫీజు. రాజు ధర్మశాస్త్రమును, శాస్త్రజ్ఞులను, నాచారములను విచారింపకయే తీర్పు చెప్ప

---

1. (మను. ౭-౯౦-౯౩ వఱకు) 2. (౭-౨౦౧-౨౦౨-౨౦౩)
3. (మను. ౮-౧-౨). 4. (౮-౯-౧౦-౧౧).

రాదు 5. ఒకసారి విచారించి తీర్పుచెప్పఁబడిన యంశమును మరల విచారణ చేయఁగూడదు 6. దీనినే ప్రస్తుతము పునర్విచారణ దోషము (Res-judicata) అనియెదరు.

ఇవిగాక దాయభాగమును గుఱించియు, అప్పుపత్రములను గుఱించియు కుదువపెట్టిన ద్రవ్యములను గుఱించియు, వడ్డీలను గుఱించియు, పొలిమేర తగాదాలను గుఱించియు, మఱి యెన్నియో విషయములను గుఱించియు ననేక నియమములు చేయఁబడినవి. ఏయే యపరాధముల కెట్టి శిక్షల విధింపవలయునో తెలిపెడి శిక్షాస్మృతి (Penal code) సంబంధమైన నియమములుకూడ బహు వివరముగాఁ జేయఁబడెను 7.

## సాంఘికస్థితి.

ఇఁక నప్పటి సాంఘికస్థితిని విచారింతము. అప్పటి స్త్రీలు వేదాధ్యయనమును మీమాంసాశాస్త్రమునుగూడ నభ్యసించుచుండిరి. బహుపత్నీత్వమనఁగా నొక్కభార్య బ్రతికియుండఁగనే రెండవ భార్యను జేసుకొనుట నాచారమప్పుడుండెను. కాని కేవల సంతానప్రాప్తికొఱకే యట్టి వివాహమంగీకరింపఁబడియె. ఇతర సమయములందు నిషేధింపఁబడియె. "తన ధర్మకృత్యములఁ జేయుటకు నిష్టమును సామర్థ్యమును కలిగిన పుత్రవతి యగు భార్యకలవాఁడు రెండవభార్యను జేసికొనఁగూడదు." అని యాపస్తంబుఁడు వ్రాసియున్నాఁడు.

---

5. (౨-౧౩౬) 6. (౨-౩౬౦-౪౫.) 7. (౯-౭౩౩) 8. (మను. ౨-౯ అధ్యాయములు చూడనగు.)

అన్యాయముగ భార్యను వదలువానికి క్రిందిశిక్ష విధింపఁబడి యున్నది. "అన్యాయముగ భార్యను వదలి పెట్టినవాఁడు, గాడిదతోలు కప్పుకొని తలవిరియఁబోసికొని యేడిండ్లలో భిక్షమెత్తవలయును." (ఆపస్తంబధర్మ ౧-౧౦-౨౮-౧౯)

అతిబాల్యవివాహ మీకాలమునఁ దిన్నఁగాఁ బ్రారంభమాయెను. కాని "రజస్వలయైన కన్య మూఁడుసంవత్సరముల వఱకు నెదురు చూడవలయు" ననిన వసిష్ఠవచనమునుబట్టి ప్రౌఢవివాహము లింకను బూర్తిగఁ బోలేదని యెంచవలసి యున్నది.

## జాతిభేదము.

ఈ కాలమునందు జాతిబంధనములు మిక్కిలి దృఢము కాఁజొచ్చె. బ్రాహ్మణుల మాహాత్మ్య మెక్కువయ్యె. బ్రాహ్మణులకు దానము జేయుట, బ్రాహ్మణులకు భోజనము పెట్టుట, పుణ్యప్రదమని తలఁపఁజొచ్చిరి. సంకరజాతు లభివృద్ధి కాఁదొడఁగెను[a]. యజ్ఞయాగాదిక్రతువులు చేయవలదని జనులకు బోధించు మస్కరు లనఁబడు పరివ్రాజకు లప్పు డుండిరి. (మహాభాష్యము ౬-౧-౫౪). శూద్రుని మిక్కిలి నీచముగఁ జూడసాగిరి. శూద్రుఁడు వేద ముచ్చరించినయెడల నాలుక కోయవలసినదనియు, వేదము విన్నయెడల సీసము కరఁగించి చెవిలోఁబోయవలసిన దనియు, వాఁడు వేదము జ్ఞాపకముంచు

a (వసిష్ఠ ధర్మసూత్రములు ౧౮ అధ్యాయము.)

కొన్ని యెడల వాని దేహమును రెండుతునుకలు చేయవలసిన దనియు శాసించిరి 1. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులలోను గ్రింది వారికంటెఁ బైవారు శ్రేష్ఠులని స్పష్టముగాఁ జెప్పసాగిరి 2. బ్రాహ్మణుఁ డనువాఁ డెట్టి తప్పుచేసినను వానికి శారీరదండనము వలదనిరి 3. బ్రాహ్మణుఁడువచ్చి సభలో సాక్ష్యమీయ నక్కఱ లేదు 4. బంధువులు పోయినపుడు బ్రాహ్మణుఁడు పది దినములును, క్షత్రియుఁడు పదునోకండుదినములును, వైశ్యుఁడు పండ్రెండు దినములును, శూద్రుఁడు నెలదినములును నాశౌచ ముండవలెనని విధించిరి 5. తనరాజ్యములో నే బ్రాహ్మణుఁడును భోజనము లేక యుండకుండఁజూచుట రాజునకుఁ గర్తవ్యమని వ్రాసిరి. 6 రాజ్యమును రక్షించుటకుఁ బైమూఁడు జాతులవారే నేమింపఁబడవలెను. కాని 7 శూద్రులు పనికి రాకపోయిరి. బ్రాహ్మణులకు పన్నుకట్టుట తప్పు 8 ఈప్రకారముగా జాతి మత్సరము విశేషముగా వృద్ధినొందెను.

## ప్రతిమాపూజ.

ఈకాలంబున జనులు ప్రతిమా పూజకులయిరి. వెనుకటి రెండు యుగంబులలో నార్యులు ప్రతిమలను బూజించినట్లుగాఁ గానరాదు. ఈయుగమునందుఁ బ్రతిమలఁ బూజించుచు నూరే

1. (గౌతమధర్మశాస్త్రము ౧౨-౪-౫-౬) 2. (అపస్తంబధర్మ శాస్త్రము ౧-౧-౧-౪). 3. (గౌతమ ౧౨-౪౬). 4. (గౌతమ ౧౩-౪). 5. (గౌతమ ౧౪-౧-౨-౩-౫) 6. (అపస్తంబధర్మ. ౨-౧౦-౨౫-౧౧) 7. (అప. ౨-౧-౨౬-౪). 8. (అప. ౭-౧౦-౨౬-౧౦).

గించుచు వచ్చిరి. బ్రహ్మ, ప్రజాపతి, శివుఁడు, వైశ్వానరుఁడు, స్కందుఁడు, విశాఖుఁడు అను దేవతల ప్రతిమలఁ బూజించుచుండిరి. మార్యులను ధనకాంక్షగలవా రిట్టి ప్రతిమలఁ జేసి యమ్ముచుండిరి (మహాభాష్య ౫-౩ అ).

## రేఖాగణితము.

ఈ కాలమందు నార్యు లనేకవిద్యల నభివృద్ధిఁ జేసిరని వెనుక వ్రాసియున్నారము. రేఖాగణిత (Geometry) మందు సూక్ష్మసిద్ధాంతములఁ (Propositions) గనిపెట్టిరి. యజ్ఞసంబంధమైన వేదులు వేయునపుడు కొన్ని త్రిభుజాకృతిగను, గొన్ని చతుష్కోణములుగను, గొన్ని పరిమండలములుగను నిర్మింపవలసివచ్చెను. ఇంతియ కాదు. త్రిభుజవేదితో సమాన పరిమాణముగల పరిమండలవేది యుండవలసివచ్చె; పరిమండల వేదిలో నాల్గవవంతు పరిమాణముగల చతుష్కోణవేదిక కావలసివచ్చె. ఇట్లు యజ్ఞసంబంధమైన వేదులును, కుండములును నియమితాకారపరిమాణములు గలవిగ చేయవలసివచ్చి నందున నప్పటి యార్యులకు రేఖాగణిత సంబంధమైన సిద్ధాంతములను గనిపెట్టుటయావశ్యకమయ్యె. ఈ సిద్ధాంతములు ఆపస్తంబకృతసుల్వ సూత్రములలో వర్ణింపఁబడినవి. అంకగణితాంతర్గతమైన దశాంశ (Decimal) గణితమును ఈ కాలమునందలి యార్యులే కనిపట్టిరి. వీరివద్దనుండి అరబ్బీవారును, వారియొద్ద నుండి యూరోపువారును నేర్చుకొనిరి.

## జ్యోతిశ్శాస్త్రము.

ఈ యుగమునందు జ్యోతిశ్శాస్త్ర మధికముగా నభివృద్ధి యైనదని చెప్పవచ్చును. పౌలిశ, రోమక, వాసిష్ఠ, సౌర, పితామహ సిద్ధాంతము లనఁబడు గణితపద్ధతు లీకాలముననే యుదయించినవని తోఁచెడిని. కాని యప్పటి సిద్ధాంతగ్రంథము లిప్పుడు లేవు. ఈ పేళ్లతో నిప్పుడు కానవచ్చెడి గ్రంథము లిటీవలివి. ఆ కాలములో గ్రహధూమకేతు నక్షత్రాదుల యస్తిత్వమును, గతి విశేషములను ఆకాశవేధ (Astronomical observation) మార్గమున నాచార్యులు కనుఁగొనుచుండిరనియు, ఎవరెవరు కనుఁగొనిన నక్షత్రగోళములకు వారివారిపేళ్లు పెట్టబడుచుండెననియుఁ గానవచ్చెడిని. వరాహమిహిరుఁడు తన బృహత్సంహితలోఁ గేతుచారమను అధ్యాయమందు అనేకధూమకేతువులను వర్ణించి యున్నాఁడు. అతఁడచ్చటఁ దాను గర్గ, పరాశర్యసిత దేవలులను ఋషుల వర్ణనల ననుసరించి వ్రాయుచున్నటుల చెప్పినాఁడు. ఇందుపై టీక వ్రాయుచు భట్టోత్పలుఁడను నతఁడు పరాశరాదుల వాక్యము లనేకము లిచ్చియున్నాఁడు. అందుఁ గొన్నిటి నిటనుదాహరించెదను. "పైతామహకేతు వైదువందల వత్సరములు తిరిగి తిరిగి యుదయించును. ఉద్దాలక శ్వేతకేతువు నూటపదిసంవత్సరములు పరిభ్రమించి యుదయించును. శూలాగ్రమువంటి శిఖను ధరించు కాశ్యప శ్వేతకేతువు పదియైను వందల సంవత్సరముల వఱకుఁ బ్రవాసముచేసి పద్మకేతు

వను తోఁకచుక్క వచ్చి పోయినతరువాత పూర్వదిక్కున నుదయించి, బ్రాహ్మ (అభిజిత్) నక్షత్రమును, ధ్రువనక్షత్రమును, బ్రహ్మరాశిని, సప్తర్షిని స్పృశించి ఆకాశముయొక్క మూఁడవవంతు భాగమును ఆక్రమించి అపసవ్యమార్గమునఁ బోవును. అర్ధవర్తులాకారమైన జటలుగల యీ ధూమకేతు వెన్నినెలలు కానవచ్చునో యన్ని సంవత్సరములు సుభిక్షకాలమగును. నూటేండ్లుచుట్టి "విభావసుజ రశ్మికేతువు" అనునది ఆవర్తకేతువు వచ్చి పోయినతరువాతఁ గృత్తికానక్షత్రమందు నుదయించును. దానికి ధూమశిఖ కలదు" * ఇందు నుద్దాలక, కశ్యపేత్యాద్యనేక నామములు ఋషులవి. అనఁగా నాయాకేతువులను గుఱించి చక్కఁగ గనుఁగొని లోకులకుఁ దెలిపిన ఋషుల నామములు వానికిఁ బెట్టిరి. ప్రస్తుతకాలమందు హాలే ధూమకేతువు, ఎంకీయొక్క ధూమకేతువు మొదలయిన పాశ్చాత్యనామములు మనము వినుచున్నారము. ఆలాగుననే మనపూర్వులను జ్యోతిషాచార్యులను గౌరవించుచుండినట్లు గానవచ్చుచున్నది.

---

*"పైతామహశ్చలకేతుః పంచవర్షశతం ప్రోష్యోదితః......అథోద్దాలకః శ్వేతకేతుర్దశోత్తరం వర్షశతం ప్రోష్య......దృశ్యః. శూలాగ్రాకారాం శిఖాం దర్శయన్ బ్రాహ్మనక్షత్ర ముపసృత్య మనాక్ ధ్రువం బ్రహ్మరాశి సప్తర్షీన్ సంస్పృశ్య...కాశ్యపః శ్వేతకేతుః పంచదశం వర్షశతం ప్రోష్యం ప్రాచ్యాం పద్మకేతోశ్చారాన్తే...నభస్త్రిభాగ మాక్రమ్యాపసవ్యం నివృత్యార్ధ ప్రదక్షిణ జటాకారశిఖః సయావన్తోమాసాన్ దృశ్యతే తావద్వర్షాణి సుభిక్ష మావహతి...అథ రశ్మికేతుర్విభావసుజః ప్రోష్య శత మావర్తకేతో రుదిత శ్చరాన్తే కృత్తికాసు ధూమశిఖః.

## షడ్దర్శనములు.

పైని వర్ణించిన యన్నివిద్యలకంటెను షడ్దర్శనములను తత్త్వసంబంధములయిన గ్రంథములే కాలపు టార్యుల యనుపమేయ కుశాగ్రబుద్ధిని వెల్లడిచేయుచున్నవి. షడ్దర్శనములనఁగా ౧. కపిలకృత సాంఖ్యదర్శనము; ౨. పతంజలికృత యోగదర్శనము; ౩. గౌతమకృత న్యాయదర్శనము; ౪. కణాదకృత వైశేషిక దర్శనము; ౫. జైమినికృత పూర్వమీమాంస; ౬. వ్యాసకృతోత్తరమీమాంస. ఉత్తరమీమాంసకే బ్రహ్మసూత్రములనియు, వేదాంతసూత్రములనియు నామాంతరములు.

సాంఖ్యశాస్త్రమునందు బురుషప్రకృతులనుగుఱించియు, మనోబుద్ధ్యహంకారములను గుఱించియు, ఇంద్రియతత్త్వములను గుఱించియు వివరింపఁబడియున్నది. పురుషప్రకృతులనఁగాఁ జేతనజడములు. ఇవి యనాదులును, స్వయంభువులును అయియున్నవి. శరీరాదిక సర్వసృష్టి ప్రకృతిజన్యమే గాని పురుషకృతము గాదు. దేహమందుఁ బురుషుఁడు (ఆత్మ) తటస్థుఁడై నిమిత్తమాత్రుఁడైయుండి ముక్తి సమయమున నందుండి వేఱయిపోవును. ప్రకృతి గ్రుడ్డిమనుష్యునివంటిది. ఆత్మ కుంటిమనుష్యునివంటిది. స్వతంత్రముగా గ్రుడ్డివాఁడుగాని కుంటివాఁడుగాని నడువలేఁడు. కాని గ్రుడ్డివానిభుజముపైఁ గుంటివాఁడు కూర్చుండి తప్పుత్రోవను బోకుండఁ గనుపెట్టిన వారిద్ద ఱెంతదూరమైనను వెళ్ళవచ్చునుకదా! అట్లే తటస్థుఁడగు

పురుషుఁడును జడమైన ప్రకృతియుఁ గలిసి యీప్రపంచమంతయు నిర్మించుచున్నారు. యజ్ఞయాగాది కర్మలవలన ముక్తి లేదనియు జ్ఞానమువలన ముక్తికలదనియు వీరి సిద్ధాంతము. ఈశాస్త్రమందుఁ బురుషుఁడనఁగా జీవుఁడని యర్థము; ఈశ్వరుండని యర్థముగాదు. ఈశ్వరుని యునికి వీరొప్పుకొనరు గాన వీరిని నిరీశ్వరసాంఖ్యులని యెదరు.

ప్రాణాయామాది సాధనములవలన శరీరమంతయు స్వాధీనపఱచుకొని సమాధిమూలముగా ముక్తి సాధింపవలయు ననునది యోగసిద్ధాంతము. ఈ యోగసూత్రములందు మానసశాస్త్ర (Psychology) సంబంధమైన యనేక సిద్ధాంతములు లేర్పడియున్నవి.

న్యాయశాస్త్రములో యథార్థజ్ఞానసంపాదనకు సాధనములగు ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము మొదలగు ప్రమాణములను గుఱించియుఁ, బరపక్షమువారి సిద్ధాంతముల ఖండించి స్వమతస్థాపనచేయు మార్గంబులును, సృష్టియందలి పదార్థముల స్వరూపములును వివరింపఁబడినవి. ఈశాస్త్రమునకు తర్కశాస్త్రమని మాఱుపేరు.

వైశేషిక దర్శనమునందు న్యాయశాస్త్రములోనివిషయములే యనేకములున్నను నిందు పరమాణువాద మను నొక విశేషము కలదు. మిక్కిలి చిన్నవగు నణువుల సమ్మేళనము వలన నీసృష్టియంతయుఁ బుట్టెననియు, మరలఁ బ్రళయకాలమున నీపదార్థములన్నియుఁ బరమాణువులుగా మాఱుననియు

వీరి సిద్ధాంతము. జగత్తునకుఁ బరమాణువులే కారణమని చెప్పి యీశ్వరునిగుఱించి యేమియుఁ జెప్పనందున వీరిని గొందఱు నాస్తికు లందురు.

యజ్ఞయాగాదిక్రతువులును, నిత్యకర్మానుష్ఠానమును జేసినందువలన ధర్మ మను నొక దేవతావిశేషము పుట్టి మరణానంతర మామనుజునికి స్వర్గాదిసౌఖ్యములఁ గలుగఁజేయు నని పూర్వమీమాంసా సిద్ధాంతము. వేదమునుగుఱించి యితరులు చేయు నాక్షేపణల కన్నిటికిని హేతుపూర్వక ప్రత్యుత్తరములును, క్రతుసంబంధమైన క్రియాకలాపముల కన్నిటికిని సయుక్తిక హేతువులును ఇం దియ్యఁబడియున్నవి. వేదవాక్యములకు నర్థముచేయునెడ నుపయోగపడుపవలసిన న్యాయములును ఇందు వివరింపఁబడినవి. ఏమతస్థుఁడైనను ఈన్యాయముల ననుసరించిన గాని వేదవాక్యములకు నర్థము కననేరడు.

జీవబ్రహ్మసంబంధమైన యుపనిషద్వాక్యము లన్నియు నుత్తరమీమాంస యను నొక దారముతో గుచ్చఁబడినవి. ఈ మీమాంసయందలి ప్రతిసూత్రమునకును ఉపనిషత్తులలోని యనేకవాక్యములతో సంబంధ ముండును. ఇట్టి వాక్యములను ఉపబృంహితవాక్యము లని యెదరు. ఇందు ననేకయుక్తిప్రయుక్తులతో జీవబ్రహ్మసంబంధమును ఆత్మానాత్మ వివేకమును వర్ణింపబడినవి. ఈసూత్రములయొక్క యర్థమును గుఱించి పెక్కు వివాదములు గలవు. ఈసూత్రముల కనేకు లనేకభాష్యములు వ్రాసిరి. మొట్టమొదట భాష్యము వ్రాసిన

వాఁడు నీలకంఠశైవాచార్యుఁడు; దీనిని నీలకంఠభాష్యమని యెదరు. అందు శివపరముగ నర్థము చేయఁబడినది. లోకవిఖ్యాతులగు శంకరాచార్యులవారి సూత్రములపై వ్రాసిన భాష్యము శాంకర శారీర భాష్యమని జగత్ప్రసిద్ధము. యుక్తివాదమున నీగ్రంథమును మించినగ్రంథము వేఱొకటి యుండఁబోదు. ఇందు బ్రహ్మము సత్యమనియు, జగత్తు మిథ్యయనియు, జీవుఁడే బ్రహ్మమనియు జెప్పఁబడియున్నది. రామానుజకృతమైన విశిష్టాద్వైతభాష్యము మూఁడవది. దీనికి శ్రీభాష్యమని పేరు. వీరుగాక, మధ్వాచార్యులవారు ద్వైతపరముగను వల్లభాచార్యులవారు శుద్ధాద్వైతపరముగను భాష్యము లిటీవల వ్రాసియున్నారు.

ఈవడ్దర్శనములన్నియు సూత్రకాలములోనే వ్రాయఁబడినవికావు. ఇందలి విషయచర్చయుఁ గొన్నిసూత్రములు నీయుగంబున నేర్పడెఁగాని, విస్తృతము గానిపించెడి గ్రంథరూపము వానికి బౌద్ధకాలమునఁ గలిగియుండవచ్చునని విద్వాంసుల యభిప్రాయము.

ఇతర సూత్రములు.

పైని వర్ణింపఁబడిన సూత్రగ్రంథములుగాక వాత్స్యాయనకృత కామసూత్రములును, పింగళాచార్యకృత ఛందస్సూత్రములును గలవు. ఇటీవలి వారిచే వ్రాయఁబడు కామశాస్త్రాది గ్రంథములకు నీకామసూత్రములే మూలాధా

రములు, ఇటువంటి ఛందశ్శాస్త్రముల కన్నిటికిని పింగళసూత్రములే యాదిమాతృకలు.

ఇవిగాక యనుక్రమణికలను గ్రంథములు గలవు. ఒక్కొక వేదమునకు నొక్కటిగాని, పెక్కులుగాని యనుక్రమణికలుండును. ఇందు నాయావేదములలోని సూక్తములు, ఋషులు, ఛందములు, దేవతలు మొదలయినవాని వివరముండును. ఆయా సంహితలలోఁ బిమ్మట నెవ్వరును క్రొత్త మంత్రములు కలుపకుండ, ఇం దిన్ని మంత్రములు, ఇన్ని పదములు, ఇన్ని యక్షరములు ఉన్నవని వ్రాయఁబడును. ఋగ్వేదములో ౧౦౧౭ సూక్తములును, ౧౦౫౮౦ ఋక్కులును, ౧౫౩౮౨౬ పదములు (శబ్దములు) ను, ౪౩౨౦౦౦ అక్షరములును గలవని ఋగ్వేదానుక్రమణికలోఁ జెప్పబడియున్నది. అనఁగా నాకాలమందు వేదములను నంత సూక్ష్మనిరీక్షణతో నభ్యసించిరని యర్థము. ఈ యనుక్రమణికలు కొన్ని పద్యరూపముగను, కొన్ని గద్యరూపముగను ఉండును.



అయిదవ ప్రకరణము.

# బౌద్ధయుగము

(క్రీ. పూ. ౫౦౦-౫౦౦).

క్రిందటి ప్రకరణములోఁ జెప్పినట్లు బ్రాహ్మణుల యాధిక్య మెక్కువగాఁజొచ్చె. బ్రాహ్మణులుతప్ప నితరులకు అధ్యయనాధ్యాపన (చదువుకొనుట, చదువుచెప్పుట) సంబంధమైన యధికారములు లేవనియు, యజ్ఞ యాగాదికములఁ జేయించుటకు బ్రాహ్మణేతరు లనర్హులనియు వారు వాదింపఁ జొచ్చిరి. అనార్యులను, శూద్రులను మిక్కిలి యసూయతోను దిరస్కారభావముతోను జూచుచుండిరి. అందువలన శూద్రులకు మిక్కిలి బాధ గలుగుచుండె. బ్రాహ్మణుఁ డెట్టియపరాధము చేసినను వానికి శిక్షలేదు. శూద్రుఁడు కొలఁది తప్పుచేసినను వానికిఁ గఠినశిక్ష విధింపఁబడుచుండెను. వేదమంత్రములు వినినంతమాత్రమున శూద్రుని చెవిలో సీసము కరఁగించి పోయుమనిరి. ఇట్లు క్రిందిజాతివారణఁగఁద్రొక్కఁబడుచున్నందున బ్రాహ్మణులు చేయు స్వార్థపరధర్మబోధలు జనసామాన్యమునకు గ్రాహ్యములు కావయ్యె. కాన జాతి విభేదములేక యందఱుజనులను సమానముగాఁ జూచి యందఱకు సాధ్యమగు నీతిసిద్ధాంతములే తత్వములుగాఁ గలిగిన యొక క్రొత్తధర్మమును స్థాపించి సంఘసంస్కరణము

8

చేయ నప్పటి సంస్కర్త లనేకులు యత్నించిరి. వారిలో మహావీరుఁ డనువాఁడును, బుద్ధుఁ డనువాఁడును ముఖ్యులు. మహావీరుఁడు జైనమతస్థాపకుఁడు. బుద్ధుఁడు బౌద్ధమతస్థాపకుఁడు. వీరిని గుఱించియు వీరిక్రొత్తమతముల గుఱించియు మన మిచ్చటఁ గొంత కనుఁగొందము.

## మహావీరుఁడు.

ఈతఁడు బుద్ధునకు సమకాలీనుఁడనియు నతనికి బంధుఁ డనియుఁ జెప్పెదరు. ఈతఁడు వైశాలీపురమునందు క్రీ. పూ. ౫౫౫-వ సంవత్సరప్రాంతమున జన్మించెను. వైశాలి యను పట్టణము, ప్రస్తుతము బేహారులోని పాట్నాపట్టణమునకు నుత్తరమున నిరువదియేడుమైళ్ళదూరమున నున్న బిసర్ అను పల్లెకు సమీపమం దుండెనఁట. అచ్చట రాజ్యము చేయువాఁ డొక రాజుగాక, యనేక క్షత్త్రియ కుటుంబముల లోని నాయకు లందఱుఁ గలిసి రాజ్యము చేయుచుండిరి. దీనిని నాయక సత్తాక రాజ్యము (Oligarchical Republic) అనియె దరు. అట్టి క్షత్త్రియనాయకులలో "నత" వంశకుఁ డగు నొక నాయకుని చిన్నికుమారుఁ డీమహావీరుఁడు. ఈతఁడు ముప్పదేండ్ల వయస్సున సర్వసంగపరిత్యాగముచేసి పారస నాథులను సన్న్యాసులలోఁ గలిసి రెండుసంవత్సరము లుండెను. తరువాత నాతఁడు స్వతంత్రమతమును స్థాపించి నలువదియేండ్ల వఱకు ధర్మోపదేశము చేయుచు నుత్తర దక్షిణబేహారు దేశములందే కొన్నిమఠము లేర్పాటుచేసి క్రీ. పూ. ౪౭౦ లోఁ

బరమపదము నొందెను. ఈ మతమువారిని మొదట నిర్గ్రంథు లనిరి. వేదాదికములయిన యేగ్రంథములను నమ్మనివారని యందుల కర్థము. మహావీరుని, ఇంక నితర మతస్థాపకులను ఈమతమువారు "జిను" లని యన్నందున నీ మతమునకుఁ దరువాత జైనమతమని పేరువచ్చెను. కొంతకాలమునకు వీరిలో దిగంబరు లనియు, శ్వేతాంబరు లనియు రెండు తెగ లేర్పడెను. ఈమతము క్రమక్రమముగా దక్షిణమునందును ప్రసరించె. క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దంబున నీ ధర్మము పశ్చిమతీరమునను, మధుర, మైసూరురాజ్యములందును బ్రబలి శఁటులు గానవచ్చెడిని. కాంచీపట్టణములో అకలంకుఁ డను జైనాచార్యుఁడు బౌద్ధుల నోడించి వెడలఁ గొట్టించెనఁట. అరవములోను కన్నడములోను జైనులు చక్కని గ్రంథములు వ్రాసియున్నారు. క్రీ. శ. పండ్రెండవ శతాబ్దంబున శైవ మతస్థులును వైష్ణవమతస్థులును ప్రబలి దక్షిణమునందలి జైన మతమును రూపుమాపిరి. ప్రస్తుతము హిందూదేశమున పదుమూఁడులక్షల జైనులుమాత్ర మున్నారు.

## జైనసిద్ధాంతములు.

౧. వేదము లపౌరుషేయములు కావు. ౨. అరూప గుణుండను సర్వేశ్వరుఁ డొకఁడు కలడు. వాడు సర్వశక్తి మంతుఁడయ్యును తటస్థునివలె నుండును. ౩. ఈశ్వరుఁడు మనలను యిష్టమువచ్చినట్లు రక్షింపఁడు; శిక్షింపఁడు. మన సదాచరణ దురాచరణములే మనలను రక్షించును, శిక్షించును.

౪. సృష్టియు, జీవులును అనాదులు; అవినాశులు, వినాశము చెందునవికావు. ౫. ఈభూలోకమునకుఁ గ్రింద నేడునరకములును పైని బదునారు దేవలోకములును గలవు. అన్నిటికిపైని బదునేడవది ఆగమిాంద్రిలోకముకలదు. అందు సర్వేశ్వరుఁడుండును. పుణ్యాత్ము లచ్చటికిఁబోయెదరు. పాపాత్ములు నరకమునకు బోయెదరు. ౬. ఇదివరకు నిరువదినలుగురు తీర్థంకరులను గురువులు వచ్చి వెళ్ళిరి. వారిని దేవతలకంటె నెక్కుడుగా భావించి వారిప్రతిమలను జైనులు పూజించెదరు. ౭ అహింస యనునది వీరి యన్నివ్రతములలో గొప్పది. రాత్రి భోజనము సేసినఁ జీఁకటిలో జీవకోటికి హింస కలుగునేమో యని వీరు సాయంకాలముననే భోజనము చేయుదురు. వడియఁబోయని నీరు త్రాగరు. మొదట వీరిలో జాతిభేదము లేకపోయినను నిటీవలి జైనులు జాతిభేదమును పాటించుచు శివవిష్ణ్వాది దేవతలఁ బూజింతురట.

## గౌతమ బుద్ధుఁడు.

ఆకాలమునందలి సంస్కర్తలలోనేగాక భూమిపై నేఁటి వఱకును బుట్టిన యందఱు సంస్కర్తలలోను, విరాగులలోను, మహానుభావులలోను గౌతముఁ డగ్రగణ్యుఁడనుటకు సందేహములేదు. కావున నిచ్చట నాతని చరిత్ర కొంచెము వివరముగ వ్రాసెదను.

కోసలదేశమునకు నీశాన్యమున శాక్యవంశపు రాజుల యొక్క చిన్నరాజ్య ముండెను. దానికి రాజధాని రోహిణీనది



గౌతమ బుద్ధుడు

రెయొద్దుననున్న కపిలవస్తునగరము. * ఈ నగరము కాశికి నుత్తరమున నూఱుమైళ్ళమీఁద, హిమాలయ ప్రాంతమం దుండె. అచ్చట నాకాలంబున శాక్యవంశజుఁడును, గౌతమ గోత్రుఁడును అగు శుద్ధోదనుఁ డను రాజు తన వంశజులైన యితరనాయకులతోఁగలిసి రాజ్యము చేయుచుండెను. అతనికి మాయాదేవి యను భార్య గలదు. ఈ దంపతులకుఁ గ్రీ. పూ. ౫౫౭ వ సంవత్సరమునందు నొక కుమారుఁడు కలిగెను. కపిలవస్తునగరమునకు నాలుమైళ్ళమీఁదనుండు లంబినీవన మనఁబడు తోటలో బుద్ధుఁడు జన్మించినస్థలంబునఁ దరువాతి కాలమున అశోకమహారాజొక శిలాశాసనము వేయించెను. అది యిప్పటికి నచ్చటనేయున్నది.

బుద్ధునికిఁ జిన్నతనమునం దేమిపేరుపెట్టిరో తెలియదు. కాని తరువాత నాతనికిఁ గౌతమగోత్రుఁడగుటచే గౌతము డనియు, శాక్యవంశజుఁడగుటచే 'శాక్యముని' లేక 'శాక్య సింహుఁ' డనియుఁ బరతత్వబోధ కలిగినవాఁడగుటచే బుద్ధుఁ డనియు, వచ్చినకార్యమును సాధించినవాఁడుగాన సిద్ధార్థుఁ డనియు నామములు గలిగె. ఈ సిద్ధార్థుఁడు చిన్ననాఁటనుండి యు, సమస్తభూతములయందును నత్యంత దయగలవాఁడయి

* ప్రస్తుతము యునైటెడ్ ప్రావిన్సెస్ ఆఫ్ ఆగ్రా అందు ఔడ్ అనఁబడు పరగణాలలోని, బస్తి అను జిల్లాలో ఈశాన్యమూల నుండు "పిప్రహవా" యనుపల్లెయున్న స్థలముననే కపిలవస్తునగర ముండెనని యిటీవలి శోధకులచే నిశ్చయింపఁబడియె.

సంసారసుఖము నొల్లక యెప్పుడును నేకాంతంబునఁ జింతాక్రాంతుఁడై యుండె. అది చూచి యతని తండ్రి, తన కుమారుఁడు రాజులకు సహజమైన శౌర్యము నొల్లక సన్యాసులకుఁ దగిన సత్త్వగుణములు స్వీకరించియుండుటకుఁ జింతించి, యతనిని సంసారబంధములోఁ బడవైచిన నతఁడు వైరాగ్యవృత్తిని మానునని తలఁచి 'యశోధర' యను రాజకుమారికను దెచ్చి, సిద్ధార్థున కిరువదవయేట వివాహము చేసెను. వివాహానంతరము కొన్నిదినములవఱకు సిద్ధార్థుఁడు సంసారములోఁ గొంచెము మునిఁగియుండె. కాని యొకదినమున నాతఁడు పట్టణముఁ జూడఁబోవఁగా నాతనికి నొకరోగియు నొక ముదుసలివాఁడును నొక పీనుఁగును దోవను బోవుచుండఁ గానవచ్చెను. అందుపై సంసారములోనుండు మానవులకందఱకును, రోగజరామరణములు సహజములనియు, వీనిని దప్పించుకొన నిర్వాణమార్గమును గనిపట్టవలయుననియు నాతనికిఁ దోఁచి వైరాగ్య మినుమడించెను. ఇంతలో నతనికి రాహులుఁడను ముద్దుఁబిడ్డఁడు పుట్టె. ఇఁక నింట నుండినయెడల సంసారమోహమెక్కువై జననమరణములులేని నిర్వాణోపాయముఁ గనిపట్టుట దుర్లభమని తలఁచి సిద్ధార్థుఁ డిలువిడిచిపోవఁదలఁచెను. ఎవరికిఁ దెలియకుండఁ దనరథము మధ్యరాత్రి సిద్ధపఱచియుంపవలసినదని విశ్వసనీయుఁడగు తన సారథితోఁ జెప్పి, యిలువెడలునపు డొకమారి తన ముద్దులకొమరుని ముద్దాడి వెళ్ళెదనని యాతఁడు కుమారుని యుయ్యెలయొద్దకుఁ బోయెను.

అచ్చట నాతనిభార్యయగు 'యశోధర' యప్సరసలఁబోలిన సఖీజనంబుచేఁ బరివేష్టితయై నిదురించుచుండె. జాజ్వల్యమానముగా వెలుఁగుచున్న దీపంబుల ప్రకాశంబు ముఖముపైఁబడ నా తరుణీలలామ రతీదేవివలె శోభిల్లె. అట్లు నిద్రావశలయిన యా జవ్వనుల ముఖకమలంబులచే నిండియున్న యా యంతఃపురకాసారంబు తన్ను ముంచునేమోయని సిద్ధార్థుఁ డించుక భయమందెను. కాని మనోనిగ్రహముగల మహానుభావుఁడుగాన గ్రక్కున మనస్సును ద్రిప్పుకొని, కుమారుని ముద్దాడిన యెడల వాఁడేడ్చుననియు, నదికారణముగాఁ దన భార్యయు నితర స్త్రీలును లేచి తన ప్రయాణకార్యమునకు భంగము గలిగించెదరనియుఁ దలఁచి తన పట్టిని ముద్దయిన నాడక, మనస్సును రాయిచేసికొని పరిపూర్ణవైరాగ్యవంతుఁడై, తన గొప్ప రాజ్యమును, చక్కని భార్యను, ముద్దుల కుమారుని, సకలైహికసౌఖ్యములను వదలి సిద్ధార్థుఁ డెవరికిఁ జెప్పక ముక్తి మార్గమును సాధించుటకు ముప్పదవయేట బయలు దేరెను. అనన్యసామాన్య వైరాగ్యమన నిట్టిదికదా!

ఇట్లు వెడలినవాఁడు కొంతదూరమువఱకు రథము మీఁదఁబోయి, రథము డిగ్గి, తన రాజవేషమంతయు సారథి కిచ్చి, సారథి వేషముఁ దాను ధరించి, తన కురులన్నియుఁ గత్తిరించివైచి సన్న్యాసిరూపము ధరించెను. సారథినిఁ దిరిగి తన పట్టణమునకుఁ బంపివైచెను. కొంతదూరము పోఁగా నా తనికి శిష్యులచేఁ బరివృతుఁడై తత్త్వవిచారము చేయుచున్న

ఆరాదకాలపుఁడను ఆచార్యుఁడు గానవచ్చెను. అతనియొద్ద గొన్నిదినములుండి సిద్ధార్థుఁడు శాస్త్రములలోని ముక్తిమార్గము నభ్యసించెను. తరువాత రుద్రకుఁడనువానియొద్దఁ బ్రాణాయామాది సమాధిసాధనంబుల నేర్చెను. కాని యందువలన నతనికి మనస్సమాధానము కాలేదు. అటుతర్వాత బుద్ధుఁడు మగధదేశమునకు రాజధానియగు రాజగృహమునకుఁ బోయెను. శరీరమును గష్టపెట్టి తపస్సుచేయక ముక్తిదొరకదని యచ్చట బోధింపఁబడినందున గయ యను పట్టణమునొద్ద నరణ్యములో నాఱు సంవత్సరములవఱకును నైదుగురు శిష్యులతోఁగూడ నాహారముమాని తపస్సానరించెను. అన్నాహారములు లేక శరీరమును గృశింపఁజేసియు, బంచాగ్నిమధ్యమునఁ దనువును దపింపఁజేసియుఁ దపస్సానరించినను నందువలన నతనికి నేమియు లాభము గానరాక యొకపరి నాతఁడు మూర్ఛవచ్చి పడి పోయెను. తర్వాత శరీరశోషణమువలన లాభము లేదనిచూచి యాతఁడు దానిని వదలిపెట్టెను. అందుపై శిష్యులాతనియందు భక్తితగ్గినవారై యాతనిని వదలివెళ్ళిరి. పిదప గయయొద్ద నొక రావిచెట్టుక్రిందఁ గూర్చుండి శాంతమనస్సుతోఁ దత్త్వమును విచారింపఁగా నాతనికి నిర్వాణసాధకం బగు తత్త్వము బోధపడి యాతఁడు బుద్ధుఁడయ్యెను. ఆతఁడు బుద్ధత్వముఁ జెందినస్థలమే బుద్ధగయ. ఆతఁ డశ్వత్థవృక్షముక్రింద బుద్ధత్వముఁ జెందెఁ గాన నదియత్యంతపవిత్రమైన వృక్షమని బౌద్ధుల విశ్వాసము.

సిద్ధార్థుఁ డిట్లు తత్త్వమునుగాంచి బుద్ధత్వముఁజెంది తన మతము నితరులకు బోధించునిమిత్తము ముప్పదియాఱవయేట వెడలెను. మొట్టమొదట కాశీపట్టణమునకుఁబోయి యచ్చట సకలజనులకుఁ దన నూతన సిద్ధాంతముల బోధపరుపఁజొచ్చెను. మూఁడు నెలలలో నఱువది శిష్యులాతని మతము స్వీకరించిరి.

తనమతమును దశదిశలఁ బ్రసరింపఁజేయుటకై యాతఁ డాయఱువదిశిష్యుల దేశదేశములకుఁ బంపి "ఈ యుత్తమ ధర్మమును నందఱకు బోధింపుఁ" డనియాజ్ఞాపించెను. ఈభూగోళముమీఁది మొట్టమొదటి మతప్రబోధక సంఘము (Religious Mission) మిదియె. ఇటీవలి క్రైస్తవ మతప్రబోధకసంఘము లన్నియు బౌద్ధసంఘముల యనుకరణంబులే.

కాశీపట్టణమున మఱికొందఱుశిష్యుల సంపాదించి మగధ దేశమునకు రాజధానియగు రాజగృహమునకుఁబోయి యచ్చట బింబిసారుఁడను రాజునకును మఱి యనేకజనులకును నూతన ధర్మదీక్ష నొసంగెను. సంవత్సరమునకు నెనిమిదినెలలు నానా దేశములు తిరిగి ధర్మబోధఁజేయుచు, శాక్యమహాముని యగు బుద్ధుఁడు వర్షకాలము నాలుగునెలలును రాజగృహము నొద్ద నున్న వేణువనమునఁ గడపుచుండెను. అనేక రాజులును విద్వాంసులును బ్రహ్మవేత్తలును వేణువనమునకువచ్చి యాతని మతమును స్వీకరించిరి.

బౌద్ధసన్న్యాసులకు భిక్షువు లనిపేరు. వీరినే ప్రాకృతమున బిఖులని యనియెదరు. అట్టి యనేక భిక్షులతో

బుద్ధుఁడు తనరాజధానియగు కపిలవస్తు పురంబునకు భిక్షు వేషముతో వెళ్లి తనముదుసలి తండ్రికిని గుమారునకును భార్యకును దీక్ష యొసంగెను. బౌద్ధమతములోఁ బురుషులకుఁబోలె స్త్రీలకును సన్న్యాసము కలదు. అట్టిస్త్రీని భిక్షుని అనియెదరు. బుద్ధునిభార్యయగు యశోధర మొదటి భిక్షుని యయ్యె. ఇట్లు బౌద్ధమతము బుద్ధునిజీవితకాలమునందే కాశీ కోసల మగధ దేశంబులఁ బ్రసరించెను. బుద్ధుఁడు నూతన మతాభివృద్ధికై నలువదినాలుగేండ్లు పాటుపడి క్రీ. పూ. ౪౭౭-వ సంవత్సరములో, ప్రస్తుతము గోరక్ పూర్ జిల్లాలో కాశియా యని పిలువఁబడు కుశినగరమునందు తన కెనుబదవయేట నిర్వాణము చెందెను. . . . . . . . . . . . . .

## బౌద్ధమతాభివృద్ధి

బుద్ధుఁడు నిర్వాణము చెందిన సంవత్సరమున రాజగృహము నొద్ద పర్వతప్రదేశమందు నేనూరుగురు బౌద్ధాచార్యులు చేరి బుద్ధుని యుపదేశవాక్యఁబుల మూఁడు పిటకలుగా సంగ్రహించిరి. బుద్ధుఁడు తనశిష్యులకుఁ జేసిన యుపదేశమునకు సుత్త (సూత్ర) పిటక మని పేరు; సంప్రదాయ సంబంధమైన నిబంధనలకు వినయపిటక మని పేరు. మతసిద్ధాంతములకు అభి (ధర్మ) దమ్మ పిటకమనిపేరు. ఈ పిటకత్రయము బౌద్ధులకు వేదతుల్యము. పిటకమనఁగా పెట్టె.

రమారమి నూఱు సంవత్సరములకుఁదర్వాత వైశాలి యను నగరమందు బౌద్ధాచార్యుల రెండవపరిషత్తు కూడెను.

అచ్చటి కేమువందల బౌద్ధాచార్యులు వచ్చియుండిరి. ఆ పరిషత్తులో మతభేదములు కలిగి వారిలో రెండు సంప్రదాయములు పుట్టెను.

తరువాత రెండువందల సంవత్సరములవఱకును బౌద్ధధర్మ ముత్తర హిందూదేశ మంతటను వ్యాపించెను. క్రీ. పూ. ౨౬౦-వ సంవత్సరప్రాంతమున మగధదేశపు విఖ్యాతచక్రవర్తియగు నశోకమహారాజు బౌద్ధమతమును నవలంబించి ఆ ధర్మముయొక్క యభివృద్ధికై మిక్కిలి పాటుపడి, దక్షిణహిందూదేశము, సింహళము, బ్యాక్ట్రియాదేశము మొదలయిన దేశములకు ధర్మోపదేశకులఁ బంపెను. క్రీ. పూ. ౨౪౨ లో అశోకమహారాజు తనరాజధానియగు పాటలీపుత్రమందు బౌద్ధాచార్యుల మూఁడవ పరిషత్తును జేయించెను. బౌద్ధుల మని చెప్పెడి కొందఱు మోసగాండ్రచే ధర్మగ్రంథములలోఁ గలుపఁబడిన ప్రక్షిప్తభాగము లీపరిషత్తునందు విడఁదీయఁబడియె. ఘనుడైన యీ యశోకచక్రవర్తినిగురించి మౌర్యవంశచరిత్ర వ్రాయునపు డధికముగా వ్రాయఁబడును.

క్రీ. శ. ప్రథమ శతాబ్దమునందుఁ గణిష్కుఁడను శకవంశపురాజు కాశ్మీరదేశమును గెలిచి రాజ్యము చేయుచుండె. ఆతఁడు బౌద్ధమతమునం దాసక్తి కలవాఁడై యుండెను. ఆతఁడు రాజ్యము చేయుచుండఁగా క్రీ. శ. ౪౦ లో బౌద్ధాచార్యుల నాల్గవ పరిషత్తు జరిగెను. అందు మూఁడు పిటకములకు మూఁడుభాష్యములు వ్రాయఁబడియె.

కాశ్మీరమునుండి బౌద్ధధర్మంబును బౌద్ధగ్రంథములును చీనాదేశమునకుఁ బోయి నాల్గవ శతాబ్దమున నచ్చట వ్యాపించెను. అచ్చటనుండి బౌద్ధమతము కొరియాకు నాలవ శతాబ్దమందును, జపానునకు నాఱవశతాబ్దమందును బోయెను. చీనానుండియే యీధర్మము, ఫార్మోజా, మంగోలియా, సైబీరియాదేశములలోఁ బ్రసరించెను. టిబెట్టువారు నేపాళము వారి యొద్దనుండియు, ఖొట్కా, బొఖారా, తార్తారదేశస్థులు కాశ్మీర, కాబూల్ దేశములవారియొద్దనుండియు నీ నూతన ధర్మమును నేర్చుకొనిరి. ఈదేశములోని బౌద్ధధర్మమునకు నుత్తరసంప్రదాయ మని పేరు.

క్రీ. శ. ౪౫౦ లో బుద్ధఘోషుఁడను బౌద్ధాచార్యుఁడు బౌద్ధధర్మగ్రంథములకు భాష్యములు వ్రాసి మగధదేశము నుండి సింహళమునకును, నచ్చటినుండి బర్మాదేశమునకును బోయి యచ్చటివారిని బౌద్ధులుగా మార్చెను. ఏడవశతాబ్దమునందు, సయాం, జావా, సుమత్రాదేశములం దీమతము వ్యాపించెను. ఈ దేశములలోని బౌద్ధధర్మమునకు దక్షిణ సంప్రదాయ మని పేరు.

## బౌద్ధధర్మసిద్ధాంతములు.

(i) ధర్మతత్వములు.—ఈశ్వరుఁడు, జీవుఁడు వీరికిఁగల సంబంధము మొదలయిన విషయము లతీంద్రియములు; అవా జ్ఞానసగోచరములు. అవి యజ్ఞేయములు. అనఁగా నవి యున్నవనిగాని, లేవనిగాని తెలిసికొనుటకు వీలులేదు. కావున

నిట్టి విషయములనుగుఱించి విచారించుట యనావశ్యకము. ప్రత్యక్షానుమానములే ప్రమాణములు; వేదాదిశబ్దములు ప్రమాణములు కావు. ఈసృష్టినిగుఱించి వీరి ముఖ్యసిద్ధాంతములు నాలుగు. వీనిని బౌద్ధపరిభాషలో "భావన" లనియెదరు. అవి యేవియన: ౧. "సర్వం దుఃఖం దుఃఖమ్" అనఁగా సంసారమంతయు దుఃఖమయమని యర్థము. ౨. "సర్వం క్షణికం క్షణికమ్" అనఁగాఁ బ్రతిపదార్థము క్షణకాలముమాత్రమే యుండును. రెండవక్షణమున నుండదు. ఆత్మ యనునది యొక స్వతంత్రద్రవ్యము కాదు. విజ్ఞానము, వేదనసంజ్ఞ, సంస్కారము, రూపము అను పంచస్కంధముల పరిణామము. ఇప్పు డాలోచించు నాత్మ యింకొకక్షణమున నుండదు. క్రొత్తది వచ్చును. ముఖ్యముగా నిది విజ్ఞానమయము. పూర్వవిజ్ఞాన ముత్తరవిజ్ఞానమును అవలంబించి తాను అంతరించును. ఇట్లు విజ్ఞానధార యెప్పుడును ప్రవహించుచుండు. అనఁగా నిది యొక నదివంటిది. ఎప్పటికప్పటికిఁ గ్రొత్తనీరు వచ్చుచుఁ బ్రాఁతనీరు పోవుచున్నప్పటికి నదిమాత్ర మొక్కపేరటనే పరఁగుచుండునటు లాత్మయొక్కటియే యని చెప్పుట వ్యావహారికము. ౩. "సర్వం స్వలక్షణం స్వలక్షణమ్" అనఁగా సృష్టిలోని యొకవస్తువుతో నింకొకదానిని బోల్చుటకు వీలు లేదు. ఈవస్తు వావస్తువువలె నున్నదనుట తప్పు. కావున నేవస్తువులక్షణము దానికి చెల్లు. ఇతరవస్తువునకుఁ జెల్లదు. ౪ "సర్వం శూన్యం శూన్యమ్" అనఁగా నంతయు సున్నయని యర్థము. ఈచతుర్విధ భావనల యథార్థజ్ఞానమువలన ముక్తి

కలుగును. "సర్వం శూన్యం" అను భావనయొక్క యర్థమును గురించి బౌద్ధులలో నాలుగు శాఖాభేదములు గలిగె. మాధ్యమికు లనువారు సర్వశూన్యత్వము నొప్పిరి. యోగాచారు లను బౌద్ధులు బాహ్యశూన్యత్వమును మాత్రి మంగీకరించిరి. విజ్ఞానము సత్యమే యని వారి యభిప్రాయము. సౌత్రాంతిక లనువారు బాహ్యార్థములు కేవల మనుమేయములు; ప్రత్యక్షములు కావనిరి. వైభాషికులు బాహ్యార్థములే ప్రత్యక్షము లనియు, విజ్ఞానమే యనుమేయ మనియు గ్రహించిరి. బౌద్ధసిద్ధాంతమునఁ గర్మమాహాత్మ్య మెక్కువ. ఇచ్చటఁ గర్మ యన యజ్ఞయాగాదిక వైదిక కర్మ కాదు. మానవుఁడు చేయు ప్రతిపనియుఁ గర్మ యనియే యర్థము. చేసిన చెడుపనికిని మంచిపనికిని బ్రతిఫల మనుభవించి తీర వలయును. తప్పించుకొనుట యెవరికిని నశక్యము. కావునఁ జెడ్డపనిచేయకయే యుండవలయును. చేసినయెడల దానిఫల మనుభవింపక తప్పదు. దేవునికిఁగోర్కెరకాయ కొట్టిన లాభము లేదు. మంచిచెడ్డపనుల ఫలము లనుభవించుటకుఁ బున ర్జన్మంబుల నెత్తుచుండవలయును. కాని జన్మరాహిత్యముం గోరు వారు కర్మసన్న్యాసముఁ బుచ్చుకొనవలయును.

(ii) నీతిబోధ:—తత్త్వవిచారము జనసామాన్యమునకుఁ దెలియదు. కావున బుద్ధుఁడు నీతివర్తనమే యందఱకు ముఖ్య మని శాసించెను. పరిశుద్ధాలోచన, పరిశుద్ధవాక్కు, పరిశుద్ధా చరణయు నిర్వాణమునకు ముఖ్యసాధనములు. పరోపకారము,

భూతదయ ధర్మముయొక్క ముఖ్యాంగములు. ఇవియందఱకు సాధ్యములు. బ్రాహ్మణునికి నాధిక్యము లేదు; శూద్రునికి నీచతలేదు. సత్ప్రవర్తనగలవా రెవరయినను బూజ్యులే. ఇట్లం దఱకు సాధ్యమైనట్టియు నందఱకుఁ దెలియునట్టియు నీతి తత్త్వములను బోధించినందున నీ ధర్మము బహుశీఘ్రకాలము లోనే నానాదేశములు వ్యాపించెను.

## అప్పటి రాజ్యములు.

ఇట్లు బౌద్ధకాలంబునఁ బ్రబలిన నూతన ధర్మము యొక్క చరిత్ర కనుగొనిన పిదప నాకాలమందుఁ బ్రసిద్ధి కెక్కిన రాజ్యములను గుఱించియు, రాజకీయవ్యవహారములను గుఱించియు విచారింతము. బౌద్ధగ్రంథముల వెదకిచూచిన యెడల నాకాలమందు నుత్తరహిందూదేశంబున, ౧. అంగ ౨. మగధ, ౩. కాశి, ౪. కోసల, ౫. వంశ, ౬. కురు, ౭. పాంచాల, ౮. మత్స్య, ౯. శూరసేన, ౧౦. అస్సకా (అశ్వక) ౧౧. అవంతి, ౧౨ గాంధార, ౧౩. కాంభోజములను నీ పదుమూఁడు రాజ్యములు బుద్ధునకుఁ బూర్వము కొంతకాలమును దరువాత కొంతికాలమును బ్రసిద్ధి వహించినట్లు కానవచ్చెడిని. ఇవిగాక యొక్కరాజుచేఁ బరిపాలింపఁబడక పెక్కు క్షత్రియనాయకులచే నేలఁబడు నాయకసత్తాకరాజ్యములు కొన్నియుండెను. అందు ౧౪. శాక్య, ౧౫. మల్ల, ౧౬. వజ్జియను నాయకదేశంబులు ముఖ్యమైనవి. ఈ రాజ్యములన్నిటిని గుఱించి కొంచె మిచ్చట వ్రాసెదము.

౧. అంగరాజ్యము:—ఇది మగధదేశమునకుఁ బూర్వమున నుండెను. చంపానగరము దీనికి రాజధాని. ప్రస్తుతము భాగల్పూరు అనఁబడుపట్టణమునొద్ద చంపానగర ముండెను. బుద్ధుని కాలమందు నీరాజ్యము మగధదేశమునకు లోఁబడియుండెను.

౨. మగధరాజ్యము:—ప్రస్తుతము బెహారనఁబడు దేశము పూర్వపు మగధ మని చదువరులకుఁ దెలిసియే యున్నది. బౌద్ధకాలమందు మొదట నీ రాజ్యమునకు నుత్తరమున గంగానదియు, దక్షిణమున వింధ్యమును, దూర్పున చంపానదియు, బశ్చిమమున శోణనదమును ఎల్లలుగానుండినట్లు గానవచ్చెడిని. బుద్ధునికాలమందు నీరాజ్య మంగరాజ్యముతోఁ గలిసి రెండువేల మూఁడువందల మైళ్లు చుట్టుకొలతకలదియు నెనిమిదివేల గ్రామములు గలదియునై యుండె.

అప్పటి యన్నిరాజ్యములలోను మగధరాజ్యము గొప్పదియై సార్వభౌమత్వమును గలిగియుండెను. మహాభారత యుద్ధకాలమునుండి క్రీ. పూ. ఏడవ శతాబ్దమువఱకును నిందు నిరువదియేడుగురు రాజులు రాజ్యము చేసిరి. ఏడవ శతాబ్దంబున శిశునాగుఁ డనువాఁ డీరాజ్యమును గెలిచెను. ఈవంశమునందు నైదవవాఁ డగు బింబిసారుఁ డనురాజు రాజ్యముచేయుచుండఁ గనే గౌతమబుద్ధుఁడు తనధర్మమును లోకులకు బోధించి యితనికిని దీక్ష యొసంగెను. ఈతఁడు శాంతస్వభావము గల రాజు. ఇతనికుమారుఁడగు అజాతశత్రుఁడితనిఁజంపించి రాజయ్యె. ఈ యజాతశత్రుఁడు మొదట దేవదత్తుఁ డనువాని

దుర్బోధలచే దుర్మార్గవర్తనుఁడై, తరువాత పశ్చాత్తాపము కలవాఁడై బౌద్ధదీక్షను గ్రహించెనఁట! బుద్ధుఁడు నిర్వాణము జెందిన సంవత్సరముననే (క్రీ. పూ. ౫౪౪లో) రాజగృహము నొద్ద జరిగిన ప్రథమబౌద్ధాచార్య పరిషత్తు నిమిత్తమై యీ రాజు సప్తపర్ణిగుహాలోఁ గొప్పమండపముఁ గట్టించె నఁట!

ఈ యజాతశత్రువునకును గోసలదేశపు రాజునకును జరిగిన యుద్ధమువిషయమై యొకవింతకథ కలదు. అప్పటి కోసలాధీశ్వరుని పేరు పసేనది (ప్రసేనధి). ఈతని యక్కయగు కోసలాదేవి బింబసారుని భార్య; అనఁగా అజాతశత్రునకు సవతితల్లి. తన సవతికొమారుఁడగు నజాతశత్రుఁడు తన భర్తను జంపఁగాఁ గోసలాదేవి యా దుఃఖముతో మరణమందెను. కోసలరాజులు కాశీరాజ్యములోని కొన్నిగ్రామములు కోసలాదేవికి సరణమిచ్చియుండిరి. ఆమె పోఁగానే యా గ్రామములు గోసలరాజయిన పసేనదిచే నాక్రమింపఁబడెను. అందుపై ముసలివాఁడగు పసేనదికిని నతని సవతిమేనల్లుఁడగు నజాతశత్రువునకును యుద్ధము ప్రారంభమాయెను. మొదట నజాతశత్రునకుఁ గొంచెము జయము కలిగెఁగాని నాల్గవసారి అతఁడు దాడివెడలినప్పుడు పసేనదిచేఁ జెఱఁబెట్టఁబడెను. కాశీదేశపు గ్రామములపై నజాతశత్రునకు నేమియు హక్కు లేదని యనిపించుకొని యాతనిని గోసలేశ్వరుఁడు విడిచిపెట్టెను. కాని చెఱలోనున్న కాలమందు నాతనికిని గోసలేశ్వరుని కూఁతునకును ప్రేమ యంకురించినందునఁ గోసలేశ్వరుఁడు తన కూఁతురగు వజిరా (వజ్రా) దేవిని అజాతశత్రు

వున కిచ్చి వివాహముచేసి వివాదగ్రామము శేయామె కరణ మిచ్చెను.

అజాతశత్రుని తరువాత నలుగురురాజులతో నీ వంశ మంతరించె. అటుమీఁద నందుఁడును అతని పుత్త్రి లెనమండు గురును రాజ్యముచేసిరి. ఈవంశములోని కడపటిరాజును సంహరించి చంద్రగుప్తుఁడను రాజు మగధాధీశ్వరుఁ డయ్యెను. ఈతనినిగుఱించి ముందు మౌర్యవంశమును వర్ణించునపుడు విశేషముగా వ్రాయఁబడును.

౩. కాశీ రాజ్యము.—ఈ రాజ్యము పూర్వముస్వతంత్రముగా నున్నను బుద్ధునికాలమందు కోసలరాజ్యములోఁ గలిసియుండెను. దీని చుట్టుకొలత రెండువేలమైళ్ళుండెను.

౪. కోసల రాజ్యము.—త్రేతాయుగమునుండి విఖ్యాతిఁగాంచిన యీరాజ్యమునకు బుద్ధకాలమున సావత్తి (శ్రావస్తి) యను పట్టణము రాజధానిగ నుండె. గోరఖ్ పురమునకు వాయవ్యమున డెబ్బదిమైళ్ళమీఁద నీ పట్టణముండెనఁట! ఈ రాజ్యమునకు దక్షిణపశ్చిమముల గంగానదియుఁ దూర్పున గండకినదియు, నుత్తరమున హిమవత్పర్వతమును ఎల్లలు. బుద్ధుని కాలమున నీరాజ్యము మిక్కిలి ప్రబలి మగధరాజ్యమునకుఁ బ్రబలప్రతిస్పర్థి యయ్యె. అంతకుఁబూర్వము మగధములోఁ జేరిన కాశీపట్టణమును బట్టుకొనుటకు, దబ్బసేన (దర్భసేన) కంసు లను కోసలరాజులు మగధరాజులతో యుద్ధముచేసిరి. కంసుఁడనువాఁడు తుదకు దానిని స్వాధీనపఱుచుకొనెను. ఇది బుద్ధజన్మమునకుఁ బూర్వము జరిగిన వృత్తాంతము.

బుద్ధునికి సమకాలీనుఁ డగు సి దేశపురాజు పసేనది. (ప్రసన్నజిత్) యనువాఁడు. ఈతనికిని మగధాధీశ్వరుఁ డగు నజాతశత్రునకును జరిగిన యుద్ధసమాచారము పైని వ్రాసియున్నారము. ఈతఁడు తక్షశిలానగరమందలి పాఠశాలయందు విద్యలన్నిటిని సంపాదించిన విద్వాంసుఁడు. విద్వాంసులకును తత్త్వవేత్తలకును నాశ్రయదాత. సత్సహవాసమునందే యాతనికి నెక్కువ శ్రద్ధయుండెను. అన్ని మతముల యాచార్యులకును నాశ్రయదాతయై విద్యాగోష్ఠితోఁ గాలముఁ గడుపుచుండెను. ఈతఁడు బుద్ధునిబోధవలన బుద్ధధర్మమునందు నధికశ్రద్ధ గలవాఁ డయ్యె. ఈతని మేనత్తయగు మహాకోసలాదేవి బుద్ధభిక్షుని యయ్యెను.

బుద్ధుని వంశముతో సంబంధము చేయవలయునని యిచ్ఛగలవాఁడయి యీ రాజు తన కొకపిల్ల నిమ్మని శాక్యవంశజుల నడిగెనఁట! కాని కోసలాధీశ్వరునికంటె దాము శ్రేష్ఠమైన వంశపువార మని తలంచి, శాక్యులు తమ బిడ్డ నియ్యక తమ దాసీపుత్రికను దమ పుత్రికయనియే పంపిరి. ఈ దంపతులకు విదూతభుఁడు పుట్టె. ఈతఁడు రాజ్యము చేయునప్పుడు శాక్యులుచేసిన పై మోసము వెల్లడియయ్యెను. అందుపై రాజునకు మిక్కిలి కోపమువచ్చి యాతఁడు శాక్యులపై దండెత్తి వెళ్ళి వారిలో ననేకుల సంహరించెను. ఇది బుద్ధుని మరణానంతరము కొలఁదికాలములో జరిగిన సమాచారము.

౫. వంశరాజ్యము.—ఇది యావంతి కుత్తరమున యమునానదియొడ్డున నుండెను. దీనిరాజధాని కౌశాంబిపట్ట

ణాము. బుద్ధునకుం బూర్వ మచ్చటఁ బరంతపుఁ డను రాజు రాజ్యముచేసెను. అతని కుమారుఁడగు ఉదయనుఁడు బుద్ధుని కాలమం దచ్చట రాజుగానుండి యుజ్జయిని రాజధానిగా గలఁ యవంతి రాజ్యమునకు నేలికయగు ప్రద్యోతు (ప్రద్యోతు)ని కొమార్తెను వివాహమాడెను. ఆ కథ యొంతయు వింతగ నున్నది.

అవంతిరాజగు ప్రద్యోతుఁడు తనకంటె నధికు లెవరైన నున్నారా యని యడుగఁగాఁ గౌశాంబీరాజగు ఉదయనుఁడు వైభవమునందు మీకంటె నధికుఁడని యొద్దనుండువారు చెప్పిరి. అందుపై నాతని గెలువవలయునని ప్రద్యోతునికిఁ గోర్కెపుట్టె. కాని బహిరంగముగా యుద్ధము చేసినయెడల నుదయనుఁడు తనకు వశుఁడుగాఁడని తలఁచి యొక మోసము పన్నెను. కఱ్ఱతో మాయాగజమును జేయించి యందు శస్త్రధరులగు భటులను వుంచి యద్దాని నరణ్యంబున నిలిపెను. ఏనుఁగులను వేటాడు వ్యసనముగల యుదయనుఁ డొంటిగా నా యేనుఁగును వేటాడ వెళ్ళినప్పుడు లోనిభటులు నాతనిఁ జెఱబెట్టిరి. ఉదయనుఁడు గజహృదయ మను శాస్త్రమును నేర్చినవాఁడుగాన నా శాస్త్రము తనకుఁ జెప్పిన విన్న వదలి వేయుదునని ప్రద్యోతుఁ డుదయనునికిఁ జెప్పె. ఆచార్యులకు జేయు విధిప్రకారము వందనము లాచరించి శిష్యత్వముఁ జేసిన నేర్పెదనని యుదయనుఁడు బదులు చెప్పెను. వందన మాచరించుటకుఁ బ్రద్యోతుఁడు సమ్మతింపఁడయ్యె. కాని యాతఁ డావిద్యను నేర్చుకొనుటకై తన కొమార్తెను నియమించెను.

ఆమె గూనిగల యొక క్షుద్రస్త్రీ యని యుదయనునికిని, ఉదయనుఁడు మఱుఁగుజ్జువాఁడని యామెకును జెప్పి తెర వెనుక నుండి యామె పఠనముచేసి విద్య నభ్యసించునట్లు ఏర్పాటు చేసెను. కాని యామె తిన్నఁగా నభ్యసింపనందున నొకనాఁడు కోపమువచ్చి గురువులవారు 'గూనిపోరీ' యని సంబోధించిరి. 'అశ్లీల యనియెదవు మఱుఁగుజ్జువాఁడా' యని యామె మాఱుపలికెను. అందుపై నిద్దఱకును ప్రద్యోతరాజుచేసిన మోసము తెలిసి, వా రొకరినొకరు చూచుకొని పరస్పరానురాగబద్ధులయిరి. అచ్చటనుండి వెడలుట కొక యుక్తిపన్నిరి. పెద్ద యేనుఁగుపై నెక్కి రాత్రి యొకానొక మూలికఁ గోసినఁగాని విద్య ఫలింపదని చెప్పి యామె తనతండ్రియొక్క భద్రగజమును దీసికొనియెను. బంగారునాణెముల సంచులు కొన్ని తీసికొని యామెయు నుదయనుఁడును గజముపై నెక్కి కౌశాంబికి బయలుదేఱిరి. కొంత సేపటికి నీ మోసము తెలిసికొని ప్రద్యోతుఁడు వారిని బట్టుకొని వచ్చుటకుఁ గొందఱను బంపెను. కాని యుదయనుఁడు వెంట దీసికొనిన సంచులలో నొక్క సంచిలోని మాడల వారియెదుట వెదచల్లెను. వా రవి యేరుకొనుచుండఁగా దంపతులు ముందఱికి దాఁటిరి. భటులు మాడ లేరుకొని వెంబడింపఁగా మరల నొకసంచి పాఱవైచిరి. ఇట్లు వారు కౌశాంబికిఁ జేరి యామె యుదయనునకుఁ బట్టమహిషి యయ్యెను. ఈమె పేరు వాసవదత్త.

౬. కురురాజ్యము.—ఇది సూత్రకాలమునందు మిక్కిలి విఖ్యాతిఁ జెందియుండె. కాని యీకాలమునందు దాని కంతగా

విఖ్యాతిలేక యుండెను. ఈ కాలమునందు దానికి నింద్రప్రస్థము రాజధాని. ఇది ఢిల్లీపట్టణమునకు సమీపమం దుండెను. దీనికిఁ దూర్పునఁ బాంచాలదేశమును, దక్షిణమున మత్స్యదేశమును నుండెను. దీని చుట్టుకొలత రెండువేలమైళ్ళు. బుద్ధుఁ డీ కురుదేశమున ననేక బోధలు చేసెను. ఆ బోధలే ధర్మగ్రంథములయ్యె. ఈదేశమునకు అప్పటిరాజు రటపాలుడు (రాష్ట్రపాలుడు).

౭. పాంచాలరాజ్యము—కురుదేశమునకు దక్షిణమున రెండు పాంచాలరాజ్యము లుండెను. తూర్పున గంగానదియుఁ, బశ్చిమమున ఆరావలిపర్వతములును, నీపాంచాలములకు నెల్లలు. కాంపిల్య, కనోజ్ అను పట్టణములు వీనికి రాజధానులు.

౮. మచ్చ (మత్స్య) రాజ్యము.—ఇది కురుదేశమునకు దక్షిణమునను, యమునకుఁ బశ్చిమమునను నుండెను. దక్షిణ పాంచాలమునకును దీనికిని యమునానది మధ్య నుండును.

౯. శూరసేనరాజ్యము.— మత్స్యదేశమునకు నిది నైరృతదిశ నుండెను. దీనికి రాజధాని మధురానగరము.

౧౦. అస్సికా (అశ్వక) రాజ్యము.—ఈ దేశము పేరు బుద్ధగ్రంథములలో నుండుటయేకాని యిది యీదేశమని విద్వాంసులు నిశ్చయింపలేదు. బుద్ధునికాలమున గోదావరి యొద్దున నశ్వకు లుండిరి. "పాటలి" అనునది వారిరాజధాని.

౧౧. అవంతిరాజ్యము.—దీనికి రాజధాని ఉజ్జయిని. ఈరాజ్యమునకే తరువాత మాళవదేశ మను పేరుగలిగెను.

ఆకాలమందు దిచ్చట ప్రద్యోతుఁడు రాజ్యము చేయుచుండెను. ఈతఁడు భయంకరుఁడగుటచేనీతని చండప్రద్యోతుఁడనుచుండిరి.

౧౨. గాంధారరాజ్యము.—ప్రస్తుత కందహారునకుఁ బూర్వము గాంధారమని పేరు. ఈదేశమందు అఫ్గానిస్థానములోని దూర్పుభాగమును, పంజాబులోని వాయవ్యభాగంబును నిమిడియుండెను. దీనికితక్షశిలానగరము రాజధాని. దీనినే ప్రాకృతములో "తక్కసిలా" అనియు, గ్రీక్ దేశము వారు ట్యాక్సిలా (Taxila) అనియు వ్రాయుదురు. బుద్ధునికి సమకాలీనుఁడగు నీదేశపురాజుపేరు పుక్కుసాతి. ఈతఁడు బింబసారుని యొద్దకు రాయబారులఁ బంపెనఁట!

౧౩. కాంభోజరాజ్యము—ఇది ద్వారక రాజధానిగాఁ గల రాజ్యము.

౧౪. శాక్య నాయకులు—కపిలవస్తు నగరము రాజధానిగా ఈ నాయకులు రాజ్యము చేయుచుండిరి. బుద్ధునితండ్రియగు శుద్ధోదనుఁ డీనాయకులలోనివాఁడు. శాక్యవంశమునందెన్ని కుటుంబములుండెనో యందఱు నాయకులు కలిసి రాజ్యము చేయుచుండిరి. కపిలవస్తు పట్టణములోనుంబోలె నితరగ్రామములలోను బల్లెలలోను గ్రామములలోని మహాజనులే యచ్చటి వ్యవహారములఁ జూచుకొనుచుండిరి. కపిలవస్తుపురంబున శాంతాగార మను నొక్కభవన ముండెను. అచ్చట నాయకులందఱును గలిసి రాజ్యసంబంధమైన వ్యవహారములఁ జేయుచుండిరి. ఈ నాయకులలో నొక్కని సగ్రాసనాధిపతిగా

నియమించుచుండిరి. ఈతఁడు 'రాజు' అను బిరుదువహించుచుండెను. బుద్ధుని తండ్రియు, నతని జ్ఞాతియు నగు భద్దియుఁడనువాఁడును 'రాజ' శబ్దము ధరించినట్లు గానవచ్చెడిని. బుద్ధుఁడు న్యగ్రోధారామమందున్నప్పుడు కపిలవస్తు నగరఁబున నింకొక శాంతాగారము కట్టిరి. అందు నన్నిమతముల భిక్షువు లుండ వీలుచేసిరి. ఈ శాంతాగారముయొక్క గృహప్రవేశోత్సవము గౌతమబుద్ధుని యాధిపత్యముక్రిందనే జరిగెను. అందు బుద్ధుఁడును నతని విఖ్యాత శిష్యులగు ఆనందుడును మొగ్గల్లన యను నతఁడును ప్రథమమున రాత్రిసమయములందు ధర్మోపన్యాసఁబు లిచ్చిరి. ఆ బోధలన్నియు బౌద్ధులు తమ ధర్మగ్రంథములలో సంగ్రహించియున్నారు.

ఇప్పటి పోలీసువారివలె నప్పుడు రాజులయొద్ద భటులుండిరి. వీరందఱును నొక్కరీతి విచిత్రమైన దుస్తులను ధరించుచుండిరి. లోకులను నన్యాయముగా బాధపెట్టి వారియొద్ద నుండి లంచములు లాఁగుదురని వీరిపై నపవాద కలిగెను. ఈ శాక్యులు కోసలరాజుచేఁ జంపఁబడిరని ఇదివఱకే వ్రాసియున్నారము.

౧౫. మల్లనాయకులు.—వీరును శాక్యులవలెనే యందఱు కలిసి ప్రభుత్వము చేయుచుండిరి. కుశీనర యను పట్టణము వీరికి రాజధాని. చీనా బాటసారుల వ్రాఁతలు చూడఁగా శాక్యనాయకులు దేశమునకుఁ దూర్పునను వజ్జియనాయకుల దేశమునకు నుత్తరమునను బర్వతిపాంతమున

వీరి రాజ్య ముండినట్లు గానవచ్చెడిని. కాని కొందఱు దేశ మాహాత్మ్యాలకు దక్షిణముననూ, వజ్జ్యులకు దూర్పునను నుండె ననియెదరు.

౧౬. వజ్జియనాయకులు.—వీ రెనిమిదిగోత్రములవా రుండిరి. వారిలో "లిచ్ఛవి" అనువారును "విదేహు" లను వారును ముఖ్యులు. పూర్వము జనకుని రాజధాని యగు విదేహ రాజ్యము బౌద్ధకాలమందు నాయకుల సంఘముచేఁ బరిపాలింపఁబడు రాజ్యముగా మాఱుట చూడ వింతగా నున్నది. విదేహమునకు రాజధాని మిథిలానగరము. ఇది ప్రస్తుతము తిర్‌హూట్ జిల్లాలో నున్నది. దీని చుట్టుకొలత యాభ్యాఁ డేబది మైళ్ళుండెనఁట. "లిచ్ఛవి" నాయకుల రాజధాని "వైశాలి" పట్టణము. అచ్చటనుండిన నాయకులు, అప్పటి మగధరాజు లకును, తరువాతవచ్చిన మౌర్యులకును, గుప్తరాజులకును, ప్రస్తుతపు నేపాళ రాజులకును రక్తసంబంధులు. అప్పుడు స్వతంత్రముగానుండిన నాయక రాజ్యము లన్నింటిలో నిది మిక్కిలి గొప్పపట్టణమై యుండెను. ఈపట్టణ మెచ్చటనుండెనో నిశ్చయముగాఁ దెలియదుగాని, యిది తిర్‌హూట్‌జిల్లాలో గంగ కుత్తరమున నిరువదియైదు మైళ్ళుదూరమునను, రాజగృహము నుండి ముప్పదియెనిమిది మైళ్ళదూరమునను నుండెనని తెలియు చున్నది. దానికి నుత్తరమున 'మహావన' మను గొప్పయర ణ్యము హిమాలయమువఱకుఁ బ్రసరించియుండెను. ఈ యర ణ్యములో బుద్ధునికొఱకు నొక యాశ్రమము కట్టఁబడియె. అందు నాతఁ డెన్నియో ధర్మబోధ లొనరించెను. ఈ పట్టణ

మునకు సమీపమందె జైనమతాచార్యుఁడగు మహావీరుఁడు పుట్టెను. ఆ పట్టణమునందు ౭౭౦౭ రు క్షత్రియులును, దాని చుట్టు మూఁడు ప్రాకారంబులును నుండెనఁట.

ఈ వజ్జియనులు శాక్యులవలెనే శాంతాగారమునందుఁ జేరి రాజ్యవ్యవహారములను బరిష్కరించుచుండిరి. "న్యాయాధీశులు" "న్యాయవాదులు" "ధర్మశాస్త్రప్రవచనపాఠకులు" ఎనిమిదిగోత్రముల ప్రతినిధుల సభ, సైన్యాధిపతి, యువరాజు, రాజు, ఇంద ఱచ్చటి యధికారులు. వీ రందఱును అపరాధులకు శిక్షవిధించుటకు నధికారులయియుండిరి. నిరపరాధుఁడని తలఁపబడినవానిని వదలిపెట్టు నధికార మందఱకు నుండెను. కాని యిందొక రెవన్నైన నపరాధి యని శిక్ష విధించిరేని, యా తీర్పు పైవారికిఁ బంపి వారిసమ్మతిఁ గైకొనవలసియుండె. ఇట్లపరాధికి శిక్షవిధింపు చరమాధికారము రాజునం దుండెను.

అజాతశత్రుఁడు వైశాలిలోని క్షత్రియులలో నంతః కలహములు పుట్టించి యొక బ్రాహ్మణుని విశ్వాసఘాతమును సాయముగఁ దీసికొని యా క్షత్రియరాజుల నాశ మొందించెను.

ఇట్లప్పటి ముఖ్యరాజ్యములను వర్ణించి కొన్ని ముఖ్య పట్టణములను గుఱించి వ్రాసెదము.

తక్షశిలా.—ఈ పట్టణము గాంధార దేశమునకు రాజధానిగా నుండెనని కొందఱును, స్వతంత్రమైన చిన్న రాజ్యముగా నుండెనని కొందఱును వ్రాసియున్నారు. ఇచ్చటి జనులను తక్షు లనియెదరు. ఇట్టి జాతివారు ప్రస్తుతముకూడ తక్కలను

పేరట నున్నారఁట. తక్షశిలానగరము పంజాబుదేశములో రావల్ పిండి యను జిల్లాలో రావల్ పిండి పట్టణమునకు వాయ వ్యమునను, హాసన్ అబ్దుల్ అను మైదానమునకు నాగ్నేయ మునను నుండెను. ఇది బౌద్ధకాలములో మిక్కిలి గొప్పపట్టణ ముగను విఖ్యాతవిద్యాపీఠముగను నుండెను. అలెగ్జాండరు వచ్చినపుడు (క్రీ. పూ. ౩౨౭.) ఇచ్చట అంభి యను రాజు రాజ్యము చేయుచుండెను. తరువాతికాలమున నిది మౌర్యు లచే గెలువఁబడెను.

వారాణసి.—ప్రస్తుతము కాశీ, బనారస్ అనఁబడు పట్టణము మునుపటి కాశీదేశమునకు రాజధానిగ నుండెను. ఈ దేశ మున్నతదశయం దుండునప్పుడు పట్టణ మెనుబదిమైళ్ళు చుట్టుకొలత కలిగియుండె. అచ్చట నొక విశాలమైన సభా భవనముండెను. అందు రాజ్యసంబంధమైన చర్చలు జరుగు చుండెను. కాశీరాజ్యము కోసలరాజ్యములోఁ గలిసిన తరువాత బుద్ధునికాలమున నీ సభయందు ధర్మసంబంధమైన చర్చలు జరిగెను.

చంప.—అంగదేశమున కిది రాజధాని. ఇచ్చట నొక చక్కని కోనేలుండెను. అది గగ్గరా యను రాజ్ఞిచే నిర్మింపఁ బడినది. ఈ కోనేటికి సమీపమునఁ జంపకవనము గలదు. ఈవనము పేరునుబట్టియే యీ పట్టణమునకు "చంపా" యను నామము గలిగెను. ఈచంపకారణ్యములో బుద్ధునికాలమందు ధర్మోపదేశకులు బసచేయుచుండిరి.

కాంపిల్యపట్టణము.—దీనిని పాలిగ్రంథకారులు కాంపిల్ల అని వ్రాసిరి. ఇది యుత్తరపాంచాలదేశమునకు ముఖ్య పట్టణము.

కౌశాంబి.—'వత్స' లేక 'వంశ' అను పేరుగల దేశమున కిది రాజధాని. ఇది నదీమార్గమునఁ గాశికి రెండు వందల ముప్పదిమైళ్ళదూరమున యమునాతీరమున నుండెను. ఆకాలమునందు దక్షిణమునుండియుఁ బశ్చిమము నుండియు వచ్చి కోసల మగధదేశములకుఁ బోయెడి బాటసారులకును, వర్తకపు సరకులకును నిది కూడలితావు. బుద్ధుని జీవిత కాలములోనే యీ పట్టణము చుట్టుపట్లు "బదరిక" "కుక్కుట" "ఘోషిత" "ఆమ్రవన" అను పేళ్ళుగల నాలుగు బౌద్ధభిక్షువుల యాశ్రమము లేర్పడెను. బౌద్ధుల ముఖ్యధర్మగ్రంథములలోనున్న యనేకబోధలీయాశ్రమములోనే బుద్ధమునిచేఁ జెప్పఁబడినవి.

మధురానగరి.—ఇది శూరసేనదేశపు రాజధాని. బుద్ధుని కాలమందచ్చటనున్న రాజునకు "అవంతిపుత్తో" (అవంతిపుత్త్రుఁడు) అను పేరు గలిగియుండెను. అందువలన నాతఁ డుజ్జయినీరాజపుత్త్రిక కుమారుఁ డేమోయని యూహింప వలసియున్నది. బుద్ధుఁ డీ గ్రామమును నెన్నియోసారులు తన యాగమనముచేఁ బవిత్రముచేసెను. అతని ముఖ్యశిష్యులలో నొక్కఁడును, పాలిభాషకు వ్యాకరణము మొట్టమొదట రచించినవాఁడును నగు మహాకక్కాణుఁ డను వాని కీనగరమే నివాసస్థలమై యుండెను.

రాజగృహము.—ఇది మగధరాజధాని. దీనినే పాలీ గ్రంథకారులు 'రాజగహ' అనియెదరు. ఈ పేరుగల పట్టణములు రెండున్నట్లు గానవచ్చెడిని. ప్రాచీనపట్టణము పర్వతదుర్గమై గిరిబజ్జ (గిరివ్రజ) మను నామాంతరము గలిగి యుండెను. ఇది మహాగోవిందుడను శిల్పిచే గట్టబడియెనట! క్రొత్తపట్టణము పర్వతముక్రింద బుద్ధుని సమకాలీనుడగు బింబసారునిచే గట్టింపబడియె. ఇదియే నిజమైన "రాజగృహము." బుద్ధుని సమయమందును, తరువాత కొంతకాలము వఱకును నీ పట్టణము మిక్కిలి వైభవ మనుభవించెను. కాని శిశునాగుడను రాజచ్చటనుండి రాజధానిని వైశాలికి మార్చెను. అతని పుత్త్రుడగు కాలాశోకుడు దానిని పాటలీపుత్త్రమునకు మార్చెను. గిరివ్రజమునకు చుట్టుకొలత నాలుగున్నర మైళ్ళును, రాజగృహమునకు చుట్టుకొలత మూడు మైళ్ళును గిరివ్రజపు రాతిగోడలే ప్రస్తుతము మనకు దెలిసినంతవఱకు నేడు గానవచ్చెడి మిక్కిలి పురాతనపు శిల్పసంబంధమైన పనులు.

రోరుక:—దీనికి రోరువ అనియు పేరుకలదు. ఇది సౌవీరమునకు రాజధాని. ప్రస్తుతపు సూరత్ (Surat) పట్టణమిందులోనిదియే. ఇది సముద్రతీరమునందలి విఖ్యాత వర్తకస్థలముగా నుండెను. ఇచ్చటినుండి హిందూదేశములోని యన్నిరేవులకే గాక, సింహము, ప్యాలెస్టైన్ మొదలయిన దేశములకును సరకులు వెళ్లుచుండెను. ఇది ప్రస్తుతపు గల్ఫ్ఆఫ్

కచ్ఛవద్ద నుండెను. దీనిఖ్యాతి తగ్గినతరువాత భరుకచ్ఛ మనఁబడు భరోచ్ పట్టణమొక గొప్ప రేవయ్యెను.

శ్రావస్తి:—పాలిభాషలో దీనిని 'సావిత్థి' అనియెదరు. బౌద్ధకాలములో నిది యుత్తరకోసలమునకు రాజధానిగా నుండెను. ఇచ్చటనే పసేనదియనురాజు రాజ్యముచేసెను. బుద్ధుని గౌరవించిన మహాపట్టణములలో నిదియొక్కటి. ఇది యచిరావతియను నదియొడ్డున నుండెను. ఇది యెచ్చటనుండెనో మనకు నిశ్చయముగాఁ దెలియదుగాని సాకేతమున కుత్తరమున రమారమి పండ్రెండు మైళ్లమీఁదను, రాజగృహమునకు వాయవ్యమున మూఁడువందలపదియైదు మైళ్లమీఁదను నుండెనని బౌద్ధగ్రంథముల వలనఁ దెలియుచున్నది.

ఉజ్జయిని—దీనికి నవంతి రాజధాని. కక్కాణుఁడను బుద్ధుని ప్రియశిష్యుడును, అశోకమహారాజు కుమారుడు నగు మహేంద్రుఁడును నిచ్చటనే జన్మించిరి. మొదట నీదేశమునకు మాహిష్మతి రాజధానిగ నుండెను.

పైని వర్ణించిన పట్టణములుగాక అయోధ్య విదేహ రాజధాని యగు మిథిల, వైశాలి మొదలగు పట్టణంబులును ఆకాలమునఁ బ్రసిద్ధిఁ జెందియుండెను.

ఆకాలమున జనులు ప్రవాసముకొఱకును, వర్తకులు తమ సరకు లొకదేశమునుండి యొకదేశమునకుఁ దీసికొనిపోవు నిమిత్తమును హిందూదేశమందు త్రోవ లుండినట్లు గానవచ్చె డిని. ఆ త్రోవలు ప్రస్తుతపు రోడ్లవలె శ్రేష్ఠమైనవి కాకపోయి

నను ఆకాలంబున యూరోపులోనుండిన త్రోవలకంటె వేయి రెట్లు శ్రేష్ఠమైనవిగా నుండెను. అందు ముఖ్యమైనవి యీ క్రిందివి.

౧. ఉత్తరమునుండి నైర్ఋతి(దక్షిణపశ్చిమ)పు దోవ— ఈ త్రోవను శ్రావస్తినుండి పాటిథాన (ప్రతిష్ఠాన, పైఠణ్) పట్టణమునకుఁ బోవుచుండిరి. పైఠణ్ గోదావరియొడ్డున మహారాష్ట్రమునం దున్నది. ఈత్రోవమీఁద మాహిష్మతి, ఉజ్జయని గోనర్ధ, వేదిశ, కౌశాంబి, సాకేతము, శ్రావస్తి అను పట్టణములుండెను.

౨ ఉత్తరమునుండి యాగ్నేయమునకు(దక్షిణ పూర్వమునకు) త్రోవ—ఈత్రోవను జనులు శ్రావస్తినుండి రాజగృహమునకు బోవుచుండిరి. ఈత్రోవవెంట శ్రావస్తి, సేతవ్య, కపిలవస్తు, కుశీనర, పావా, హస్తిగ్రామము, భండగ్రామము వైశాలి, పాటలిపుత్త్రము (పాట్నా) నాలంద, రాజగృహము లనునవి మకాము చోటులయి యుండెను. ఈ త్రోవయే గయా వఱకుఁ బోయినటులు గానవచ్చెడిని.

౩ తూర్పునుండి పడమటి త్రోవ—గంగలో సహజాతి గ్రామమువఱకుఁ బశ్చిమమునను యమునలోఁ బశ్చిమమునఁ గౌశాంబివఱకును పడవలమీఁదఁ బ్రయాణము చేయుచుండిరి.

౪ పశ్చిమమునుండి తూర్పునకు త్రోవ— గంగానదిలో ఆనదీముఖమువఱకును అచ్చటినుండి సముద్రపుటొడ్డున బర్మాదేశమునకును వెళ్ళుచుండిరి.

మొట్టమొదట గంగానదీ మార్గమునఁ బైనుండి చంప వఱకే సరకులు వచ్చుచుండెను. అచ్చటినుండి కౌశాంబికిఁ బోయి పైవర్ణించిన మొదటిత్రోవను దక్షిణమునుండి వచ్చిన సరకులఁ గలసికొని యచ్చటినుండి నైరృత వాయువ్యదిక్కులకుఁ బైవర్ణించిన మార్గములఁ బోవుచుండెను.

ఈ మార్గములుగాక విదేహమునుండి గాంధారమువఱకును, మగధమునుండి సౌవీరమువఱకు, భరుకచ్ఛము(భరోచ్) నుండి పశ్చిమసముద్రమును తూర్పుసముద్రమునంటి సముద్రముమీఁద బర్మావఱకును వర్తకులు వెళ్లుచున్నటులు గానవచ్చెడిని. రాజపుత్రస్థానములోని యెడారిలోనుండి వెళ్లునపుడు వర్తకులు బాటచూపువాని వెంట నుంచుకొనుచుండిరి. బవేరు రనఁబడు బ్యాబిలోనునకుఁ గూడ సముద్రముమీఁద వెళ్లుచుండిరి.

## అలెగ్జాండరు దండయాత్ర.

అలెగ్జాండరను ఘనతవహించిన గ్రీసుదేశపురాజు క్రీ. పూ. ౩౨౭ లో హిందూదేశము జయించుటకై గొప్ప సైన్యముతో హిమాలయపర్వతపుఁగనుమల మార్గమున ఈదేశమునకు వచ్చెను. ఈతఁడు వీరాగ్రేసరుఁడు, మహాయోధుఁడు. భూమినంతను జయింపవలెనన్న తృష్ణచే, నెంతయో రాజ్యము కలవాఁడయ్యును, ఈ దేశముపై దండెత్తివచ్చి సింధునదమును దాఁటి తక్షశిలా (రావల్ పిండి) ప్రదేశమునందు విడిసెను. అప్పుడు పంజాబుదేశములో ననేకములైన చిన్నచిన్న రాజ్యము

లుండె. వారైకమత్యము లేక, యొకరితో నొకరు పోరాడుచుఁ బరస్పర మత్సరగ్రస్తులై పర దేశీయుఁడగు నలెగ్జాండరు నెదిరింపక యనేకు లతనికి సహాయులై తమకుఁ దామ విషము పోసికొనిరి. ఇట్లు స్వదేశాభిమానశూన్యులై కొందఱు నృపులు పరరాజునకుఁ దోడైనందున నతనికి విజయమే సంప్రాప్త మయ్యె. జేలం, చీనాబ్ నదులనడుమ పౌరవులను పౌరుష ప్రధానులగు రాజు లప్పుడు రాజ్యముచేయుచుండిరి. అప్పటి రాజుపేరు పురుషోత్తముఁడు. ఈతఁడు స్వాభిమానమును(Self-respect), స్వదేశాభిమానమును, స్వాతంత్ర్యాభిరుచియుఁ గల వాఁడగుటచే నన్యదేశీయుఁడును, హూణుఁడు నగు నలెగ్జాండరును జేలంనదియొద్ద తన చతురంగసేనతో నెదిరించెను. ప్రస్తుతము చిలియాన్‌వాలా యనఁబడు మైదానమునకుఁ బశ్చిమమునఁ బదునాల్గుమైళ్ళదూరమున నదియొద్దున ఘోరమైన పోరు గలిగె. ఇంటిగుట్టు లంకకుఁ జేటన్నట్టు లీయుద్ధములోఁ దక్షశిలారాజులు తమ స్వదేశస్థుఁ డగు పురుషోత్తమునికి సాహాయ్యముచేయుటకు మాఱుగా తమసైన్యముతో నలెగ్జాండరు పక్షమునఁ బోరిరి. అందువలనను, బురుషోత్తముని రథంబులు నదియొద్దున బురదలో దిగఁబడినందునను, అతని యేనుంగులు తిరుగఁబడి యాతనిసైన్యమునే నాశనము చేసినందునను అలెగ్జాండరు సైన్యములు పురుషోత్తముని సైన్యముకంటె నెక్కుడుగా నున్నందునను అతనికిఁ బరాభవము గలిగి యలెగ్జాండరునకే జయము గలిగెను.

౨౨౫౦-సంవత్సరముల క్రిందట నిట్లు హిందూదేశము మీఁదికి వచ్చిన యలెగ్జాండరు కాలమునుండియు నేఁటివఱకును మన హిందువు లైకమత్యము లేనివారై, సామర్థ్యముగలవారయ్యును బరస్పర ద్వేషములచే నాసామర్థ్యంబును వ్యర్థపుచ్చుకొనుచుఁ దమవారికి, న్యాయము చేయుటకు మాఱుగాఁ దమవారిని దామే గెలుచుచుఁ దుదకుఁ దాము నాశమొందుచుండిరి.

అలెగ్జాండరు పంజాబు దేశములోను, సింధు దేశములోను రెండు సంవత్సరములవఱకు నుండెను. ఇంతకాలములో నుత్తరపంజాబులోను, తక్షశిల (డేరిషహాన్), నికాయా (మూంగ్), దక్షిణపంజాబులోని అలెగ్జాండ్రియా (వుచ్), సింధు దేశములో పాటల (హైదరాబాద్), అను స్థలముల రాజులను దనకు నాశ్రితులఁ జేసికొనియె. తన సైన్యములోఁ గొంతభాగ మచ్చటచ్చట నుంచెను.

ఆతనికి హిందూదేశమంతియు జయింపవలయునను కోర్కియుండెను. కాని గంగానదియొడ్డున మిక్కిలి ప్రచండ సైన్య మున్నదని వినినందునను ఈ దేశపు వేఁడిమికిఁ దాళలే నందునను అతని సైన్యములు తిరుగఁబడియె. అందువలనను స్వదేశాభిమానులగు నీదేశములోని కొందఱు దొరలు తిరుగఁబడినందునను, సట్లజ్ నదినిగాని యమునానదినిగాని దాటకయే యాతఁడు తన సైన్యములతో క్రీ. పూ. ౩౨౫ లోఁ దిరిగి పోవలసినవాఁ డాయెను. ఈతఁడు క్రీ. పూ. ౩౨౩ లో మృతుఁడయ్యె. అప్పు డాతఁడు హిందూదేశములో సంపాదించిన రాజ్యము శెల్యూకస్ అనువానికి నిచ్చెను.

---

## మగధదేశము; మౌర్యవంశము.

### చంద్రగుప్తుఁడు (క్రీ. పూ. ౩౨౨-౨౯౮.)

పైని వర్ణించినట్లు పరదేశీయుఁడగు నలెగ్జాండరు హిందూదేశమునఁ గొంతరాజ్యము సంపాదించి, దాని రక్షణార్థమై కొందఱు సైనికుల నీదేశమందునుంచి, వెడలినతరువాత ఆ పరదేశీయులగు గ్రీకువారిని వెడలఁగొట్టి దేశముయొక్క దైన్యమును దొలఁగింపవలెనని యప్పటి కొందఱు దేశాభిమానులకుఁ దోఁచెను. అట్టివారిలో విశేషవిఖ్యాతిఁ జెందినవాఁడు చంద్రగుప్తుఁడు. ఈ శూరాగ్రేసరుఁ డప్పు డిరువది సంవత్సరములకంటె మించని వయస్సుకలవాఁడై యుండెను. ఈతఁడు మగధరాజునకును శూద్రస్త్రీకిని బుట్టినవాఁడని చెప్పెదరు. ఆతనిజన్మ మెట్టిదయినను ఆతనియందు శౌర్యము, స్వాభిమానము, స్వదేశాభిమానము అను సద్గుణములు నెలకొనియుండెను.

అప్పుడు మగధదేశములో మహాపద్మనందుఁడు రాజ్యముఁ జేయుచుండె. చంద్రగుప్తుఁడు ప్రబలి తన్ను పదభ్రష్టునిఁ జేయునేమో యని భయపడి నందుఁడు చంద్రగుప్తుని దన రాజ్యమునుండి వెడలఁగొట్టెను. ఇట్లితఁ డజ్ఞాతవాసమునం దున్నకాలమునందే యలెగ్జాండరు పంజాబుదేశమునకు వచ్చెను. చంద్రగుప్తుఁ డలెగ్జాండరును స్వయముగాఁ జూచెననియు వదంతి కలదు. కాని యప్పు డాతఁ డజ్ఞాతవాసమందును నేకాకిగానునున్నందున నేమియుఁ జేయలేకపోయెను. తరువాతఁ

గొన్నిదినముల కాతఁడు తిన్నతిన్నగా సైన్యముల సమకూర్పఁ జొచ్చె. వాయువ్యప్రాంతమందలి యుద్ధప్రియులగు భటులను జేర్చి యొక గొప్పసైన్యము సిద్ధపఱుచుకొని పంజాబుదేశము నుండి గ్రీకువారి నెల్ల వెడలఁగొట్టి పంజాబును స్వాధీనపఱుచు కొనియె (క్రీ. పూ. ౩౨౨). తరువాతఁ దన శత్రుఁడును దాయాదియు, దుష్ప్రవర్తనలవలన జనులకు నహితుఁడును నయిన మహాపద్మనందునిఁ దెగటార్చి చంద్రగుప్తుఁడు మగధ సింహాసనమును నాక్రమించి మౌర్యవంశమునకు మూలపురుషుఁడయ్యె. ఈతని తల్లిపేరు ముర గాన నిది మౌర్యవంశమయ్యె. నందుని నందవంశజులను అంతమొందించుటలో నితనికిఁ జాణక్యుఁడను బ్రాహ్మణుఁడు మిక్కిలి సహాయుఁడుగా నుండెను. ఈకథయంతయు ముద్రారాక్షస నాటకమునందుఁ జక్కఁగ వర్ణింపఁబడినది.

సైన్యము నభివృద్ధి పఱుచుట.

చంద్రగుప్తుఁ డిట్లు మగధరాజ్యమును సంపాదించి హిందూదేశమంతటను నేకచ్ఛత్రాధిపత్యముసంపాదింపఁదలఁచి తనసైన్యముల మిక్కిలి యభివృద్ధిచేసెను. ఆతనియొద్ద నాలుఁ లక్షల కాల్బలమును, ముప్పదివేల స్వారులును, తొమ్మిదివేల గజంబులును నుండెను. ఈ ప్రచండ సైన్యంబుతో నాతఁ డుత్తరహిందూదేశమందలి యన్నిరాజ్యములను గెలిచి నర్మదా హిమాలయములు దక్షిణోత్తరముల ఎల్లలుగను, బూర్వ పశ్చిమసముద్రంబు లాయాదిక్కుల ఎల్లలుగను గల యార్యావర్తంబున కంతటికిని ప్రథమచక్రవర్తి యయ్యెను.

### గ్రీకురాజు నోడించుట.

అటు వెడలఁగొట్టఁబడిన గ్రీసువారి యప్పటిరాజగు శెల్యూకస్ అనువాఁడు పోయిన పంజాబురాజ్యమును మరల గెలువవలెననెడి యిచ్ఛకలవాఁడయి క్రీ. పూ. ౩౦౫ లోఁ జంద్రగుప్తునిమీఁదికి దండెత్తివచ్చెను. చంద్రగుప్తుఁ డీతని నెదిరించి సంపూర్తిగా నోడించెను. ఇటు లీదేశపు స్వాతంత్ర్యంబు నపహరింపవచ్చిన గ్రీకురాజు, హిందూదేశపు సత్పుత్రుఁడగు చంద్రగుప్తునిచేఁ బరాజితుఁడయి యాతని శరణుఁ జొచ్చి తా నాసపడి వచ్చిన రాజ్యమును వదలుకొనుటయే కాక, సింధునదమునకుఁ బశ్చిమమున నున్న కాబూల్ రాజధానిగాఁగల "ప్యరోపనిసదాయి" (Parapanisadai), హీరట్ రాజధానిగాఁగల ఏరియా (Aria), కందహారు రాజధానిగాఁగల అరక్కోశియా, గడ్రోశియా (Godrosia) యను నీనాలుగు క్షేత్రపి (Satrapies) లనఁబడు రాజ్యములను, దన కొమార్తెను చంద్రగుప్తచక్రవర్తికి నిచ్చి యాతనితో సంధిచేసికొని బ్రతుకు జీవుఁడా యని వచ్చినమార్గముననే తిరిగివెళ్ళెను. (క్రీ. పూ. ౩౦౩.) ఇట్లు చంద్రగుప్తుని రాజ్యపు టుత్తరసీమ పోయి హిందూదేశపర్వతముల నంటుకొనియె. ఇట్లు మన దేశము సాధింపవచ్చిన యన్యదేశీయుల వెడలఁగొట్టి వారిదేశమునే స్వాధీనపఱుచుకొనిన చంద్రగుప్తుని గొనియాడఁ దగును.

పదునాఱు సంవత్సరములలో నింత విశాలరాజ్యము నిర్మించి దానిని మిక్కిలిజాగ్రత్తతోఁ గాపాడిన యీరాజును

భూమండలములో మిక్కిలి ఘనతవహించిన ఫిలిఫ్, అలెగ్జాండర్, హ్యానిబల్, నెపోలియన్ మొదలయిన శూరాగ్రేసరులలో నొక్కనిఁగా నెంచవలెనని యొకానొక పాశ్చాత్యుఁడు వ్రాసియున్నాఁడు.

## రాయబారి మెగస్థనీస్.

సంధిచేసికొనిన తరువాత శెల్యూకస్ అను రాజు, మెగస్థనీస్ అనువానిని పాటలీపుత్త్రమందే చంద్రగుప్తునియొద్ద రాయబారిగ నుండెను (క్రీ. శ. ౩౦౨). ఈ రాయబారి యప్పటి రాజ్యవ్యవస్థను గుఱించియు, దేశస్థితిని గుఱించియు వ్రాసియున్నాఁడు. క్రింది యంశము లాతని వ్రాఁతలవలననే మనకుఁ దెలిసెను.

## పాటలీ పుత్త్రము.

రాజధానియగు పాటలీపుత్త్రము గంగాశోణసంగమమువలనఁ గలిగిన యంతర్వేదిలో శోణకుత్తరమునఁ దొమ్మిదిమైళ్ల పొడవును రెండుమైళ్ళ వెడల్పును గలదియై యుండెను. దాని చుట్టును దారుప్రాకారఁబును, జలమయపరిఖయు (కందకము), అయిదువందల డెబ్బది బురుజులును, అఱువదినాల్గు ద్వారంబులును గలవు. చుట్టనున్న కందకము శోణనదముయొక్క యుదకముతో నింపఁబడుచుండెను. ఒక యుద్యానవనములో నచ్చటి రాజమందిర ముండెను. అయ్యది బంగారపు స్తంభములచేతను, వానిపైఁ జెక్కఁబడిన వెండితీఁగెలచేతను, బంగారపు పిచ్చుకలచేతను, రత్నమయ పుష్పములచేతను సుశోభి

తంబయు, పూర్వకాలమున విఖ్యాతిఁజెందిన సూసా, ఎగ్బటానా పట్టణములలోని రాజమందిరములను బరిహసించుచుండెను.

గ్రామరక్షక సంఘము (Municipal Corporation)

ఇట్టి రాజధానియు రాజమందిరంబును గాపాడుటకు ముప్పదుగురు ఉద్యోగస్థుల సంఘ మొకటి యేర్పఱుపఁబడియె. ఇది యిప్పటి మ్యునిసిపాలిటి యనవచ్చును. ఇందుండు ముప్పదిమందియు నాఱుపంచాయతులుగా విభజింపఁబడిరి. ఒక్కొక పంచాయతిలో నైదుగు రుద్యోగస్థు లుండిరి. అందు మొదటి పంచాయతివారు పట్టణములోని కలాకౌశల్యాభివృద్ధికి నుత్తరవాదు లయియుండిరి. అనఁగా నిప్పుడు మన దేశాభిమానులు కొందఱు చేయుచున్న స్వదేశోద్యమము వంటి యుద్యమ మీ యుద్యోగస్థు లప్పుడు చేయుచుండిరి. రెండవ పంచాయతివారు పాటలీపుత్రమునకు వచ్చెడి యన్యదేశీయులఁ గాపాడుచుండిరి. అన్యదేశీయులు రాజ్యము గుట్టు కనుఁగొనవచ్చిన మోసగాండ్రో లేక, నిజముగా నేదో యన్యకార్యముమీఁద వచ్చినవారో కనుఁగొనుట, అన్యకార్యము మీఁద వచ్చినవారిని గౌరవించుట, వారికి నేమియు నిబ్బంది లేకుండఁ గాపాడుట, వారికిఁ గావలయు భోజనపదార్థము లిప్పించుట, జబ్బుగ నున్నవారికి నౌషధము లొసంగుట, మృతిఁ జెందినవారికి నంత్యసంస్కారములు చేయించి వారి సొత్తేమైన నున్న యెడల వారి వారసులకుఁ బంపుట, వీరి పనులయి యుండెను. ఇందువలన నాకాలమందు ననేక పరదేశీయు లీదేశమునకు వచ్చుచుండిరనియుఁ జంద్రగుప్తునకు

ననేకపరరాజులు స్నేహితులుగ నుండిరనియుఁ గానవచ్చుచున్నది. మూఁడవ పంచాయతివారు గ్రామములోని జనన మరణముల లెక్కలను జూచుచుండిరి. రెండువేలేండ్లక్రిందఁ జంద్రగుప్తుఁడు ప్రజాక్షేమము తెలియుకొఱకును, పన్ను వేయుటకు వీలుగనుండుకొఱకును ఈ లెక్కల వ్రాయించుట చూడ నతని బుద్ధివైభవమునకు నెవ్వ రాశ్చర్యపడకుందురు? నాల్గవ పంచాయతీవారు వాణిజ్యాధికారము గలవారయి యుండిరి. తూనికలు కొలతలు తప్పువి కాకుండను, అమ్మెడు వస్తువులలో మోసము లేకుండను జూచుట వీరిపని. అయిదవ పంచాయతీవారు చేతిపనులమీఁది యధికారులు. వరు వర్తకులమ్మిన సరకుల మీఁదఁ బన్నులు పోగుచేయువారు. ఈ విడివిడిపనులు గాక వీరందఱును గ్రామములోని యితర వ్యవహారము లన్నిటిని జూచుచు, గుళ్లు, రేవులు, అంగళ్లు, మొదలయినవానిఁ గాపాడుచుండిరి.

ఇది పాటలీపుత్రరక్షణావిధము. ఇటులే యితరపురంబు లన్నియు రక్షింపఁబడుచుండెను.

## సైన్యవ్యవస్థ.

చంద్రగుప్తునియొద్దఁ గొప్పసైన్య ముండెనని యిదివరకే వ్రాసియున్నారము. అప్పుడు రాజునొద్ద నాఱులక్షల పదాతి సైన్యంబును, ముప్పదివేల కాల్బలమును, తొమ్మిదివేల యేనుంగులును, ఎనిమిదివేల రథంబులును ఉండెనని తెలియుచున్నది. కాల్బలములోని ప్రతిసైనికునియొద్దను ముఖ్యముగ

నొక క త్తియు విల్లమ్ములును నుండె. మనుష్యునంత పొడవుగల విల్లెక్కు పెట్టి బాణము విడిచిన నది యెట్టిపలక నైనను (Shield) ఎట్టి కవచము నైనను ఛేదించుచుండెను. అశ్వసైనికుఁడు రెండుబల్లెములును డాలును యుద్ధమునకుఁ గొంపోవుచుండె; రథము రెండు గుఱ్ఱములచేఁగాని నాల్గుగుఱ్ఱములచేఁగాని యీడ్వఁబడుచుండె. సారథికాక ప్రతిరథమువీఁదను ఇద్దఱు రథికులుండురు. అందుచే నెనిమిదివేల రథములనఁగా నిరువదినాలుగువేల భటులని యర్థము. ప్రతియేనుఁగుపై మావటివాఁడుగాక ముగ్గురు యుద్ధభటు లెక్కుచుండిరి. కాన తొమ్మిదివేల గజము లనఁగా ౩౬,౦౦౦ జనులని యర్థము. ఇట్లు వీరి నందఱను లెక్క వేయఁగా రమారమి యేడులక్షల జను లగుచున్నారు.

ఇంత గొప్పసైన్యమునందు వ్యవస్థ యేర్పఱిచి, యెవ్వరి పని వారు క్రమముగాఁ జేయుచుండుటఁగనుపెట్టి, యేక్షణము నందుఁ గావలయునని న నాక్షణమునందు సైన్యము యుద్ధమునకు సిద్ధముగా నుండునట్లు సూత్రములన్నియుఁ దనచేతిలో నుంచుకొనిన చంద్రగుప్తుని వ్యవస్థాప్రతిభను మన మెంతయుఁ గొనియాడ వలసియున్నది. సైన్యవ్యవస్థకై యీచక్రవర్తి ముప్పది యధికారుల సంఘ మేర్పఱిచి దానినిగూడ నాఱు పంచాయతులుగ విభజించె. మొదటివారు సముద్రసైన్యమునకు (Admiralty) రెండవవారురస్తుసామగ్రి (Commissariat) ప్రయాణప్రయత్నము (Transport) సైన్యమునకుఁ గావలసిన నఫరువాండ్రు, గడ్డికోయువారు మొదలగు క్షుద్రసేవకుల

సంపాదించుట మొదలగువానికిని, మూఁడవవారు కాల్బలము నకును, నాల్గవవా రశ్వసైన్యంబునకును, అయిదవవారు రథ సైన్యంబునకును, ఆఱవవా రేనుఁగు సిబ్బందికిని నధికారులయి యుండిరి.

## రాజ్యవ్యవస్థ.

దూరపు దేశములఁ బాలించుటకుఁ బ్రాంతాధికారు లంపఁబడుచుండిరి. వ్యవసాయము, కాలువలు, అరణ్యములు, మొదలగువానిని రక్షించుట, పన్నుల రాఁబట్టుట, బాటల నిర్మించుట, గ్రామాదులలోని కలాకౌశల్యములఁ, జేతిపనుల నభివృద్ధిచేయుట, యీ ప్రాంతాధికారుల కర్తవ్యములయి యుండె.

## వ్యవసాయాభివృద్ధి.

రాజ్యంబునందుఁ గాలువలు త్రవ్వించి, జలసమృద్ధి కలుగఁ జేసి ప్రజలవ్యవసాయము నభివృద్ధిసేయుట కీయుద్వోతీయ చక్రవర్తి మిగుల శ్రద్ధవహించెను. చెఱువులు వేయించి యానకట్టలు కట్టించి, కాలువలుత్రవ్వించి వానిలోనుండి పిల్ల కాలువలు తీయించి వానికిఁ దూములు పెట్టించి యందునుండి కొండఱకుమాత్రము నీరుపోయి కొందఱకు నీరుబోకుండు నేమో యని యీ తూములమీఁద నధికారుల నియమించి యందఱ భూములకును సరిపోవునట్లు నిష్పక్షపాతబుద్ధితో నీరు పంచి పెట్టుఁడని శాసించెను. ఈ విషయమునఁ దన రాజధానియొద్ద నున్న ప్రజల నెట్లుకాపాడెనో యట్లే దూరముననున్న వారిని

గూడ రక్షించుచుండె. పాటలీపుత్రమునకు వేయిమైళ్లమీఁద నున్న గిరనారులోఁగూడ నొకనదికి ఆనకట్టవేయించెను.

సస్యసమృద్ధి: కఱవులు లేకపోవుట.

పైనివర్ణించినట్లు దేశములోని వ్యవసాయము మిగుల శ్రద్ధతోఁగాపాడఁబడినందున 'భూములన్నియు సమరకమై, జలసమృద్ధి కలిగి సంవత్సరమునకు రెండుపంట లిచ్చుచుండె... అందువలననే హిందూదేశమునందుఁ గఱవులు లేవనియు జీవనాధారమగు నాహారము ప్రజలకందఱకు దొఱకుచుండె ననియుఁ జెప్పఁబడును.'

ప్రజలసత్యసంధత్వము.

అప్పటి జనసామాన్యమును గుఱించి మెగస్థనీ సిట్లు వ్రాసియున్నాఁడు. 'హిందూదేశస్థులు ఆహారవ్యవహారముల యందుఁ గించిత్తయినను డంబములేనివారును మితవ్యయులునై సుఖజీవనము చేయుచుందురు...వారి లౌకిక వ్యవహారంబులును వారిచట్టంబులును ఎక్కువ చిక్కులు కలిగినవి కావు. అందుచే వారు సాధారణముగా దివాణ మెక్కరు. అప్పులను గుఱించిగాని, కుదువపెట్టిన ధనమును గుఱించిగాని వారిలో నెన్నడును కలఁతలు కలుగవు. అందునుగుఱించి వారు రాజసభకుఁబోవు నిమిత్తముండదు. అప్పిచ్చుటకును బుచ్చుకొనుటకును వారికిఁ బత్త్రములతోను, ముద్రలతోను, సాక్షులతోను బనిలేదు. అవియేమియులేకయే యొకరినొకరు నమ్మి

యప్పిత్తురు. తమ యిండ్లను, సొత్తును వారు భయములేక విడిచి యుందురు. కావున దల చేయక పోయినను వానిని నెవ్వరును దొంగిలింపరు...సత్యమును సత్ప్రవర్తనయు వారికిఁ బరమైన వ్రతములు'.

వార్తలఁ దెలుపు చారులు.

తన రాజ్యమునందును, నితర రాజ్యములలోను జరుగు చున్న వృత్తాంతములు తెలుపుటకై యీరాజు సకలదేశంబు లందును దనచారుల (news-men) నియమించియుండెను. ఈ చారులు మిక్కిలి సూక్ష్మబుద్ధిగలవారుగను, చతురులుగను, సత్యప్రియులుగను ఉండిరి. వీరు పంపు వార్తలలో నెన్నఁడును నసత్యము వచ్చుట లేదనియు, అసత్యమనెడి ఘోరపాతక మును హిందువు లెవ్వరెఱుఁగరనియు ఏరియన్ (Arian) వ్రాసియున్నాఁడు.

రాజవినోదములు.

గొఱ్ఱెపొట్టేళ్లు, ఆఁబోతులు, ఏనుఁగులు, ఖడ్గమృగములు మొదలయిన పశువులపందెములు రాజునకు వినోదకరము లయియుండెను. ఒక్కొక్కబండికి నడుమ గుఱ్ఱము, దానికి రెండు వైపుల రెండెడ్లఁగట్టి వానిని బరుగెత్తించి పందెము లాడుచుం డిరి. వేఁటాడుట రాజునకు మిక్కిలి మోదకరమైయుండెను. మృగయావినోదార్థమై రాజు మిగుల డంబముతో నరణ్యము నకుఁ బోయి యెత్తగుస్థలమునందుఁగాని యేనుఁగుమీఁదఁగాని కూర్చుండి మృగముల సంహరించును. రాజుపోవుమెడి త్రోవ

యంతయు త్రాళ్లతోఁ గనఁబడుపఁబడును. ఆమార్గమున నితరు లెవ్వరును బోఁగూడదు. పోయిన మరణదండనకుఁ బాత్రులయ్యెడివారు. ఈ మృగయాకుఁ గాని యితరస్థలములకుఁ గాని వెళ్ళునపుడు రాజుల వెంట యౌవనస్త్రీలు వచ్చుచుండిరి. అప్పటి రాజులు గ్రీస్, బ్యాక్ట్రియా మొదలయిన దేశములనుండి యౌవన స్త్రీలను గొని తెచ్చి, తమకు నంగరక్షికలఁగా నుంచుకొనుచుండినట్లు గానవచ్చుచున్నది. శాకుంతలనాటకములో దుష్యంతుని వెంట యవనకన్యక లున్నట్లు వర్ణింపఁబడియున్నది. కొన్ని ప్రతులలో వీరు కిరాతకన్యలని యున్నది. చంద్రగుప్తుని వెంట "శోణోత్తరా" యను యవనస్త్రీ యున్నట్లు ముద్రారాక్షస నాటకంబునం దున్నది.

రాజు సాధారణముగా స్త్రీభటులచే రక్షితంబయిన యంతఃపురమునందు నివసించుచుండెను. నందాదులను జంపి రాజ్యమునకు వచ్చినవాఁడుగాన వారిస్నేహితు లనేకులు చంద్రగుప్తునిఁ జంప నెన్నియో మాయోపాయంబులు పన్నుచుండిరి. అందువలన నాత్మరక్షణమునకై రాజు నేఁడు శయనించిన మందిరమున రేపు శయనింపకయుండెు. ప్రతిదినము సభాభవనమునకు నొక్కసారివచ్చి, స్వయముగాఁ బ్రజల విన్నపములు వినుచుండెను.

క్రీ. పూ. ౨౯౭ లో నీమహాచక్రవర్తియగు చంద్రగుప్తుఁడు మృతినొందెను.

## బిందుసారుఁడు.

(క్రీ. పూ. ౨౯౮-౨౭౨.)

చంద్రగుప్తుఁడు కాలధర్మము నొందఁగా నాతనికుమారుఁడగు బిందుసారుఁడు రాజయ్యె. ఈతఁ డిరువదియైదు సంవత్సరములు రాజ్యముచేసి, నర్మదకు దక్షిణమునఁ గృష్ణానదివఱకు నుండిన యనేక రాజ్యముల గెలిచి "అమిత్రఘాతుఁ" డను బిరుదు వహించెను.

ఈతని రాజ్యకాలములో గ్రీకువారితనితో మిగుల స్నేహభావముతో నుండిరి. మేగస్తనీసునకు బదులుగా డీమెకాసనువాఁడు పాటలీపుత్రములో గ్రీకు రాయబారిగా నుంపఁబడెను. ఈరాయబారియు నీదేశమును గుఱించి గ్రంథము వ్రాసియుంచెను. కాని యాగ్రంథమిప్పుడు ఖిలమైపోయినది. క్రీ. పూ. ౨౮౦ లోఁ జంద్రగుప్తుని మామయగు సెల్యూకస్ మృతుఁడయి యాతని కుమారుఁడగు ఆంటియోకస్ సోటర్ రాజయ్యెను. ఈ యాంటియోకసు రాజును, ఈజిప్టు రాజగు టాలమీ ఫిలాడెల్ఫస్ (క్రీ. పూ. ౨౮౫-౨౪౭) అనువాఁడును బిందుసారునికి స్నేహితులుగానుండి యాతని యొద్దకుఁ దమ రాయబారులఁ బంపుచుండిరి.

ఈరాజు క్రీ. పూ. ౨౭౨-లోఁ బరలోకగతుఁడయ్యెను.

## అశోకవర్ధనుఁడు.

(క్రీ. పూ. ౨౭౨-౨౩౧)

బిందుసారుని తరువాత నాతని కుమారుఁడగు నశోక వర్ధనుఁడు చక్రవర్తియయ్యె. ఈతనిని సాధారణముగా నశోకుఁడనియెదరు. ఈ యశోక మహారాజు భూమండలములో మిక్కిలి విఖ్యాతిచెందిన రాజులలో నొకఁడు. ఈతని ఖ్యాతి హిందూదేశములోనే గాక యీభూమండలములోని యనేక దేశములలోఁ బ్రసరించి యున్నది.

అశోకుఁడు తండ్రికాలములో యువరాజుగానుండి, తక్షశిలోజ్జయనీ ప్రాంతములకు రాజప్రతినిధి (Viceroy) గా బంపఁబడెను. ఆప్రాంతములలోను దండ్రియొద్దను నీతఁడు రాజ్యపరిపాలనక్రమము నేర్చెను. ఈతఁడు క్రీ. పూ. ౨౭౨ లో రాజ్యమునకు వచ్చినను, మూఁడు సంవత్సరముల తరువాత (క్రీ. పూ. ౨౬౯ లో) నితనికి రాజ్యాభిషేకము జరిగెను. ఈతని యన్నదమ్ము లనేకులుండి వారీతనితో రాజ్యమునకై పోరాడుచుండిరనియు, నందువలన నీమూఁడేండ్లవఱకుఁ బట్టాభిషేకము చేసికొనక యంతఃకలహములు తీరినతరువాత నశోకుఁడు పట్టాభిషిక్తుఁ డయ్యెనని యుఁజరిత్రకారులూహించుచున్నారు.

క్రీ. పూ. ౨౬౧ లో ననఁగా దాను రాజ్యమునకు వచ్చిన పండ్రెండవయేట నీతఁడు కళింగదేశముపై దండు వెడలెను. కళింగదేశమనఁగా గోదావరీ మహానదులకు నడుమ

నున్న సముద్రతీర ప్రాంతము. అప్పటికిఁ గాళింగులు బలవంతు లయి యుండిరి. అఱువది వేల కాల్బలమును, వేయిస్వారులును ఏడువందల యేనుఁగులును, గలిగియుండిరి. కావున వారు తమ స్వాతంత్ర్యమునకై ఘోరముగాఁ బోరాడిరి. తుదకు నశోకుఁడే కాళింగుల గెల్చెను. కాని యా యుద్ధమందు నుభయసైన్యములలోనుగలిసి లక్షజనులకంటె నధికముగా హతులైరి. లక్ష యేఁబది వేల జనము శత్రువులచేఁ జెఱపట్టఁ బడియె. ఇంక నెందఱో యుద్ధము వలనఁ గలిగిన రోగదుర్భిక్షాదుల వలన నశించిరి. ఇట్టి యసంఖ్య నిరపరాధ జనవినాశంబు జూచి హృదయము కరఁగినవాఁడయి తనరాజ్యతృష్ణయే దీని కంతకును గారణమని తలఁచి యా దయానిధియగు నశోకుఁడటు తరువాతఁ దానయి యితరుల రాజ్యముల మీఁదికి దండు వెడలనని ప్రతిజ్ఞ చేసికొని తన నలువది సంవత్సరముల ప్రభుత్వకాలములోఁ దత్ప్రతిజ్ఞానువర్తియై యుండె.

ఇంతియ గాక యీరాజు బౌద్ధ ధర్మమునందు మిక్కిలి శ్రద్ధగలవాఁడయి" యితరరాజులనుశస్త్రములతో గెలుచుటయే తమ ధర్మమని రాజులు తలఁచుట తప్పు. ధర్మమువలన సంపాదించిన జయమే నిజమైన జయము." 1 అని శాసించెను. తాను క్రొత్తగా సంపాదించిన కళింగదేశములోని ప్రజలకు నేమియు నిబ్బంది లేకుండఁ బాలించుటకు నధికారుల దనియమించి ప్రజలను బీడించు నధికారులకుఁ గఠినముగా దండనలు విధించుచుండెను.

1. (శిలాశాసనము-౧౩)

ఈరాజు మొదట హిందూ ధర్మమునందు శ్రద్ధగలవాఁడయి తరువాత నుపగుప్తుఁడను బౌద్ధాచార్యుని బోధవలన బౌద్ధమతావలంబి యయ్యెం. అప్పటినుండియు నారాజు రాజసవృత్తిని బూర్తిగాఁ బరిత్యజించి సాత్వికుఁడయి తన రాజ్యమునందును నితర దేశములందును, ధర్మాభివృద్ధి చేయుటయే తన పరమ కర్తవ్యమని నిశ్చయించెను.

తాను రాజ్యమునకు వచ్చిన పదునాలవ, పదునేడవ యేండ్లలో (క్రీ. పూ. ౨౫౭-౨౫౬) నశోకుఁడు తనధర్మమతముల లోకులకుఁ దెలుపుటకునై దేశమందంతటను బదునాల్గు శిలాశాసనములఁ జెక్కించెను.

ఇరువదిమూఁడేండ్లు రాజ్యము చేసిన తరువాత నశోకుఁడు క్రీ. పూ. ౨౪౯ లో బౌద్ధులకుఁ బవిత్రమైన స్థలముల సందర్శించుటకు యాత్ర వెడలెను. ఉత్తరదిశను ప్రస్తుతము ముజఫర్‌పూర్, చంపారణ్ అనఁబడు జిల్లాలలోనుండి హిమాలయముయొక్క వెలుపలి దక్షిణ ప్రాంతమునకుఁ బోయెను. అచ్చటినుండి పశ్చిమమునకుఁ దిరిగి నేపాల్ టెరాయ్ యొద్ద బుద్ధుని జననస్థానమగు లంబినీవనము చూచి యచ్చట నొక శాసనము వేయించెను. అదియిప్పటికిని నచ్చటఁ గానవచ్చుచున్నది. ఇదిగాక, బుద్ధుని తండ్రియొక్క రాజధాని యగు కపిలవస్తునగరము కాశియొద్ద బుద్ధుఁడు ప్రథమమున బోధచేసిన స్థలమగు సారనాథము, బుద్ధుఁడనేక సంవత్సరములు నివసించియున్న శ్రావస్తి, బుద్ధుఁడు బుద్ధత్వమును జెందిన

గయలోని బోధివృక్షము, బుద్ధుఁడు నిర్వాణముఁ జెందిన కుశి నగరముఁ మొదలయిన బౌద్ధ పవిత్రక్షేత్రములఁజూచి యచట దానధర్మములు చేసి శాసనముల వేయించెను.

రాజు నేపాళ దేశమునకు (క్రీ. పూ. ౨౪౯ లో) యాత్ర వెడలినపుడు అచ్చట లలిత పట్టణమను నొక రాజధానిని గట్టించెను. ఇది ప్రస్తుతపు రాజధానియగు ఖట్మండూ నగరమునకు నాగ్నేయమున మూఁడుమైళ్ళమీఁద నున్నది. ఈ లలిత పట్టణమునకే బౌద్ధ గ్రంథములందు లలితపాటన్, పాటన్, లలితపూర్ అను నామాంతరములు కలవు. ఈ లలిత పట్టణమును మిక్కిలి పవిత్రమైనస్థలముగా భావించి యశోకుఁ డచ్చటనైదుస్తూపములఁ గట్టించె. ఇందుఁబట్టణమునకుమధ్యను నొక్కటియుఁ బట్టణముయొక్క నాలుగువైపుల నాలుగును నిర్మింపఁబడియె. ఇవి యిప్పుడును గానవచ్చుచున్నవి.

అశోకుఁడు నేపాళదేశమునకు వెళ్ళినపు డాతనికొమార్తెయగు చారుమతీదేవి యాతనివెంట వెళ్లి నేపాళములోనే యుండిపోయెను. ఈమె గతభర్తృకగాఁ గానవచ్చుచున్నది. ఈమె పెనిమిటిపేరు దేవపాలక్షత్రియుఁడు. అతనిపేరట నామె యచ్చట దేవపట్టణమను నొక నగరము కట్టించెను. పశుపతినాథ్ అను గ్రామములో నుత్తరపువైపున నొక భిక్షుకాశ్రమము (Nunnery) కట్టించి యందునసేయుండి యామె దేహము సార్థకపఱచుకొనెను.

క్రీ. పూ. ౨౪౨-లో అశోకమహారాజు సప్తస్తంభ శాసనముల వేయించి యందుఁ దాను ధర్మాభివృద్ధికై చేసిన

ప్రయత్నముల సింహావలోకనము (Review) చేయుచుఁ బశు వధ చేయఁగూడదని శాసించెను.

క్రీ. పూ. ౨౬౦లో నశోకుఁడు సన్న్యాసి యాయ్యె. భిక్షువయినఁగాని ముక్తిలేదని బౌద్ధసిద్ధాంత మయినందున నితఁడు వైరాగ్యము గలవాఁడగుటచే భిక్షువయి రాజ్యము యొక్క పాలనాంశముల యువరాజునకును, మంత్రులకును వదలెను. కాని రాజ్యములోని ముఖ్యవిషయములఁ దానే విచారించుచు నుండెను. శాసనములన్నియు నితనిపేరటనే వ్రాయుచుండిరి.

ఈతని రాజ్యకాలమందు నీతని రాజధానిలో నొక బౌద్ధభిక్షువుల పరిషత్తు జరిగినదని యిదివఱకే వ్రాసియున్నా ము. ఈపరిషత్తు రాజు సన్న్యసించిన తరువాత జరిగియుండును.

## అశోకుని రాజ్యవిస్తారము.

వాయువ్యదిక్కున హిందూకుశపర్వతమువఱ కీతని రాజ్యము వ్యాపించియుండెను. అనఁగా ప్రస్తుతపు ఆఫ్గానిస్థాన రాజ్య మంతయు బలుచిస్థాన, సింధు ప్రాంతములును, ఆరాజ్యములోనివే యైయుండెను. సవాత్, బాజౌర్ అను కొండకనుమలప్రదేశమును, కాశ్మీర నేపాళదేశములును అశో కునికి లోఁబడియుండెను. కాశ్మీరమున నీతఁడు శ్రీనగరమను పట్టణము కట్టించెను. అది యిప్పుడు రాజధానియై యొప్పు చున్నది.

తూర్పున గంగానదిముఖమునొద్దనున్న తామ్రలిప్తి (ప్రస్తుతపు తాంలూక్) వఱకు బంగాళమంతయు నితని తాత కాలముననే స్వాధీనపడెను. క్రీ. పూ. ౨౬౧-లో నితఁడు కళింగమును జయించెను. ఆంధ్రదేశమున స్వతంత్రరాజులచే బరిపాలింపఁబడుచు నశోకునికి సామంతరాజ్యముగా నున్నట్లుఁ గానవచ్చెడిని.

దక్షిణమున మైసూరురాజ్యమువఱకును నశోకుని రాజ్యమున్నట్లు లచ్చటి యాతని శాసనములవలనఁ దోఁచుచున్నది. అంతకు దక్షిణముననున్న పాండ్య, చేర, చోళ, కేరళదేశములు స్వతంత్రములయి యుండె. వానిపై నశోకునికి నేమియు నధికారము లేకయుండెనని చెప్పవచ్చును.

ఇట్లశోకుని రాజ్యవిస్తారమంతయు లెక్కచేయఁగా దక్షిణములోని కొన్ని చిన్నిరాజ్యములు తప్ప ప్రస్తుత మిఁగ్లీషువారిస్వాధీనమందున్న హిందూదేశమంతయును, బలుచిస్థానమును ఆఫ్గానిస్థాన్ నేపాళదేశమును అశోకచక్రవర్తికి లోఁబడియుండి యాతని "చక్రవర్తి" బిరుదును సార్థకపఱిచెనని చెప్పవచ్చును.

పాటలీపుత్రి రాజధానియం దుండి మధ్యదేశమును రాజే స్వయముగా బాలించుచుండె. దూరప్రదేశముల నేలుటకై రాజవంశపువారు రాజప్రతినిధులుగాఁ బంపఁబడుచుండిరి. అశోకునికాలమున నిట్టి రాజప్రతినిధులు నలుగురుండిరి. వాయువ్యప్రాంతములఁ బాలించు రాజప్రతినిధికి

తక్షశిల రాజధానిగా నుండెను. పంజాబు, సింధ్, కాశ్మీరము, సింధునదమునకు నావలి దేశములును ఈ ప్రతినిధి సత్తాలోనివి. పూర్వప్రాంతము నేలుట కొక ప్రతినిధి తోశలిలో నుండె. తోశలి యెచ్చటనుండెనో యిప్పుడు నిశ్చయముగాఁ జెప్పుటకు వీలులేదు. ఈ తోశల్యధిపతియే కళింగదేశమునుకూడఁ బాలించుచుండెను. పశ్చిమప్రాంతములగు మాలవ, గుజరాత్, కాఠియవాడ్ దేశములఁ బాలింప నొక ప్రతినిధి యుజ్జయినిలో నుండెను. నర్మదానదికి దక్షిణమునందుండు ప్రాంతములఁ బరిపాలింప నొక ప్రతినిధి యుండె. ఇట్లు నలుగురు రాజప్రతినిధు లుండిరి.

## శిలాశాసనములు.

అశోకమహారాజు తన ప్రజలను రాజువలెఁ బాలింపక ధర్మగురువువలెఁ బాలించెను. ప్రజలధర్మాభివృద్ధికై యాతఁడు ధర్మశాసనములఁ జెక్కించి తన రాజ్యమునం దంతటను, ప్రజల బాటలలోను, సంతలనిమిత్తమైకాని, యాత్రలనిమిత్తమైకాని ప్రజలు విశేషముగా గుంపులుకూడుచోట్లను వేయించెను. అశోకునిశాసనము లీదేశములోని మిక్కిలి పురాతనశాసనములు. ఇంతకంటెఁ బురాతన శాసనములు మఱియేవియు లేవు. ఈ శాసనములవలన నశోకునిచరిత్ర మనకుఁ దెలియుచున్నది. ఈ శాసనములతని రాజ్యమందంతటను అనఁగా హిమాలయము మొదలుకొని మైసూరువరకును పూర్వసముద్రము మొదలుకొని పశ్చిమసముద్రమువఱకును వ్యాపించియున్నవి.

ఈ శాసనములు ప్రాకృతభాష ననఁగా నప్పటిజనులు మాటలాడెడు భాషలో వ్రాయఁబడినవి. ఇందలి యక్షరములు రెండువిధములయినవి. హిందూదేశముయొక్క వాయువ్యపు సరిహద్దుమీఁది శాసనములన్నియు ఖరోష్ఠి లిపిలో వ్రాయఁబడినవి. ప్రస్తుతపు అరబ్బి, పారసీ భాషల కీలిపియే మూలము. ఇది కుడివైపునుండి యెడమవైపునకు ననఁగా



అశోకునిస్తంభము

నపసవ్యముగా వ్రాయఁబడును. కడమ శాసనములన్నియు బ్రాహ్మీలిపిలో వ్రాయఁబడినవి. ఇది యెడమవైపునుండి కుడివైపునకు వ్రాయఁబడును. ప్రస్తుతపు దేవనాగరియక్షరములకును, తెలుఁగు, కన్నడముల యక్షరములకును ఈబ్రాహ్మీలిపియే మాతృక. అశోకుని శాసనములోని లిపి సామాన్యజనుల కిప్పుడు తెలియదు. పాశ్చాత్య పండితు లెంతో శ్రమపడి యాయక్షరముల నన్నిటిని గనుఁగొనిరి. అశోకునిచే వేయింపఁబడిన శాసనముల నన్నిటిని మనకుఁ దెలిసినంతవఱకు నీక్రింది యెనిమిదివిధములుగా విభజింపవచ్చును.

౧. పదునాల్గు శిలాశాసనములు.—ఇవి క్రీ. పూ. ౨౫౭-౨౫౬ లో వేయింపఁబడియె. ఇందు ధర్మసిద్ధాంతములు బోధింపఁబడినవి. ఈ పదునాలుగు శాసనములు నేడు ౯ స్థలములలో నున్నవి.

౨. రెండు కళింగశాసనములు:—క్రొత్తగా జయింపఁబడిన కళింగదేశములో నివి.క్రీ. పూ. ౨౫౬లో వేయింపఁబడియె.

౩. మూఁడు గుహాశాసనములు.—ఇవి గయ యొద్ద బరాబరు అనుచోట, క్రీ. పూ.౨౫౭ లోను, క్రీ. పూ. ౨౫౦ లోను, అజీవికులను జైనమతస్థులకొఱకుఁ గట్టఁబడిన మహావిహారములోఁ జెక్కఁబడినవి. ఈశాసనములు రాజుయొక్క దానమును వర్ణించును.

౪. రెండు బెరాయిస్తంభ శాసనములు.—ఇవి క్రీ.పూ. ౨౪౯ లో రాజు నేపాళమునకు వెళ్లినపుడు వేయించినవి.

౫. ఏడు స్తంభశాసనములు.— ఇవి రాతిస్తంభముల మీఁద చెక్కఁబడి నందున వీనికి నీపేరు పెట్టఁబడియె. ఈశాసనములు క్రీ. పూ. ౨౪౯, ౨౪౨ లో వేయింపఁబడి యాఱు చోట్ల వీని ప్రతులుగలవు. మొదటి పదునాల్గుశాసనములలో వర్ణించిన ధర్మము నే యీశాసనములలో విపులముగా విశదీకరించి యేడవశాసనములో ధర్మాభివృద్ధికై యశోకుఁడు చేసిన ప్రయత్నములన్నియు వర్ణింపఁబడినవి.

౬. పరిశిష్టస్తంభశాసనములు.—ఇవి క్రీ. పూ. ౨౪౦ లో వేయింపఁబడియె.

౭. లఘు శిలాశాసనములు—ఇవి క్రీ. పూ. ౨౩౨ లోనో ౨౩౧ లోనో యనఁగా నశోకుఁడు రాజ్యమునకు వచ్చినతరువాత నలుబదియొక్క సంవత్సరములకు వేయింపఁబడియె. ఇవి యశోకుని యంతిము సంవత్సరమునఁ జెక్కింపఁ బడియెంగాఁబోలును.

౮. భాభ్రాశాసనము— ఇదియుఁ పైశాసనములు చెక్కించిన సంవత్సరముననే వేయింపఁబడియె. ఇందు సన్న్యాసియైన రాజు, బుద్ధభిక్షులకును, భిక్షుకీజనమునకును, నితర జనులకును, బుద్ధుని భాషణములన్నియు సుభాషితములయినప్పటికి

యందు వేదవచనముల విశేషశ్రద్ధతోఁ జదువుటకును నను ష్ఠించుటకును బోధించెను.

ఇట్లశోకమహారాజుచే జనోపయోగమునకై క్రీ. పూ. ౨౫౭ నుండి క్రీ. పూ. ౨౩౧ వఱకును శాసనములు చెక్కింపఁబడినట్లు గానవచ్చుచున్నది.

ఈశాసనములలో ధర్మము యొక్క స్వరూపమును, ధర్మప్రచారమును గుఱించి యనేక యేర్పాటులును వర్ణింపఁబడినవి. తర్కవితర్కములుగాని యుక్తివాదముగాని చేయక, ధర్మస్వరూపము స్పష్టముగా వర్ణింపఁబడినది. సత్ప్రవర్తనయు భూతదయయు ముఖ్యముగా ధర్మస్వరూపమని చెప్పఁబడినది.

భూతదయ.

పిపీలికాది సకలభూతములను దయతోఁ జూడవలయు ననియు, నేజీవమును జంపఁగూడదనియు నమ్మిక కలవాఁడు గావునఁ దన సువారములో నంతకుఁబూర్వము భోజనమునకై జరుగుచున్న పశువధను నాపివేసెను.1 అశోకుని తాతయైన చంద్రగుప్తుని కాలమునుండియు మృగయావినోదము రాజుల కత్యంతప్రియమై యుండెను. కాని యన్యాయముగా నిరప రాధములగు నరణ్యమృగములఁ జంపుట తగదని యశోకుఁడు వేటాడుట చాలించెను. వేటకు బదులుగా రాజ్యములోని ప్రజల కష్టములఁ గనుఁగొనుటకును, పవిత్రమైన స్థలములను,

1. ౧-వ శిలాశాసనము.

జనులను చూచుటకును, ధర్మబోధ చేయుటకును దేశయాత్ర చేయుట మంచిదని శాసించెను.[2] తన రాజ్యములోని ప్రజలు కొన్ని మృగముల నెన్నఁడును జంపనేకూడదనియు, మాంసాహారులైనశూద్రాదులుగూడ సంవత్సరములో నేఁబదియాఱు విశిష్ట దినములందు నెట్టిప్రాణులను జంపఁగూడదనియు నాజ్ఞాపించెను.[3] (క్రీ. పూ. ౨౪౩).దయామయుఁడగు నీరాజు పశువులరోగచికిత్సకై పశువైద్యశాలల నిర్మించెను.[4] భూతదయ యింతకుమించ నేరదుగదా?

## తలిదండ్రుల గౌరవించుట.

అశోకుఁడు చేసిన రెండవబోధ, కొమారులు తమ తలిదండ్రులను గురువులను పెద్దలను మిక్కిలి గౌరవముతోఁ జూడవలసినదని. అట్లే పెద్దవారును తమ కుమారులను, సేవకులను, దయతోను వారికిఁ దగిన మర్యాదతోను జూడవలెనని యాజ్ఞాపించెను. బంధువులను, భిక్షువులను (సన్న్యాసులను), బ్రాహ్మణులను గౌరవముతోఁ జూచి వారివిషయమై యౌదార్యముఁ గనఁబఱుపవలెను.

## సత్యప్రియత్వము.

అశోకుఁడు బోధించిన మూఁడవధర్మము సత్యము. ఈ మూఁడుతత్త్వములును నీక్రింది ౨-వ శిలాశాసనమునందు

2. ౩వ శిలాశాసనము. 3. ౫వ స్తంభశాసనము. 4. ౨వ శిలాశాసనము.

సంగ్రహముగాఁ జెప్పఁబడినవి. ఆశాసనముయొక్క భాషాంతర మిందు నిచ్చుచున్నారము:

“పియదశి * యిట్లని శాసించె: తలిదండ్రులమాట వినవలయును. అట్లే భూతదయను బాటింపవలయును; సత్యము మాటలాడవలయును. ఇవి యనుష్ఠింపవలసిన ధర్మముయొక్క లక్షణములు. గురువును గౌరవింపవలెను. బంధువుల మన్నింపవలెను. ఇది దీర్ఘాయుప్రదమగు పురాతనధర్మమర్యాద. మానవులు దీని ననుష్ఠింపవలయును.”

## పరమతసహిష్ణుత.

తాను బౌద్ధధర్మాభిమాని యయ్యును యశోకుఁడు పరమతములయెడ ద్వేషములేనివాఁడయి యన్నిటిని సమభావముతోఁ జూచుచుండె. బౌద్ధభిక్షువులకు నాశ్రమములు కట్టియిచ్చినట్లే యాజీవకులనఁబడు జైనులకును గట్టించి యిచ్చెను. బౌద్ధాచార్యుల గౌరవించినట్లే బ్రాహ్మణుల గౌరవించుచుండెను. ఇది యీ మహాత్మునియందుండిన గొప్ప గుణములలోని గొప్ప గుణము. తాను నమ్మిన ధర్మము నాచరింపవలసినదే కాని యితరుల మతములను నిందచేయఁ గూడదనియు, నన్ని ధర్మములలోను నింద్రియ నిగ్రహము, పవిత్రాచరణము ముఖ్యములని చెప్పఁబడినందున నన్నిధర్మముల ముఖ్యసిద్ధాంతము లొకటియేయనియు, భేద మముఖ్య

---

* పియదశి (ప్రియదర్శి) యనునది యశోకుని బిరుదునామము.

మైన విషయములను గుఱించినదని తెలిసికొనవలయుననియు, మతసంబంధమైన చర్చలలోఁ బరస్పర, నిందావ్యంజక శబ్దముల నుపయోగింపఁగూడదనియు శాసించెను.1 ఇప్పుడు మామత మెక్కువ మామత మెక్కువ యని పోరాడువారశోకుని శాసనములు చదివియైనను బరమతసహిష్ణుత (Religious toleration) నేర్చికొనియెదరుగాతి!

బాటసారులకు వసతులు.

ఒకదేశమునుండి మఱియొక దేశమునకు నడిచివెళ్ళు బాటసారులకు వీలుగానుండుటకు నచ్చటచ్చట స్తంభములు వేయించి వానిపైఁ గ్రోశములసంఖ్య వేయించు నాచారము అశోకుని తాతయగు చంద్రగుప్తునికాలమునుండియుఁ గలదు. అశోకుని ప్రభుత్వమున మనుష్యులకును పశువులకును నీడనిమిత్తమై త్రోవపొడుగున మఱ్ఱిచెట్లును మామిడితోఁపులును వేయింపఁబడియె; క్రోశ క్రోశమునకును బావి యొకటి త్రవ్వింపఁబడియె; చావడులు కట్టింపఁబడియె; జలపానప్రదేశములు మనుజులకొఱకును బశువులకొఱకును నిర్మింపఁబడియె.2

ఔషధశాలలు.

రోగార్తులెవ్వరైనను వారికి నౌషధంబులిచ్చుటకు నీయద్వితీయకరుణామూర్తియగు నశోకచక్రవర్తి, తన రాజ్యమంతటను ఔషధాలయముల నేర్పఱిచెను. సర్వజీవులయందును

1. ౩-వ శిలాశాసనమును, ౧౨-వ శిలాశాసనమును జూడనగు.

2. ౭-వ స్తంభశాసనమును, ౨-వ శిలాశాసనమును.

గరుణగలవాఁడు గావున నీవైద్యశాలలోఁ బశువులకుఁగూడ నౌషధంబులిచ్చునట్లేర్పాటు చేసెను. అంతటితోఁ దృప్తిఁ జెందక తనకు స్నేహితులుగానున్న యితర రాజుల రాజ్యములలోను దన ధనముపెట్టి యట్టి యౌషధశాలలఁ గట్టించెను. ఉత్తరమున హెలెనిష్టిక్ ఏసియా (Hellenistic Asia) యనఁబడు దేశములలోఁ గూడ నశోకుని యౌషధశాలలుండెను. ఈశాలలకుఁ గావలసిన యోషధులఁ దోఁటలో వేయించుచు, నితరస్థలములనుండి తెప్పించుచు నౌషధసంగ్రహము చేయుచుండిరి.[1]

## ధర్మాధికారులు.

తన శాసనముల ననుసరించి ప్రజలు ప్రవర్తించుచున్నారో లేదో కనుఁగొనుటకును, నపరాధుల దండించుటకును నీరాజు ధర్మాధికారుల నేర్పఱిచెను. ప్రజల నీతిని గాపాడుటయు వీరిలోఁ గొందఱి పనియై యుండెను.[2] వీరుగాక సాధారణ రాజకీయాధికారు లనఁగాఁ బ్రస్తుతము గవర్నర్, కమిష్నర్, కలెక్టర్ అనఁబడు వారివంటి యధికారులు సంచారమునకు వెడలినపుడు జనులను గుంపులుగాఁ జేర్చి వారికి ధర్మోపదేశము చేయుచుండవలయునని రాజు శాసించెను.[3]

## పరరాజ్యములకు ధర్మోపదేశకుల నంపుట.

తన రాజ్యములో ధర్మాభివృద్ధి పైని వర్ణించిన ప్రకారము చేసి యంతటితోఁ దృప్తినొందక, తాను నమ్మినమత

1. ౨-వ శిలాశాసనము. 2. ౫-వ ౧౨ శిలాశాసనములు; ౭-వ స్తంభశాసనము. 3. ౩-వ శిలాశాసనము, కళింగశాసనము.

ము:ను నీతికల్పనలును జగత్తంతయుఁ బ్రసరించునట్లు చేయు టకు ననన్యసామాన్యుఁడగు నశోకుఁడు యత్నింపసాగెను. అందుకై ధర్మోపదేశకుల నేమించి, తనకు లోఁబడిన సామంత రాజులరాజ్యములకును, తనకు లోఁబడక పోయినను స్నేహి తులుగా నుండు రాజుల దేశములకును వారిని బోధనిమిత్తమై పంపెను. ఈ బౌద్ధధర్మోపదేశకులు (అనఁగా పాద్రీలు లేక మిషనరీలు) ఏయే దేశములకుఁ బంపఁబడిరో మన మశోకుని శాసనములవలనఁ దెలిసికొనవచ్చును.

క్రీ. పూ. ౨౫౬ కుఁ బూర్వమనఁగా శిలాశాసన ములు వేయునపుడు తిబ్బేతు దేశములోని కాంభోజుల దేశము, హిమాలయప్రాంతమందలి రాజ్యములు, కాబూలు కనుమ లలోని గాంధారి యవనదేశములు, వింధ్యపర్వతములోను పడమటి కనుమలలోను ఉన్న పుళింద పిటేనికలను అనాగరికుల ప్రాంతములు, కృష్ణా గోదావరీ మధ్యనున్న యాంధ్రదేశము, అను నీ సామంతరాజుల రాజ్యములలోనికి నీరాజుయొక్క ధర్మోపదేశకులు వెళ్లియుండిరి.

మిక్కిలి దక్షిణమందలి చోళ పాండ్య కేరళ సత్య పుత్రరాజ్యములు స్వతంత్రముగా నుండెను. ఆరాజ్యముల లోనికి నశోకుని ధర్మోపదేశకులు పంపఁబడిరి. సత్యపుత్ర దేశమనఁగా మంగళూరు మధ్యగాఁ గలిగియున్న తుళువభాష మాటలాడు దేశమని కొందఱి యభిప్రాయమై యున్నది.

మహేంద్రుఁడను తనకుమారుని, సంఘమిత్ర యను తనకూఁతును నశోకుఁడు సింహళమునకు ధర్మోపదేశార్థము పంపెను. వారచ్చట నాటిన ధర్మబీజమే నేఁటికిని అచ్చటఁ బ్రబలియున్నది. ఈకథ మహావంశమను సింహళచరిత్రలో నున్నది. కాని మహేంద్రుఁడనువాఁడు అశోకుని కుమారుఁడు కాఁడనియుఁ, దమ్ముఁడనియుఁ గొందఱు వ్రాసియున్నారు.

బర్మాదేశములోని పెగుప్రాంతమునకును ధర్మోపదేశకులు పోయినట్లు మహావంశకారుఁడు వ్రాసియున్నాఁడు. కాని యీయంశము శాసనములలోఁ జెప్పఁబడలేదు.

పైని వర్ణించిన దేశములన్నియు హిందూదేశమునకుఁ జుట్టుప్రక్కవి. ఇవిగాక అప్పుడు అంటియోకస్ థియోస్ రాజుచేఁ బాలింపఁబడుచున్న సిరియా, టాలెమీఫిలాడెల్ఫాసుచే నేలఁబడుచున్న యీజిప్టు (మిసర్), మాగ్యాసుచేఁ బరిపాలింపఁబడుచున్న సిరీన్, ఆంటిగోనోస్ గొనాటస్‌చే దొరతనముచేయఁబడుచున్న మాసిడోనియా, అలెగ్జాండరుచేఁ బ్రభుత్వము చేయఁబడుచున్న యెపిరస్ అను దేశములకన్నిటికి హిందూదేశమునుండి మతాచార్యులు ధర్మోపదేశమునకై వెళ్లియుండిరి. ఈదేశములందు నశోకునిచేఁ బశువుల యుపయోగార్థమును, మనుష్యుల యుపయోగార్థమును జికిత్సాశాల లేర్పఱుపఁబడెను. అనఁగా నశోకునిబోధకులు (మిషనరీలు) ఆశియా, యూరోప్, ఆఫ్రికాఖండములలోని గొప్పగొప్ప రాజ్యములలో ధర్మోపదేశము చేయుచుండిరి.

ఇట్లు బౌద్ధధర్మమును జగత్తంతయు వ్యాపింపఁజేయు నశోకుఁడన్ని దేశములకును ధర్మోపదేశకులఁ బంపినందున బౌద్ధ-ధర్మ మత్యంతముగా నభివృద్ధియై క్రమక్రమముగా నితరమతముల మ్రింగివేసెను. తరువాత రెండువందల సంవత్సరములకుఁ బుట్టిన క్రైస్తవధర్మము రాజాశ్రయముచేతను, ప్రజలయాశ్రయముచేతను, నభివృద్ధిచెందినను నేటివరకును బౌద్ధమతమును మించలేకున్నది. నేఁడు క్రైస్తవుల సంఖ్యకంటె బౌద్ధులసంఖ్యయే యెక్కుడుగా నున్నది. దీనికంతకును అశోకుని మతబోధక సంఘమే ముఖ్యకారణము. కాన నశోకుఁడు జగత్తునకంతకు నవీన ధర్మము నేర్పిన మహానుభావుఁడని చెప్పవలసియున్నది.

ప్రస్తుతము క్రైస్తవధర్మబోధనిమిత్తమై అమెరికా యూరోపు దేశములనుండి బోధకులు వచ్చుట మనము చూచుచున్నారము. ఇటుల మతబోధ నిమిత్తము పరదేశములకు బోధకులఁ బంపు పద్ధతి జగత్తునకు మొదట నేర్పినవాఁడు బుద్ధుఁడు. తరువాత నుదాహరణపూర్వకముగా నభివృద్ధిపఱిచినవాఁడు అశోకుఁడు. బుద్ధుని యుపదేశకు లీదేశముననే బోధచేసిరి. అశోకుని యుపదేశకులు జగత్తంతయుఁ బ్రసరించిరి. ఇట్లు పరదేశములకు నుపదేశకులఁ బంపియు, నౌషధశాలాదులఁ గట్టించి లోకులకు నుపకారముచేసియు, ధర్మమభివృద్ధిచేయు మార్గములను బౌద్ధులవలననే క్రైస్తవులు నేర్చికొని రనుటకు సందేహము లేదు. ఇదియుఁగాక బౌద్ధధర్మతత్త్వముల నేకములు తీసికొని పురాతన క్రైస్తవులు తమ ధర్మగ్రంథముల నిర్మించు

కొనిరని కొందఱి యభిప్రాయమై యున్నది. కాని యీవిషయ-
మింకను విచారణీయము.

### అశోకుని స్వభావము.

పరమసాధువుయొక్క సాత్త్విక సద్గుణములును అసాధారణ చక్రవర్తియొక్క రాజ్యధురంధరత్వమును నొక్కచోటఁ గలిపి యీ యశోకుఁడు చేయఁబడినట్లు గానవచ్చెడిని. అహింసామాహాత్మ్య మెఱిఁగినతోడనే మాంసాహారమును మానుటయు మృగయావినోదమును వదలుకొనుటయు యుద్ధములవలనఁ బ్రజాక్షయ మగునని పరరాజ్యములను గెలుచుట మాని 'కళింగయుద్ధములో జరిగిన ప్రజాక్షయములో వేయవపాలు ప్రజాక్షయ మయినను నేను సహింపలే'నని శాసించుటయుఁ జూడ నీతని సాధుత్వము పదునాఱువన్నెలదని యని చెప్పక తప్పదు. రాజ్యతృష్ణచే లక్షలకొలఁది జనులను నాశమందించెడి ప్రస్తుతపు రాజులీ యశోకునిచరిత్ర చదివినైనను ప్రజాక్షయకర కృత్యముల మానుదురుగాక! 'పరులెంత యపకారముచేసినను పియదశి శాంతముగా సహించు'నని చెప్పెడి రాజుయొక్క సత్త్వగుణము మనమువినుచున్న సాక్రిటీస్, తుకారాము, వేమన మొదలగు సాధువుల గుణమును బోలినదియని చెప్పుట కేమి సందేహము? అశోకుని ప్రభుత్వములోనున్న రాజ్యముయొక్క సువ్యవస్థయే యాతని రాజ్యధురంధరత్వమును వేనోళ్ళఁ గొనియాడుచున్నది. ఆతఁడు తనప్రజల కష్టములను వినుటకు నెప్పుడును సిద్ధముగా నుండెను. రేయుంబవళ్ళిట్లు ప్రజాసుఖమునకై పాటుపడుచు నంతటితో సంతుష్టి

చెందక తాను పోమరినని నిందించుకొనెను. ఇట్లు తనరాజ్యమును రక్షించుకొనుచు దూరదూర దేశములందుండు విఖ్యాతి రాజులతో స్నేహము చేయుచు వారి రాజ్యములోనికిఁ దన ధర్మోపదేశకులను బంపుచుండఁగా నశోకుఁడు ప్రస్తుతము ఇంగ్లండ్, జర్మనీ, అమెరికా దేశములలోని ప్రభుత్వమువారికిఁ గల సామర్థ్యంబును, దూరదృష్టియు, రాజకార్యధురంధరత్వమును గలిగియుండెనని చెప్పుటకు సందేహములేదు.

ఇట్టి యద్వితీయ చక్రవర్తియగు నశోక మహారాజు క్రీ. పూ. ౨౩[illegible]లో నిర్యాణము చెందినట్లు గానవచ్చుచున్నది.

## మౌర్య వంశావసానము.

అశోకుని మరణానంతరము మౌర్యవంశపురాజుల ప్రతాపము తగ్గఁజొచ్చి యది కొలఁదికాలములోనే (క్రీ. పూ. ౧౮౫-లో) యంతరించెను. ఆ కథ నిచ్చటఁ గొంచెములో ముగించెదము.

అశోకుని పుత్త్రులను గుఱించి మనకు విశేష మేమియుఁ దెలియదు. అతనికి కారూవకీయను రాణియు తీవరుఁడను కుమారుఁడు నుండినటు లొకశాసనమువలనఁ దెలియుచున్నది. అశోకునికి మొదట అసంధిమిత్రియను భార్య యొకతె కలదనియు, నామెకు కునాలుఁడను కుమారుఁడుండెననియు, నామె మరణానంతరము అశోకుఁడు తిష్యరక్షిత యను నామెను వివాహమాడెననియు నొక వదంతికలదు. ఈ కునాలుని గుఱించియు

నాతని సవతితల్లియగు తిష్యరక్షితను గుఱించియు మనదేశమున సారంగధర చిత్రాంగులను గుఱించి చెప్పుకథ వంటి కథ యొకటి చెప్పెదరు. అందువలనఁ గునాలుని కన్నులు తీయింపఁ బడెనఁట. కాని యీచిత్రకథ నమ్మఁదగినదిగాదు. అశోకునికి జలౌకుఁడను నొక కుమారుఁడుండెననియు, నీతఁడు కాశ్మీరము నకు రాజయ్యెననియు నచ్చటనుండి యాతఁడు పరదేశీయులఁ గొందఱ వెడలఁ గొట్టించి కనౌజ్ వఱకును రాజ్యమును గెలి చెననియు, బౌద్ధ ధర్మమునకు శత్రువుగానుండి యాతఁడును ఆతని భార్యయగు నీశాన్యాదేవియు ననేక శివాలయములఁ గట్టించిరనియుఁ గాశ్మీరమున వాడుకకలదు. కాని శాసనము నందుఁ జెప్పఁబడిన తీవరుండు తప్ప నితరు లుండిరా, లేదా యని మనము సంశయింప వలసియున్నది. ఈ తీవరుని గుఱించి మన కెక్కువగా నేమియుఁ దెలియదు.

అశోకుని మరణకాలమువఱకు నొక కుమారుఁడయిన జీవించి యుండ నందున నాతని మనుమడగు దశరథుఁడు రాజయినట్లు గానవచ్చును (క్రీ. పూ. ౨౩౧.). ఈతని తండ్రి పేరు సుయశుఁడని విష్ణుపురాణమునందుఁ జెప్పఁబడి యున్నది. ఈ దశరథుఁడు నాగార్జునపర్వతము నొద్దఁ దాతగారుకట్టించిన యాజీవిక జైనుల మఠములో నొక శాసనము చెక్కించెను. దశరథుని కాలమునకో తరువాతఁ గొంతకాలమునకో కళింగు లును, ఆంధ్రులును స్వతంత్రులైరి. దశరథుని తరువాత నలు గురు రాజులైరి. మౌర్య వంశపు కడపటిరాజు పేరు బృహద్ర థుఁడు. ఈతఁడు మిక్కిలి దుర్బలుఁడు. ఈతనికిఁ బుష్యమిత్రుఁ

డనువాఁడు సేనాపతియై యుండెను. పుష్యమిత్రుఁ డొకనాఁడు తన ప్రభువునకు సైన్యమంతయుఁ జూపుమిషను తన బలములన్నియు నిల్పియుంచి, చూడవచ్చిన రాజుపైఁ దిరుగఁబడి యాతనిఁ జంపెను.1

ఇట్లు మగధరాజులగు మౌర్యు లింతటితో నంతరించిరి. కాని తరువాత నీవంశమువా రనేక శతాబ్దములవరకుఁ జిన్న చిన్న మండలాధీశులుగా నున్నట్లు తోఁచుచున్నది.

### శుంగ వంశపు రాజులు.

బృహద్రథ మౌర్యుని సైన్యాధీశ్వరుఁడగు పుష్పమిత్రుఁడు 2 తన రాజును జంపి మౌర్యరాజ్యమున కంతకును క్రీ. పూ. ౧౮౪-వ సంవత్సరమున రాజయ్యెను. ఈ వంశమునకు శుంగవంశమని పేరు. వీరు పాటలీపుత్రము రాజధానిగాఁ గలిగి నర్మదానదివఱకు రాజ్యము చేసిరి. పశ్చిమమునఁ బంజాబు దేశమును నర్మదానదికి దక్షిణమునందలి దేశములును, వీరికి లోఁబడక స్వతంత్రము లయ్యెను.

పుష్యమిత్రుని రాజ్యముయొక్క యుత్తరార్ధములో బ్యాక్ట్రియారాజునకు బంధువగు మేనాండరు అను యవనుఁడు హిందూదేశముపై దండెత్తి వచ్చి సాకేతమును మాధ్యమిక దేశములను (రాజపుత్రస్థానములోని చిత్తూరియొద్ద దేశము) ముట్టడించెను. మథురానగరమును, సౌరాష్ట్రమును (కాథియావాడ్) ఆక్రమించెను. కాని తుదకుఁ బుష్యమిత్రుని

1. బాణకృత హర్ష చరితము. 2. ఈతనినే పుష్యమిత్రుఁడందురు.

సైన్యము లీపరరాజును దమవిక్రమముచే నీదేశమునుండి వెడలఁ గొట్టెను (క్రీ. పూ. ౧౫౩). భూమార్గమున హిందూదేశము నకు వచ్చిన యూరోపియు రాజులలో నీతఁడు కడపటివాఁడు. అటుపిమ్మటవచ్చిన యూరోపియు రాజులు జలమార్గమున వచ్చిరి. ఇట్లు అలెగ్జాండరు, సెల్యూకస్, మీనాండరు అను యూరోపురాజు లీదేశమునకు వచ్చి మొదటఁ గొంత జయ మును రాజ్యమును సంపాదించిరి. కాని యీదేశపురాజుల శౌర్యసాహసముల నెదిరించి శాశ్వతముగ నిచ్చట నిలువలేక తుద కీదేశమునుండి వెడలిపోవలసినవా రయిరి. ఇది యప్పటి హిందువుల పౌరుషమునకు వన్నెగదా!

కళింగదేశాధీశ్వరుఁడగు ఖారవేలుఁడు ఈకాలమునం దునో, యింతకుఁ గొంతపూర్వమో పుష్యమిత్రునితోఁ బోరాడి యాతనిని గొన్ని యుద్ధములలో నోడించెను. కాని పుష్యమిత్రుఁడు త్వరలోనే బలములఁ గూర్చుకొని తన రాజ్య మును వృద్ధిపఱిచినట్లు కానవచ్చెడిని.

ఈతనికి నగ్నిమిత్రుఁ డను కుమారుఁ డుండెను. మాళవి కాగ్నిమిత్రమను కాళిదాసకృతమైన నాటకములోని నాయకుఁ డీయగ్నిమిత్రుఁడే. తండ్రిజీవితకాలమునం దీతఁడు విదిశా పట్టణమునందుఁ బుష్పమిత్రునికి దక్షిణమున నర్మదానదివఱ కుండు రాజ్యమునకుఁ బ్రతినిధిగా (Viceroy) రాజ్యము చేయు చుండె. ఈతఁడు విదర్భరాజు నోడించి యాతని రాజ్యములో

సగ మాతనిపినతండ్రి కిప్పించెను. వీరియిద్దఱి రాజ్యములకు వరదానదియే పొలిమేరగా నేర్పఱుపఁబడియె. అగ్నిమిత్రుని పట్టపుదేవి పేరు ధారణి. ఈ దంపతులకు వసుమిత్రుఁ డను కొమారుఁడు కలిగెను. ఈ వసుమిత్రుఁడు తన తాతగారగు పుష్పమిత్రుని సేనానిగ నుండెను.

ఇట్లు శూరాగ్రేసరుఁడగు కుమారుఁడును, మనుమఁడును గల యారాజు, అశ్వమేధయాగముఁ జేయ నిశ్చయించి యశ్వమును వదలి దాని రక్షణార్థమై వెంటఁ దన మనుమని సైన్యములతోఁ బంపెను. వసుమిత్రుఁ డాగుఱ్ఱము వెంటఁ బోయి యెడ్డమువచ్చినవారిని జయించుచు ముఖ్యముగా సింధు నదపుటొడ్డున గుఱ్ఱమును బట్టుకొనిన యవనాశ్వికుల జయించి గుఱ్ఱమును విడిపించుకొని తాతయొద్దకి జయజయధ్వనులతో వచ్చెను. తరువాతఁ బుష్పమిత్రుఁ డశ్వమేధయాగమును వైభవముతోఁ జేసెను. ఈ విషయములన్నియుఁ గాళిదాసుని యీక్రింది వాక్యములవలనఁ దేటపడఁగలవు:

"శ్రీరస్తు. విదిశానగరమందున్న చిరంజీవియై మా పుత్రుఁడగు నగ్నిమిత్రుని సేనాపతియైన పుష్పమిత్రుఁడు ప్రేమ పూర్వకముగా నాలింగనము చేసికొని యజ్ఞశాలనుండి పుత్తెంచిన పత్రిక. నేను రాజసూయజ్ఞదీక్షితుఁడ నయియుండి నూఱు వురు రాజపుత్త్రులను దోడిచ్చి మన వసుమిత్రునిఁ దురంగ రక్షణార్థము సంవత్సరముక్రిందట నియోగించి తన మనస్సు వచ్చినట్లుగా సంచరించుటకయి గుఱ్ఱమును విడిచిపెట్టితిని. అది

సింధునద దక్షిణతీరమునం దిరుగుచుండఁగా దాని సర్వసేనాధిపతియైన యొక యవనుఁడు పట్టుకొనియె. అప్పు డుభయసేనలకు ఘోరయుద్ధము సంభవించెను. అతులధ్వనియగు వసుమిత్రుఁడు నాగుఱ్ఱమును తీసికొని పోవయత్నించిన యాశత్రువుల నోడించి నా యుత్తమాశ్వమును మఱలించెను. అంశుమంతుఁడు సగరున కశ్వమును దెచ్చియిచ్చినట్లుగా నా పౌత్రుఁడు నాకు యజ్ఞాశ్వమును దీసికొనిరాఁగా నే నిప్పుడు చేయఁగలిగిన యీయజ్ఞమునకు నీవు రోషముమాని వధూజనసహితముగా యుక్తసమయమునకు రావలయును." 1

మహాభాష్యములోని కొన్ని వాక్యములను బట్టి పతంజలి యీయశ్వమేధయాగ మప్పు డుండెననియు, అతఁడు పుష్యమిత్రునికి సమకాలీనుఁడనియుఁ గొందఱు పాశ్చాత్యు లూహించియున్నారు. కాని వారి యూహలు సరియైనవి కావు. పతంజలి యింతకుఁ బూర్వ మాఱువందలయేండ్ల క్రిందనే యుండెననుట కాధారములున్నవి. 2

ఈ రాజు బ్రాహ్మణధర్మమునం దభిమానము గలవాఁడయి యజ్ఞయాగాది క్రతువులు విశేషముగాఁ జేసెను. కాని కొందఱు వ్రాసినట్లు బౌద్ధులఁ బీడించెననుటకు నేమియు నాధారము లేదు.

---

1. (మాళవికాగ్నిమిత్రము. ౫-వ యంకము)

2. Vide Kunte's Vicissitudes of Aryan Civilization in India.

పుష్యమిత్రుఁడు క్రీ. పూ. ౧౪౮-లో మృతిచెందెను. అంతవరకు యువరాజుగను దక్షిణ రాజ్యమునకు రాజప్రతినిధిగను ఉన్న యగ్నిమిత్రుఁడు రాజయ్యె. ఈతని తరువాత సుజ్యేష్ఠుఁడనువాఁడు రాజ్యమునకు వచ్చె. ఈతఁడు పుష్యమిత్రుని రెండవకుమారుఁడు కాఁబోలును. ఈతఁ డేడుసంవత్సరములు రాజ్యము జేసెను. సుజ్యేష్ఠుని తరువాత వసుమిత్రుఁడు పట్టాభిషిక్తుఁడయ్యె. ఈతనితరువాత నీతని తమ్ముఁడగు సుమిత్రుఁడు రాజ్యమునకు వచ్చెను. ఈతఁడు విషయాసక్తుఁడు. ఎప్పుడును నటులతో సహవాసము చేయుచు నాటకములఁ జూచుటయందే కాలము గడపును. ఒకనాఁ డీతఁడు నాటకములో నిమగ్నుఁడయియుండ మిత్రదేవుఁడనువాఁ డీతని తెలమ్రించి వేసెను. తరువాతఁ గొన్నిదినములవఱకు నీతని వంశజులు రాజ్యము చేసిరి. కాని యనామధేయులయి తమ మంత్రుల చేతులలోని కీలుబొమ్మలుగ నుండిరి. తుదకు నీ వంశములోని పదియవరాజగు దేవభూతి యనువానిని నాతని మంత్రియగు వసుదేవుఁడు చంపి రాజ్యమును దా నాక్రమించుకొనియె (క్రీ. పూ. ౭౩.).

## కాణ్వవంశము.

ఈవసుదేవుఁడు బ్రాహ్మణుఁడు; కణ్వగోత్రజుఁడు. కావున వీరిది కాణ్వవంశమయ్యె. ఈవంశమును గుఱించి మన కంతగా నేమియుఁ దెలియదు. ఈవంశమున నలుగురు రాజులు నలుబదియైదేండ్లు రాజ్యము చేసినట్లును (క్రీ. పూ. ౭౩-౨౮)

కడపటిరాజు క్రీ. పూ. ౨౭-లో నాంధ్రరాజుచేఁ జంపఁబడినందున ఈవంశ మంతమందినట్లును వాయు, మత్స్యపురాణముల వలనఁ గానవచ్చుచున్నది. మగధరాజ్య మంతటితో నడుగంటెను.

## ఆంధ్రరాజులు.

మగధరాజ్యము తరువాత హిందూదేశములో మిక్కిలి యున్నతదశ ననుభవించినది యాంధ్రరాజ్యము.

పురాతన గ్రంథములన్నియు వెదకిచూడఁగా నాంధ్ర జనులపేరు మొట్టమొదట నైతరేయ బ్రాహ్మణములోఁ గానవచ్చుచున్నది. 1 ఐతరేయబ్రాహ్మణము క్రీ. పూ. ౧౦౦౦ సంవత్సర ప్రాంతమున రచింపఁబడినదని విద్వాంసులు నిర్ణయించి యున్నందున నిప్పటికి మూఁడువేల సంవత్సరములక్రింద నాంధ్రులుండియున్నట్లు నిశ్చయింపవచ్చును. ఐతరేయబ్రాహ్మణములోని వర్ణన చూడఁగా నప్పటి యాంధ్రులు ఉత్తర దేశములోని యార్యులతోఁబోరాడి లేచివచ్చి దండకారణ్యములోని యనార్యజనమధ్యంబున నివసించెడి యొకతెగవా రగు నార్యులని తోఁచుచున్నది. వాల్మీకిరామాయణమందును భారతమందును నాంధ్రదేశవర్ణనలు కలవు. కాని, యందువలన మనకు విశేషాంశము లేమియుఁ దెలియవు. తరువాత క్రీ. పూ. ౩౦౦ సంవత్సరప్రాంతమున నాంధ్రరాజ్యము మహోన్నతదశ

1. (౭-౧౮).

యందున్నట్లు చంద్రగుప్తుని యాస్థానమందున్న మేగాస్థనీసను రాయబారి వ్రాసియున్నాఁడు. హిందూదేశమందు నాకాలమునఁ జంద్రగుప్తుని రాజ్యముతప్ప ఆంధ్రరాజ్యమును మించిన మఱియొక రాజ్యము లేకయుండెను. ఆంధ్రరాజ్యమునం దప్పుడు ముప్పది దుర్గములును, లక్ష కాల్బలమును, రెండు వేల గుఱ్ఱపు సైన్యంబును, వేయి యేనుఁగులును ఉండెను. ఆంధ్రదేశపు రాజులు అశోకుని సమయమున (క్రీ. పూ. ౨౫౦) నాతనికి సామంతులయి యుండినటు లాతని శాసనములవలనఁ గానవచ్చున్నది.1 కాని యశోకుని మరణానంతరము (క్రీ. పూ. ౨౩౧) ఈ యాంధ్రరాజులు మగధేశ్వరులను లక్ష్యపెట్టక పూర్తిగా స్వతంత్రులయిరి.

ఇట్లు స్వతంత్రులయిన రాజులవంశము పురాణాదులలోను, శాసనాదులలోను ఆంధ్రవంశమనియు, శాతకర్ణి వంశమనియు వర్ణింపఁబడియున్నది. ఈ వంశపు రాజులు మొట్టమొదటఁ గృష్ణాగోదావరీ నదుల ముఖముల నడుమననఁగాఁ దూర్పు సముద్రమునంటిన ప్రదేశమునఁ దమరాజ్యము గలవారయి, క్రమక్రమముగాఁ గృష్ణాగోదావరీ నదుల మూలము వఱకును, మగధదేశమువఱకును రాజ్యమును నాక్రమించుకొనిరి. పౌరాణిక యుగములోఁ జాళుక్యరాజులు పశ్చిమము నుండి తూర్పునకుఁ బ్రసరించినటు లీయాంధ్రులు తూర్పు నుండి పశ్చిమమువఱకు జయించుచుఁ బోయిరి. అందువలన

1. ౧౩-వ శిలాశాసనముఁ జూడుఁడు.

వీరికిఁ దూర్పున నొక రాజధానియుఁ, బశ్చిమమున నొక రాజధానియుఁ గావలసివచ్చెను. మొట్టమొదట నీ రాజులకు శ్రీకాకుళము రాజధానిగా నుండెను. ఈ శ్రీకాకుళము కృష్ణానదిముఖమునొద్ద కృష్ణాజిల్లాలోని చల్లపల్లి జమీందారిలో నున్నది. ఇచ్చట నాంధ్రవిష్ణుదేవాలయము గలదు. ఒకానొకరాజు విష్ణ్వంశమున నిచ్చటఁ బుట్టెననియు, నాతని ద్యోతకముగనే యీదేవాలయము నిర్మింపఁబడియె ననియుఁ జెప్పుదురు. క్రీ. శ. ౧౫౧౫-లోఁ గృష్ణదేవరాయలవారు “కళింగదేశ విజిగీషామనీషం దండెత్తిపోయి విజయవాటిం గొన్ని వాసరంబులుండి శ్రీకాకుళనికేతనుఁడగు నాంధ్రమధుమథను సేవింపఁబోయి” నప్పుడు విష్ణుచిత్తీయమను గ్రంథము తెనుఁగున రచింప నాతనిఁ బురికొల్పె:—

“గీ. తెలుఁగదేలయన్న దేశంబు తెలుఁగేను
దెలుఁగువల్లభుండఁ దెలుఁగొకండ
యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.”

అని చెప్పినది యీ యాంధ్రవిష్ణువే. ఇది యటుండెఁ. శ్రీకాకుళముకాక యాంధ్రులకుఁ గొంతకాలము అమరావతియు ధరణికోటయు రాజధానులుగా నుండెనని కొందఱు వ్రాసి యున్నారు. రాజ్య మభివృద్ధియైన తరువాత వీరికిఁ బ్రస్తుతము పైఠణ్ అనఁబడు ప్రతిష్ఠానపురము పశ్చిమరాజధానిగా నుండెను. రాజ్య మభివృద్ధియైన తరువాతఁ జాళుక్యుల

వలెనే యాంధ్రరాజులును పూర్వాంధ్రులు, పశ్చిమాంధ్రు లని రెండు తెగలవారలు వేఱువేఱుగ రాజ్యము చేయుచుండి రని కొందఱు పండితుల యభిప్రాయము. 1 కాని యందు లకుఁ బ్రబలమైన నిదర్శనములు లేవు. ఒక్కవంశమువారె యుభయత్ర రాజ్యముఁ జేసినట్టు గానవచ్చుచున్నది.

పురాణములలోని వర్ణనలు చూడఁగా నీవంశములో ముప్పదిగురు రాజులు నాలుగువందలయేఁబదియాఱు సంవత్స రములవఱకు రాజ్యముచేసినటు లేర్పడుచున్నది. వారందఱ పేళ్లిచ్చుట నుదాహరించుట యనావశ్యకము. అందు ముఖ్యు లైనవారిని వర్ణించినఁ జాలును.

మగధరాజుల ధిక్కరించి స్వతంత్రులయిన రాజులలో మొదటివాఁడు శ్రీముఖుఁడు (క్రీ. పూ. ౨౨౦); రెండవ వాఁడు 'కన్హా' అనఁబడు కృష్ణుఁడు. వీరు మహాశూరాగ్రేసరు లయి యనేక రాజులను జయించి యాంధ్రరాజ్యపుఁ బొలి మేరను గోదావరి మూలస్థానమగు నాసికాత్ర్యంబకేశ్వరము వఱకును జరిపిరి.

మూఁడవవాఁడో నాల్గవవాఁడో యగునాంధ్రరాజు తన సఖుఁడగు ఖారవేలుఁడను కళింగరాజుయొక్క సాహాయ్యార్థమై యొక ప్రచండ చతురంగ సేనను బంపెను (క్రీ. పూ. ౧౬౮). ఈ కాలమునుండి రమారమి నూటయేఁబది సంవత్సరముల వఱకు నీ యాంధ్రరాజుల చరిత్ర మన కంతగాఁ దెలియదు. అప్పటి శాసనములు కానవచ్చుట లేదు.

1. ఇది ముఖ్యముగా డాక్టరు భాండార్కర్ గారి యభిప్రాయము.

క్రీ. పూ. ౨౭-వ సంవత్సరమున నాంధ్రవంశపురాజొకఁడు కాణ్వవంశజుఁడగు మగధరాజును జంపి మగధరాజ్యమును ఆక్రమించుకొనియె నని యిదివఱకే వ్రాయఁబడినది. ఇట్టు గాణ్వరాజును జంపినవాఁడు ఆంధ్రరాజులలో మొదటివాఁడగు శ్రీముఖుఁడే యని పురాణకారులు వ్రాసిరి. కాని యీ యుభయులకాల మొక్కటికానందున నీమాట నమ్ముటకు వీలులేదు. కాణ్వరాజగు సుశర్మను జంపినవాఁడు, ఆంధ్రరాజులలోఁ బండ్రెండవవాఁడగు కుంతలశాతకర్ణి, పదుమూఁడవవాఁడగు శాతకర్ణి, పదునాల్గవవాఁడగు ప్రథమ పులమాయి యను నీముగ్గురిలో నెవ్వఁడో యొక్కఁడై యుండును. అట్టివాఁడు వీఁడే యని నిశ్చయముగాఁ జెప్పుటకు వీలులేదు.

ఈవంశములోని పదునేడవరాజగు హాలుఁడనువాఁడు విక్రమార్క, భోజ, కృష్ణరాయ సదృశుఁడయి విద్వాంసులను గవులను నాదరించుచుఁ దానును విద్వాంసుఁడును గవియు నయి యుండెను (క్రీ. శ. ౬౮). ఈతఁడు సప్తశతి యను గ్రంథంబొకటి ప్రాకృతంబున రచించెను. ఇతని మంత్రులు కాతంత్రవ్యాకరణమును పైశాచీభాషయందు "బృహత్కథా" యను గ్రంథమును రచించిరి. పైశాచి యనునది ప్రాకృత భాషలలో నొకభేదము. ఈ ట్లీరాజు దేశభాషాభివృద్ధికై మిక్కిలి పాటుపడినట్టు గానవచ్చుచున్నది. ఇట్టిరాజచంద్రులేరికిఁ బూజ్యులుకారు?

తరువాత నాంధ్రవంశవృక్షములోని నిరువదియొకటవవాఁడగు మొదటి విలివాయకురుఁడనువాఁ డాఱునెలలు

మాత్రము రాజ్యము చేసెను (క్రీ. శ. ౮౪). ఈతనికి "చకోరుడు" రాజతశాతకర్ణి యను బిరుదునామము లుండెను. ఈతఁడు వాసిష్ఠీ పుత్రుఁడు. అనఁగా నితనితల్లి వసిష్ఠగోత్రమువారి యింటి యాఁడుబడుచు. ఈరాజునొద్దనుఁడి తరువాత రాజు లందఱును దమతల్లుల పేళ్లు శాసనాదులలోఁ జెప్పినందున వీరితల్లులు విఖ్యాతవంశజ లనియు లేక విద్యాదిగుణములచేఁ బ్రఖ్యాతలనియు మన మూహింపవలసియున్నది.

ఈతని కుమారుఁడగు శివాలకురుఁ డిరువదియెనిమిది సంవత్సరములు (క్రీ. శ. ౮౫-౧౧౩) రాజ్యముచేసెను. ఈతనికి మాఢరీపుత్రుఁడనియు, శివశాతకర్ణుఁడనియు, శకసేనుఁ డనియు బిరుదులు కలవు. ఇందువలన నీతఁడు శకవంశపు పరరాజుల నోడించినట్లు గానవచ్చెడిని.

ఈతని కుమారుఁడగు రెండవ విలవాయకురుఁ డిరువదియై దేండ్లు (క్రీ. శ. ౧౧౪-౧౩౯) రాజ్యముచేసెను. ఈతఁడు గౌతమీపుత్రుఁడు. ఆంధ్రరాజులలో నందఱిలో నీతఁడు మిక్కిలి పరాక్రమవంతుఁడును స్వదేశాభిమాన పూరితుఁడును నగునని చెప్పుటకు సందేహము లేదు. శక, పహ్లావ, యవనులు అను విదేశీయులనేకు లీరాజు రాజ్యమునకు వచ్చుటకుఁ బూర్వమే బలుచిస్థాన్ మొదలయిన పశ్చిమదిక్కులనుండి హిందూదేశములోఁ జొరఁబడి యచ్చటివారిని గెలిచి యింకను ముందుకు వచ్చి యాంధ్రరాజ్యములోఁ గొంతభాగముగూడ నాక్రమించు కొనిరి. ఆంధ్రరాజాగ్రగణ్యుఁడగు రెండవ విలివాయకురుని

కాలమున నాంధ్రరాజ్యములోని పశ్చిమభాగమును ఆక్రమించు కొనియున్న పరరాజు నహపానుఁడు అను క్షత్రపుఁడు(Satrap). ఈతఁడు క్షహరాట వంశజుఁడు. ఈతఁడు పరదేశీయుఁడయ్యు నందున హిందువులయందును వారి శాస్త్రములయందును నసూయ గలవాఁడయి వారిని మిక్కిలి బాధపెట్టు చుండెను. ఇట్టి శత్రువుతోఁ బోరాడి, విలివాయకురుఁ డాతనిని క్రీ. శ. ౧౨౬లోఁ బూర్తిగ నోడించెను. ఇటులే యన్యదేశీయులగు రాజుల ననేకుల నాశమొందించి దేశమును బారతంత్ర్యమునుండి తొలఁగించి, స్వరాజ్యమును స్వధర్మమును నిలిపెను. ఈ రాజుతల్లియు గౌతమగోత్రోద్భవయు నగు బలశ్రీ యను పేరమాత క్రీ. శ. ౧౪౪–లో వేయించిన జయశాసనమందు "శకపహ్లవ యవనుల నాశమొందించి చాతుర్వర్ణ్యసంకరము గాకుండఁగఁ జేసినట్టియు, ధర్మశాస్త్రానుసారముగఁ బ్రజలయొద్దనుండి గైకొనిన పన్నుల యుక్తమగునటుల వెచ్చించినట్టియు" వీరాగ్రేసరునకుఁ దాను తల్లియైనటుల గౌరవపూర్వకముగా శిలాక్షరములఁ జెక్కించెను. 1

ఈరాజు నహపానుని గెలిచినతరువాత నచ్చటఁ దన ప్రతినిధిగా చష్టనుఁ డనువాని నుంచెను. ఈతఁడు శకవంశజుఁడగు క్షత్రపుఁడు. చష్టనుఁడు ఉజ్జయిని రాజధానిగా రాజ్యమేలె. నాల్గవశతాబ్దమున గుప్తవంశజుఁడగు విక్రమార్కుఁడు ప్రబలి యీరాజ్యమును ఆక్రమించుకొనువఱకు నీతని వంశజులే యచ్చట రాజ్యము చేయుచుండిరి.

---

1. ౪౭ వ కార్లిశాసనముఁ జూడదగు.

క్రీ. శ. ౧౩౮-లో రెండవ పులుమాయి రాజ్యమునకు వచ్చెను. ఈతఁ డాంధ్రరాజుల వంశవృక్షమునందు నిరువది నాల్గవవాఁడు. వాసిష్ఠీ పుత్రుఁడు. ఈతని తండ్రియగు రెండవ విలవాయకురునిచే నుజ్జయినికి క్షేత్రపునిఁగా నేమింపఁబడిన చస్తనుని మనుమఁడగు రుద్రమాన్ క్షేత్రపుఁ డప్పుడు ఉజ్జయినిని బాలించుచుండెను. రుద్రమానుని కూఁతురగు "దక్షమిత్రి" యను నామెను ఈ పులుమాయి వివాహమాడెను. కాని రాజ్యసంబంధమైన మామకును నల్లునకును బోరాటంబయి యందు రుద్రమానుఁడే విజయుఁడయ్యె. అందువలన నాతఁడు ఆంధ్రుల రాజ్యములోని సౌరాష్ట్రము (కాథియావాడ్), మాళవము, కచ్ఛము, సింధుదేశము, కొంకణము అను రాజ్యములను ఆక్రమించుకొని స్వతంత్రుఁడయ్యె (క్రీ. శ. ౧౪౫). ఈ రెండవపులుమాయి తన రాజధానిని ప్రతిష్ఠానపుర మనఁబడు పైఠణ్ పట్టణమునకు మార్చెను. ఈతఁడు ముప్పదిరెండు సంవత్సరములు రాజ్యముచేసి మృతుఁడయ్యె (క్రీ. శ. ౧౩౮-౧౭౦).

ఈ రాజుకాలమునుండియే యాంధ్రవంశపు రాజుల వైభవదశ తగ్గఁజొచ్చెనని చెప్పవచ్చును. తరువాత రాజ్యము చేసిన రాజులలో యజ్ఞశ్రీయను రాజు మాత్రము పేర్కొనఁదగినవాఁడుగ నున్నాఁడు. ఈతఁడు గౌతమీపుత్త్రుఁడు; క్రీ. శ. ౧౮౪ మొదలు ౨౧౩-వఱకు నఱువదితొమ్మిదేండ్లు రాజ్యముచేసెను. ఉజ్జయినీ క్షేత్రపులచే నాక్రమింపఁబడిన రాజ్యములలోఁ గొన్నిటిని గెలిచి, యచ్చటఁజెల్లుబడినిమిత్తము

వెండినాణెములఁ జేయించెను. ఓడయొక్క ముద్రిగలనాణెము లీరాజుపేరుగలవి. అందువలన నీతని రాజ్యములో సముద్రవర్తకము విశేషముగా నున్నట్లు మనమూహింపవచ్చును.

ఈరాజు తరువాత ముగ్గురు రాజులు రాజ్యము చేసినట్లును తరువాత నీవంశ మంతరించినట్లును పురాణములవలనఁ గానవచ్చుచున్నది. క్రీ. శ. మూఁడవశతాబ్దమునందలి హిందూదేశచరిత్ర యంధకారబంధురమై యున్నందున నీయాంధ్రవంశ మెట్లంతరించినదియు, వీరిరాజ్య మెవ రాక్రమించుకొనినదియు స్పష్టముగాఁ దెలియదు. అయినను ఈరాజ్యమంతయు ననేకరాజులచే నాక్రమింపఁబడి చిన్న చిన్న రాజ్యములుగా మారెనని తోఁచుచున్నది. పశ్చిమరాజ్యమంతయు ఉజ్జయినివా రాక్రమించిరి. ఉత్తరమున రాష్ట్రకూటులును కాలచురి రాజులును బ్రబలిరి. క్రీ. శ. ౨౪౯-లో కాలచుర్యు లాంధ్రులను ఓడించిరి. అప్పటినుండియే కాలచుర్యశకము ప్రారంభమయ్యె. దీనినే చేదిశక మనియెదరు. దక్షిణమున కాదంబులు, పల్లవులు, వేఁగిరాజులు ఆంధ్రరాజ్యమును ఆక్రమించుకొనిరి. ఈలాగున నీమహత్తరమైన యాంధ్రరాజ్యము మూఁడవశతాబ్దమందుఁ దునుకలు తునుకలయ్యెను.

ఈ యాంధ్రరాజులు మొట్టమొదట బౌద్ధమతస్థులుగా నుండి కృష్ణా గుంటూరు మండలములలోని అమరావతి, జగ్గయ్యపేట మొదలగు స్థలములలో బౌద్ధస్తూపములఁ గట్టించి రనియుఁ దరువాత వారు బ్రాహ్మణమతస్థులుగ మారిరనియుఁ

దోఁచుచున్నది. అయినను నీవిషయ మింకను విచార ణీయము.

## శక, పహ్లవ, యవన, బ్యాక్ట్రియన్, కుశను అను పర దేశీయులు.

అలెగ్జాండరునకుఁ దరువాతి గ్రీకురాజులు హిందూదేశమునకుఁ దగిలియున్న బ్యాక్ట్రియా యనుదేశమును ఏలుచుండిరి. ఆంధ్రరాజులు మహావైభవమునందున్న కాలమున హిందూదేశపు ఉత్తర పశ్చిమములనుండి యీ బ్యాక్ట్రియనులనేకులు మనదేశములోనికి వచ్చిరి. క్రీ. పూ. ౧౩౦-లో నీ బ్యాక్ట్రియనులను ట్యూరేనియను లనువారు గెలిచిరి. అట్లోడిన బ్యాక్ట్రియను లనేకు లీదేశమునకు విశేషముగా వచ్చి యచ్చటచ్చట రాజ్యముల నేర్పఱచుకొని కొన్ని దినంబులకు హిందువులలోఁ గలిసిపోయిరి.

పశ్చిమ ప్రాంతమగు మాళ్వా దేశముననున్న శకరాజుల నచ్చటిదేశస్థు లందఱును గలిసి క్రీ. పూ. ౫౭-లోఁ బంజాబులోనికారూరునొద్ద నోడించిరి. అప్పటినుండియే విక్రమ సంవత్సరము ప్రారంభమాయెను. క్రీ. శ. ౧౨౬ లో నాంధ్రరాజగు రెండవ పిలమాయకురుఁడు నహపానుఁ డనువాని నోడించిన సమాచార మప్పటివఱకే వ్రాయఁబడినది.

## కనిష్కమహారాజు

ఈ శాకులను దరువాత పల్లవు లనఁబడు పార్థియనులు జయించిరి. వారిని కుశనవంశజులు జయించిరి. ఈవంశమునఁ

గనిష్కుఁడను రాజు క్రీ. శ. రెండవ శతాబ్దారంభమునందు విఖ్యాతిఁ జెందెను. అశోకుని తరువాత బౌద్ధ ధర్మమునందు మిక్కిలి శ్రద్ధగలిగి దాని యభివృద్ధికై పాటుపడినరాజితఁడే. ఈతని ఖ్యాతి హిందూదేశమునందే గాక చీనా, టిబ్బేట్, మంగోలియా మొదలయిన దేశములందును ఇప్పటికిని వ్యాపించి యున్నది. ఈతఁడు క్రీ. శ. ౧౨౦-వ సంవత్సరముననో లేక, ౧౨౫ వ సంవత్సరముననో రాజ్యారూఢుఁ డయ్యెను. ఈతని రాజ్య ముత్తరమున కాబూల్ వఱకును, దక్షిణమున వింధ్య పర్వతము వఱకును వ్యాపించి యుండెను.

కనిష్కుఁడు కాశ్మీరదేశము గెలిచి యచ్చటఁ గనిష్కపురమును నిర్మించెను. ప్రస్తుతము దీనిని కానిస్పూరు అని యెదరు. కనిష్కుని కాలమునుండియు నక్బరు కాలము వఱకును గల కాశ్మీరదేశ చరిత్ర కహ్లణకృతమైన రాజతరంగిణి[1] గ్రంథమునందు వర్ణింపఁబడినది. ఈ రాజు పాటలీపుత్రమువఱకును జయించి, యచ్చటనున్న యశ్వఘోషుఁ డను బౌద్ధాచార్యునిఁ దనవెంటఁ గొనిపోయెనఁట.

ఈతని రాజధాని పురుషపుర మనఁబడు ప్రస్తుతపు పెషావర్ పట్టణము. అచ్చట నీతఁడొక గొప్పగోపురము కట్టించెను. అది పదుమూడంతస్తులు గలిగి నాలుగువందల యడుగుల కంటె నెత్తుగ నుండెను. అది చిత్రవిచిత్రముగాఁ జెక్కఁ

1. మిక్కిలి మనోహరమైన యీచరిత్ర కాకినాడలో సరస్వతీ పత్రికాధిపతులచేఁ దెనిఁగింపఁబడినది.

బడిన కఱ్ఱతోఁ జేయఁబడియె. తరువాతి కాలమున నిది రెండు మూఁడు పర్యాయములు కాలిపోయెను. దాని నప్పటిరాజులు మరలఁ గట్టించిరి. ఈగోపురమునొద్దనే యొక గొప్ప విహార మనఁగాఁ బౌద్ధసన్యాసుల యాశ్రమ ముండెను. ఈ యాశ్రమము తరువాత పెక్కువందల సంవత్సరముల వఱకును విద్యాపీఠమని ప్రఖ్యాతిఁ జెందియుండెను. ఈ యాశ్రమము గజ్నిమహమ్మదు చేత నాశమందింపఁ బడినట్లు గానవచ్చెడిని.

## పరరాజుల జయించుట.

ఈ కనిష్కమహారాజు పార్థియనుల నెదిరించి యోడించెను. హిందూదేశములోని రాజ్యములతోఁ దృప్తిఁజెందక యీతఁడు టిబ్బేటుదేశమున కుత్తరము నందును పామీర్స్కుఁ దూర్పునను ఉన్న కాష్గర్, యార్కండు, ఖోటాన్ అను దేశముల జయించెను. ప్రస్తుతమువలెనే యప్పుడును నీ దేశములు చీనారాజునకు లోఁబడి యుండెను.

చీనారాజ్యములోని యీ భాగమును జయించి చీనావారితో సంధిచేసికొని యాసంధిలోని యంశములను దప్పక వారు నడుపుటకై జామీనుగాఁ జీనాదేశపు సరదారులను వెంటఁదీసికొని వచ్చెను. అందుఁ జీనారాజు పుత్రుఁడును ఒకఁడుండె. కనిష్కుఁడీ చీనావారిని మిక్కిలి గౌరవముతోఁ జూచుచు వారు ఉష్ణకాలము వర్షకాలము శీతకాలములం

డుండుటకై వేలువేలు స్థలముల నేర్పఱిచెను. కాబూలున కవతలనుండు కపిశ యను చోటనున్న యాశ్రమ ముష్ణకాలమున మిక్కిలి చల్లగా నుండుటవలన నది చీనా రాజపుత్త్రుని యుష్ణకాలపు నివాసస్థల మయ్యెను. ఈ రాజపుత్రుఁడు తాను చీనా దేశమునకుఁ బోకమునుపు అసంఖ్యధన మాయాశ్రమమునకు నిచ్చెను. అందువలన నేడవశతాబ్దమున హుయెన్ త్సాంగు వెళ్ళిచూచువఱకును నీరాజపుత్రుని పేరచ్చటి సన్న్యాసులు మిక్కిలి గౌరవముతోఁ దలఁచుకొను చుండిరి.

ఈ చీనారాజపుత్రుఁడు చలికాలమునఁ బంజాబుదేశములోఁ గాపురముండుచు వచ్చెను. అతఁడు గాపురముండెడి చోటికిఁ "జీనాపతి" యని పేరు పడెను. ఇచ్చటను నొక బౌద్ధాశ్రమ ముండెను. దీనికి నీరాజపుత్రుఁ డనేక లక్షలు వెలగల బంగారపు కణికలును, రత్న మాణిక్యములును నిచ్చెను. ఈ ధనముపై యక్షరాజగు వైశ్రవణుఁడు కాపుగా నుండి యెవ్వరిని దానియొద్దకు రానీయక యుండెననియు, హుయెన్ త్సాంగు వచ్చినప్పుడు ఆవిహారము బాగు చేయుటకు ధనము కావలసివచ్చి నందున, నాతఁడు ధూపదీపాదికములచే వైశ్రవణుని సంతృప్తుఁజేసి యాశ్రమము బాగుచేయుటకుఁ గావలసిన ధనము మాత్రము తియించి తక్కిన ధనంబును మరలఁ బాతివేయించె ననియు నొక వింతయైన కథ కలదు.

కనిష్కుఁడు మొదట సన్యమతస్థుఁడుగానుండి తరువాత బౌద్ధమతస్థుఁ డయ్యెనని చెప్పెదరు. అశోకునివలెనే యితని

పూర్వచరిత్రను గుఱించి యనేఁగా బుద్ధమతమును స్వీకరించుటకుఁ బూర్వపుఁ జరిత్రనుగుఱించి యనేక కథలు కలవు. కాని వాని నన్నిటిని మనము నమ్ముటకు వీలులేదు. ఈతని నాణెముల వలన నీతని మతము క్రమముగా మాఱుచు వచ్చినట్టు మాత్రము గానవచ్చుచున్నది. ఈతని మొదటి నాణెముల మీఁద సూర్యచంద్రుల ప్రతిమలు గ్రీకు పేళ్లతో (హెలియస్ Helis, సెలీనే Selene) వేయఁబడినవి. ఈనాణెములలో గ్రీకు భాషయు, గ్రీకక్షరములును వాడఁబడినవి. తరువాతి నాణెములమీఁద గ్రీకు, పారసీక, హిందూదేశములలోని దేవతల ప్రతిమలు వేయఁబడినవి. భాష పురాతన పారసీక భాష. లిపి గ్రీకు. కడపటి నాణెములమీఁద బుద్ధుని ప్రతిమయు, గ్రీకక్షరములతో నాతనిపేరును వేయఁబడినవి.

ఈరాజు కాలమునందు బౌద్ధాచార్యుల నాల్గవ పరిషత్తు జరిగెనని యిదివఱకే వ్రాసియున్నాము. ఈ పరిషత్తునకు వసుమిత్రుఁడనువాఁడగ్రాసనాధిపతిగా నుండెనఁట! వైభాషికులు, సర్వాస్తివాదు లనఁబడు బౌద్ధసంప్రదాయములవారి భాష్యము లిచ్చుట నంగీకరింపఁబడిన వఁట!

కనిష్కురా జిరువదియైదు సంవత్సరములో ముప్పది సంవత్సరములో రాజ్యముచేసి క్రీ. శ. ౧౫౭ ప్రాంతమున మృతుఁడయ్యెను.

కనిష్కుని తరువాత హువిష్క వాసుదేవు లనువారు రాజ్యముచేసిరి. తరువాత క్రీ. శ. ౨౨౫ వఱకు నీ వంశము క్రమక్రమముగా నంతరించెను. వీరిని బ్రథమమున పారసీకు లగు సెసానియన్ వారును దరువాత గుప్తవంశము వారును జయించిరి.

## గుప్తవంశము.

నాల్గవ, యైదవ శతాబ్దంబులలో శ్వేతహూణు (White Huns) లను దేశదిమ్మరులయిన యల్లరిమూకలు (Nomadic Hordes) పారసీక హిందూదేశములందుఁ జొరఁబడసాగెను. అప్పుడు కనౌజ్ దేశమును గుప్తవంశజులగు రాజులు పరిపాలించుచుండిరి. ఆంధ్రరాజుల ప్రభ తగ్గిన యొకశతాబ్దము నకు నీవంశపు రాజులు తలయెత్తసాగిరి.

క్రీ. శ. ౨౮౦-వ సంవత్సర ప్రాంతమున మగధ దేశములో గుప్తుఁడనువాఁ డొకఁ డుండెను. వాఁడు శూద్రుఁడు. ఎటులో వీఁడు మహారాజు బిరుదును సంపాదించెను. ఈతని మనుమండగు మొదటి చంద్రగుప్తుఁడను వాఁడు లిచ్ఛవివంశపు వారియింటి చూఁడుఁబడుచును వివాహమాడెను. లిచ్ఛవి వంశపువారు బౌద్ధయుగమున విఖ్యాతిఁజెందిన రాజులని చదువరు లెఱింగియే యున్నారు. వారి సాయమునను, తన శౌర్యము చేతను నీతఁడు క్రీ. శ. ౩౨౦ లోఁ బ్రయాగవఱకు రాజ్యమును నాక్రమించుకొనెను. ఇదియే గుప్తసామ్రాజ్యమునకుఁ బ్రారంభము. ఈతని కుమారుఁడు సముద్రగుప్తుఁడు.

## సముద్రగుప్తుఁడు

(రమారమి క్రీ. శ. ౩౨౬-౩౭౫.)

ఈతఁ డుత్తర హిందూదేశములోని యనేక రాజ్యములను దక్షిణమున రామేశ్వరమువఱకున్న రాజ్యములను గెలిచి యనేకరాజులవలనఁ గప్పము లందుకొనియె. ఈతని దిగ్విజయములను గుఱించి యొక శాసనము ప్రయాగలో నున్నది. ఇందలి పద్యాదికములు హరిసేనుఁ డనురాజకవిచే వ్రాయఁబడి యశోకునిచే వేయింపఁబడిన శాసనముగల స్తంభము మీఁదనే చెక్కఁబడినవి. ఇందు సముద్రగుప్తుఁడు నాలుగుసారులు దండయాత్రలకుఁ బోయి యొకసారి దక్షిణములోని పదునొకండుమంది రాజులను, రెండవసారి ఆర్యావర్తములోని తొమ్మండుగురు రాజులను, మూఁడవసారి ఆరణ్యకనాయకులను నాల్గవసారి సరిహద్దుమీఁది రాజులను గెల్చినటులున్నది. ఈతఁడు మౌర్యచంద్రగుప్తుని రాజ్యమంత విస్తారముగల రాజ్యమును సంపాదించెననుటకు సందియము లేదు. తనవిజయములను జగత్తునకుఁ దెల్పుటకై యీరాజు అశ్వమేధయాగము చేసెను. అప్పు డాతఁడు తన యశ్వమేధ సూచకమగు నాణెముల వేయించెను. అట్టి నాణెమొకటి యీక్రింద గనఁబఱుపఁ బడినది.





అశోకుని వలెనే యీతఁడును దూరదూరదేశపుఁబర రాజులతో స్నేహము చేసి వారియొద్దకు

రాయబారులఁ బంపుచుండెను. ఈతని ప్రభుత్వ సమయము నందు నీతని యనుజ్ఞవడసి సింహళదేశపురాజగు మేఘవర్ణుఁడు బుద్ధగయలో బోధివృక్షమునొద్ద దనదేశమునుండి వచ్చెడి బౌద్ధయాత్రికులకుఁ గాను ఒక భవ్యమయిన విహారముఁ గట్టించెను. ఇందు మూఁడంతస్తులును, ఆఱు విస్తీర్ణమైన చతుశ్శాలలును (Halls), చక్కని చెక్కడపుఁబనియు, వెండి బంగారములతోఁ జేయఁబడి రత్నములు చెక్కఁబడిన బుద్ధ ప్రతిమయు నుండెను. ఏడవ శతాబ్దంబున నిందు వేయిమంది బౌద్ధసన్యాసు లుండిరి. ఈరాజు సంగీత సాహిత్యములందును మిక్కిలి ప్రవీణతగలిగి "కవిరాజు" అను బిరుదును వహించెను.

## రెండవ చంద్రగుప్తుఁడు

(క్రీ. శ. ౩౭౫-౪౧౩)

సముద్రగుప్తుని కుమారుఁడగు చంద్రగుప్తుఁడు అప్పటి వఱకుఁ దమకు లోఁబడని పంజాబు, గుజరాత్, బెంగాల్ దేశముల గెలిచెను. ఢిల్లీపట్టణములో నొక లోహస్తంభము మీఁద నీజయములను గుఱించి వ్రాయఁబడినది. పశ్చిమ క్షత్రపులని (Western Satraps) పేరొందిన యుజ్జయినీ రాజులగు శకనృపతుల నీతఁడు క్రీ. శ. ౩౯౫-లో గెలిచెను. ఇందుచే నీతనికి విక్రమాదిత్యుఁడను బిరుదనామము వచ్చెను. ఈతని కాలముననే ఫాహియన్ అను చీనా బాటసారి యీ దేశమునకు వచ్చెను.

## కుమారగుప్తుఁడు. ౪౧౩-౪౫౫

ఈతఁడును తాతవలెనే పరాక్రమవంతుఁడయి యశ్వమేధ మొనరించెను. ఈతని యవసానకాలమున శ్వేతహూణులు వచ్చి యాతని రాజ్యమునకు మిక్కిలి బాధకలుగఁ జేసిరి. ఇందుగాక పుష్యమిత్ర మను రాజ్యపు రాజుతో నీతనికి యుద్ధము సంభవించెను. అందు నీతనికిఁ బ్రథమమున గొప్ప పరాజయము సంభవించెఁగాని యాతని కుమారుఁడగు స్కంధగుప్తుఁ డనువాఁడు మిక్కిలికష్టపడి రాత్రి భూశయ్యాసయితము చేసి శత్రుని జయించెను.

## స్కంధగుప్తుఁడు.

(౪౫౫-౪౮౦)

ఈరాజు మిక్కిలి పరాక్రమవంతుఁడు. ఉసుళ్ల మందల వలె వచ్చెడి శ్వేతహూణు (White Huns) లఁ దాను రాజ్యమునకువచ్చిన యొక సంవత్సరములోనే మాళవములో నోడించి, వారిని నీదేశమునుండి పాఱఁదోలి యవనదేశమందును దన పరాక్రమముఁ గనఁబఱచెను. పరరాజుల నోడించి, దేశమునకు స్వాతంత్ర్యము నొసఁగి యాతఁడు తన తల్లియొద్దికి వెళ్లి వందేమాతరమ్మని నమస్కారము చేసెను. అప్పుడాశూరమాతకుఁ గల్గిన యానందమును నెవ్వరెవను వర్ణింపఁగలరా?

ఈతని వృద్ధావస్థలో మరల హూణు లీతని రాజ్యము పైకి వచ్చినటులును, కొంతభాగ మాక్రమించుకొనినట్లును గానవచ్చెడిని. ఈస్కంధగుప్తుఁడు క్రీ. శ. ౪౮౦ ప్రాంతమునఁ

బరలోకగతుఁడయ్యె. ఈ గుప్తవంశముయొక్క వైభవ మంతటితో సమాప్తమయ్యె నని చెప్పవచ్చును. తరువాత త్వరలోనే రాజ్యమంతయు ఛిన్నవిచ్ఛిన్నమై "గుప్త" రాజులు చిన్న మాండలికరాజు లయిరి.

## దేశస్థితి.

ఇంతవరకు నాకాలమందలి రాజులను, రాజవంశములనుగుఱించి వ్రాయఁబడినది. ఇఁక నప్పటి దేశస్థితియు, సామాన్యజనాచారములను, వారి నాగరికతయు మొదలగు వానిని గుఱించి విచారింతము. మనవారు చరిత్రలు వ్రాయనందున మన కీయంశములు తెలియుట దుర్లభము. అయినను మనదేశమున కప్పుడప్పుడు వచ్చిన యన్యదేశీయు లీదేశమును గుఱించి వ్రాసియుంచిన యంశములనుబట్టి మన కప్పటిస్థితి కొంతవఱకుఁ దెలియుచున్నది. క్రీ. పూ. మూఁడవశతాబ్దమునఁ జంద్రగుప్త మౌర్యునికాలమున మెగస్తనీస్ అను రాయబారి వ్రాసియుంచిన యంశము లీవఱకే వర్ణింపఁబడినవి. తరువాత రమారమి యేనువందల యేండ్లకు "గుప్త" వంశజుఁడయిన రెండవ చంద్రగుప్తుని రాజ్యసమయమున ఫాహియాన్ అను నొక చీనాదేశస్థుఁ డగు బౌద్ధయాత్రికుఁడు బౌద్ధక్షేత్రములఁ జూచునిమిత్తమును బౌద్ధధర్మగ్రంథముల నభ్యసించునిమిత్తమును హిందూదేశమునకు వచ్చెను. ఇతఁ డీదేశమున నాఱుసంవత్సరము (క్రీ. శ. ౪౦౫-౪౧౧) లుండి యప్పటిస్థితినిగుఱించి కొంత వ్రాసియుంచినాఁడు. ఆ వ్రాఁతచూడఁగా నప్పుడు రామ

రాజ్యమయి యున్నట్లుగా గానవచ్చెడిని. ఉత్తరహిందూస్థానము లోని మథురానగరము మొదలు బేహార్ వఱకును నప్పుడు మధ్యదేశ మని పేరు. ఆ దేశమును గుఱించి యీ బాటసారి యిట్లు వ్రాసియున్నాడు.

“పన్నులవలనగాని రాజకీయోద్యోగస్థులవలనగాని బాధలు లేక ప్రజలు సుఖముగ నున్నారు. కమతపుభూముల వ్యవసాయము చెయువారు మాత్రము పంటలోని కొంత భాగము రాజున కియ్యవలెను. వీరయినను ఇష్టమున్న వ్యవసాయము చేయవచ్చును; లేనియెడల భూమిని విడిచి వెళ్ళవచ్చును. అపరాధులకు శరీరశిక్షలు విధింపకయే రాజులు రాజ్యముచేయుచున్నారు. అపరాధులకు వారి వారి యపరాధముల ననుసరించి కొంచెగనో, గొప్పగనో దండుగలు విధింపఁబడును. రాజుపై మరలమరలఁ దిరుగఁ బడువారి కుడిచేయి తెగవేయుచుందురు... చండాలురు తప్ప రాజ్యమం దెవ్వరును జీవహింసచేయరు; కల్లుత్రాగరు; ఉల్లిపాయగాని, వెల్లిపాయగాని తినరు...కసాయి దుకాణ ములుగాని సారాకట్టేలుగాని లేవు.”

ఈతఁడు పాటలీపుత్రములో నప్పటివఱకునిలిచియుండిన యశోకమహారాజుయొక్క మందిరాదికములను గుఱించి యిట్లు వ్రాసియున్నాడు: “ఈప్రాకారంబులును, రాజద్వా రంబులును, చెక్కడపు రాతిపనియు మనుష్యనిర్మితములు కావు.” ఈ పట్టణమునొద్ద రెండు బౌద్ధవిహారము లుండెను.

అందు నప్పుడు ఆఱువందల బౌద్ధసన్న్యాసు లుండిరి. అది యొక గొప్ప విద్యాపీఠమైనందున నన్ని దేశములనుండియు విద్యార్థు లచ్చటికి విద్య నేర్చుకొనుటకు వచ్చుచుండిరి. అచ్చట మూఁడుసంవత్సరము లుండి ఫాహియాన్ తన మత సంబంధమైన యనేకాంశముల నభ్యసించెను.

మధ్యదేశములో మిక్కిలి పెద్దపట్టణము లుండెను. లోకులు ధనవంతులుగ నుండిరి. దానధర్మములు విశేషముగ నుండెను. బాటపొడుగున ననేకసత్రము లుండెను. లోకోపకారపారీణులును, విద్యావంతులును నగు పౌరులు పాటలీపుత్రమునందు నొకధర్మౌషధశాలఁ బెట్టించిరి. దానినిగురించి యా యాత్రికుఁ డిట్లు వ్రాయుచున్నాఁడు: "రోగముగల బీద లందఱును ఇచ్చటికి వచ్చెదరు. ఈ యౌషధశాలలో వారినిఁ జేర్చుకొని వైద్యుఁ డెట్టిరోగమునకయినను మందిచ్చును; వారికి నన్నపానాదులన్నియు నచ్చటనే యీయఁబడును. అచ్చట వారు రోగము కుదురువఱకు నుండి బాగైనతోడనే వెళ్ళుదురు. ఇట్లు మనపూర్వులు ధర్మౌషధశాలల మహిమను జగత్తునం దందఱికంటెఁ బూర్వమే కనుఁగొనిరి. ఇది యంతయు నశోకుని బోధయొక్క ఫలమని చదువరులు జ్ఞాపకముంచుకొనియెదరుగాక! ఇట్టి యౌషధశాల లాకాలమున హిందూదేశమునందుఁ దప్ప భూభాగమునం దెచ్చటను లేక యుండెను. పదవశతాబ్దంబునఁ గాఁబోలు మొట్టమొదట యూరోపుదేశమున నిట్టి యౌషధశాల నిర్మింపఁబడియె.

సింధునదీ తీరమునుండి మథురాపురమువఱకుఁ గల మైదువందల మైళ్ళలో వేలకొలఁది బౌద్ధసన్న్యాసులు గల యనేక విహారము లీబాటసారికిఁ గానవచ్చెను. మథురాపురి యొద్ద మూఁడువేల భిక్షువులకు నాశ్రయస్థానములయిన యిరువది విహారములుండెను. అందువలన నాకాలమున బౌద్ధమత ముత్తరమున విజృంభించియుండెనని చెప్పవలసియున్నది.

ఈబాటసారి పాటలీపుత్రమునుండి రాజగృహము, గయ, కాశి, చంప మొదలయిన బౌద్ధక్షేత్రములఁ జూచి తామ్రలిప్తి (టామ్‌లాక్) జేరెను. ఇది గంగానది ముఖము నొద్ద నున్నది. ఆకాలమున నిదియొక గొప్పరేవై యెగుమతి దిగుమతులు విశేషముగాఁ గలిగియుండెను. ఇచ్చట రెండు సంవత్సరములనుండి యీబాటసారి యొక గొప్ప వర్తక నౌక నెక్కి సింహళమునకుఁ బోయెను. అచ్చట రెండేండ్లుండి మఱియొక వర్తకనౌక నెక్కి యనేకహిందువులతోఁగూడి తొంబది దినములకు "జావా" యను యవద్వీపముఁ జేరెను. అప్పు డచ్చట ననేక బ్రాహ్మణు లుండిరి. హిందువులు వర్తకము జేయుట కచ్చటికి వెళ్ళుచుండిరి. హిందూధర్మ మచ్చట నభివృద్ధిఁ జెందుచుండె. ఫాహియాన్ అచ్చటనుండి మఱియొక పడవలో బయలుదేఱి యెనుబది రెండు దినములకు స్వదేశ మగు చీనాకుఁబోయి చేరెను.

ఈ వృత్తాంతమును బట్టి యీకాలమునందు బ్రాహ్మణులుగూడ సముద్రముమీఁద వర్తకమునకై దూరదేశ

ములకుఁ బోవుచుండిరనియుఁ బాశ్చిమ్యములనుండి సింహళ మునకును, సింహళమునుండి జావా సుమాత్రా ద్వీపము లకును, అచ్చటనుండి చీనాదేశమునకును హిందువుల వర్తక నౌకలు తిరుగుచుండెననియు, ౧౫౦౦-సంవత్సరములకిందట జావా, సుమాత్రా ద్వీపములలో హిందూబ్రాహ్మణులు కాఁపురము చేయుచుండిరనియు మనము నిశ్చయముగాఁ దెలిసి కొనవచ్చును. పదునైదువందల సంవత్సరములకుఁ బూర్వ మెనుబది తొంబది దినములు సముద్రయాత్రచేయు నార్యుల సంతతివారు నేఁడు పదునైదుదినముల సముద్రయాత్రకూడ దని వాదించుట చూడఁగాఁ గార్యకారణ సంబంధమును గనుఁ గొను తెలివిగలవారందఱకును నప్పటి మనయున్నతస్థితికిని, ఇప్పటి యవనతస్థితికిని గల కారణము తప్పక గోచరము కాఁగలదు. సముద్రయానము వలదని వాదించు ప్రస్తుతపు మహా నీయులు తమ పూర్వుల వృత్తాంతమును జదివినయెనను విజ్ఞాన వంతులయి తమ దురాగ్రహమును వదలి దేశాభివృద్ధినిమిత్త మై పరదేశములకుఁ బోయి వచ్చినవారిని బాధింపకుందురు గాత!

## శాస్త్రజ్ఞానాభివృద్ధి.

ఈకాలములో ముఖ్యముగా నభివృద్ధిచెందినది జ్యోతిష ము. ఋగ్వేదకాలములోనే యార్యులు జ్యోతిషమును నభ్యసింప నారంభించిరి. బ్రాత్రియుగములో నక్షత్రచక్రముఁ గనిపట్టి దానికిఁ బేళ్ళు పెట్టి,అయన బిందువులఁ గనుఁగొనిరి ; చంద్రుని

గతి ననుసరించి తిథినిర్ణయము చేయునట్టి సామర్థ్యము సంపాదించిరి. కాని యాకాలపుగ్రంథంబు లేమియుఁ గానరావు. జ్యోతిషసిద్ధాంతములు పదునెనిమిది కలవని గ్రంథకారులు వ్రాసియున్నారు. అందుఁగొన్ని మాత్ర మిప్పుడు గానవచ్చుచున్నవి. మిగిలినవి లోపించినవి. అందు మొదటిది పరాశరసిద్ధాంతము. పరాశరతంత్రమని ప్రస్తుత మొకగ్రంథము కలదు. అందు యవనులు పేర్కొనఁబడిరి. కాన నది క్రీ. పూ. రెండవశతాబ్దంబున రచింపఁబడినది యని యూహింపవచ్చును. రెండవది గర్గసిద్ధాంతము. ఇందుఁ గౌసలాది దేశములపై దండెత్తివచ్చిన బ్యాక్ట్రియనులు మొదలగు శకవంశస్థులు పేర్కొనఁబడిరి. కావున నీ గ్రంథము క్రీ. పూ. ప్రథమశతాబ్దంబునందు రచియింపఁబడియె ననవచ్చును. ఇటులే మఱి పదియాఱు సిద్ధాంతగ్రంథములు గలవు.

జ్యోతిషము గాక యితర శాస్త్రంబులును ఈకాలమున నభివృద్ధిజెందెను. షడ్దర్శనములలోని సిద్ధాంతములకును బౌద్ధసిద్ధాంతములకును ఘర్షణజరుగుచున్నందున ననేక తాత్త్వికగ్రంథములు హిందువులచేతను బౌద్ధులచేతను ఈకాలమున వ్రాయఁబడియె. షడ్దర్శనములలోని యూహలును అనేకసూత్రములును సూత్రకాలమునందలి వేయైనను వానికిఁ బ్రస్తుతపుస్తకస్వరూపము బౌద్ధకాలములోనే ప్రాప్తమయ్యె నని యనేక విద్వాంసుల యభిప్రాయమైయున్నది.

సూత్రకాలమునందుఁ • జిన్నిచిన్ని సూత్రములుగా వ్రాయఁబడిన ధర్మగ్రంథము లీకాలమున శ్లోకరూపమున వివరముగా వ్రాయఁబడియె. మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి మొదలయిన వన్నియు నీకాలముననే శ్లోకరూపముఁ దాల్చెను. అన్నిటికంటెఁ బూర్వము మనుస్మృతి రచింపఁబడినందున నన్నిటికంటె దానికి నెక్కుడు గౌరవము కలిగెను.

ఇవిగాక బౌద్ధులచే సంస్కృతంబునను, పాలి యనఁబడు ప్రాకృతభాషయందును నసంఖ్య గ్రంథములు వ్రాయఁబడినవి. అట్టిగ్రంథము లప్పటి చరిత్రాదికములఁ గనుఁగొనుట కిప్పుడు సాధనములుగ నున్నవి. అనేక పాలిగ్రంథములలో వర్ణింపఁబడిన యంశముల ననుసరించియే విద్వాంసులచే బౌద్ధయుగపుఁ జరిత్ర కూర్పఁబడినది. అయినను బౌద్ధగ్రంథము లనేకములు మనమింకను జక్కఁగఁ బరిశీలించి యనేక విషయములను గనుఁగొనవలసి యున్నది. నన్నయభట్టునకుఁ బూర్వము తెలుఁగుబాస యెట్టిస్థితిలోనుండెనో మనకుఁ దెలియు నుపాయమేమియు లేదని యనేకు లనుకొనుచున్నారు. కాని యాంధ్రదేశమందలి బెజవాడ, ధరణికోట, అమరావతి, జగ్గయ్యపేట మొదలయిన స్థలములలోని స్తూపములలోను విహారములలోను ఉండిన బౌద్ధులచే వ్రాయఁబడిన పాలిగ్రంథము లెచ్చటనున్నవో కనుఁగొని మనము వానిని శ్రద్ధతోఁ బరిశీలించిన, నాంధ్రదేశమును గుఱించియుఁ నితరదేశములను గుఱించియు ననేక నూతనాంశములు తెలియఁగలవని మాయొక్క నమ్మిక.

## శిల్పశాస్త్రము—చిత్రవిద్య.

బౌద్ధకాలమునందు నీవిద్యలు మిగుల నభివృద్ధిఁ జెందె. బౌద్ధరాజు లనేక దేవాలయములను, స్తూపములను * విహారములను, రాజమందిరములను గట్టించినందున శిల్పులకుఁ దమ నైపుణ్యముఁ జూపుటకు సమయముదొరకెను. నాగ్నజిత్తుఁ డనువాఁడు శిల్పశాస్త్రమును గురించి యొక గ్రంథము వ్రాసెను. ఈ గ్రంథమునందు మందిరములు కట్టుటను గురించియు, విగ్రహములఁ జెక్కుటను గురించియుఁ జిత్రపటముల వ్రాయుటను గురించియుఁ జెప్పఁబడి యున్నది.

అశోకమహారాజుచే నిలుపఁబడిన ధర్మశాసన స్తంభములను గురించి యిదివఱకే వ్రాసియున్నారము. తరువాతి రాజులును నిట్టి స్తంభముల నిలిపియున్నారు. బౌద్ధులకుఁ బవిత్రమైన స్థలమందు స్తూపముల నిర్మించిరి. భోపాల్ దేశములోని శాంచియొద్ది స్తూపంబును, కాశియొద్ది సారనాథస్తూపంబును ముఖ్యమైనవి. ఈస్తూపముచుట్టు రాతిస్తంభములతోఁ గంచె కట్టఁబడినది. ఈ స్తంభముమీఁదఁ గనఁబఱచిన పనితన "మింతింత యని తెల్ప నలవికాదు. ఇచ్చట నేనుఁగులు, జింకలు, కోఁతులు మొదలయిన మృగముల ప్రతిమ లెంతచక్కఁగఁ జెక్కఁబడినవో యంతచక్కఁగఁ బ్రత్యక్షముం దెచ్చుటను జెక్కఁబడి యుండలేదు. వృక్షముల చెక్కడంబులును నద్వితీయముగ నున్నవి. విగ్రహముయొక్క ప్రత్యవయవము

* స్తూపమనఁగా దిబ్బ, యెత్తయిన స్థలము.

వివరముగను శిల్పలాలిత్యము మెఱయునటులును నత్యంత ప్రశంసనీయముగను జెక్కఁబడినది" అని డాక్టరు ఫర్గ్యూసన్ దొరగారు వ్రాసియున్నారు. ఆంధ్రదేశములోని గుంటూరు మండలమందలి యమరావతి స్తూపమందుఁ గానవచ్చెడి శిల్ప నైపుణ్యముగూడ మిక్కిలి ప్రశంసనీయము. దీనిని గురించి యింగ్లీషులో నొక పెద్ద గ్రంథము వ్రాయఁబడినది.

విడివిడి రాళ్ళతోఁ గట్టఁబడక, గుట్టలను బర్వతములను దొలిచి నిర్మింపఁబడిన బౌద్ధదేవాలయము లాకాలమందలి యద్వితీయ శిల్పకళానైపుణ్యంబును వెల్లడిచేయుచున్నవి. ఇట్టి మందిరములకు వెలుపలనంతయుఁ గొండయైనందున నంతగా శోభ యుండదు. కాని లోనికిఁ బోయిచూచిన నింద్రభవన మువలె నుండును. ఇట్టి దొకటి బొంబాయిపూనాలకు మధ్య కార్లీ యనుచోటఁగలదు. దాని పొడవు ౧౨౬ అడుగులును, వెడల్పు ౪౬ అడుగులును అయియున్నది. లోన దివ్యమైన చెక్కడపుఁ బనులచే సుశోభితములగు ముప్పదితొమ్మిది స్తంభములు గలవు.

ఇవిగాక బౌద్ధకాలమునందుఁ గొండలలో గుహలు త్రొలువఁబడి విహారంబులు నిర్మింపఁబడియె. విహారములనఁగా బౌద్ధభిక్షువు లుండు మఠములనియర్థము. ఇట్టివానిలో అజంటా విహారమనునది గొప్పది. ఇట్టి విహారములలో ముఖ్యముగా మధ్య నొక్కవిశాలమైన కూటమి (hall) యు, నందు

జక్కఁగ జెక్కఁబడిన స్తంభములును, వానికివెనుక భిక్షునివాస మునకైచిన్న గుహలును నుండును. అజంటావిహారములలో గో డలపై బుద్ధునిజీవితములోని కొన్ని ప్రసంగములును, బౌద్ధాచా ర్యుల చరిత్రలును సూచించునట్టి చిత్రపటములును జెక్కఁబడి యున్నవి. అందలి స్త్రీపురుషుల ప్రతిమల యొక్క ముఖవికాస ములు సత్త్వప్రవృత్తినిసూచించుచు,నాహ్లాదకరంబులుగనుండును.



అజంటావిహారములోని చెక్కఁడపుఁ బని.

## ఆఱవ ప్రకరణము

# పౌరాణికయుగము.

(క్రీ. శ. ౫౦౦-౧౨౦౦.)

ఇది హిందూమహాయుగములోని కడపటి యుగము. ఈయుగమునందు హిందువులు మొదట మహోన్నతదశ యం దుండినను క్రమక్రమముగా వారి వైభవమును, బలమును, స్వదేశాభిమానమును తగ్గుచుఁబోయి తుదకు వారు తురుష్కులచేతులలోఁ దమరాజ్యమును, యశస్సును, ప్రాణంబుకంటె మించిన స్వాతంత్ర్యంబును గోలుపోయిరి. ఈకథాభాగ మనఁగాఁ దురుష్కులు మన దేశమునకు వచ్చువఱకు జరిగిన వృత్తాంత మంతయు నిందు వర్ణింపఁబడును. ఈయుగమున రచింపఁబడిన గ్రంథములలోఁ బురాణములు ముఖ్యమైనవి గనుక దీనికిఁ బౌరాణికయుగమని పేరు పెట్టఁబడియె.

క్రీ. శ. ప్రారంభమునుండి నాల్గవ యైదవ శతాబ్దంబుల వఱకుఁ బశ్చిమమునుండియు వాయువ్యదిక్కునుండియు శకహూణాదిపరదేశీయులగు తురేనియనులు హిందూదేశమందుఁ జొరఁబడిరని యీవఱకే చదువరు లెఱుఁగుదురు. కొన్ని దినములవఱకు వారు తమ్ము నెదురించువారు లేక యచ్చటచ్చట హిందూరాజులను గెలిచి విఱ్ఱవీఁగి యుండిరి. కాని యిట్టి పరరాజుల నందఱను జెండాడి పాఱఁదోలి దేశమునకు స్వాస్థ్యంబును, స్వాతంత్ర్యంబును నిచ్చిన యార్యభూసుపుత్రుఁ డొకఁడు విక్రమార్కనాముఁ డుద్భవించె. ఈతనికే విక్ర

మాదిత్యుఁ డని పేరు. ఈతని రాజధాని యుజ్జయిని. ఈతఁ డుత్తరహిందూదేశమునం దంతటను దన రాజ్యము వ్యాపింప జేసిముల్తాను నొద్ది కహారూరుప్రాంతమునఁ బరదేశీయులగు శకరాజుల క్రీ. ౫౨౫-లో నోడించి శకకర్త యయ్యెను. ♦

---

♦ప్రస్తుతము విక్రమశకమని వాడఁబడునది క్రీ.పూ.౫౭-వ సంవత్సరము నుండి ప్రారంభమైనట్లుల గానవచ్చుచున్నది. ఈవిక్రముఁడు శకరాజుల జయించినది క్రీ. శ. ౫౨౫-లో నని శాసనమువలనఁ గానవచ్చుచున్నది. కాఁబట్టి విక్రమాదిత్యుని విజయమే విక్రమశకారంభకాల మయిన యెడల రెండింటికిని గాలవ్యత్యాసము కలుగుచున్నది. ఇందుపై ననేక వాదవివాదములు జరిగి విద్వాంసులు తేల్చుకొనిన యంశ మేమన, క్రీ. పూ. ౫౭-లో హిందువులు శకరాజుల నోడించి క్రొత్తశక మొకటి ప్రారంభించిరి. కాని శకనృపతులు ప్రబలినందున నది యడుగంటెను. విక్రమార్కుఁడు క్రీ. శ. ౫౨౫-లో మరల నాపరదేశీయుల నోడించి పూర్వపు శకమునే నిలిపెను. కావున నది క్రీ, పూ. ౫౭ నుండి ప్రారంభమయినను ఈప్రతాపశాలి పేరట దానికి విక్రమశక మని పేరు వచ్చెను. విక్రమశకము క్రీ. పూ. ౫౭-వ సంవత్సరమునఁ బ్రారంభమైనది గనుక విక్రముఁడు గూడ నప్పు డున్నవాఁడె యని యనుకొనఁ గూడదు. ఇదియుఁ గాక విక్రమనామము బిరుదుగాఁ గలవా రనేకు లయిరి. శకయవనాది పరరాజు లనేకపర్యాయము లోడింపఁ బడిరి. క్రీ. శ. ౫౭-లో వా రోడింపఁబడి రని యీవఱకె వ్రాయఁబడినది. క్రీ. శ. ౧౨౬-లో వీరిని ఆంధ్రరాజు లోడించిరి. క్రీ. శ. ౩౬ లో గుప్తరాజగు రెండవచంద్రగుప్తుఁడు వీరిని జయించెను. ఈతనికి విక్రమాదిత్యుఁడను బిరుదు గలదు. క్రీ. శ. ౫౨౫-లో యశోవర్మయను నాతఁడు శకవంశపువారిని జయించి విక్రమనామమును బిరుదుగ సంపాదించెను. కాళిదాసుని యాశ్రయదాతయగు విక్రముఁడు గుప్తవంశమువాఁడని కొందఱును చివర వర్ణించిన యశోవర్మయే యని కొందఱును వ్రాసియున్నారు. కాని యశోవర్మయే విక్రముండని యనేక విద్వాంసుల యభిప్రాయమైనందున నిందు దానినే గ్రహింపనైనది.

## విక్రమాదిత్యుఁడు.

ఈతనికి మాళవదేశములోని ఉజ్జయినీపట్టణము రాజధానిగా నుండెను. దీనినే అవంతీ దేశ మనుచుండిరి. ఈమాళవరాజ్యము మొదట గుప్తరాజులకు లోఁబడియుండెను. కాని యశోవర్మ యను నామాంతరము గల విక్రమాదిత్యుఁ డాఱవ శతాబ్దారంభమున గుప్తరాజుల నోడించి స్వతంత్రుఁడయ్యెను. ఇంతియకాదు. మఱి యనేక రాజులగెలిచి విక్రముఁడు చక్రవర్తియయ్యె. ఈతఁడు మందసారలో వేయించిన జయస్తంభమువలన నీతఁడు హూణశకనృపతులను జయించుటయేగాక అసామునొద్దనుండి పశ్చిమసముద్రముపఱకుఁ గల దేశములనెల్ల జయించి రాజాధిరాజు అనుబిరుదును వహించినటులఁ గానవచ్చు చున్నది. శకరాజుల నోడించిన వాఁడనియుఁ, గవులను మన్నించి విద్యాభివృద్ధి చేసినవాఁడనియు నీతఁడు ముఖ్యముగ నందఱచేఁ గొనియాడఁ బడుచున్నాఁడు.

ఈతనిచే నోడింపఁబడిన హూణశకరాజులలో ముఖ్యుఁడు మిహిరకులుఁ డనువాఁడు. వానిని, వానితో వచ్చిన యితరరాజులను క్రీ. శ. ౫౩౫-లో నోడించినందున శకరాజుల బలమంతయుఁ దగ్గి వారు పంజాబులో వాయువ్య సీమలోని చిన్న మాండలికులయి, విక్రమాదిత్యునికి లోఁబడిరి. జయింపఁబడిన హూణరాజును బట్టుకొని వచ్చి యాతఁడు తనరాజధానిలోఁ ద్రిప్పినటులు జ్యోతిర్విదాభరణమను గ్రంథమున వ్రాయఁబడియున్నది.—

శ్లో॥ యో రూమదేశాధిపతిం శకేశ్వరం
జిత్వా గృహీత్వోజ్జయినీం మహాహవే।
ఆనీయ సంభ్రామ్య ముమోచ తం త్వహో
శ్రీవిక్రమార్కః సమసహ్యవిక్రమః॥

ఈపద్యమువలన విక్రమార్కునిచే జయింపఁ బడిన శకరాజులలోఁ గొందఱు రోమక దేశస్థులుగానుండిరని తోఁచుచున్నది. ఈరాజు మిక్కిలి పరాక్రమవంతుఁడును, యశస్వంతుఁడును నై తన్నెదిరించువారు లేక యేకచ్ఛత్రాధిపత్యమున రాజ్యమేలెను. ఇతని కాలమందుఁ గాశ్మీరరాజులవంశము నశించిపోఁగా సార్వభౌమాధికారముగల యితఁడు తనస్నేహితుఁడును, ఆస్థానకవియునగు మాతృగుప్తుఁడనువానిని ఆరాజ్యముపై నిల్పెను.

ఇతఁడు మిక్కిలి విద్యాభిరుచి కలవాఁడై యనేక విద్వాంసుల మన్నించి తన యాస్థానపండితులుగను కవులుగను ఉంచుకొనియె. కవికులగురువగు కాళిదాసుం డీతని యాస్థానమునం దుండెను. ఈతని సభయందు నవరత్నము లనఁబడు తొమ్మండ్రు పండితులుండిరని చెప్పుదురు—

శ్లో॥ ధన్వన్తరిః క్షపణ కామరసింహ శఙ్కు
వేతాలభట్ట ఘటఖర్పర కాళిదాసాః
ఖ్యాతో వరాహమిహిరో నృపతేఃసభాయాం
రత్నానివై వరరుచి ర్నవ విక్రమస్య.

అనుశ్లోకము సుప్రసిద్ధము. ఇందు ధన్వంతరి వైద్య శాస్త్రవేత్తగను, క్షపణకుఁడు ముహూర్తవిదుఁడుగను, అమర సింహుఁడు శబ్దశాస్త్రవిశారదుఁడుగను, శంకుఁ డనువాఁడు శిల్పశాస్త్రనిపుణుఁడుగను, వేతాలభట్టు మంత్రశాస్త్రజ్ఞుఁడుగను, ఘటఖర్పరుం డనువాఁడు భూగతద్రవ్యముల నెఱుంగు వాఁడుగను, కాళిదాసుఁడు మహాకవిగను, వరాహమిహిరుఁడు జ్యోతిశ్శాస్త్ర పారంగతుఁడుగను, వరరుచి ప్రాకృతభాషా శాసనుఁడుగను రాజసభను అలంకరించుచుండిరఁట. ఇందు క్షపణకుఁడు, అమరసింహుఁడు అన్యమతస్థులు. మొదటివాఁడు జైనుఁడు; రెండవవాఁడు బౌద్ధుఁడు. కడమవారందరు బ్రాహ్మణులు. ఈ యనన్యసామాన్య ప్రతాపవంతుఁడును, స్వదేశాభిమానియు నగురాజు క్రీ. శ. ౫౮౩-లో మృతుఁడయ్యెనని కొందఱూహించియున్నారు. అందువలన నాతఁ డేబదిసంవత్సరములు రాజ్యముచేసినటులఁ గానవచ్చుచున్నది. ఈరాజును గుఱించి మనకింతకంటె నెక్కుడేమియుఁ దెలియనందులకు మన మెంతయుఁ జింతిల్లవలసి యున్నది.

### శిలాదిత్యుఁడు.
(క్రీ. శ. ౫౮౩.)

విక్రమార్కుని తరువాత విఖ్యాతిఁ జెందిన రాజులలో శిలాదిత్యుఁడొకఁడు (రమారమి క్రీ. శ. ౫౮౩). ఈతఁడు బౌద్ధధర్మమునందు నత్యంతాభిమానము గలవాఁడై యుండెను. ఆదినంబులలో హిందూమతమునకును, బౌద్ధమతమున

కును నంతగా వైరభావము లేదు. రెండు ధర్మములును రాజుల చేతను, బ్రజలచేతను గౌరవింపఁబడుచుండెను. హిందువులును బౌద్ధులును, ఒకరితో నొకరు కలిసిమెలసి యుండిరి. ఒకకుటుంబములో నొకఁడు హిందువుగను, మఱియొకఁడు బౌద్ధుఁడుగను, నుండుట సంభవించుచుండెను. ఉభయమతముల విద్వాంసులును నొక్కచోటఁ గూడి యొకరి యాచారము నొకరు గౌరవించుచు స్నేహభావమున మతచర్చలు చేయుచుండిరి.

శిలాదిత్యుఁడు విక్రమార్కునికుమారుఁడని కొందఱు వ్రాసి యున్నారు. ఈతఁడు క్రీ. శ. ౫౮౩-లో రాజ్యమునకు వచ్చి తనతండ్రిపద్ధతికి విరుద్ధముగా శకయవనాది పరరాజుల మిక్కిలి గౌరవించుచుండినందున నాతని సామంతరాజులందఱుఁ దిరుగఁబడిరి. ఈ తిరుగఁబడిన వారికందఱికి స్థానేశ్వరపు రాజగు ప్రభాకరవర్ధనుఁడు నాయకుఁడయి యుండెను. ఇతనికి గుప్తరాజులతోను మాళవరాజులతోను బంధుత్వము కలదు. ఇట్లు మాండలికులందఱుఁ గూడి పరదేశపక్షపాతియగు శిలాదిత్యుని క్రీ. శ. ౫౯౩-లో నోడించి పదభ్రష్టునిఁ జేసిరి. కాని యాతఁడు కాశ్మీరదేశపు హూణరాజగు రెండవ ప్రవరసేనుని సాహాయ్యమున మరల రాజ్యమును సంపాదించెను. అందుపై నితరహిందూరాజు లూరకుండలేదు. ప్రభాకరవర్ధనుని పెద్దకుమారుఁడగు రాజ్యవర్ధనుఁడనువాఁ డీరాజుతో ఘోరముగాఁ బోరి క్రీ. శ. ౬౦౬ లో నీతనిఁ బూర్తిగ నోడించెను. అంతటితో మాళవవంశ మంతరించెను.

శిలాదిత్యుని నోడించి రాజ్యవర్ధనుఁడు కనోజ పట్టణము జయజయధ్వనులతోఁ బ్రవేశింపఁగా శత్రుపక్షము వారెవ్వరో యాతనిఁ జంపిరి. అందుపై నాతని తమ్ముఁడగు శ్రీహర్షుఁడు రాజ్యమునకు వచ్చెను.

## శ్రీహర్షుఁడు.

### (క్రీ. శ. ౬౦౬-౬౪౭)

క్రీ. శ. ౬౦౬లో శ్రీహర్షుఁ డనునామాంతరముగల రెండవ శిలాదిత్యుఁడు ఉజ్జయినికి రాజయ్యె. ఈతనినే హర్షవర్ధనుఁ డనియెదరు. బాణభట్టకృతమైన హర్ష చరితమను గ్రంథమునం దీతని చరిత్ర సవిస్తరముగా వర్ణింపఁబడినది.

విక్రమమున నీతఁడు విక్రమార్కుని యంతటివాఁడు. ఈతని జన్మకాలము క్రీ. శ. 590 అయినందున పట్టాభిషేక సమయమునకు నీతఁడు పదునాఱేండ్లవాఁడు. ఇంత చిన్న వయసులో రాజ్యమునకు వచ్చినవారును, ఇన్ని కష్టముల కోర్చి శత్రువుల నందఱను గెల్చి సామ్రాజ్యము స్థాపించిన వారును అరుదు. ఈ విషయమునందు నీతనిని అక్బరుతోఁ బోల్పవచ్చును. ఈతఁడు రాజ్యమునకు వచ్చినప్పు డీతని కెందఱో శత్రువులుండిరి. కాని యాతఁడు మొదట నైదు వేల యేనుఁగులును, ఇరువదివేల గుఱ్ఱములును, ఏఁబదివేల పదాతులునుగల సైన్యముతో బయలుదేఱి ఆఱు సంవత్సరముల వఱకుఁ గట్టిన నడుమును, పెట్టిన శిరస్త్రాణంబును విప్పకుండ

నవ్యాహతముగఁ బోరి తూర్పునుండి పశ్చిమమువఱకు నుండు శత్రురాజుల నందఱి నోడించి సార్వభౌమత్వమును సంపాదించె. అంతటితో విశ్రాంతిఁ జెందక అఱువదివేల యేనుఁగులును, లక్షగుఱ్ఱములునుగల సైన్యంబులం జేర్చుకొని ముప్పదియైదు సంవత్సరములవఱకు దిగ్విజయయాత్రలకు వెడలుచుండెను. ఆతఁడు దిగ్విజయమునకు బయలుదేరగనే శుభచిహ్నముగ నాతని స్నేహమును గోరి ప్రాగ్జ్యోతిషేశ్వరుఁడైన భాస్కర వర్మ కుమారుఁడు మిక్కిలి వెలగల శ్వేతచ్ఛత్రము నొకదానిని, ఇంకను నమూల్యములైన కానుకలను ఆతనికిఁ దన దూతతోఁ బంపెను. ప్రాగ్జ్యోతిషమనఁగా ఆసాము దేశము. హర్షుఁడు తన సైన్యములను వెంటఁదీసికొని తూర్పు వైపునకును, బశ్చిమపు వైపునకును, ఉత్తరపు దిక్కునకును బోయి మార్గమందలి రాజ్యములను గెల్చుచు, అచ్చటిరాజులు శరణుగోర మరల వారినే వారి వారి రాజ్యములపై నిల్పుచు రమారమి ఆఱు సంవత్సరంబుల వఱకును తిరుగుచునే యుండెను. ఈకాలమున ఉత్తర హిందూదేశమంతయు స్వాధీనపఱచుకొనెనని చెప్ప వచ్చును. హిమాలయము మొదలుకొని నర్మదానదివఱకును నేపాళమును, పశ్చిమమున మాలవ ఘూర్జర సౌరాష్ట్ర దేశ ములును, తూర్పున బంగాళములోఁగొంత, కామరూపము వఱ కును గల దేశ మంతయు నాతని యాజ్ఞకు లోనైయుండె ననుటకు సందేహములేదు. క్రీ. శ. 643 వ సంవత్సరప్రాంత మున గంజాము దేశముపై నీతఁడు దండెత్తివచ్చినట్లు కాన వచ్చుచున్నది. వల్లభిరాజయిన ధ్రువసేనుని క్రీ. శ. 633 వ

సంవత్సరముతిరువాత జయించెను. ఈ ధ్రువసేనునకే హర్షుఁడు తన కూఁతురి నిచ్చి వివాహముచేసెను. ఈ కాలము నందుననే ఆనందపురము, కచ్ఛ, సౌరథ (దక్షిణకాఠేవాడ్) అను ప్రదేశములను గూడ హర్షుఁడు స్వాధీనపఱుచుకొనెను.

హర్షుఁడు నర్మదానదికి దక్షిణమునకు మాత్రము రాలేకపోయెను. దక్షిణమునందుఁ జాళుక్య చక్రవర్తియైన రెండవ పులకేశి రాజ్యముచేయుచుండెను. అతనిని గెల్చుటకు హర్షుఁడు గొప్ప సైన్యములను, విఖ్యాతిసేనాధిపతులనుతీసికొని వచ్చెనుగాని పులకేశి యాతనిని నర్మదానది దాటనిచ్చినవాఁడు కాఁడు. అందుచే నానదియే తన రాజ్యమునకు దక్షిణపు సరిహద్దుగా నెంచి వెడలిపోవలసినవాఁడాయెను. ఈ సమాచారము 620 వ సంవత్సరప్రాంతమున జరిగియుండును. ఈ చక్రవర్తి దూరదూర దేశపురాజులతో రాయబారము జరుపుచుండెను. క్రి. శ. 641 లో నతఁడొక బ్రాహ్మణ మంత్రిని చీనాచక్రవర్తియొద్దకు రాయబారిగాఁ బంపెను. అతఁడు 643 లోఁ దిరిగివచ్చెను. అతనివెంట చీనా చక్రవర్తి యొక్క రాయబారి యొకఁడును, ఆతని సిబ్బందియు వచ్చెను. వారు 645 వఱకు నీదేశమునందే యుండిరి. 647లో మఱియొక రాయబారము వచ్చెను. ఈ రెండు దేశములకును వర్తక సంబంధమైన మైత్రియు మతసంబంధమైన మైత్రియుఁ గల్గియుండుటయే యీ రాయబారముల యుద్దేశము.

## రాజధాని కనోజ్.

కనోజు రాజ్యము స్వాధీనమైనప్పటినుండియు హర్షుఁడు దానినే తన రాజధానిఁ జేసికొనెను. మౌర్యులకాలమునుండి గుప్తుల కాలమువఱకును పాటలీపుత్రమెట్లు హిందూదేశ మందలి ప్రముఖపట్టణముగ నుండెనో యట్లే హర్షవర్ధనుఁడు తన రాజధానిగ మార్చినప్పటినుండియు ననఁగా 7 వ శతాబ్దము నుండి కనోజ్ పట్టణము మిక్కిలి విఖ్యాతిఁగాంచెను. ప్రముఖ పట్టణమన్న యీ గౌరవము 11 వ శతాబ్దమునందుఁ దురుష్కులు ముట్టడించువఱకును ఈ పట్టణరాజమునకు గలిగియుండెను. ఈ నైదువందల సంవత్సరములును ఈ పట్టణము హిందూదేశము యొక్క రాజకీయ కేంద్రముగ నుండెనని చెప్పవచ్చును. ఈ పట్టణము హర్షునికాలమునుండి గణ్యత వహించినను అంతకుఁ బురాతనకాలమునుండియే యుండెను. మహాభారతమునందును, పతంజలిమహాభాష్యమునందును ఇది పేర్కొనఁబడినది. క్రీ. శ. 405 లో ననఁగా రెండవ చంద్రగుప్త విక్రమార్కుని కాలమున ఫాహియాన్ అను చీనా యాత్రికుఁడు ఈ పట్టణమునుచూచి యిచ్చట రెండు బౌద్ధవిహారములు హీనయానమువారివి కలవనియు, నొక స్తూప ముండెననియుఁ జెప్పెను. కాని 636 వఱకు ననఁగా హర్షవర్ధనుని కాలమున నచ్చట నూఱు విహారములును 10,000 బౌద్ధ భిక్షువులును ఉండిరి. హిందూ దేవాలయములు 200 కంటె నెక్కు డుండెను. ఇయ్యది యాకాలమున గంగానది యొడ్డున అయిదు మైళ్లు

పొడవును, ౨,౪ మైలు వెడల్పుగను ఉండెను. పట్టణము చుట్టును మిక్కిలి యెత్తుగల ప్రాకారమును, అచ్చటచ్చట బురుజులును ఉండెను. లోన నచ్చటచ్చట రమ్యమైన యుపవనములును, నీళ్ళ కొలంకులును, దేశదేశ పదార్థసంగ్రహాలయములును కలవు. తరువాత కాలముననుఈ పట్టణము క్రమక్రమాభివృద్ధిఁ జెంది క్రీ. శ. 1017 లో గజ్నీమహమ్మూదీపట్టణమునకు వచ్చినప్పుడు దాని శోభకు నచ్చెరువంది దానిని గుఱించి తనవారి కిట్లువ్రాసెను: "ఇచ్చట వేలకొలఁది మందిరములు గలవు. అవి నిశ్చలభక్తుని నమ్మికవలె దృఢమైనవి. అందుఁ జాలవఱకుఁ జంద్రకాంతశిలలతో నిర్మింపఁబడినవి. ఇవిగాక యసంఖ్య దేవాలయములు కలవు. ఈ కనోజ్ పట్టణమునకు నింత చక్కఁదనము వచ్చుటకుఁ గోట్లకొలఁది దీనారులు సెలవైయుండవలెను. రెండువందల సంవత్సరములలోఁగూడ నిట్టి పట్టణముఁ గట్టుట దుర్లభము." రాజస్థాన చరిత్రకారుఁడగు కర్నల్ టాడ్ అనువాఁ డీపట్టణముఁ గూర్చి "ప్రస్తుతపు లండను పట్టణమువలె జయచంద్రుని రాజధానియగు కనోజ్ పట్టణ మెటుచూచినను పదునైదు కోసులు వైశాల్యము కలదియై యుండె" నని వ్రాసియున్నాఁడు. ఆ నగరమునందు నాకులమ్ముమవారి గడపలు ముప్పదివే లుండెనట! దేవాలయములు 10,000 లుండెను!!

## రాజ్యవ్యవస్థ.

ఇంత పెద్ద రాజ్యమును పాలించుటలో హర్షుఁడు మిక్కిలి జాగరూకతతో మెలఁగుచుండెను. అచ్చటచ్చటఁ

దగిన యధికారులున్నను కేవలముగా వారినే నమ్మి యూరకుండక తాను స్వయముగ దేశమందంతటను సంచారము చేయుచుఁ బ్రజల కష్టసుఖములఁ గనులారఁజూచి న్యాయవిచారణ చేయుచుండెను. ఒక్క వర్షకాలమునందుఁదప్ప మిగిలిన యెనిమిది నెలలును విసుగులేక దేశసంచారము చేయుచుండెను. ఇప్పటివలె నప్పుడు గొప్ప గుడారములు లేవు. కావున రాజు ఒకానొక తావునకు రానున్నాఁడనఁగ నచ్చటఁ గుటీరములు నిర్మింపఁబడి యొక శిబిరము సిద్ధము చేయఁబడుచుండెను. రాజు తన పరిజనములతో వచ్చి యందుఁ గొంతకాలముండి, యాప్రాంతపు వ్యవహారముల నన్నిటిని విచారించి అన్యాయము జరిగిన వారికి న్యాయము కలిగించి, సజ్జనులను గౌరవించి యచ్చటినుండి మఱియొక తావునకుఁ బోవును. అంత నా దారునిర్మితమైన గుడారమును కాల్చివేయుచుండిరి. ఒక శిబిరమునుండి మఱియొక శిబిరమునకుఁ బోవుటకుఁబూర్వము ఢక్కాధ్వని చేయుచుండిరి. ఎన్ని యోజనములపై మకాము చేయవలయునో యన్ని దెబ్బలు ఢక్కామీఁదఁ గొట్టుచుండిరట. దానినిబట్టి సైనికులకుఁ దరువాతి మకాముస్థలము తెలియుచుండెను.

రాజ్యవ్యవస్థయంతయుఁ బ్రజల క్షేమమునందు దృష్టి యుంచియే చేయఁబడుచుండెను. ఇప్పటివలెనే అప్పటి పన్నులలో ముఖ్యమైనది భూమిపన్ను. అది సాధారణముగ రాబడిలో నాలవపాలుగనుండెను. ఉద్యోగస్థులకు నగదు జీతములు లేవు. భూము లీయఁబడుచుండెను. వెట్టికిఁ దెచ్చిన వారికిఁ గూడఁ గూలియీయఁబడుచుండెను. మొత్తముమీఁదఁబన్నులు

చాలతక్కువ. ప్రజలు రాజునకై స్వయముగఁ జేయవలసినపని యును స్వల్పముగ నుండెను. దానధర్మములకై తగిన యేర్పా టులు చేయఁబడెను. నేరములు చేసినవారికి శిక్ష లిప్పటికంటెఁ గొంచెము కఠినముగ నుండెను. గొప్ప నేరములకు ముక్కు, చెవి, చేతులు, కాళ్ళు తెగఁగొట్టుచుండిరి. చిన్న నేరము లకు దండుగలు విధించుచుండిరి.

రాజునకు వచ్చు నాదాయ మాతఁడు నాల్గు భాగము లుగ విభజించును. మొదటిభాగము రాజ్యవ్యవస్థకును, యజ్ఞ యాగాది క్రతువులకును, రెండవభాగము మంత్రులకును ముఖ్యులైన యితరోద్యోగియులకును, మూడవ భాగము గొప్ప వార్హులగు పురుషుల గౌరవించుటకును, నాల్గవది మతసంబంధ మయిన దాన ధర్మములకును వెచ్చించుచుండెను. ఇందుచే లోకులయొద్దనుండి తీసికొను పన్నులు బహు స్వల్పముగా నుండును. వర్తకము చేయువారు వారియిష్టానుసారముగా సర్వదేశములు తిరుగుచుందురు. కొలఁది పన్నిచ్చిన యెడల వారిని నదులు దాటించెదరు. అప్పుడు హిందూదేశమునకుఁ బరదేశములతో నావికావర్తక మధికముండుటచే సముద్రపు రేవులనున్న పట్టణములలోఁ గోటీశ్వరులు పెక్కుమందియుం డిరి. హర్షునిచేఁ జయింపఁబడిన వల్లభిరాజుల రాజ్యములో "కోటీశ్వరుల కుటుంబములు నూఱు గలవు. దూర దేశము నుండివచ్చిన మిక్కిలివెలగల ద్రవ్యముల యమిత సంగ్రహ మిచటఁ గలదు," అని హుయున్త్సాంగు వ్రాసియున్నాఁడు.

ఆకాలమందు జరుగు వార్తలను వ్రాసి యుంచుటకు నుద్యోగస్థులుండిరి. దేశమందు జరుగు మంచిచెడుగులు, కఱవులు, ఈతిబాధలు, నితర విశేషములును వ్రాసి యుంచుట వీరిపని.

రాజ్యవ్యవస్థకు గ్రామము మొదటిమెట్టు. గ్రామమునకు అక్షపటలికుఁడనియు, కరణికుఁడనియు నిద్దరు అధికారు లుండిరి. వీరిప్పటి మునసబుకరణములకు మూలపురుషులు. కొన్నిగ్రామములు కలిసి యొక విషయమగును. అది యిప్పటి తాలూకావంటిది. కొన్నివిషయములుకలిసిన నొకమండలము. దానిని ఇప్పటి జిల్లాతోఁ బోల్పవచ్చును. కొన్ని మండలములు గలిసి యొక రాష్ట్రము. ఇది యిప్పటి "ప్రావిన్సు" అనుకొనుఁడు. గ్రామమునకు నక్షపటలాధికారి యున్నటులు దేశమునకు దేశాక్షపటలాధికారి యుండెను. దేశ సంబంధమైన "రికార్డు" అంతయు నితని స్వాధీనమం దుండును.

రాజు మిక్కిలి జాగరూకుఁడై దినమంతయుఁ బని చేయుచునే యుండును. దినమును మూఁడుభాగములుగా విభజించి అందొక భాగము రాజ్యవ్యవహారము లందును, మిగిలిన రెండుభాగములును ధర్మకృత్యములందును గడుపుచుండెను. ఇట్లు రాత్రియుఁబవలు పరిశ్రమచేసినను ఆతఁడు చేయఁదలఁచిన పనులకుఁ గాలము చాలకయుండెను. ఇంతదక్షతతోఁ బ్రజాపాలనము చేసినందుననే యాతని ప్రజలకు సౌఖ్యము కలిగి యాతని రాజ్యమునకు రామరాజ్యపుఁ బోలిక గల్గి యారాజపుంగవుని కీర్తి యజరామరమయ్యెను.

హర్షుఁడు తన రాజ్యారోహణకాలమునుండి యొక శకమును బ్రారంభించెను. దానికి హర్షవర్ధనశకమని పేరు. ఇది క్రీ. శ. 606వ సంవత్సరమునందు అక్టోబరు నెలలోఁ బ్రారంభమయ్యెను. కొందఱు చరిత్రకారుల యభిప్రాయప్రకారము హర్షుఁడు రాజ్యమునకు వచ్చి దిగ్విజయము పూర్తిచేసిన తరువాత ననఁగా, ఆఱు సంవత్సరములతరువాత నీ శకము ప్రారంభమాయెనఁట. హర్షుని తరువాత నీ శకము కొన్ని యేండ్లవఱకు నడిచెను. కాని తరువాత దీనికి వ్యాప్తి కలుగలేదు.

## సైన్యము.

ఈ రాజునొద్ద గొప్పసైన్యముండెననియు నందు 5000 ఏనుఁగులును, 20,000 గుఱ్ఱములును, 50,000 కాల్బలమును ఉండెనని యిదివరకుఁ జెప్పియున్నారము. పూర్వపు చతురంగములలో నివి మూఁడు. రథములనునవి నాల్గవది. కాని హర్షుని సైన్యమునందు వాని ప్రాబల్యము కానరాదు. గట్టిరోడ్లులేని యాకాలమునందు రథములను ఒకచోటినుండి మఱియొక చోటికిఁ దీసికొని పోవుట మిక్కిలి కష్టసాధ్యమని రథములను సైన్యముయొక్క యంగములోనుండి యప్పుడు తగ్గించియుండిరి. ఇఁక మిగిలిన మూఁడిటిలోను ఏనుఁగుల పథకమునకు నెక్కుడు గౌరవ ముండెను. హిందూదేశ సైన్యములలోని యేనుఁగులను జూచియే పరదేశీయులైన గ్రీకువారు భయపడుచుండిరి. ఇప్పుడు ఫిరంగులకు మహాత్వమెట్లో అప్పు డేనుఁగులకు నట్లేయుండెను. కావున హర్షుఁడు తనగజసైన్యమును గుఱించి

యొక్కఁడు శ్రద్ధవహించెను. అతని గజశాలమీఁది యధ్యక్షుని పేరు స్కన్దగుప్తుఁడు. ఈగజశాలకునై గజవైద్యులుండిరి. ప్రతి దినమును గొప్ప గజములయారోగ్యతను గుఱించి యధ్యక్షునకుఁ జెప్పుట వారిపని. మావతుల శిరస్త్రాణములు మయూర పింఛములతో నలంకరింపఁ బడుచుండెను. క్రొత్త యేనుఁగులను స్వాధీనముచేసికొనువారు వేఱుగనుండిరి. క్రొత్తగా నరణ్యమునందు నేనుఁగులను పట్టుకొనుటకు గణిక లనఁబడు యేనుఁగు లుంచఁబడుచుండెను. ఏనుఁగులకుఁ బోరాటము నేర్పుటకై యేనుఁగుల యాకారముగల పెద్ద విగ్రహములఁ జేసి వానితో నేనుఁగులు పోరాడునట్లు చేయుచుండిరి. ఏనుఁగులకుఁ గావలసిన తినుబండారమును కొనితెచ్చుటకై వేఱధికారులుండిరి. ఇఁక గుఱ్ఱములను గుఱించి విచారింపఁగా నివి నానాదేశములనుండి తెప్పింపఁబడుచున్నట్లు కానవచ్చుచున్నది. ఆరట్టక, వనాయుజ, కాంభోజ, భారద్వాజ, సింధుదేశజ, పారసీకాశ్వము లాతని సైన్యమునందుండెను.

సేనాధ్యక్షుఁ డలంకరింపఁబడిన యేనుఁగుపైఁ గూర్చుండును. ఆ యేనుఁగును శాసించుటకు నాల్గువైపులను నల్గురు సైనికులుందురు. సైన్యముతోనున్న రథములకు నాల్గుచొప్పున గుఱ్ఱములు కట్టఁబడును. దాని రెండువైపులను రక్షణార్థమై సైనికులుండిరి. కాలిబంటులు కత్తియు డాలును పట్టుకొని యుద్ధములోనికి నిర్భయముగఁ బ్రవేశించుచుండిరి. దేశీయ వీరుల వంశపరాగతమైన వృత్తియే యుద్ధమగుటచే వారు యుద్ధకళలో నారితేరియుండిరి. శాంతత గల కాలమందు రాజ

ధానిని రక్షించుటయు, యుద్ధకాలమందు సైన్యమునకు ముందు నడుచుటయు వీరి పని.

ఈ సైన్యము వ్యయమంతయు రాజు స్వంత ధనములోనుండియే భరించుచుండెను. భటులకు జీతములు సంవత్సరమున కింతయని నిర్ణయింపఁబడును. అది ధనరూపముగను ధాన్యరూపముగను ముట్టఁజెప్పఁబడుచుండెను.

పాండిత్యము, పండితుల నాదరించుట.

ఈ రాజపుంగవుఁడు గొప్ప విద్వాంసుఁడును, విఖ్యాత కవియునని విఖ్యాతిఁజెందియున్నవాఁడు. ఈతఁడు వ్యాకరణమును గుఱించి యొక పుస్తకము వ్రాసెనఁట. అది యిప్పుడు కానరాదు. రత్నావళీ, ప్రియదర్శిక, నాగానందమను మూఁడు నాటికలను ఈతఁడు స్వయముగ సంస్కృతమునందు రచించెను. ఈ నాటికలకు సంస్కృత వాఙ్మయమునందు మిక్కిలి గౌరవము కలదు. రత్నావళీ ప్రియదర్శికలలోని నాంది శివపరముగను నాగానందమందలి నాంది బుద్ధపరముగను ఉన్నవి. రాజు బౌద్ధమతమును అవలంబించిన తరువాత నాగానందము రచింపఁబడియుండును. గొప్ప యుత్సవాదులు జరుగునప్పుడు ఈనాటిక లాడఁబడుచుండెనని, వానిలోని యుపోద్ఘాతములవలనఁ దెలియవచ్చుచున్నది. శ్రీ హర్షునకు సంస్కృతమునందును, ప్రాకృతమునందును మంచి ప్రజ్ఞగలదని మన మీనాటికలవలననే యూహింపవచ్చును. ఈ నాటకములను హర్షుఁడు రచింపలేదనియు, ధావకుఁ డన్న యొక కవి రచించి ధనము తీసికొని రాజుపేరు పెట్టెననియు నొక

గాథకలదు. కాని యెప్పుడెప్పుడు రాజులు గ్రంథములను రచించిరో యప్పుడప్పు డెల్ల నిట్టి గాథలు పుట్టియున్నందున మన మిట్టివాసిని ప్రబలప్రమాణము లున్నఁగాని నమ్ముటకు వీలులేదు. హర్షుని జీవితకాలమునందే, సకల సామంతరాజ వర్గము రాజధానికి వచ్చినప్పుడు వారియెదుట నీ నాటకము లాడఁబడుచుండెననియు ఆడునప్పుడు సూత్రధారుఁడు శ్రీహర్ష మహారాజుచే రచింపఁబడిన నాటక మాడుమని సామంత రాజులు కోరఁగాఁ బ్రదర్శించెదననియుఁ జెప్పుచుండెను. ఇతర కవులు వ్రాసినదానిని దొంగిలించినవాఁడై నయెడల నిట్లు సమకాలమువారియెదుటఁ జెప్పించునా?

హర్షవర్ధనుఁడు స్వయముగ బండితుఁ డగుటయేగాక పండితులను కవులను ఆదరించి ఘనతకెక్కెను. ఈతని సభలోఁ బెక్కురు కవిపుంగవు లుండిరి. వారిలో బాణభట్టు ముఖ్యుఁడు. ఈతఁడు "కాదంబరి," "హర్షచరితము" అను వచనప్రబంధములు సంస్కృతమున వ్రాసెను. కాదంబరి యనునది కల్పిత కథ. ఈ ప్రబంధమునకు సంస్కృతభాషలో ననన్య సామాన్య గౌరవముకలదు. హర్షచరిత్రమునందుఁ గవి హర్షవర్ధనుని చరిత్ర మిక్కిలి రసవంతముగ వర్ణించెను. కొంత వఱకుఁ దన చరిత్రమును చెప్పుకొనెను. ఈ చరిత్రమునందుఁ గొన్ని వర్ణనములు కవికల్పితములయినను మొత్తముమీఁద నిజమైన చరిత్రభాగ మెక్కువగా నున్నదనియే పండితుల

యభిప్రాయము. ఈ రాజుయొక్క స్వహస్తాక్షరి యీక్రిందఁ గనఁబఱుపఁబడినది.

స్వ హ స్తో మ మ మ హా రా జా ధి రా జ శ్రీ హ ర్ష స్య

క్రీ. శ. 630 వ సంవత్సరప్రాంతమున బౌద్ధసన్న్యాసియు, చైనా దేశస్థుఁడును నగు హుయాన్ స్యాంగు (హుయాన్ స్యాంగ్) అను బాటసారి హిందూదేశముఁ జూచి బౌద్ధమతము నభ్యసింప వచ్చెను. అతఁ డీ దేశమునందు ననేక సంవత్సరములుండి యిచ్చటి వేఱువేఱు రాజ్యములను గుఱించియు, నందలి ప్రజలను గుఱించియు, నెక్కువగా వ్రాసియుంచెను. ఈ సన్న్యాసి హర్షునిచే మిక్కిలి గౌరవింపఁబడెను. ఈ సమాచారమును, హర్షుని మతాభిమాన విషయములును మనకు ఈతని వ్రాఁతలవలనఁ దెలియుచున్నవి. ఈ క్రింది విషయము లీవ్రాఁతల ననుసరించియే యుండును.

## హర్షుని మతము, మతసహిష్ణుత.

హర్ష చక్రవర్తి మొదట హిందువుగనుండి తరువాత బౌద్ధుఁడైనట్లు కానవచ్చుచున్నది. హర్ష చరితమును బట్టి

చూడ నాతఁడు వైదికమతమునం దభిమానము గలవాఁడుగనే కానవచ్చును. రత్నావళీ ప్రియదర్శికలయందు శివుని బ్రార్థించెను. కాని బౌద్ధ గురువుల యెడ భక్తికలవానివలెనే కానవచ్చును. బౌద్ధసన్యాసియైన దివాకరమిత్రునిఁ జూచినప్పుడు మిగుల భక్తివిశ్వాసములతోఁ బ్రణమిల్లి వినయవిధేయతలను జూపును. కావున నీ రాజు హిందువుగ నున్నప్పుడు బౌద్ధుల యెడను, బౌద్ధుఁడుగ నున్నపుడు హిందువులయెడను ద్వేషము లేక, సజ్జను లేమతమువారైనను వారిని గౌరవించుచుండెనని చెప్పవలసియున్నది.

ఇట్లు రాజేగాక ప్రజలును ఒకరిమతము నెడ మఱి యొకరు సహిష్ణుత కలిగియుండిరి. హిందూ మతమును, బౌద్ధ మతమును, హిందూ దేవాలయములును, బౌద్ధ దేవాలయములును నిరుగు పొరుగున నున్న యన్నదమ్ములవలె నాకాలమందు నుండెనని యా చీనా బాటసారి వ్రాసియున్నాఁడు. ఈ కాలమువఱకు నీ రెండు మతములలోని ద్వేషభావము పోయి, యిప్పటి శైవ వైష్ణవులవలె నీ రెండు మతములవారును మెలఁగుచుండిరి. ఒకఁడు హిందువుగను, అతని తమ్ముఁడు బౌద్ధుఁడుగను ఉండుటయేకాక, ఒకఁడే భిన్నసమయములందు భిన్నమతముల నవలంబించుట సంభవించుచుండెను. హర్షవర్ధనుని పూర్వుఁడైన పుష్యభూతి వీరశైవుఁడు. అన్యదైవములఁ గొల్చువాఁడుకాఁడు. హర్షుని తండ్రి సూర్యోపాసకుఁడు. హర్షుని యన్నయు, అక్కయు బౌద్ధమతాభిమానులు. హర్షుఁడు శివుని, సూర్యుని, బుద్ధునిఁ గొల్చుచుండెను! వీరందఱకు

గుర్పుకట్టించెను! కాని చీనా యాత్రికుని బోధ విన్నతరువాత నాతనికి బౌద్ధమతమునందు నధిక విశ్వాసము కలిగినట్లు కాన వచ్చుచున్నది. తరువాతనే యాతఁడు తన రాజ్యమునందుఁ బశుహింస చేయకూడదన్న నియమముఁ జేసెను. నిరాహారములుమాని యశోకునివలె మతాభివృద్ధిఁ జేయఁ దొడఁగెను.

కనోజునందు మతోత్సవము.

చీనా పరివ్రాజకుఁడు హర్షునకు బంగాళాదేశమునందుఁ గానవచ్చెను. అచ్చట నాయునిచే నుద్బోధితుఁడై, బుద్ధుని బోధ సర్వజనులకుఁ దెల్పుటకై తన రాజధానికి రావలసిన దిగా నాతనిని గోరెను. ఇందునిమిత్తమై కనోజులో గొప్ప పరిషత్తు జరుగునట్లు ఏర్పాటుచేసెను. రాజు బంగాళమునుండి గంగయొడ్డుననే దక్షిణముగా గొప్ప సేనతోఁ బ్రయాణము చేసెను. అతని సామంతుఁడును కామరూపాధిపతియు నైన కుమారుఁ డనురాజు కొంత సైన్యముతో గంగానది యుత్తరపు టొడ్డునఁ బ్రయాణముచేసెను. ఇట్లు తొంబది దినములు ప్రయాణముచేసి క్రీ. శ. 643 లో వసంతకాలమునఁ గనోజు పట్టణముఁ జేరిరి.

అంత నుత్సవము ప్రారంభమాయెను. కామరూప రాజును, వల్లభిరాజును, మఱి పదునెనిమిదిమంది సామంతరాజులును, విద్వాంసులైన నాలుగువేల బౌద్ధ సన్న్యాసులును, మూడువేల జైనులును, శ్రోత్రియ బ్రాహ్మణులును, అసంఖ్య జనమును ఆయుత్సవముఁ జూడవచ్చిరి. నూతనముగా నొక

గొప్ప యాత్రాశ్రమమును, మందిరమును గంగయొడ్డున నిర్మింపఁబడెను. అందు బంగారముతోఁ జేయఁబడిన బుద్ధ విగ్రహ మొకటి స్థాపింపఁబడెను. అది రా జెంతయెత్తుండెనో అంత యెత్తునఁ జేయఁబడెనఁట. దానిపై నూఱడుగుల యెత్తుగల గోపుర మొకటి నిర్మింపఁబడెను. మూడడుగుల యెత్తుగల మఱియొక బంగారు బుద్ధ విగ్రహము ఉత్సవవిగ్రహముగ వాడఁబడెను. దానిని ప్రతిదినమును ఊరేగించుచుండిరి. అప్పుడు దానివెంట నిరువదిమంది రాజులు తమ పరివారముతోడను, మూడువందల యేనుఁగులును నడుచుచుండెను. శ్రీహర్షుఁడు స్వయముగ నింద్రునివేషము వేసికొని యా విగ్రహముపై ఛత్రము పట్టుచుండెను; కామరూపరాజైన కుమారుఁడు బ్రహ్మవేషము ధరించి చామరము వీచుచుండెను! ఊరేగింపు జరుగుచుండగా రాజు ముత్యములును, బంగారుపూలును, వేలు వెలగల ద్రవ్యములును వెదచల్లుచుండెను. ఇట్లు చేయుటకుఁ గారణము బుద్ధ ధర్మ సంఘము లనఁబడు బౌద్ధుల 'త్రిరత్న' ముల గౌరవించుటయే. రాజు తన చేతులతోడనే విగ్రహము నకు స్నానము చేయించి, తన బుజముమీఁద మోసికొని పశ్చిమ గోపురములోనికిఁ దీసికొనిపోయి, రత్నములతో నలంకరింపఁ బడిన పట్టువస్త్రములు వేలకొలఁది నొసంగును. పిదప భోజనము జరుగును. తరువాత మతవాదములు, మతబోధలును జరుగు చుండెను. సాయంకాలము రాజు మైలుదూరమున నున్న తన శిబిరమునకుఁ బోవుచుండెను.

బౌద్ధమతమునెడ రాజు చూపిన యాదరణమును పమేయుఁ శ్రద్ధను నోర్వఁజాలక కొందఱు రాజును చంపఁజూచిరి. కాని వారు భగ్నమనోరథులై శిక్షితులైరి.

## ప్రయాగలో సర్వస్వదానము.

కనోజులోని యుత్సవము పూర్తియైనతోడనే రాజు మఱియొక యుత్సవమునకై ప్రయాగకుఁ బోయెను. అచ్చట గంగా యమునా సంగమమున రాజు సర్వస్వదానమను మహా వ్రతముఁ జేసెను. అయిదు సంవత్సరముల కొకసారి ప్రయాగలో గొప్ప యుత్సవముచేసి, ఆ యైదు సంవత్సరములలోఁ దాను సంగ్రహించిన ధనమంతయు, బీదలకు, ఆర్తులకు, అన్ని మతములలోని మతగురువులకుఁ బంచిపెట్టుట హర్షుని యాచారమైయుండెను. ఇట్లాతఁడు ముప్పది సంవత్సరములు సేసెనఁట. ఒక యుత్సవసమయమున (క్రీ. శ. 643) చీనా ప్రవాసి యచ్చట నుండుట తటస్థించి యాతఁడా యుత్సవమును సాంగముగ వర్ణించెను.

ఈ యుత్సవముఁ జూచుటకు నాతడవ రమూరమి అయిదు లక్షల జనము వచ్చెనఁట. అందు బీదవారును, పంగువులును, అనాథలును ఎక్కువగ నుండిరి. దూరదూరదేశముల నుండి యాహూతులైన బ్రాహ్మణోత్తములును, ఇతర మతముల సన్న్యాసులును బెక్కురుండిరి. రాజులు మహారాజులును అనేకులుండిరి. ఈ యుత్సవము 75 దినములు జరిగెను. మొదటిదినము బుద్ధుని ప్రతిమ ప్రతిష్ఠింపఁబడెను. అట్లే

రెండవ దినము సూర్యుని విగ్రహమును, మూఁడవ దినము శివుని విగ్రహమును ప్రతిష్ఠింపఁబడియెను. ఈ దినములలో నెక్కువగా దానధర్మములు జరిగెను. నాల్గవ దినము పదివేల బౌద్ధభిక్షువులకు భిక్షజరిగెను. ఒక్కొక్కరికి భోజనాదులు పెట్టి నూఱు సువర్ణముద్రికలును, ఒక ముత్యమును, శాటియు, రాజొసంగెను. తరువాత ఇరువది దినములవఱకు రాజు బ్రాహ్మణులకు దానముచేసెను. తరువాత జైనమతమువారి కిని, ఇతర మతస్థులకును పదిదినములవఱకు దానము జరుగు చుండెను. తరువాత నెలదినములవఱకు బీదవారికి ధనము పంచిపెట్టఁబడెను.

ఇంతవఱకు నైదుసంవత్సరముల సంగ్రహము ముగిసెను! రాజ్యసంరక్షణమునకు నావశ్యకమైన సైన్య పరికరములును, ఏనుఁగులు, గుఱ్ఱములును తప్ప నేమియు మిగులలేదు. రాజు తన నగలు, రత్నములు, హారములు, జరీబట్టలు, పట్టు బట్టలు, మొదలైనవాని నన్నిటిని దానముచేసివేసెను. ఇట్లు ఏమియు లేనివాఁడై తన చెల్లెలిని అడిగి యొక వస్త్రముఁ దీసికొని ధరించి బుద్ధపూజ నొనర్చెను.

## చరమదశ.

హర్షవర్ధనుఁడు రమారమి నలుబది సంవత్సరములు రాజ్యముచేసి క్రీ. శ. 646 లోనో 647 లోనో కీర్తిశేషుఁడైనట్లు కానవచ్చుచున్నది. ఈతనికి సంతానము లేనందున నీతని మంత్రి యీతని రాజ్యమును ఆక్రమించుకొనియెనట

కాని యీరాజు తదనంతరము జరిగిన వర్తమానము విశ్వసనీయమైనది మనకేమియుఁ దెలియదు.

క్రీ. శ. ౭౧౦-లో అశోకవర్మ అనువాఁడు రాజ్యారూఢుఁడయ్యెను. క్రీ. శ. ౭౩౦-లోఁ గాశ్మీరరాజు ఆతనినోడించి యాతని యాస్థానకవీశ్వరుఁడగు భవభూతిమహాకవిని గాశ్మీరమునకుఁ దీసికొని వెళ్ళెనఁట.

ఈ కాలమునకుఁ దరువాతి ఉత్తర హిందూదేశచరిత్ర తెలిసికొనుటకు తానకంతగా సాధనంబులు లేవు.

## పురాణరచన

ఈ కాలమందుఁ గ్రమక్రమముగాఁ బురాణములు రచియింపఁబడియె. పురాణములు పదునెనిమిది యని యందఱకుఁ దెలిసినవిషయమే. ఇవన్నియు నొక్కసారి వ్రాయఁబడలేదు. కాని యందు ముఖ్యమైన వీ కాలమునందు వ్రాయఁబడెనని చెప్పవచ్చును. వేదములో రూపకాలంకారముగ వర్ణింపఁబడిన సృష్టిలోని దృశ్యములను నిజమైన కథలుగాఁ బురాణకారులు వ్రాసిరి. ఇందుల కొక యుదాహరణము. సూర్యుని వలనఁ గలిగిన యుషస్సు మొదటఁ గాన్పించుటయుఁ బిదప సూర్యుం డుదయించుటయుఁ జూచి సూర్యుఁడు తన బిడ్డ వెంటఁ దగిలెనని వైదికఋషులు రూపకము చెప్పిరి. పురాణకారులు దానిని నిజమైన చరిత్రగాఁ గైకొని బ్రహ్మదేవుఁడు తన బిడ్డ

వెనుకఁ దగులఁగా శివుఁడు వాని శిరస్సును దుంచెనని యొక పౌరాణిక కథను గల్పించిరి. ఇట్లు గాథలు పెరిగిపెరిగి పురాణములయ్యెను. జను లీపురాణాదులలోని గాథలు నిజమైనవి యని నమ్మఁజొచ్చిరి. ఇంద్రుఁడు, వరుణుఁడు, రుద్రుఁడు మొదలయిన వైదిక దేవతలు మూలఁబడి శివుఁడు, విష్ణువు, గణపతి మొదలగు పౌరాణిక దేవతల మాహాత్మ్య మెక్కుడయ్యె. ఈ పౌరాణిక దేవతల గౌరవ మెక్కువయైనకొలఁది జనులు కొంద ఱొకదేవతపక్షమువారయి యితరదేవతలను నిందించుచు, శైవ, వైష్ణవ, గాణపత్యాది సంప్రదాయములఁ బుట్టించిరి. పురాణకారులు కొందఱు శివపక్షపాతులు, కొందఱు విష్ణుపక్షపాతులు. ఇట్లీ యాధునిక సంప్రదాయములు పెఱిగెను.

పారాశరాది కొన్ని స్మృతులు గూడ నీకాలంబుననే రచింపఁబడియెనని యూహింపఁ బడుచున్నది.

## శాస్త్రజ్ఞానాభివృద్ధి.

ఆర్యభట్టుఁడను గొప్ప జ్యోతిషికుఁడు పాటలీపుత్ర నగరమునఁ క్రీ.శ. ౪౭౬లో బుట్టెను. ఈతఁడు జ్యోతిషశాస్త్రములోని యనేక నూతనాంశములఁ గనుఁగొని యొకగ్రంథము వ్రాసెను. ఆతఁడు భూమి తనచుట్టు తిరుగుచున్నదనియు, సూర్యచంద్ర గ్రహణములకుఁ జంద్రుఁడును భూచ్ఛాయయుఁ గారణంబులనియుఁ గనిపెట్టెను. క్రీ. శ. ౫౦౫-లో నవంతీపురంబున వరాహమిహిరుఁడను నింకొక జ్యోతిషికుఁ డుదయించె,

ఈతఁడు విక్రమాదిత్యుని సభయందలి నవరత్నములలో నొకఁడు. ఈతఁడు పూర్వసిద్ధాంతముల నన్నిటిని గలిపి పంచ సిద్ధాంతికయను గ్రంథమును బృహత్సంహితయను నింకొక గ్రంథమును రచించెను. వరాహమిహిరుఁడు క్రీ. శ. ౫౮౭-లో మరణముఁ జెందెను.

చరక సుశ్రుతులనువారు వైద్యవిద్య నభివృద్ధి చేసిరి. వీరు బౌద్ధకాలమువారని కొందఱి యభిప్రాయము. చరక కృత గ్రంథమునందు నౌషధ వైద్యంబును గుఱించియు, సుశ్రుతకృత గ్రంథమునందు శస్త్రవైద్యమును గుఱించియుఁ జెప్పఁబడియున్నది. నానావిధ రాసాయనిక మిశ్రణములును (Chemical Compounds), అనేక రాసాయనిక పద్ధతులును (Chemical Processes) అప్పటి హిందువు లెఱింగియుండిరి. అసంఖ్యౌషధులును, వనస్పతిక్రియలును, లోహభస్మములును వారెఱింగియుండిరి. అరబ్బీదేశస్థులీవిద్యలను హిందువులయొద్ద నుండి నేర్చుకొని యూరోపావారికి నేర్పిరి. శస్త్రవైద్యమును గుఱించి వ్రాయఁబడిన వైద్యగ్రంథములలో నూటయిరువది యేడు సూక్ష్మశస్త్రములు వర్ణింపఁబడినవి. ఈశస్త్రములు చకచకలాడుచును పదును గలవిగను, వెండ్రుకను నిలువుగ రెండుతునకలు చేయునంత సూక్ష్మముగను, తీక్ష్ణముగను నుండవలెనని చెప్పఁబడియున్నది. అప్పుడు శస్త్రక్రియలు విశేషముగ జరుగుచుండెను. ప్రస్తుతము దుస్సాధ్యమని యనిపించుకొను వ్రణములనుగూడ నప్పుడు కోసి మాన్పుచుండిరి.

కాని జాతిభేద మభివృద్ధి యైనకొలఁది ఇట్టిపని గొప్పజాతివారు చేయుట మానినందున మంగలవాండ్రు మొదలగు తక్కువ జాతివారిపాలిట నీవిద్య పడెను. అందువలన నీవిద్య మనదేశమందు నభివృద్ధి చెందుటకు మాఱుగా నశించినది. యూరోపు దేశమునందు విద్యాధికులు ఈవిద్యను చేపట్టినందున నది వారిలో మిక్కిలి ప్రబలి యున్నతదశకు వచ్చెను.

అంకగణిత బీజగణితములు హిందూదేశమునందుఁ బుట్టి యితరదేశములలోఁ బ్రసరించెను. అనఁగా నీవిషయములో మనదేశ మన్నిదేశములవారికిని గురుస్థానమై యొప్పెను. దశాంశగణిత (Decimal) మిచ్చటఁ బుట్టెను. అరబ్బీవారు దానిని మనవలన గ్రహించి యూరోపియనులకు నేర్పిరి. బీజగణిత (Algebra) మిచ్చటనే యుద్భవించెను. అరేబియను లీశాస్త్రమును ఎనిమిదవ శతాబ్దంబునఁ దమభాష లోనికి భాషాంతరీకరించుకొనిరి. పీసా నివాసస్థుఁడగు లియునార్డొ యనువాఁడు దీనిని యూరోపువారికి నేర్పెను. నక్షత్రశోధనలకును (Astronomical investigations) రేఖాగణిత సిద్ధాంతములకును (Geometrical demonstrations) బీజగణితమును ఉపయోగించు పద్ధతియు హిందువులే యందఱకు నేర్పిరి.

యజ్ఞయాగాది క్రతువులు తగ్గుటవలన యజ్ఞకుండములను గుఱించి యుద్భవించిన రేఖాగణితమును జనులు విశేషముగ నభ్యసింపరైరి. కాన నీవిద్యను హిందువులవలన నేర్చు

కొనిన గ్రీకువారు శాస్త్రమునందు హిందువులకంటె నధిక గతి కలవారైరి. హిందువులు జ్యోతిషమునందు రాశిచక్రమును, ద్వాదశరాసుల నామములను గ్రీకువారియొద్దనుండి నేర్చిరని యనేక విద్వాంసుల యభిప్రాయమై యున్నది.

## వాఙ్మయాభివృద్ధి.

### కాళిదాసుఁడు

ఈ కాలంబున సంస్కృతములో ననేక కావ్యంబులు నిర్మింపఁబడియె. అట్టి కావ్యకర్తలలో నన్నివిధముల మొదటి వాఁడు కాళిదాసుఁడు. ఈతఁడు రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము అను కావ్యములను శాకుంతలము, విక్రమోర్వశీయము, మాళవికాగ్నిమిత్రము అను నాటకములను రచించెను.

రఘువంశమునందు సూర్యవంశపు రాజుల చరితము లుండును. కుమారసంభవమునందు మన్మథదహన కథయును, శివపార్వతుల వివాహంబును వర్ణింపఁబడినవి. మేఘసందేశంబున వింధ్యపర్వతప్రాంతముననున్న యొక యక్షుఁ డచ్చట నుండి హిమాలయమునకుఁబోవు మేఘమునకు త్రోవ వర్ణించునెపమున ఉత్తర హిందూదేశములోని యనేక పట్టణములను, దేశంబులను జక్కఁగ వర్ణించెను. ఈ కావ్యము లన్నియు సకల జనాహ్లాదకరంబు లయినను అతని శాకుంతల నాటకంబె యతని

యాద్వితీయకీర్తి వైభవంబునకు ముఖ్యకారణము. పదునైదు వందల సంవత్సరములనుండి యీనాటకము సకలజనులచే నాటకరాజమని కొనియాడఁబడుచున్నది. గేటి (Goethe) యను జార్మణ్య విద్వాంసుఁడు దీనిని జదివి యానందంబును బట్టఁజాలక నాట్యము చేసెను! మహాభారతములోని దుష్యంతునికథ ధీరోదాత్తనాయకునికిఁ దగినట్లు మార్పఁబడి యీ నాటకమున వర్ణింపఁబడినది. విక్రమోర్వశీయ నాటకమునందు పురూరవ రాజునకును, ఊర్వశియను నచ్చరకును గలిగిన ప్రేమాదికములు వర్ణింపఁబడినవి. మాళవికాగ్నిమిత్రము నందు అగ్నిమిత్రుఁడను రాజపుత్త్రునకును, మాళవిక యను రాజపుత్రికిని గలిగిన యనురాగమును గూర్చినకథ వర్ణింపఁ బడినది. ఈనాటకము కాళిదాసకృతమగునో కాదో యని విద్వాంసులు భిన్నాభిప్రాయులయి యున్నారు.

పైని వర్ణింపఁబడిన కుమారసంభవాది కావ్యములకర్త యగు కాళిదాసుఁడు గౌడబ్రాహ్మణుఁడు; విక్రముని సభ లోనివాఁడు; వినయాది సద్గుణసంపన్నుఁడు. భోజప్రబంధ ములో వర్ణింపఁబడి మనవారిచే నెక్కువగాఁ జెప్పికొనఁబడు వాఁడు ఆంధ్రకాళిదాసుఁడు; భోజరాజుసభయం దున్నవాఁడు; అత్యంత విషయలంపటుఁడు; ఆత్మగౌరవము లేనివాఁడు. సేతు కావ్యము, రామాయణచంపు అనుకావ్యములఁ గాళిదాసుఁడు

రచించినట్టు చెప్పెదరు. కాని యీకావ్యములు శాకుంతల కర్తయగు కాళిదాసునకుఁ దగినవి కావు. కావున నవి యాంధ్ర కాళిదాసునిచే రచింపఁబడెనేమో యని యూహింపవలసి యున్నది.

## భారవి.

కాళిదాసుని తరువాతఁ గొలఁదికాలములోనే భారవి కవి యుదయించి కిరాతార్జునీయమను కావ్యమును రచించెను. ఇందుఁ గాళిదాసుని కావ్యములోని సహజములగు శబ్ద సౌష్ఠవమును, అర్థగాంభీర్యమును ద్రాక్షాపాకమును లేవు. తెలుఁగులోని వసుచరిత్రవలెఁ బరిశ్రమసూచకంబులగు శబ్దముల జిగిబిగి యల్లికలును, పాండిత్యప్రదర్శకంబులగు శబ్దార్థాలంకారంబులును గలిగి యుండును.

## పంచతంత్రము.

ఈ కాలంబుననే బాలుర నీతిబోధకై పంచతంత్రంబను వచనప్రబంధము వ్రాయఁబడియె. అందుఁ జిత్రవిచిత్రంబులగు నీతికథ లుండును. క్రీ. శ. ౫౩౧ మొదలు ౫౭౯ వరకు రాజ్యము చేసిన నౌషర్వాఁ అను పారసీకరాజు కాలంబున నీగ్రంథము పారసీకభాషలో భాషాంతరీకరింపఁబడియె. అందుండి అరబ్బీలోనికిని, అందునుండి గ్రీకులోనికిని మార్చఁబడి క్రమక్రమముగా నీగ్రంథము యూరోపులోని యన్నిభాషలలోనికి భాషాంతరీకరింపఁబడియె.

## వచనకావ్యములు.

దండికవికృత దశకుమారచరిత్రంబును, బాణభట్టకృత కాదంబరియు, సుబంధుకృత వాసవదత్తయు నేడవశతాబ్దంబున వ్రాయఁబడినవి. ఇవి మూఁడును గద్య ప్రబంధములు. ఇందుఁ గాదంబరీ గ్రంథమునకు సంస్కృతవాఙ్మయంబున మిక్కిలి గౌరవము గలదు. 'బాణోచ్ఛిష్టమిదం జగ' త్తను వచనము సుప్రసిద్ధము. ఈబాణుఁడు శ్రీహర్షమహారాజునకు సమకాలీనుఁడు; ఆతని యాస్థానకవీశ్వరుఁడు. ఈతఁడు హర్ష చరిత మను నింకొకవచనకావ్యము వ్రాసెను. శ్రీహర్షమహారాజు రత్నావళ్యాది నాటకములను ఈశతాబ్దమునందే రచించెనని యీవఱకే చెప్పియున్నారము. భర్తృహరి యనునతఁడు నీతి వైరాగ్యశృంగార శతకంబులను నీ కాలముననే రచించెనని కొందఱూహించుచున్నారు.

## భవభూతి.

ఎనిమిదవ శతాబ్దంబున విఖ్యాతిఁగాంచిన మహాకవి భవభూతియనువాఁడు. ఈతఁడు తెలుఁగుసీమలో జన్మించినవాఁడని డాక్టరు భండార్కర్ మొదలయిన విద్వాంసుల యభిప్రాయమై యున్నది. ఈమహాకవి మహావీరచరిత్రము, ఉత్తరరామచరిత్రము, మాలతీమాధవీయము అను మూఁడు నాటకరత్నంబుల నిర్మించెను. జలస్థలారణ్యస్వాభావిక వర్ణనల యందును, కరుణవీరరస పోషణమునందును నీతఁడు కాళిదా

సుని మించినవాఁడని చెప్పవచ్చును. ‘ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే’ అనఁగా నుత్తరరామచరితమందు భవభూతి కాళిదాసుని మించెనని యొక్క వాక్యము కలదు. ఉత్తరరామచరిత్రలోని సీతావియోగజన్యములయిన రాముని విలాపములను వర్ణించెడి పద్యములు ప్రాతినైనను గరఁగింపఁగలవు. ఈ మహాకవి కొన్నిదినములు విదర్భదేశమునందును, కొన్నిదినములు మగధరాజునాస్థానంబునను, కొన్నిదినములు కాశ్మీరరాజునాస్థానంబునను ఉండెను. ఈతడు క్రీ. శ. ౭౫౦ ప్రాంతమునఁ గీర్తిశేషుఁ డయ్యెనని యూహించెదరు.

## శిల్పకలాభివృద్ధి.

బుద్ధదేవాలయసంబంధమయిన శిల్పకల క్రీ. పూ. ౩వ శతాబ్దమునుండి యభివృద్ధియై క్రీ. పూ. ౫-వ శతాబ్దములో నంతమందెనని యిదివఱకే వ్రాసియున్నారము. తరువాత నాఱవ శతాబ్దంబున హిందువు లీవిద్యను అంతగా నభివృద్ధి చేయలేదు. కాని తరువాతజరిగిన హిందూమతాభివృద్ధితో నీశిల్పకలయు నభివృద్ధిఁజెందెను. మతాభివృద్ధికాలమున ననంఖ్య దేవాలయములు నిర్మింపబడియె.

ఉత్తర హిందూదేశమందలి హిందూశిల్పకళానైపుణ్యముఁ జూపునవి ఒరిస్సాప్రాంతములోని భువనేశ్వర దేవాలయములు. ఇవి క్రీ. శ. ౬౫౫ ప్రాంతమునఁ గట్టఁబడియె. కార్నాక్‌లోని కృష్ణదేవాలయము తొమ్మిదవ శతాబ్దంబునఁ

గట్టియుందురని యూహింపవలసియున్నది. విశ్వవిఖ్యాతమైన జగన్నాథస్వామివారి ప్రస్తుత దేవాలయము ౧౧౭౪-లోఁ గట్టఁబడియె. బుందేల్ ఖండ్, భోపాల్ మొదలయిన దేశములందును మంచిదేవాలయములు గలవు. ఉత్తర హిందూదేశమందు నింక ననేక సుందరదేవాలయములు కట్టఁబడియుండెను. కాని వానిఁ దురుష్కులు నాశమందించినందున నిప్పుడు గనఁబడకున్నవి.

దక్షిణదేశములోని శిల్పనైపుణ్యమును జూపు దేవాలయములలో ఎల్లోరాగుహ యొక్కటియైయున్నది. ఇది పర్వతములో నెంతయు సొగసుగఁ జెక్కఁబడెను. ఎనిమిదవ లేక తొమ్మిదవ శతాబ్దంబున నీ దేవాలయమును జెక్కియుందురు. ఎల్లోరా నైజాము రాజ్యములోని యౌరంగాబాద్ జిల్లాలో దేవగిరియొద్ద నున్నది. తంజావూరు, శ్రీరంగము, మధుర, రామేశ్వరము మొదలయిన స్థలములయందలి యత్యద్భుత దేవాలయంబు లాయాకాలముల శిల్పనైపుణ్యముఁ జూపుచున్నవి. ఇవి పదుమూఁడవ శతాబ్దానంతరము నిర్మింపఁబడియె.

## అప్పటి దేశస్థితి.

క్రీ. శ. ౬౩౦-వ సంవత్సర ప్రాంతమున బౌద్ధసన్న్యాసియు, చీనాదేశస్థుఁడును నగు హుయన్‌స్యాంగు అను బాటసారి హిందూదేశముఁ జూడవచ్చె. అతఁ డీదేశమునం దనేక

సంవత్సరములుండి యిచ్చటి వేఱువేఱు రాజ్యములను గుఱించియు, నందలి ప్రజలను గుఱించియు వర్ణనవ్రాసియున్నాఁడు. అందువలన మనకప్పటి యనేకాంశములు తెలియవచ్చుచున్నవి. అతఁడు కాశ్మీరము, మధుర, కురుక్షేత్రము, హరి



ఎల్లోరాగుహలోని కైలాసము.

ద్వారముఁ జూచెను. హరిద్వారక్షేత్రమునందు గంగానదిలో స్నానము చేయ వేలకొలఁది యాత్రికులు వచ్చియుండిరి. ఆకాలమునందు రెండవ శిలాదిత్యుఁ డనురాజు 'కనౌజ్

రాజధానిలోఁ బాంచవర్షిక బౌద్ధసత్రమొకటి చేయుచుండెను. ఈతనికే శ్రీహర్షుఁడని మాఱు పేరుండెనని చదువరు లెఱింగియే యున్నారు. ఈబాటసారి అయోధ్యనుచూచి ప్రయాగకు వచ్చెను. అచ్చటికి నసంఖ్యహిందువులు ముక్తి సంపాదింప మరణముఁ జెందవలెనని వచ్చియుండిరి. అప్పుడు కాశిపట్టణమందు నిరువది దేవాలయము లుండెను. అచ్చట మహేశ్వరుఁడు ముఖ్యదేవతయై యుండెను. అచ్చట నిప్పుడు రాగితోఁ జేయఁబడిన మహేశ్వరుని ప్రతిమ యొకటి నూఱడుగులెత్తుగలదికలదు. అది మిక్కిలి గంభీరముగను మహనీయముగను ఉండి ప్రాణముగలదివలెఁ గానవచ్చుచుండెను. ఈ బౌద్ధుఁడు తనధర్మమునకుఁ బవిత్రమైన మగధదేశమునందు ననేకదినము లుండెను. అప్పటికి పాటలీపుత్రము నామశేషమయ్యెను. గయయొద్ద బౌద్ధభిక్షువుల యాశ్రమములును, నాలందలో బౌద్ధ విద్యాపీఠంబును నీతఁడు గాంచెను. ఈ విద్యాపీఠ మప్పుడు మిక్కిలి ఘనతనుజెంది వేలకొలఁది విద్యార్థులకు విద్యాదానముఁ జేయుచుండె. అచ్చట గహన విషయములను గుఱించి యడుగఁబడు ప్రశ్నలకును, జెప్పఁబడు ప్రత్యుత్తరంబులకును దినమంతయుఁ జాలక యుండెను. కాన దూరదేశములనుండి యనేక విద్వాంసులు తమవాదశక్తి జూపి ఖ్యాతిఁజెందుటకును, తమ సంశయంబులను బాపుకొనుటకును విద్యాపీఠమగు విహార మత్యంత వైశాల్యముగలదియై

నలుగురు రాజుల ధనసహాయ్యమున నిర్మింపఁబడియె. ఈ భవ్య మందిరము పూర్తియైన తరువాత నందలి విద్వత్పరిషత్తును జూచుటకు రెండువేలమైళ్ళనుండియు జనులు వచ్చుచుండిరి.

మోంఘీరువద్ద హిరణ్యపర్వతమును, భాగల్‌పూరువద్ద చంపారణ్యమును జూచుచు నీబాటసారి బంగాళదేశమునకుఁ బోయెను. అప్పుడు బంగాళమున నైదు అంతరరాజ్యము లుండెను. అవియేవియన:—పుండ్రము (ఉత్తరబంగాళము) కామరూపము (ఆసాం), సమాతతము (తూర్పుబంగాళము), కర్ణసువర్ణము (పశ్చిమబంగాళము), తామ్రలిప్తి (దక్షిణబంగాళము). పుండ్రదేశమునందు విశేషజనవాసంబును ధాన్యసమృద్ధియుఁ గలదు. కామరూపములోని జనులు కపటము లేనివారుగను, విశ్వసనీయులుగను, పొట్టివారుగను, కృష్ణపీత వర్ణముగల వారుగను ఉండిరి. వా రుత్తర హిందూదేశములోని భాషకంటె నన్యభాష మాటలాడుచుండిరి. సమాతతములోని వారు పొట్టివారుగను, నల్లగను, గష్టమున సహించువారుగను విద్యాప్రియులుగను, ధీమంతులుగను నుండిరి. ఈ వర్ణన పూర్వపుబంగాలీ వారికింబోలె యిప్పటి వారికిని నన్వయించును. తామ్రలిప్తిలోని జనులు శ్రమకోర్చువారుగను, శూరులుగను చురుకుఁదనము, తొందఱపాటుకలవారుగను నుండిరి. కర్ణసువర్ణదేశము జనభూయిష్ఠమైనదిగ నుండెను. అచ్చటిజనులు విద్వత్ప్రియులు, విశ్వసనీయులు.

మన బాటసారి బంగాళమునుండి దక్షిణదిక్కుగా నోఢ్రదేశంబునకుఁ బోయె. అచ్చట నుత్తరదేశపు భాషకంటె

వేఱుభాష మాటలాడుచుండిరి. అచ్చటినుండి యాతఁడు కళింగము దాఁటి మన యాంధ్రదేశంబునకు వచ్చెను. ఆదేశమందును పూర్వశిలా అపరశిలా యను రెండు పర్వతములమీఁది బౌద్ధాశ్రమములం జూచెను. అపరశిలయనునది ప్రస్తుతపు అమరావతి స్తూపమని కొందఱి యభిప్రాయమైయున్నది.

కృష్ణానదిదాఁటి దక్షిణమున నీబాటసారి చోళ, ద్రవిడ మాల్యకూట దేశంబులఁ గాంచెను. అచ్చటినుండి యుత్తర దిక్కునకుఁదిరిగి యాతఁడు మహారాష్ట్రదేశము చేరెను. అప్పటివలెనే ఇప్పుడును నాదేశస్థులు మిక్కిలిశూరులు. "వారికి మేలుచేసినవారియెడ వారెంతయు కృతజ్ఞులుగను, శత్రువుల యెడ దయారహితులుగను ఉందురు. వారిని నెవరైన నగౌరవపఱిచిరేని ప్రాణము లర్పించియైనను వా రట్టివానియెడఁ దప్పక కసిదీర్చుకొనియెదరు. ఆర్తుఁడు సాహాయ్యము గోరెనేని వానికి సాహాయ్య మొనరించునెడఁ దమమేలుకూడ మఱచెదరు. పగఁదీర్చుకొనునెడ వీరు మొదటఁ దమ శత్రువునకు హెచ్చరిక చేయుదురు. అట్లిద్దరును సిద్ధమైనతరువాత బల్లెములుతీసికొని పోరాడెదరు. సైన్యాధిపతి యుద్ధములో నోడిపోయినయెడల వానికేమియు శిక్ష విధింపక వానికి నాఁడువారు కట్టుకొనుచీర యిత్తురు. అందువలన నాతఁడు స్వయముగనే యాత్మహత్య చేసికొనును." అని యీబాటసారి వ్రాసెను. మహారాష్ట్రదేశ పూర్వ సీమయొద్ద హుయాన్‌త్సాంగు అజంట గుహలను జూచెను. అచ్చటినుండి యాతఁడు మాళ్వాదేశముఁజూచి సముద్రతీరమునఁ బ్రబలిన

వల్లభీవంశజుల రాజ్యముఁ జేరె. సముద్రవర్తకమువలన నచ్చటి జనులు మిక్కిలి ధనవంతులయి యుండిరి. ఇచ్చట కోటీశ్వరుల కుటుంబములు నూఱు గలవు. దూరదేశములనుండి వచ్చిన మిక్కిలి వెలగల ద్రవ్యముల యమిత సంగ్రహమిచ్చటఁ గలదు' అని యీ బాటసారి వ్రాసెను. ఇప్పుడు హిందూదేశమంతయు వెదకినను పదిమందియైనను కోటీశ్వరులు గానవచ్చెదరా? గుజరాత్, ఉజ్జయిని, సింధుదేశములఁ జూచి హుయన్‌త్సాంగ్ క్రీ. శ. ౬౪౫ లోఁ దన చీనా దేశమునకుఁ బోయెను.

ఈ బాటసారి చూచిన దేశములలో ముఖ్యమైనవి మాత్రము పైని పేర్కొనఁబడినవి. ఆకాలమునందు నీ దేశమునంగల యున్నిదేశముల వివరమును, అతఁడు చూచిన దేశములవివరమును ఇందుతో జతపఱచిన పటమువలన స్పష్టముగాఁ దెలియఁగలవు.

హిందూధర్మమును, బౌద్ధధర్మమును, హిందూ దేవాలయములును, బౌద్ధదేవాలయములును నిరుగుపొరుగున నన్నదమ్ములవలె నాకాలమం దుండెనని హుయన్‌త్సాంగు వ్రాసియున్నాఁడు. ఇట్టి పరధర్మసహిష్ణుత ఈ దేశమునఁ దప్ప నెచ్చటను గానరాదు. ఇదియుఁగాక గ్రీకు బాటసారులును, చీనాబాటసారులును ఈ దేశపుఁ బూర్వజనులను గుఱించి వ్రాయునెడ వాండ్రు సత్యవ్రతులనియు, నిష్కపటులనియు, విశ్వాసపాత్రులనియు వ్రాసియుండుట యెంతయు గౌర

వాస్పదంబుగదా! 'జనసామాన్య మంతగా నాలోచనగలది కాకపోయినను న్యాయపరివర్తనగలదియు గౌరవార్హమును అని చెప్పుటకు సందేహము లేదు. డబ్బునుగురించిన వ్యవహారములలో వారు జిత్తు లెఱుంగరు. న్యాయవిచారణ చేయునెడ నాత్రిపడరు. మోసముగాని, విశ్వాసఘాతముగాని వా రెఱుఁగరు. ఆడినమాటగాని బాసగాని తప్పరు' అని హుయన్‌త్స్యాంగ్ వ్రాసినాఁడు.

అప్పటి రాజ్యపద్ధతినిగురించి యీబాటసారి యిట్లు వ్రాసెను. "రాజునకు వచ్చు నాదాయము నాల్గుభాగములుగా విభజింపఁబడును. మొదటిభాగము రాజ్యవ్యవస్థకును, యజ్ఞయాగాది క్రతువులకును, రెండవభాగము మంత్రులకును ముఖ్యులైన యితర యుద్యోగస్థుల యుపయోగార్థమును, మూడవభాగము గౌరవార్హులగు పురుషుల గౌరవించుటకును, నాల్గవది మతసంబంధమయిన దానధర్మములకును వెచ్చించుచుండిరి. ఇందుచే లోకులయొద్దనుండి తీసికొను పన్నులు బహుస్వల్పముగా నుండును. జనులు రాజుకొఱకు స్వయముగాఁ జేయవలసిన పనులు మిక్కిలి స్వల్పముగానుండెను...... రాజుయొక్క భూములు దున్నువారు రాజునకు షష్ఠాంశమిచ్చెదరు. వర్తకముచేయువారు దారిని ఇష్టానుసారముగా సర్వదేశములు తిరుగుచుందురు. కొలఁది పన్నిచ్చినయెడల వారిని నదుల దాఁటించెదరు. మార్గమున నడువనిచ్చెదరు. దేశకార్యము వచ్చినప్పుడు వెట్టిచేయించుకొనియెదరు. కాని చేసినపనికిఁ దగినకూలి యిచ్చెదరు. సైన్యము పొలిమేరఁ

గా చియుండును; తిరుగఁబడినవారిని శిక్షించును. రాజభవనము చుట్టు గుఱ్ఱపు రౌతులు రాత్రిలందు పహరా యిచ్చెదరు. ప్రయోజనానుసారముగా జనులను యుద్ధభటులుగాఁ గైకొని యెదరు. ఇట్లు భటులగువారి (Volunteers) నామములు అధికారులు తమలెక్కలలోఁ జేర్చుకొనియెదరు. వీరికి జీతము లిచ్చెదరు. ప్రాంతాధికారులు, మంత్రులు, దండనాధకారులు మొదలయిన గొప్పరాజకీయోద్యోగస్థులకుఁ గొంత భూమి యియ్యఁబడును.

### రాజ్యక్రాంతి.

క్రీ. శ. ౬౫౦ నుండి ౭౫౦ యేండ్లవఱకు నుత్తర హిందూదేశచరిత్రమంతగా మనకుఁ దెలియదు. అప్పటికి నుజ్జయిని, కనౌజ్, మగధరాజ్యములు నశించెను. గొప్ప రాజు లెవ్వరు నుదయింపరైరి. విఖ్యాతగ్రంథంబులేవియు వ్రాయఁబడలేదు. క్రొత్తవిద్యలేవియుఁ గనిపట్టఁబడలేదు. కావున దీనిని రాజకీయ నిశాకాల మనవచ్చును.

అయినను ఇట్లు పూర్వపు రాజ్యములన్నియు నాశము నొందిన యీకాలము రాజపుత్రులనుజాతివారి యభ్యుదయమునకుఁ గారణమయ్యె. వీరి యుత్పత్తి మనకంతగాఁ దెలియదు. కాని విక్రమాదిత్యాది రాజులచే నోడింపఁబడిన శకవంశపు పరదేశీయులు వీరి పూర్వులని విద్వాంసుల యభిప్రాయము. ఈశకవంశపువారు హిందూరాజులచే ననేక పర్యాయము లోడింపఁబడియు మరల మరల నీదేశంబునకు వచ్చి, రాజపుతానా (రాజపుత్రస్థాన) దేశమందును, గుజ

రాత్ దేశమందును, మఱియు దక్షిణదేశములందును అనేక రాజ్యముల సంపాదించిరి. ఇట్లు ప్రబలులైన వీరు పురాతన రాజవంశములన్నియు నశించిన యాకాలంబున ఉజ్జయిని, ఢిల్లి మొదలయిన రాజ్యముల నాక్రమించుకొనిరి. పదవ శతాబ్దాంతమువఱకు రాజపుత్రులు ఉత్తరహిందూదేశమంతయు స్వాధీనపఱచుకొనిరి. వీరు మొదట పరదేశీయులగు శకవంశము వారయినను కొంతకాలముపోఁగా నీదేశపువారిలోఁ గలిసి యిచ్చటివారమే యనుకొని తాము హిందూదేశమువారిలోని క్షత్రియులమని చెప్పఁదొడఁగిరి. ఇటులీకాలంబునఁ బ్రాఁత రాజ్యములుపోయి క్రొత్తరాజులు వచ్చిరి. దీనిని రాజ్యక్రాంతి (Political Revolution) అనియెదరు.

### హిందూమతోద్ధారణకాలము.

పైని వర్ణింపఁబడిన రాజ్యక్రాంతి సమయముననే ధర్మక్రాంతియు (Religious Revolution) నీదేశమున జరిగెను. శిలాదిత్యాదిరాజుల కాలములో బౌద్ధధర్మ మీదేశమునఁ బ్రబలియుండెననియు, హిందూధర్మముతోఁ బోరాటము లేకయుండెననియు నీవరకు వ్రాసియున్నారము. కాని తరువాత బౌద్ధధర్మము క్రమక్రమముగా నశింపఁ జొచ్చె. ఆర్యక్షత్రియుల మనిపించుకొనఁగోరు రాజపుత్రులు హిందూమతమును, బ్రాహ్మణులను, పురోహితులను మిక్కిలి గౌరవించుచు వచ్చినందున హిందూమతము ప్రబలి బౌద్ధమతము క్షీణించెను. పదవ శతాబ్దపునంతమువఱకు నీమతము ముక్కాలు మూఁడు వీసము లీదేశమునుండి వెడలఁగొట్టఁబడియె. జైనమతమును

తగ్గిపోయెను. ఇటులు బౌద్ధజైనమతముల నడఁచిన శ్రేయస్సు కుమారిలభట్టు, శంకరాచార్యులు అను నీయుభయులకు నియ్యవలయును.

## కుమారిల భట్టు.

ఈతఁడు క్రీ. శ. ౮-వ శతాబ్దమునం దుదయించి జైన బౌద్ధమతములను ఖండించి కర్మమార్గ ప్రధానమైన వైదిక ధర్మమును ప్రబలఁజేసెను. ఈతనికే భట్టపాదుఁడను మాఱు పేరు గలదు. ఈతఁడు బంగాలీవాఁడని హంటరు మొదలగు వారు వ్రాసిరి. కాని జినవిజయమను జైనగ్రంథములోని యీ క్రింది శ్లోకములవలన నీతఁడు తెలుఁగువాఁడనియు, తైత్తిరీయశాఖవాఁడనియు, నీతని తండ్రిపేరు యజ్ఞేశ్వరభట్టనియుఁ, దల్లిపేరు చంద్రగుణయనియు, ఈతఁడు ఆంధ్రోత్కల సంయోగ ప్రదేశమున అనఁగా ప్రస్తుతపు గంజాము జిల్లాలో జయమంగలమను గ్రామమునందుఁ బుట్టెననియు స్పష్టపడఁ గలదు.

శ్లో॥ ఆన్ధ్రోత్కలానాం సంయోగే పవిత్రే జయమఙ్గలే।
గ్రామే తస్మిన్ మహానద్యాం భట్టాచార్యః కుమారకః॥
ఆన్ధ్రజాతి స్తిత్తిరికో మాతా చన్ద్రగుణాసతీ।
యజ్ఞేశ్వరః పితా యస్య................
మహావాదీ మహాఘోరః శ్రుతీనాం చాభిమానవాన్।

జినానా మస్తకః సాక్షాత్ గురుద్వేష్టాఽతిపాపవాన్.

జైనులు తమ మతగ్రంథములను ఇతరులకుఁ జూపనందున నీ

కుమారిలభట్టు జైనవేషము వేసికొని జినాచార్యులవద్ద నా ధర్మతత్త్వములను నేర్చుకొని తరువాత జైనమతఖండనముఁ జేసినందున జైనులీతనిని గురుద్రోహి యనియెదరు. ఈతఁడు మేదినీపురపు (మిడ్నాపూరు) రాజైన సుధన్వుఁడను వానిని శిష్యునిఁ జేసికొని యతనివలన నసంఖ్యాబౌద్ధజైనులను జంపించె నని కింవదంతి కలదు. కాని యది యంతిగా నమ్మదగినది కాదు. ఈసంగతి నిజమైనను గాకపోయినను ఈదేశమునందు జైనబౌద్ధమతము లడుగంటుటకు నీతఁడు ముఖ్యకారకుఁడని చెప్పవలసియున్నది. తరువాత జన్మించిన శంకరాచార్యులవారి మార్గ మీతఁడు బహుసుకరము చేసి యుంచెను. జైమినికృత పూర్వమీమాంసపై నీతఁడు వ్రాసిన భాష్యమొకటి కాన వచ్చుచున్నది. అందు వర్ణించిన సంప్రదాయమునకు భాట్టమతమని పేరు. ఇతఁడు కర్మమార్గవాది. వేదములో వర్ణింపఁబడిన యజ్ఞయాగాదికర్మలు చేయుటచే ముక్తికలుగునని యీతని సిద్ధాంతము. పూర్వమీమాంసపైఁ బ్రభాకరుఁడనువాఁ డొక భాష్యము వ్రాసెను.

## శంకరాచార్యులు.

విశ్వవిఖ్యాతుఁడగు నీమ్మహానుభావుఁడు శివుని యవ తారమనియుఁ గుమారిలభట్టుయొక్క చరమదశయందు దుద యించెననియు మనహిందువుల యభిప్రాయమై యున్నది. ఇతఁడు క్రీ. శ. ౮-వ శతాబ్దంబున నుదయించియుండు. ఇతఁడు మళయాళ బ్రాహ్మణుఁడు. ముప్పదిరెండు సంవత్సరములు మాత్రము జీవించియుండి బ్రహ్మచర్యమునుండియే సన్న్యా

సిద్ధుఁడై ఆసేతుహిమాలయమంతయుఁ దిరిగి పరమత ఖండనమును స్వమత మండనమును జేయుచు నీదేశములోని బౌద్ధమతమును బూర్తిగా నడుగంటఁజేసెను. విష్ణువు, గణపతి, మొదలగు దేవతలందఱును భేదములేక పూజింపవలయునని పౌరాణికమతమును బోధించెను. ఇతఁడు బౌద్ధదర్శనములోని యనేక సిద్ధాంతములను గ్రహించియు బుద్ధుఁడు విష్ణువుయొక్క దశావతారములలో నొక్కయవతారమని వచించియు ననేక బౌద్ధులను హిందువులుగ మార్చెనని యెదరు.

వ్యాసకృత వేదాంతసూత్రములకును, దశోపనిషత్తులకును, భగవద్గీతకును శంకరుఁడు భాష్యములు వ్రాసెను. వీనికిఁ బ్రస్థానత్రయమని పేరు. యుక్తివాదమున నీప్రస్థానత్రయంబును మించిన మఱియొక గ్రంథ మీ హిందూదేశమున లేదని చెప్పవచ్చును. శంకరాచార్యుఁడు హిమాలయములోని బదరీకేదారములో మృతుఁడయ్యెను. ధర్మవ్యవస్థకై యాతఁడు హిందూదేశమునందు నాల్గుమఠములను ఏర్పాటుచెను. ఉత్తరహిందూస్థానమునకై బదరీకేదారములోను, దక్షిణహిందూదేశమునకై శృంగేరిలోను పూర్వహిందూస్థానమునకై జగన్నాథములోను, పశ్చిమహిందూస్థానమునకై ద్వారకలోను, శంకరపీఠములు నిర్మింపఁబడియె. ఆదిని నాలుగు మఠములే యున్నను ప్రస్తుతము శంకరమఠము లసంఖ్యములైనవి. శాంకరమతస్థులను అద్వైతులనియు స్మార్తులనియుఁ బేర్కొందురు. హిందువులలో నూటికి నెనుబదిమంది స్మార్తమతస్థులై యున్నారు.

## రామానుజాచార్యులు.

పదునొకండవ శతాబ్దాంతమునందు రామానుజుఁడు విష్ణుభక్తినిఁ బ్రబలఁజేసెను. చెన్నపట్టణమునొద్ద పరమత్తూరిలో నీతఁడు జన్మించెను. కాంచీపట్టణమునందు విద్య నభ్యసించి శాంకరమతమును నిరాకరించుచు నచ్చటనే తనమతమును బోధింపఁజొచ్చెను. కాని యచ్చటి చోళరాజు శంకరభక్తుఁడయినందున నితని నచ్చటనుండి వెడలఁగొట్టెను. అందుపై నీతఁడు మైసూరుదేశమునకుఁ బోయి యచ్చట జైనరాజగు వెల్లాలరాయుని కొమార్తెయొక్క రోగము నివారించి యాతనికి వైష్ణవదీక్ష నొసంగెను. ఈతని సాహాయ్యమువలన రామానుజుఁడు తన వైష్ణవమతాభివృద్ధి చేసెను. అచ్చటచ్చట దిగ్విజయ యాత్రలుచేసి యనేకుల జయించెను. అదివఱకు శివస్థలముగానున్న తిరుపతి దేవాలయము స్వాధీనపఱుచుకొని వైష్ణవుల గుడిగా మార్చెను. చోళరాజుపోయిన తరువాత రామానుజాచార్యుఁడు శ్రీరంగమునకుఁ బోయి యచ్చటనే సమాధిఁజెందెను. ఈతఁడు శంకరాచార్యునివలెనే ప్రస్థానత్రయమనఁగా భగవద్గీత, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు అను మూఁడు గ్రంథములపై భాష్యములు వ్రాసెను. ఈతని బ్రహ్మసూత్రభాష్యమును శ్రీభాష్య మనియెదరు. ఈతని సంప్రదాయమువారిని శ్రీవైష్ణవు లనియెదరు. ఈతని సంప్రదాయమును విశిష్టాద్వైత మనియెదరు. శంకరాచార్యుఁడు జ్ఞానమువల్లనే ముక్తియని చెప్పెను. కాని భక్తి ప్రపత్తులు లేనిది ముక్తిలేదని రామానుజుఁడు బోధించెను. ప్రపంచము

మిథ్యకాదనియు, ముక్తిసమయమున జీవుఁ డీశ్వరస్వరూపము కలవాఁడయినను పూర్తిగా నాతనికి నీశ్వరస్వరూపము రాదనియు నీతని యభిప్రాయము. భక్తివిషయములో నీతఁడు శంఖచక్రగదాధారియు గరుడవాహనుఁడు ను నగు లక్ష్మీపతియే సర్వేశ్వరుఁడని బోధించెను.

సన్న్యాసియగుటకుఁ బూర్వ మీతనికి ఎంబెరుమానార్ అను పేరుండెను. ఈతని తండ్రిపేరు కేశవభట్టు, తల్లిపేరు కాంతిమతి, మేనమామపేరు యాదవప్రకాశులు. రామానుజుఁడు శా. శ. ౧౦౪౯-లో జన్మించెనని యొకచోట వ్రాసియున్నది.

## మధ్వాచార్యులు.

ఈతఁడు ద్వైతమతస్థాపనాచార్యుఁడు. ఈతనికి మొదట ఆనందతీర్థులని పేరు. ఇతఁడు శా. శ. ౧౧౨౧-కి సరియైన క్రీ. శ. ౧౧౯౯-వ సంవత్సరమునఁ గర్ణాటములోని యుడిపి గ్రామమునందుఁ బుట్టెను. ఇతని తండ్రిపేరు మధ్యగేహభట్టు; తల్లి వేదవేది; గురువు అచ్యుతప్రేక్షుఁడు. ఇతనిది శంకరాచార్యుని యద్వైతమతమునకు సంపూర్ణవిరోధియైన ద్వైతమతము. జీవేశ్వరుల కైక్య మెన్నఁడును లేదని వీరి సిద్ధాంతము. ఈయాచార్యుఁడుకూడ ప్రస్థానత్రయమునకు భాష్యము వ్రాసినాఁడు. ఇవిగాక యీతఁ డనేకగ్రంథముల వ్రాసెనఁట. ప్రస్తుతము మాధ్వులనఁబడువా రీతని యనుయాయులు. ఈ మతమునకుఁ గర్ణాటమునందుఁ బ్రచార మెక్కువకలదు. ఉడిపిలో వీరి ముఖ్యాచార్యుల పీఠమున్నది.

## బసవేశ్వరుఁడు.

ఈతఁడు క్రీ. శ. ౧౧౬౨ లోఁ గల్యాణపురములో రాజ్యముఁ జేసిన బిజ్జలరాజునకు మంత్రిగా నుండెను. ఈతఁడు మొదట బ్రాహ్మణుఁడయినను ఉపనయనముతోఁ బనిలేదని వాదించి యుపనయనముచేసికొనక శివునిభక్తియే ప్రధానమనియు, శివలింగమును ధరించినవాఁ డేజాతివాఁడయినను వానిని గౌరవింపవలయుననియు బోధించెను. ఈతని శిష్యులలో నొక్కఁడు చాకలవాఁడుగను, ఒక్కఁడు కుమ్మరవాఁడుగను నుండిరి. కావున అతఁ డాకాలములోని భక్తిప్రధానమతమును బోధించిన యొక గొప్పసంస్కర్తయని చెప్పవలెను. బిజ్జలరాజు జైనుండైనందున నతనికిని రాజునకును మతవిషయమై చర్చగలిగి యాతనిశిష్యులు బిజ్జలునిఁ జంపిరి. బిజ్జలుని కుమారునిచే బసవఁడు హతుఁడయ్యె. ఈతఁడు జంగమమతమునకు మూలాచార్యుఁడు. ఈతని మహిమను వర్ణించునది బసవపురాణము.

## రాజపుత్రుల యభివృద్ధి.

ఏడవ శతాబ్దమునుండి పండ్రెండవ శతాబ్దమువఱకు రాజపుత్రుల యనేక కుటుంబములవారు హిందూదేశముయొక్క యనేక భాగములలో స్వతంత్రరాజ్యములను స్థాపించి రాజ్యముచేయసాగిరి. ఉత్తరహిందూదేశమందును దక్షిణదేశమందును నెక్కడఁజూచినను వీరిరాజ్యములే వ్యాపించియుండెను. కాని యిట్టి రాజ్యము లన్నియు దేనికది స్వతంత్రముగా

నుండి, సార్వభౌమరాజ్య మొక్కటియు లేకయుండెను. ప్రతి మండలాధీశుఁడును తానే సార్వభౌముఁడని యితరరాజులతోఁ బోరాడుచుండెను. ఇటులు వీ రంతఃకలహములు కలవారయి నందున దేశముపై దండెత్తివచ్చిన తురుష్కులకు నీదేశము గెలుచుట సులభమయ్యె. ఆకాలంబున ననఁగా దురుష్కులీదేశమునకువచ్చువఱకు పేర్గాంచిన రజపూతరాజులలో మాళవదేశములోని ఘూర్జరరాజులును అజమీర్ వారగు చౌహాణ్ రాజులును, కనౌజ్ రాజులగు ఘూర్వార్ వంశజులును మాళ్వాదేశపు పార్మార్ వంశమువారును ముఖ్యులైన వారు. కాన వీరినిగురించి యిచ్చటఁ గొలఁదిగా వ్రాసెదము.

## ఘూర్జర రాజ్యము.

జైన గ్రంథములను బట్టిచూడఁగా క్రీ. శ. ౭౮౩ లో రాజపుత్రులచేఁ బాలింపఁబడుచున్న కనౌజ్, ఉజ్జయిని యను రాజ్యములు రెండు ప్రబలియున్నట్లు గానవచ్చెడిని. వీరికి యమునానదియే హద్దుగానుండెను. ఆ సమయమునందలి యుజ్జయినీరాజు ఘూర్జరవంశజుఁడగు వత్సరాజు. క్రీ. శ. ౮౪౩లో నీతని మనుమఁడగు ప్రథమభోజుఁడు కనోజ్ రాజ్యమును గెలిచి తనరాజధానిని అచ్చటికి మార్చి చక్రవర్తియను బిరుదును వహించెను. ఈ రాజు శూరుఁడుగాన నీతనికాలమందు ఘూర్జరరాజ్యము మిక్కిలి యభివృద్ధి జెందెను. ఈరాజ్యమునకును నప్పుడు తూర్పున బంగాళమును, ఆగ్నేయమున చేదిరాజ్యమును నైరృతిమువైపు అనల్వాడా రాజధానిగాఁగల గుజ

రాత్ రాజ్యమును ఉండెను. ఇంత విస్తారముగల రాజ్యముక్రమముగా తగ్గఁజొచ్చెను. ప్రథమభోజుని మనుమడగు రెండవభోజుని కాలములో (క్రీ. శ. ౯౧౩) చండేల్ రజపూతుల నాయకుడగు యశోవర్మ ఈ రాజ్యములోని బుందెల్ ఖండ్ భాగమును దీసికొని స్వతంత్రుఁడై చక్రవర్తిబిరుదును వహించెను. ఇఁక ముందు నీచండేల్ వంశమువారికిని ఘూర్జరవంశమువారికిని సార్వభౌమత్వమును గుఱించి యెడతెగక జరుగుచున్న కలహములవలన వీరు బలహీనులును ఐక్యము లేనివారునునై, క్రీ. శ. ౧౦౧౯-లో గజ్నిమహమ్మదు వచ్చి కనోజ్ పట్టణమును గాల్చినప్పుడాతని నెదిరింప లేకపోయిరి. ద్వితీయభోజుని కుమారుఁడగు మహీపాలుఁడు క్రీ. శ. ౯౧౭-లో దక్షిణములోని రాష్ట్రకూట రాజగు ఘ్రువుఁడను వాని చేతిలోఁ దనరాజ్యమంతయుఁ గోలుపోయెను. ఇతఁడు మరలఁ గొంతరాజ్యమును సంపాదించెను. కాని దక్షిణములోని మాళవరాజ్యమును పశ్చిమరాజపుతానా రాజ్యమును పార్మార్ చౌహాణ్ రాజులు ఆక్రమించుకొనిరి. కావున ఈరాజునకు కనౌజ్ మాత్రము మిగిలెను. అటుతరువాత నీఘూర్జరరాజుల వంశమునుతోమరవంశమనుచు వచ్చిరి. ఈవంశమువారికిని నిఁక మీఁద పూర్వవైభవము రాలేదు. క్రీ. శ. ౧౦౧౯ లో గజ్నిమహమ్మదు వచ్చి కనోజుపట్టణమును ముట్టడించిన వర్తమానము రెండవ భాగమునందు వివరముగా వర్ణింపఁబడును. మహమ్మదు పోయినతరువాతఁగూడ నీరాజులు కొంతకాలము రాజ్యముచేసిరి. క్రీ. శ. ౧౦౮౦ లో త్రిలోచనపాలుఁడను వానిని గహర్వార్ వం

శజుఁడయిన చంద్రదేవుఁడు జయించెను. ఘూర్జరులే లాల్ కోట్ అను పేరిట డిల్లికోటను గట్టిరి. ఈవంశములోఁ బురుష సంతానము లేనందున నిది ౧౧౭౦ లో అజమీర్ రాజులగు చౌహాణ్ రాజులకుఁ బోయెను.

## పార్మార్ వంశము.

ఘూర్జరవంశమువారి యొద్దనుండి క్రీ. శ. ౯౧౭ ప్రాంతమున పార్మార్ వంశజులగు రజపూతరాజులు మాళ్వ దేశమును దీసికొని స్వతంత్రులైరి. వీరి మూలపురుషుఁడగు కృష్ణరాజు సార్వభౌమ బిరుదుల ధరించెను. అందుచే నీవంశపువారికిని ఇతరులకును నెప్పుడును యుద్ధములు జరుగుచుండెను. ఈ వంశములో మూఁడవవాఁడగు హర్షదేవుఁడు దక్షిణమునకు దండయాత్రవెడలి మాంగ్ఖేడ్ రాజధానిగాఁ గల రాష్ట్రకూటుల ధనమును దోఁచుకొనెను(౯౭౧). ఈ వంశములో మిక్కిలి విఖ్యాతిఁ జెందినవాఁడు భోజరాజు. ఈతఁడు ౧౦౧౦ మొదలు ౧౦౫౫ వఱకు ధారాపట్టణమునందు రాజ్యముచేసి యనేక విద్వాంసులను కవులను గౌరవించి, భోజశబ్దమునకు విద్యాప్రియత్వమని యర్థము కల్పించెను. భోజ ప్రబంధమునందు నీతని చరిత్ర వర్ణింపఁబడియున్నది. ఆంధ్ర దేశములో 'భోజరాజు, కాళిదాసు' అని చెప్పుకొనియెడు కథ లీభోజుని విషయమైనవియే. ఈ భోజుని సభయందుండిన వాఁడూ ఆ ధ్రకాళిదాసుఁడు. ఇతఁ డాంధ్రుఁడయినందున నీతని యాశ్రయదాతయగు భోజుని కీర్తి తెలుఁగుసీమలో మిక్కిలి

వ్యాపించి, యాది కాళిదాసుని, అతని యాశ్రయదాతయగు విక్రమార్కుని ఆంధ్రజనులు మఱచినట్లు గానవచ్చెడిని. ఈ రాజ్య మనేక మహమ్మదీయుల దాడికి నాఁగుచుఁ బదునాల్గవ శతాబ్దారంభము వఱకుఁ బ్రాణముల రక్షించుకొనియె. కాని ఖిల్జీవంశజుఁడగు ప్రథమమహమ్మద్ ఈ రాజ్యమునంతమొందించెను.

## చౌహాణ్ రాజులు.

వీరినే చోహాణ్, చవ్హాణ్ అనియెదరు. వీరికి మొదట అజమీర్ పట్టణము రాజధాని, ఇది యెనిమిదవ శతాబ్దాంతమున చౌహాణ్ రాజుల స్వాధీనమయ్యెను. ఈవంశములో నిరువదిముగ్గురు రాజులు మొదట నవ్యాహతముగ రాజ్యము చేసిరి. వారందఱును అరిభయంకరులని విఖ్యాతిఁ జెందిరి. వీరిలో సింహరాజనువాఁ డీరాజ్యమునకుఁ దన దిగ్విజయములచే మిక్కిలి వైభవమొసంగెనఁట. ఇరువదినాల్గవవాఁడగు సోమేశ్వరుఁడు తోమరవంశజుఁడును ఢిల్లీశ్వరుఁడునునగు రెండవ యనంగపాలుని కొమార్తెనువివాహమాడెను. ఈ దంపతులకుఁ బుట్టినవాఁడే విఖ్యాతుఁడగు పృథ్వీరాజు. అనంగపాలునికిఁ బురుషసంతానము లేనందున ఢిల్లీ, కనోజ్ రాజ్యములు రెండింటికిని పృథ్వీరాజే యధిపతియయ్యెను. ఇతనిని ఘోరీమహమ్మదు స్థానేశ్వరములో నోడించిన సమాచారము రెండవ భాగమునందు సవిస్తరముగా వర్ణింపఁబడును.

## ఘూర్వార్ వంశము.

ఇది కనౌజ్‌లో రాజ్యముచేయుచుఅజమీర్ చౌహానులకుఁ బ్రబలప్రతిస్పర్థియైయుండెను. వీరిది గంగ కుత్తరమున ఇటావా కాశీపట్టణముల నడుమనున్న చిన్ని రాజ్యమే యైనను వీరు సార్వభౌమబిరుదము ధరించుచుండిరి. వీరి మూలపురుషుఁడు చంద్రదేవుఁ డనువాఁడు. కడమరాజుల సంగతి మన కంతగాఁ దెలియదు. కడపటిరాజు జయచంద్రుఁడు. ఇతనికిని పృథ్వీరాయలకును గల వైరమువలననే యీదేశము తురుష్కుల పాలగుట సంభవించెను. ఈదుఃఖప్రద సమాచారమంతయు మహమ్మదీయమహాయుగములో వర్ణింపఁబడును.



కనౌజ్‌లోని పురాతనమందిరము

## భాషాభివృద్ధి.

రజపూతులు ప్రభుత్వముచేసిన రెండుమూఁడు శతాబ్దంబులలో వాఙ్మయమును (Literature), శాస్త్రంబును (Science) నభివృద్ధిఁజెందెను.

మాఘకవి పదునొకొండవ శతాబ్దంబున నైషధకావ్యము వ్రాసెను. ఆ శతాబ్దంబుననే జయదేవుఁడు బెరో ర్దేశమందు గీతగోవిందమను మనోహర కావ్యముఁ జెప్పె. పృథ్వీరాయని యాస్థాన కవీశ్వరుఁడు హిందీభాషలోఁ గవిత్వముఁ జెప్పెఁదొడఁగె. భట్టనారాయణుఁడు వేణీసంహారమను నాటకమును నిర్మించెను.

పైని చెప్పినవారి యందఱికంటె నధికగౌరవమునకు బాత్రుఁడైన భాస్కరాచార్యుఁ డీకాలపువాఁడు. జ్యోతిషశాస్త్రాభివృద్ధిని గుఱించి యీతని పేరిదేశంబున మిక్కిలి కొనియాడఁబడును. ఇతఁడు క్రీ. శ. ౧౧౧౪-లో జన్మించె. సిద్ధాంతశిరోమణియను విశ్వవిఖ్యాతిసిద్ధాంతగ్రంథమును ౧౧౫౦-లో రచించెను. ఇందు అంకగణితము (Arithmetic), బీజగణితము (Algebra) ఖగోళగణితము (Astronomy) అను మూఁడుభాగములుగలవు. అంకగణితభాగమునకు లీలావతియనిపేరు. జ్యోతిషభాగమునకు గోలాధ్యాయమనిపేరు. భూమి గుండ్రముగా నున్నదనియు, భూచ్ఛాయ గ్రహణమునకు గారణమనియు నీతఁడు తనజ్యోతిషగ్రంథములో వ్రాసియున్నాఁడు. పదునేడు పదునెనిమిదవ శతాబ్దంబులలో యూరోపు దేశస్థులకుఁ దెలియని యనేకాంశములు తన బీజగణితమందుఁ బండ్రెండవ శతాబ్దంబునఁ బుట్టిన యీ హిందూజ్యోతిష్కుఁడు వ్రాసియున్నాఁడు. భూమియందు నాకర్షణశక్తి కలదని యింగ్లీషు వారికిఁ బదునెనిమిదవ శతాబ్దంబున న్యూటను అనువాఁడు తెలిపెను. కాని యంతకు బూర్వమాఱువందల యేండ్లక్రింద

టనే భాస్కరాచార్యుల వారియంశమును తమగ్రంథములో వ్రాసియున్నారు.

ఇట్లు హిందూరాజ్యములును, హిందూధర్మంబును హిందూవిజ్ఞాన శాస్త్రంబులును నభివృద్ధిఁజెంది మరల దలచూపఁ దొడంగె. ఈ యభివృద్ధి నిరాఘాటముగాఁ గొన్నివందల సంవత్సరములు జరిగియున్న పక్షమున హిందూదేశ మెంతయో వైభవదశఁ జెందియుండును. కాని హిందువుల దురదృష్టముచే వారు క్రీ. శ. ౧౧౯౩-లోఁ దమ స్వాతంత్ర్యంబును దురుష్కుల చేతిలోఁ గోలుపోయి శాశ్వతంబగు పారతంత్ర్యంబున మునిఁగిరి.

ఇటులు మనకథ తురుష్కుల ప్రభుత్వమువఱకు వచ్చినదికాని తురుష్కరాజ్య చరిత్రమును బ్రారంభించుటకుఁ బూర్వము హిందూదేశములోని కొన్ని రాజ్యములను గుఱించి వ్రాయవలసియున్నది. ఇదివఱకువర్ణింపబడిన దంతయు మగధము, ఉజ్జయిని, కనౌజ్ మొదలయిన మధ్యదేశాంతర్గతములగు గొప్పరాజ్యములను గుఱించి. ఈరాజ్యములుగాక పురాణకాలంబునను, అంతకుఁ బూర్వంబునను విఖ్యాతిఁ జెందిన చిన్న రాజ్యములు మఱికొన్ని కలవు. వానిని గుఱించి సంక్షేపముగా వ్రాసి ఈ ప్రకరణము ముగించెదము.

## కాబూల్ దేశములోని బ్రాహ్మణరాజులు

హిందూదేశము నంటుకొని యున్న కాబూల్ దేశము పూర్వకాలమందు హిందూదేశములోనిదిగనే భావింపఁబడు

చుండెను. పంజాబులోని కొంతభాగమును, కాబూల్ దేశమును గలిసి యొకరాజ్యముగనే యుండెను. అచ్చట బ్రాహ్మణ రాజులు రాజ్యము చేసిన సమాచారముమాత్రి మిదివఱకు నెవ్వరికిని తెలియదు. ఇటీవల దొరకిన అల్‌బిరూని యొక్క యొకగ్రంథములో నిట్లు వ్రాయఁబడి యున్నది.

మొదట గాబూలురాజ్యము బౌద్ధరాజుల వశమందుండెను. ఆవంశములోఁ దుదివాఁడు కతోర్మానను వాఁడు. వాని యొద్దఁ గలారుఁడను బ్రాహ్మణుఁడు మంత్రిగా నుండెను. ఇతనికి నదృష్టవశమున భూమిలో ధనము దొరికెను. అందువలన నతని సామర్థ్యము హెచ్చెను. కతోర్మాన్ రాజు దుర్మార్గుఁడు. అతనియాలోచనలును, ఆచరణమును మంచివికావు. అందుచే బ్రజలు విసివి మంత్రితో మొఱపెట్టిరి. అందుపై నాతఁడు మొదట రాజునకు బుద్ధి వచ్చుటకునై యాతనిని జెఱఁ బెట్టెను. కాని కొన్నిదినముల కాతనికి రాజుకావలయు ననిన దుర్బుద్ధి పుట్టి యాతఁడు రాజయ్యెను. అతనియొద్ద ధనముండుటచే వచ్చిన యిక్కట్టులఁ దప్పించుకొని రాజ్యమునందు స్థిరమయ్యెను. ఇతఁడు క్రీ.శ. ౮౫౦-వ సంవత్సర ప్రాంతమునందు రాజయి యుండవచ్చును. ఇతని తరువాత సామంద్ అనువాఁడు రాజ్యముచేసెను. 'స్యాలా పతి' యను పేరిట నితని నాణెము లనేకములు కాబూల్ దేశములోను, పంజాబుదేశములోను కానవచ్చుచున్నవి. ఈతని తరువాత కమ్లువా యనువాఁడును, భీముఁడనువాఁడును రాజ్యముచేసిరి. భీమునికాలములోఁ గాబూల్ పట్టణము

మహమ్మదీయుల స్వాధీనమై యుండనోపు. తరువాత జయ
పాలుఁడనువాఁడు రాజ్యముచేసి ౧౦౦౨ లోఁ గీర్తిశేషుఁ
డయ్యెను. జయపాలుని కుమారుఁడు అనందపాలుఁడు. ఇతనినే
అనంగపాలుఁ డనియెదరు. ఇతఁడు గజ్నీమహమూదునకు సమ
కాలీనుఁడు. ఇతనికిని మహమూదునకును అనేకయుద్ధములు
జరిగెను. అందు నితఁడు మహమూదును బూర్తిగఁ బరాభ
వించెను. ఇట్లు పరాభూతుఁడయిన తరువాతి మహమూదు
మీఁదికిఁ దురక దేశమునుండి తురుష్క (Turk) రాజు దండెత్తి
వచ్చెను. ఆసమాచారము తెలిసి యీధర్మపరాయణుఁడగు
ఆనందపాలుఁడు తనకు మహమూదు శత్రుఁడయినను వానికి
సంకటసమయమున సాహాయ్యముచేయుట ధర్మమని యెంచి
వాని కిట్లు ఉత్తరము వ్రాసెను. ‹నీరాజ్యముమీఁదికిఁ దుర
కలు (Turks) దండెత్తివచ్చిరనియు, ఖురాసాన్ ప్రదేశమం
దంతటను బ్రసరించిరనియు విన్నాఁడను. వలయునెడ నైదు
వేలగుఱ్ఱములతోను, పదివేల సైనికులతోను, నూఱు ఏనుఁగుల
తోను నీకు సాహాయ్యముచేయుటకు వచ్చెదను; లేదా నీకిష్ట
మున్నయెడలఁ బైని చెప్పినదానికంటె రెట్టింపు సైన్యముల
నిచ్చి నా కుమారునిఁ బంపెదను. నీయనుగ్రహమునకై నే
నిట్లు వ్రాయలేదు. నేను నిన్నుఁ బూర్తిగఁ బరాభవించినను,
అట్టి గౌరవము నాకుఁదప్ప నితరులకుండఁగూడదని నా యుద్దే
శము. శత్రువులకుఁగూడ సంకటసమయమున నిట్లుసాయము
చేయుదునని యుత్తరము వ్రాసిన రాజుయొక్క యౌదార్య
మును అల్ బురునికూడఁ గొనియాడియున్నాఁడు. ఆయుత్తర

మితఁడే యుదాహరించినందున దీనిసత్యాత్వమును గుఱించి సంశయింపనక్కఱలేదు. ఆల్ బురిని మహామూదుయొక్క యాస్థానపండితుఁడు. ఈరాజు తురుష్కులను మిక్కిలి ద్వేషించుచుండెనఁట. ఆనందపాలుని తరువాతి రెండవ జయపాలుఁడు రాజ్యమునకువచ్చెను. ఇతఁడు క్రీ. శ. ౧౦౨౧ లోఁ గాలధర్మమునొందెను. అంతటితో నీవంశ మంతరించెను. ఈవంశపు రాజులను గుఱించి యుల్బెరూని యిట్లు వ్రాసియున్నాఁడు. ఈ రాజులు మిక్కిలి రాజ్యవిస్తారముగలవారయ్యును ఉత్తమ సద్గుణమండితులయి యుండిరి. ఆడినమాట తప్పకుండుటయుఁ బలకంబెఁ దక్కువవాని దయతోఁ జూచుటయు వీరి విశేష గుణములయి యుండెను.

కాశ్మీరము.

కల్హణపండితులచే వ్రాయఁబడిన రాజతరంగిణి యను గ్రంథమునందుఁ గాశ్మీరదేశచరిత్ర సాద్యంతముగాఁ గలదు. క్రీ. శ. ప్రథమ శతాబ్దంబునఁ గనిష్కుఁడను రాజు ఈరాజ్యమును గెలిచెనని చదువరు లిదివఱకే వినియున్నారు. ఈదేశ మం దొకప్పుడు హిందూమతమును, ఒకప్పుడు బౌద్ధమతమును ప్రబలియుండెను. మూఁడవ శతాబ్దంబుననో, నాల్గవ శతాబ్దంబుననో మిహిరకులుఁడను కాశ్మీరరాజు విజయయాత్ర వెడలి సింహళమువఱకుఁ బోయెను. ఆతఁడు హిందూమతము నందు నభిమానముగలవాఁడై బౌద్ధుల బాధపెట్టెనని చెప్పెదరు. అయిదవ శతాబ్దంబుననో లేక యాఱవ శతాబ్దంబుననో మేఘవాహనుఁడను కాశ్మీరరాజు మరల సింహళమువఱకు

జయించెను. ఈతఁడు బౌద్ధమతమునందు నభిమానము కలవాఁడై తన రాజ్యమునందుఁ బశుహింస జరగఁగూడదని శాసించెను. ఈతనిభార్యలు అనేక బౌద్ధాశ్రమములఁ గట్టించిరి. ఆఱవశతాబ్దమధ్యమున మాతృగుప్తుఁడనువాఁడు విక్రమాదిత్యునిచేఁ గాశ్మీరమునకు రాజుఁగా జేయఁబడి, విక్రమాదిత్యుని మరణమువఱకు రాజ్యమేలెను. ఈతని తరువాత రాజు ఉజ్జయినీ నృపుఁడగు శిలాదిత్యుని గెలిచి యాదేశపు రాచగద్దియను ఉజ్జయినిపట్టణమునుండి కాశ్మీరమునకుఁ దెచ్చెనఁట. ఎనిమిదవ శతాబ్దారంభమున లలితాదిత్యుఁడను కాశ్మీరరాజు కనోజ్ రాజ్యమును గెలిచి యచ్చటి యాస్థానకవియగు భవభూతిని గాశ్మీరమునకుఁ గొనిపోయెనని యీవఱకే చెప్పియున్నారము. ఈరాజు కర్ణాటకమువఱకు జయించి వింధ్యపర్వతము దాటి యవంతిమార్గమునఁ దనదేశమునకు వెళ్ళెను. హిమాలయ పర్వతము దాటి యావలనున్న రాజ్యములు గెలువవలెనని బయలుదేరి యీరాజు త్రోవలో మృతుఁడయ్యె. క్రీ. శ. ౭౭౫ నుండి ౭౭౬ వఱకు జయవీరుఁడను మహావిక్రమవంతుఁడగు రాజు రాజ్యముచేసెను. ఈతఁడు గౌడదేశపు రాచకన్నియయగు కళ్యాణదేవిని వివాహమాడెను. పతంజలి కృతిమైన మహాభాష్యమప్పుడు శిథిలమై యొక్కచోట నంతయుఁ గానరానందున నీరాజు ఆ మహాగ్రంథములోని భిన్నభాగములను చోటిచోటినుండి తెప్పించి విద్వాంసులచే గ్రంథమునకుఁ బునర్జీవన మిప్పించెను. తొమ్మిదవశతాబ్దమున అవంతివర్మయను రాజు తనపేరిట అవంతిపురమను రాజధానిని గట్టిం

చెను. ఈరాజు పోయినతరువాత శౌర్యాదివిహీనులును దుర్మార్గావలంబులును నగు రాజులును రాణులును గొందఱు రాజ్యముచేసిరి. అంతఃకలహములు మెండై తుదకుఁ బదునాల్గవశతాబ్దంబున నీరాజ్యంబు తురుష్కుల చేతఁబడియెను.

పంజాబు.

ఇది ఋగ్వేదకాలమందు నార్యుల ప్రథమనివాసస్థలమని చదువరు లెఱిఁగియే యున్నారు. బ్రాహ్మణముల కాలములో నచ్చటనుండి వెడలి కొందఱార్యులు గంగా యమునల మధ్య కురు, పాంచాల, కోసల విదేహాదిరాజ్యముల నేర్పఱుచుకొనిన సమాచారంబును మన మెఱుఁగుదుము. ఇట్లు గంగయొద్దనకుఁ బోయిన యార్యులు యజ్ఞయాగాది క్రతుపద్ధతులును జాతిభేదంబును నేర్పరచుకొనిరి. ఈ సంగతులు పంజాబులోని యార్యుల కంతగాఁ దెలియవు. ఇట్లు సింధునదముఒద్దనున్న యార్యులకును, గంగయొద్దనున్న యార్యులకును ఆచారభేదము గలిగెను. సింధునదమునకుఁ బశ్చిమముననున్న గాంధారాశ్వకులలోను, సింధునదమునకుఁ దూర్పుననుండు కైకేయ క్షత్రియులలోను వర్ణవ్యవస్థ పెరుగదయ్యె. ఈ శూరజనులను గుఱించి గంగయొద్దనున్న యార్యులు 'వారిలో ఋత్విజుఁడు నాపితుఁడుగను నాపితుఁడు క్షత్రియుఁడుగను మారవచ్చును' అని పరిహాసముగాఁ జెప్పుకొనుచుండిరి. కాని క్రమక్రమముగ గంగయొద్ద ఆర్యులు గాంధార కైకయదేశముల పిల్లలను జేసికొనసాగిరని భారత రామాయణాదులవలనఁ దెలియుచున్నది.

డేరియస్ అను పారసిక దేశపు రాజు క్రీ. పూ. ౫౦౭ లో సింధువునకుఁ బశ్చిమమునందు దేశములఁ గెల్చెను. అలగ్జాండరు పంజాబునకు వచ్చినప్పుడు అశ్వకు లాతనితో ఘోరముగాఁ బోరిరి. తుదకు మోసముచే నాతఁడు వారిని గెలిచెను. అలగ్జాండరుతరువాత చంద్రగుప్తుఁడు పంజాబును జయించి మగధములోఁ గలిపికొనియె. అశోకునితరువాత పరదేశీయు లనేకులు పంజాబుదేశమునకు వచ్చిరి. బ్యాక్ట్రియాదేశపు గ్రీకువారు సింధుపశ్చిమప్రదేశముల నాక్రమించుకొనిరి. తరువాత తురేనియను లనఁబడిన శకవంశపువారు వచ్చిరి. ఆఱవ శతాబ్దమున విక్రమార్కుఁడు వీరల వెడలఁగొట్టెను. తరువాతఁ గొన్నిదినము లచ్చట నరాజకమై గజినిమహమ్మదు వచ్చువఱకు నారాజ్యమును రాజపుత్రు లాక్రమించుకొని యుండిరి.

## గుజరాత్.

దీనికి సౌరాష్ట్రమని పేరు. ఇచ్చట బ్రాహ్మణముల కాలములోనే మూర్యులు వచ్చి నివసించిరి. క్రీ. పూ. నాల్గవ మూఁడవ శతాబ్దంబులలోఁ జంద్రగుప్తాశోకరాజు లీరాజ్యమును బరిపాలించిరి. తరువాత నీరాజ్యము కనిష్కునిక్రిందికి బోయె. కనిష్కుని యనంతరమున నచ్చటి షాహారాజులు స్వతంత్రులయిరి. షాహారాజుల యనంతరము వల్లభివంశజులు రాజులైరి. భట్టార్కుఁడను నీ మూలపురుషుఁడు క్రీ. శ. ౪౭౦-లో రాజయ్యెను. ఈవంశజులు క్రీ. శ. ౭౭౦-వఱకు రాజ్యము చేసిరి. ఈవంశపువారు రాజ్యము చేయుచుండగనేఁ హూయెన్‌స్యాంగు అనువాఁడు సౌరాష్ట్రముఁ జూచె. అప్పుడు

వల్లభపురమున సముద్రవర్తకంబుకతన లక్ష్మి తాండవమాడు చుండెను. క్రీ. శ. ౭౭౦-సంవత్సర ప్రాంతముల చాళుక్యవంశజులయిన రాజపుత్రులు దక్షిణమునుండి వచ్చి వల్లభివంశమును నాశ మొందించిరి. వీరు అన్హల్‌వాడాపట్టణ అను పట్టణమును రాజధాని చేసికొనిరి. ఇంకొక రాజపుత్రవంశజులు వచ్చి క్రీ. శ. ౯౫౦-లో నీ చాళుక్యులఁ దొలగించిరి. ఈ వంశపురాజే మహమ్మదు గజినీ వచ్చినపుడు రాజ్యము చేయుచుండెను.

## దక్షిణములోని రాజ్యము.

దక్షిణదేశమున ననేక రాజ్యము లుదయించి యనేకము లస్తమించెను. వాని నన్నిటి నిందు వర్ణించుట యనావశ్యకము. ఆంధ్రు లనఁబడు రాజులు దక్షిణమున నాల్గవ శతాబ్దమువఱకు సార్వభౌమత్వముఁ జేసిరని వెనుక బౌద్ధయుగములో వర్ణింపఁ బడియె. వారితరువాత పల్లవులును, పూర్వపశ్చిమ చాళుక్యులును ప్రబలిరి. తరువాత దేవగిరియాదవులును, ఓరుగంటి గణపతిరాజులును, మహారాష్ట్రాంధ్ర దేశములను వైభవముతో నేలిరి. మిక్కిలి దక్షిణమున పాండ్య, చేర, చోళ, రాజులు రాజ్యము చేయుచుండిరి. ఇందు ముఖ్య రాజవంశములను ఇచ్చట సంగ్రహముగా వర్ణించెద.

## పశ్చిమ చాళుక్యులు.

ఈవంశమువారు ఆఱవ శతాబ్దమునఁ గల్యాణపట్టణము రాజధానిగాఁ గొంకణ మహారాష్ట్ర కన్నడ దేశంబుల

నేలపాగిరి. ఈ వంశముయొక్క స్థాపకుఁడు పులకేశియనువాఁడని చెప్పెదరు. ఇతఁడు క్రీ. శ. ౫౫౦ ప్రాంతమున వాతాపియను పట్టణమును రాజధానిగా నేర్పఱచుకొని యనేక రాజులను గెలిచి యశ్వమేధ యాగమును జేసెనట.

ఈతని మనుమఁడగు రెండవ పులకేశి క్రీ. శ. ౬౦౮లో రాజ్యారూఢుడై శూరాగ్రేసరుఁడని పేరొందెను. ఇతఁడిరువది సంవత్సరములలో లాట, ఘూర్జర, కొంకణ, మాళవ రాజులఁ గెల్చెను. క్రీ. శ. ౬౧౦-లో నీతఁడు వేఁగిదేశమునుండి పల్లవరాజుల వెడలఁగొట్టి దాని నాక్రమించుకొనెను. ఈతఁడు శ్రీహర్షునితో సమకాలీనుఁడు. క్రీ. శ. ౬౨౦-లో నీతఁడు శ్రీహర్షుని సైన్యముల నోడించె నని యీవఱకే వ్రాసియున్నారము. ఇట్లీతని మరాటీసైన్యములు తమస్వాతంత్ర్యమును రక్షించుకొనియె. ఈ మరాటీవా రెప్పుడును ఇట్టి పట్టుదలయు స్వదేశాభిమానమునుగలవారు. హిందూదేశమంతయు గెలిచిన ఔరంగజేబుచక్రవర్తి మరాటారాజగు శ్రీశివాజిని గెలువలేకపోయె నని చదువరులు ముందుఁ జూడఁగలరు.

ఈ రెండవ పులకేశిమహారాజుయొక్క కీర్తి ఈదేశమునందే గాక పారసీకదేశంబునకు ప్రసరించెను. పారసీకరాజగు రెండవ ఖుస్రువద్ద కీరాజు క్రీ.శ.౬౨౫-లోనో౬౨౬ లోనో తన రాయబారులఁబంపెను. ఆపారసీకరాజు తిరిగి తన రాయబారుల నీరాజునొద్దకుఁ బంపెను. ఆజంటాలోని మొదటిగుహాలో ఈ పారసీకరాయబారి వచ్చినప్పటి ప్రసంగమును జూపుప్రతి

ములు చెక్కఁబడియున్నవి. ఈ గుహ లీరాజుకాలములో క్రీ.శ. ౬౮౦ ప్రాంతమునఁ జెక్కింపఁబడియె. ఈరాజు చరమ దశయం దీతని కాంచిదేశపు రాజులగు పల్లవులు జయించినట్లు గానఁబడుచున్నది.

ఈతని కుమారుఁడగు విక్రమాదిత్యుఁడు కాంచీపల్లవులఁ గెలిచి నష్టమయిన కీర్తిని మరల సంపాదించెను.

క్రీ.శ. ౮౧౫ మొదలు ౮౭౭ వఱకు రాజ్యముచేసిన యీ వంశపురాజగు అమోఘవర్షుఁడు జైనమతమునం దభిమానము గలవాఁడై పూర్వచాళుక్యులతోఁ బోరాడుచుండెను.

విక్రమాంకదేవుఁ డనురాజు ౧౦౭౬ మొదలు ౧౧౨౬ వఱకు రాజ్యముచేసెను. ఈతనిని నాయకునిఁగా వర్ణించుచు బిల్హణుఁడనుకవి విక్రమాంకదేవచరిత మను కావ్యము రచించెను. ఇతఁడు కాంచిరాజులతోను ద్వారసముద్రపు రాజులతోను బోరాడి యనేక దిగ్విజయములఁ బొంది తనపేరిట నొక శకము నేర్పఱిచెను. కల్యాణపట్టణ మీతని రాజధాని. ఇచ్చటనే మితాక్షరమను ధర్మశాస్త్రమునకుఁ గర్తయైన విజ్ఞానేశ్వరుఁడు నివసించి యుండెను.

క్రీ.శ. ౧౧౫౬ నుండి ౧౧౬౨ వఱకు రాజ్యము చేసిన తైలుఁడనురాజుకాలములో నాతని సైన్యాధిపతియగు బిజ్జలుఁడనువాఁడు తిరుగఁబడి, యజమానునిఁ జంపి తానే రాజయ్యెను. ఈ బిజ్జలుఁడు జైనమతస్థుఁడు. ఈతఁడు కాలచుర్య వంశజుఁడు. ఈతని మంత్రియగు బసవఁ డనువాఁడు లింగాయత మతస్థాపకుఁడై జంగముల మతమునకు నాచార్యుఁ

డయ్యెను. ఈ బసవఁడు బిజ్జలుని ౧౧౬౭ లోఁ జంపెను. ఈతని మరణానంతరము చాళుక్యవంశజుఁడు మరల రాజయ్యె. చాళుక్యవంశము ౧౧౮౨ లో నంతరించెను.

## పల్లవులు.

మూఁడవ శతాబ్దములో నాంధ్రవంశ మడుగంటిన తరువాతఁ దెలుఁగుఁ సీమలోని వేఁగిదేశము కాంచీపట్టణము రాజధానిగాఁగల పల్లవుల చేతిలోఁబడెను. ఈ పల్లవులకుఁ గాంచీదేశములో నొక రాజ్యమును, వేఁగిదేశములో నొక రాజ్యమును నుండినట్లు గానవచ్చుచున్నది. మూఁడవ శతాబ్దాంతమువఱకు మాధవవర్మ, కులకేతనుఁడు, నీలకంఠుఁడు, ముక్కంటి యను రాజులు రాజ్యము సేసిరి. నాల్గవశతాబ్దాంతము వఱకు చంద్రవర్మ, విజయనందివర్మ, విజయబుద్ధవర్మ, స్కంధవర్మ, త్రిలోచనపల్లవులనువారీవంశమున రాజులందురి. ఈ కాలములోనే పశ్చిమచాళుక్యరాజగు జయసింహ విజయాదిత్యుఁడు పల్లవులపై దండెత్తివచ్చి రణరంగములో హతుఁడయ్యెను. ఆతని కుమారుఁడగు విష్ణువర్ధనుఁడు పల్లవుల నోడించి వారికూఁతును వివాహమాడెను. అయిదవ యాఱవ శతాబ్దంబులలో నీ పల్లవులు మిక్కిలి ప్రబలి ఆంధ్ర ద్రావిడ కర్ణాటదేశములలోని యనేకరాజ్యముల సంపాదించిరి. కాని 7వ శతాబ్దప్రారంభమునఁ బశ్చిమచాళుక్యులు వీరిని నోడించి యాంధ్రదేశములోని వీరిరాజ్యమును స్వాధీనపఱచుకొనిరి. ద్రావిడకర్ణాటదేశములోని పల్లవరాజ్యమింకను బహుదినముల వఱకునుండెను.

వేంగిదేశమునకుఁ బల్లవులు సార్వభౌములయినను సాలంకాయను లనువారచ్చటి మాండలికరాజు లయినట్లు గానవచ్చెడిని. వీరు బౌద్ధమతస్థులు. చాళుక్యులు రాఁగానే యీ సాలంకాయన వంశ మంతరించెను.

## తూర్పుచాళుక్యులు.

వీరు తెనుఁగు సీమలోనిది యగు వేంగిదేశంబును నేడవ శతాబ్దమునుండి పదునొకండవ శతాబ్దారంభమువఱకుఁ బరిపాలించిన రాజులు. వేఁగినాడనఁబడు దేశము కృష్ణాగోదావరుల కును, పూర్వసముద్ర మహేంద్రపర్వత (Eastern Ghats) ములకును నడుమ నున్న యెనిమిదివేల చదురపు మైళ్ళ వైశాల్యముగల తెలుఁగుసీమ. ఏలూరున కుత్తరమున నేడు మైళ్ల దూరముననున్న వేఁగిపురము మొదట నీదేశమునకు రాజధానిగా నుండెను. ఇది పూర్వ మొకచూచినను రెండు క్రోశముల పట్టణమై వైభవము ననుభవించినది యైనను బ్రస్తుతిను నామావశిష్టమైయున్నది. నిజముయిన వేఁగినా డింత చిన్నదియైనను చాళుక్యరాజు లీరాజ్యమును దమ శౌర్యముచే నుత్తరమున గంగవంశజుల దయిన కళింగ రాజ్యమువఱకును, దక్షిణమునఁ గాంచీనగరము రాజధానిగాఁ గల పల్లవులదైన చోళరాజ్యమువరకును వ్యాపించినట్లు చేసిరి. రాజ్యము మిక్కిలి యభివృద్ధియైన తరువాత రాజధాని వేఁగిపురము నుండి రాజమహేంద్రవరంబునకు మార్పఁబడియె.

పశ్చిమచాళుక్యవంశములో మిక్కిలి విఖ్యాతిఁజెందిన రెండవ పులకేశివల్లభుఁడు దక్షిణదండయాత్రకు వెడలినపుడు చోళుల నోడించి ఆంధ్రదేశమును స్వాధీనపఱచుకొని క్రీ. శ. ౬౧౫-లోఁ దనతమ్ముఁడయిన కుబ్జవిష్ణువర్ధనుని వేఁగి దేశమునకుఁ బాలకునిగా నియమించెను. కాని యాతఁడు త్వరలోనే స్వతంత్రుఁడయి పూర్వచాళుక్య వంశమువారికి మూలపురుషుఁడయ్యెను. పండ్రెండవ శతాబ్దమున ఈవంశమువారు వివాహసంబంధబంధముచేఁ జోళులలోఁగలియువఱకు రమారమి ముప్పదిమంది రాజులయిరి. వారిలో ముఖ్యులైన రాజులను గుఱించి యిందుఁ గొంచెము వ్రాసెదము.

కుబ్జవిష్ణువర్ధనుఁడు— ఈతఁడు ౬౧౫-లో రాజ్యమునకు వచ్చి ౬౩౩ వఱకుఁ బ్రభుత్వము చేసెను. ఈతఁడు కుంటివాడయినను మిక్కిలిశూరుఁడు. అన్నగారగు పులకేశివల్లభుఁడు దక్షిణరాజ్యములు గెలిచినపుడీతఁ డతని వెంటనుండి యాతనికి మిక్కిలి సాయము చేయుచుండెను. ఈతఁడు పిష్టపురమనఁబడు పిఠాపురములోని దుస్సాధ్యమైన దుర్గమును సాధించెను. ఈతని శాసనములు దిమిలిపెమలోను గానవచ్చుచున్నందున నీతని రాజ్యము విశాఖపట్టణమండలములోని సర్వసిద్ధితాలూకావఱకు వ్యాపించి యుండెనని చెప్పవచ్చును.

జయసింహుఁడు—విష్ణువర్ధనుని జ్యేష్ఠ పుత్త్రుఁ డయిన (మొదటి) జయసింహుఁడు ౬౩౩-వ సంవత్సరము మొదలు

---

(ఆంధ్రకవులచరిత్రము. 1 వ భాగము.)

కొని ౬౬౩-వ సంవత్సరము వఱకు ముప్పదియేఁడ్లు రాజ్యము చేసెను. ఇతనికి సర్వసిద్ధియను బిరుదునామముకలదు. ఇతడు గుడివాడ తాలూకాలోని పెనుకపఱ్ఱుగ్రామము నొకబ్రాహ్మణుని కిచ్చినట్లు దానశాసన మున్నందున ఇతని రాజ్యము నెల్లూరి మండలము వఱకును వ్యాపించియుండెను.

మూఁడవవాఁడగు ఇంద్రభట్టారకుఁడును, తరువాత వచ్చిన విష్ణువర్ధనుఁడు, మంగియువరాజు, జయసింహుఁడు, కొక్కిలిరాజు, విష్ణువర్ధనుఁడు, విజయాదిత్యుఁడు అను నేడుగురు రాజులును క్రీ. శ. ౭౬౪ వఱకు ననఁగా నూటేండ్లు రాజ్యము చేసిరి.

పదవవాఁడగు విష్ణువర్ధనుఁడు ౭౬౪ మొదలు ౭౯౬ వఱకు రాజ్యము చేసెను. ఈతఁడు నాల్గవ విష్ణువర్ధనుఁడు. ఈతని కుమారుఁడగు రెండవ విజయాదిత్యుఁడు ౭౯౯ మొదలు ౮౪౩ వఱకు భూమినేలి గాంగ రాష్ట్రకూటులను రాజులతోఁ బోరాడి వారిని గెల్చి తనరాజ్యమునం దనేకశివాలయములఁ గట్టించెను. ఈతని కొడుకు అయిదవ విష్ణువర్ధనుఁడు (౮౪౩-౮౪౪.)

ఈ వంశములోని పదమూడవవాఁడు మూఁడవవిజయాదిత్యుఁడు. ఇతనికి గణకవిజయాదిత్యుఁ డని పేరు. ఇందుచే నీతఁడు గణితశాస్త్రమునందు విశారదుఁడై యుండెనని తోఁచెడిని. ఈతఁడు రాష్ట్రకూటు లనఁబడురాజులజయించి మంగిరాజుతలను ఖండించెను. ఈరాజు ౮౪౪ మొదలు ౮౮౮ వఱకు రాజ్యము చేసెను.

పదునాల్గవరాజగు చాళుక్యభీముఁడు రాష్ట్రకూట వంశజుఁడగు రెండవ కృష్ణుని జయించి యావరకుం బరరాజుల స్వాధీనములోనున్న వేగిదేశముయొక్క కొంతభాగమును స్వాధీనపఱచుకొనియె. ఇతఁడు ౮౮౮-లో రాజ్యమునకువచ్చి ముప్పది యేండ్లు పరిపాలనము చేసెను. ఆతనికూరుడగు విజయాదిత్యుఁడు కళింగుల జయించెను.

పదునాఱవవాఁడగు అమ్మరాజవిష్ణువర్ధనుఁడు ౯౧౮ నుండి ౯౨౫ వఱకు నేడేండ్లు రాజ్యముచేసి తన రాజధానిని రాజమహేంద్రవరమునకు మార్చెను. ఇతనికి రాజమహేంద్రుఁడను బిరుదునామ మున్నందున నాతని నూతనరాజధానికి రాజమహేంద్రవరమను పేరు వచ్చెనఁట.

౯౨౫ మొదలు ౯౪౫ వఱకు నీవంశపువారిలో జ్ఞాతి వైరములు గలిగి యొకరి నొకరు పదభ్రష్టులఁ జేసికొనుచు నేఁడుగురురాజులు రాజ్యము చేసిరి.

౯౪౫-లో చాళుక్యభీమవిష్ణువర్ధనుఁడు రాజయ్యె. ఈవంశములో నీతఁడిరువది రెండవరాజు. గండమహేంద్రుఁడు, రాజమార్తాండుఁడు అను బిరుదులు కలవాఁడై చోళరాజును, రాష్ట్రకూటరాజైన యైదవ గోవిందరాజునుజయించి పండ్రెండేండ్లు భూమినేలెను. పదవశతాబ్దంబునఁ జోళులు వేఁగి దేశమునకు దండెత్తివచ్చి గెలిచినట్లును గొంతకాల మీదేశమును బరిపాలించినట్లును గానవచ్చెడిని.

చాళుక్యవంశములోని యిరువదియాఱవ రాజగు విమలాదిత్యుఁడు ౧౦౧౫ మొదలు ౧౦౨౨ వఱకు రాజ్యము

చేసి రాజేంద్రచోళుని చెల్లెలును రాజకేసరివర్మయొక్క కూతురును నగు కుందమాంబాదేవిని వివాహమాడి యామె యందు నాంధ్రభారతకృతిపతియగు రాజరాజనరేంద్రునిఁ గనెను.

రాజరాజనరేంద్రుఁడు:—ఈతఁడు తెలుఁగుబాసకు మహోపకారమొనర్చి యాచంద్రార్కము నాంధ్రదేశమునఁ బ్రతిదినము తన్ను ఆంధ్రులు తలఁచుకొనునట్లు చేసిన మహానుభావుఁడు. ఈతనిప్రేరణవలననే నన్నయభట్టు తెలుఁగున భారతము వ్రాయ నారంభించెను. నన్నయభట్టు తెలుఁగుబాసలోఁ గావ్యము చెప్పిన యాదికవి. ఈయనకుఁ బూర్వము తెలుఁగునఁ గవిత్వము చెప్పినవారు తప్పక యుందురు. కాని వారినామములుగాని, గ్రంథములుగాని మన మెఱుఁగము. అందుచే నాదిమకవియు నాదిమకృతిపతియు నగు నన్నయభట్ట రాజరాజనరేంద్రులు మనభాషకు జనకులని చెప్పవలసి యున్నది. ఈ నన్నయభట్టు ఆంధ్రభారతములోని మొదటి రెండుపర్వములు పూర్తిగను, మూఁడవపర్వము కొంత వఱకును రచించెను. ఇదియుఁగాక ఆంధ్రవ్యాకరణ మొకటి రచించి శబ్దశాసనుఁ డన్న బిరుదు వహించెను. నన్నయభట్టు వ్యాకరణము రచింపలేదనియు, భారతము రచించినందున నాతనికి నీపేరు వచ్చెననియు రావుబహాదరు కందుకూరి వీరేశలింగముపంతులుగారి యభిప్రాయమై యున్నది కాని తెలుఁగు బాసలోని రెండవ సీసపద్యమనఁదగు భారతములోని రెండవ సీసపద్యములోనే నన్నయభట్టు తనకు శబ్దశాసనుఁడన్న బిరు

మున్నట్లు వ్రాసికొని యుండుటచే నాతనికి శబ్దశాసనుఁ డను బిరుదు భారతరచనమువలన వచ్చెనని చెప్పుట పొసఁగదు. ఆతఁడు భారతమునకుఁ బూర్వమే వ్యాకరణము రచించెనని స్పష్టపడుచున్నది. సంస్కృతములో శబ్దానుశాసన మనఁగా వ్యాకరణ మని యర్థము. వ్యాకరణ మహాభాష్యము 'అథ శబ్దానుశాసనమ్' అనుసూత్రముతోఁ బ్రారంభమగుచున్నది. నన్నయభట్టుగాక ఈ రాజునాస్థానంబున నారాయణభట్టు, పావులూరి మల్లన యను సిద్ధఆంధ్రకవులున్నట్లు గానవచ్చెడిని. నారాయణభట్టు భారతముఁ దెనిఁగించుటలో నన్నయభట్టునకు సహాయుఁడుగా నుండెను. పావులూరుమల్లన యను నాతఁడు రాజనరేంద్రునివలన నగ్రహారము వడసి పావులూరి గణితమను గ్రంథము రచించెను. ఇటు లీరాజచంద్రుఁడు ఆంధ్రభాషావధూటిని నెంతయుఁ బ్రేమతోఁ బెంచి పెద్దదానిని జేసెను.

ఇమ్మహారాజు తన మేనమామయగు రాజేంద్రచోళుని కూఁతురయిన యమ్మంగదేవిని వివాహమాడి శాలివాహన శక ౯౪౪-వ సంవత్సరమందు భాద్రపద బహుళ ద్వితీయా గురువారము ఉత్తరాభాద్ర నక్షత్రమున (ననఁగా క్రీ. శ. ౧౦౨౨ వ సంవత్సరము ఆగష్టు నెల ౧౬-వ తేదిని) పట్టాభిషిక్తుఁడై క్రీ. శ. ౧౦౬౩ వఱకు ననఁగా నలువదియొక్క సంవత్సరములు రాజ్యపరిపాలనము చేసెను. ఇతని తమ్ముఁడు విజయాదిత్యుఁడు. కుమారుఁడు కులోత్తుంగ చోళదేవుఁడు.

కులోత్తుంగ చోళదేవుఁడు:— ఇతఁడు రాజనరేంద్రుని ప్రథమపుత్త్రుఁడు. ఇతఁడే రాజేంద్రచోళుఁడు. ఇతని మొదటి పేరిదియే యయినను ఇతఁడు వేఁగిదేశ రాజ్యభారమును వహించిన మొదటి సంవత్సరములోనే చోళదేశముపై దండెత్తి దానిని జయించి స్వాధీనపఱుచుకొన్న తరువాత కులోత్తుంగ చోళదేవుఁ డనఁబడుచు వచ్చెను. ఇతనికి రాజనారాయణుఁ డను బిరుదుండెను. ఇతనిని కరికాలచోళుఁ డనియుఁ బిలుచుచు వచ్చిరి. మూఁడుతరములనుండి చోళరాజులకూఁతులను వివాహమాడుచు వచ్చుటచేతఁ దమతల్లులనుబట్టియు భార్యలనుబట్టియు చాళుక్యుల కంతకంతకు వేఁగిదేశమున కంటె చోళదేశముమీఁద నభిమాన మెక్కువగుచు వచ్చెను. విమలాదిత్యుఁడు రాజరాజుకూఁతురైన కుందమాంబాదేవిని వివాహమాడి తనకుమారునకు రాజరాజని పేరుపెట్టెను; రాజరాజు తన మేనమామయైన రాజేంద్రచోళునికూఁతురైన అమ్మాంగదేవిని పెండ్లియాడి తనపుత్త్రునకు రాజేంద్రచోళుఁ డనియే నామకరణము చేసెను. తరువాత రాజేంద్రచోళుఁడును, రాజేంద్రచోళునికూఁతురైన మధురాంతకదేవిని పరిణయముచేసికొని చోళదేశము మీఁదనే యధికారరముగలవాఁడై తా నాదేశమును జయించినతోడనే తన రాజధానిని చోళదేశమునకు మార్చుకొని, వేఁగిదేశమును పాలించుటకై పాలకులను నియమించి రాజ్యాధికారమును వారికి విడిచిపెట్టెను. ౧౦౬౩-వ సంవత్సరమునందు వేఁగిదేశమును పాలించుటకై కులోత్తుంగచోళదేవుఁడు తనపినతండ్రి

మైన విజయాదిత్యుని నియమింపఁగా నతఁడు పదునేను సంవత్సరములు రాజ్యపాలనచేసి వార్ధకదశలో ౧౦౭౬-వ సంవత్సరమునందు చోళదేశమునకుఁ బోయిచేరెను. అటుతరువాత ౧౦౭౮-వ సంవత్సరములోనే వేఁగిదేశపాలనము నిమిత్తము తన రెండవకొడుకైన రాజరాజును బంప నతఁ డక్కడ నుండ నొల్లక మరుసటి సంవత్సరములోనే తల్లిదండ్రులయొద్దకు లేచి రాఁగా ౧౦౭౮-సంవత్సరమునందు శ్రావణమాసములోఁ దనమూఁడవకొడుకైన వీరచోళదేవుని వేఁగిదేశపాలకునిగా బంపెను. ఈ వీరచోళదేవుఁడు (తొమ్మిదవ) విష్ణువర్ధనుఁడను బిరుదుతో ౧౦౮౪-సంవత్సరమువఱకును వేఁగిదేశాధిపుఁడుగా నుండెను. కులోత్తుంగ చోళదేవునికి విక్రమచోళుఁడు, రాజరాజు, వీరచోళదేవుఁడు మొదలుగాఁగల కొడుకులును, రాజసుందరియనుకూఁతురును గలిగిరి. ఈ రాజసుందరి కళింగరాజైన రాజరాజునకు భార్యయయ్యెను. కులోత్తుంగ చోళదేవుఁడు ౧౦౬౩ మొదలు ౧౧౧౨ వఱకు నలుబదితొమ్మిది సంవత్సరములు రాజ్యపాలనము చేసెను.

విక్రమచోళుఁడు.—ఇతఁడు కులోత్తుంగచోళుఁ డను బఱెడు రాజేంద్రచోళుని జ్యేష్ఠకుమారుఁడు. ఇతఁడు కొంత కాలము వేఁగిదేశపాలకుఁడుగా నుండెను. ఇతఁడు తండ్రి యొక్క మరణానంతరమున వేఁగిదేశమునువిడిచి చోళరాజ్యమును వహించుటకుఁ బోయెనని యొకశాసనమున వ్రాయఁబడియున్నది. ఇతఁడు ౧౧౧౨ మొదలు ౧౧౨౭వఱకు పదునేనుసంవత్సరములు రాజ్యముచేసెను.

"కులోత్తుంగ చోళదేవుఁడు:—ఈ రెండవకులోత్తుంగుఁడు విక్రమచోళుని కొడుకు. ఇతఁడు ౧౧౨౭-సంవత్సరమున రాజ్యమునకువచ్చెను. ఇతఁడుచోళరాజ్యము ౧౧౪౮ సంవత్సరము వఱకును పాలించెను. ఇతనికొడుకు రాజేంద్ర చోళుఁడు. పండ్రెండవ శతాబ్దాంతము వఱకును, రాజేంద్ర చోళుని కొడుకగు రాజరాజచోళుఁడు ౧౨౩౨ వ సంవత్సరమువఱకును చోళరాజ్యమును పాలించినట్లు కనఁబడుచున్నది. ఈ రెండవ కులోత్తుంగచోళదేవునికాలములోనే వేఁగిదేశమితర చాళుక్యుల యధీనమయినట్టు స్పష్టముగాఁ గనఁబడుచున్నది. ౧౨౦౨వ సంవత్సరమునందు మల్లవిష్ణువర్ధనుఁడు వేఁగిదేశప్రభువుగా నుండిన ట్లొక శాసనమునం దున్నది. ఆ శాసనమునందే యాతని తండ్రి విజయాదిత్యుఁడు చిరకాలము వేఁగిదేశమును పాలించినట్లును జెప్పఁబడియున్నది. దీనినిబట్టి చూడఁగా రెండవకులోత్తుంగచోళదేవుని కాలములోనే విజయాదిత్యుఁడు వేఁగిదేశరాజ్యమును వహించినట్లు తోఁచుచున్నది. ఈ విజయాదిత్యుఁడు పైని వివరింపఁబడిన పదునేడవ తూర్పుచాళుక్యరాజగు బేటవిజయాదిత్యుని కాలవతరమువాఁడు. బేటవిజయాద్యితుని కొడుకు సత్యాశ్రయుఁడు; సత్యాశ్రయుని కొడుకు విజయాదిత్యుఁడు; విజయాదిత్యునికొడుకు విష్ణువర్ధనుఁడు; విష్ణువర్ధనుని కొడుకు మల్లప్పదేవుఁడు; మల్లప్పదేవుని కొడుకు వేఁగిదేశప్రభువైన విజయాదిత్యుఁడు; ౧౨౦౮ వ సంవత్సరమునందు కృష్ణా గోదావరీ మధ్యమునందున్న వేఁ

దేశమంతయు గణపతిరాజుల యధీనమైనది. కులోత్తుంగ చోళదేవుని కాలమునుండియుఁ జాళుక్యరాజు లందఱును తాము వేఁగిదేశమును విడిచి చోళుల బిరుదావళులను వహించి తాము చోళులుగానే పరిగణింపఁబడుచు వచ్చుటచేత వారిని గూర్చి యిందు వివరించుట యనావశ్యకము. చాళుక్యులు చంద్రవంశపు రాజులు; చోళులు సూర్యవంశపు రాజులు"[1]

దేవగిరి యాదవవంశము.

చరిత్రగ్రంథములలో యాదవవంశములు రెండు వర్ణింపఁబడినవి. ఉభయ వంశములవారును తాము కృష్ణవంశజులమని చెప్పుకొనుచుండిరి. ఇందు నొకవంశమువారి రాజధాని దేవగిరి; రెండవవంశమువారిది ద్వారసముద్రము.

యాదవులు మొదట మథురలోని రాజులు. కృష్ణుని కాలమున వీరు ద్వారక ప్రవేశించిరి. సుబాహుని కుమారుఁడైన దృఢప్రహారుఁ డనువాఁడు మొదట మహారాష్ట్ర దేశము నకుఁబోయి యచ్చట రాజ్యమును స్థాపించెను. శ్రీనగరమను పట్టణమీతని రాజధాని. అది ప్రస్తుతపు నాశికాపట్టణము నొద్ది చాందోరనుగ్రామమేయని కొందఱు విద్వాంసుల యభిప్రాయము. దృఢప్రహారుని కుమారుఁడు సేఉణచంద్రుఁడు. ఈతఁడు తనపేరిట సేఉణపురమును గట్టించెను. అప్పటినుండి

(1 ఆంధ్రకవుల చరిత్రము; ప్రథమ భాగము.)

యూదేశమునకుఁ గూడ సేఉణదేశమనియే నామము వచ్చెను. ప్రస్తుతము బొంబాయి రాజధానిలోని ఖాన్‌దేశ్ అను జిల్లా యున్న ప్రదేశమే పూర్వపు సేఉణదేశము. కాని ప్రస్తుతపు ఖాన్‌దేశమను జిల్లాకంటె నప్పటి దేశపు వైశాల్యము దక్షిణపూర్వదిక్కుల నధికముగా నుండెననుటకు సందేహము లేదు.

సేఉణచంద్రుని తరువాత నాతని పుత్రుఁడగు ధాడియప్ప, మనుమఁడగు భిల్లముఁడు రాజ్యముఁ జేసిరి. తరువాత శ్రీరాజ, వడ్డిగ, ధాడియస, భిల్లములను రాజులును, మఱికొందఱు రాజులును రాజ్యమేలిరి. వీరిలో భిల్లముఁడు పరాక్రమవంతుఁడు. కొందఱు రాజులు పాలించిన తరువాత విక్రమశాలి యగు మూఁడవభిల్లముఁడు రాజ్యమునకు వచ్చెను. ఈతఁడు చళుక్యవంశజుఁడైన జయసింహునికూఁతును వివాహమాడెను. తరువాత రెండవ సేఉణచంద్రుఁడు రాజయి చళుక్యరాజయిన విక్రమాదిత్యునకు యుద్ధములో మిగుల సాయము చేసెను. కొన్నితరముల తరువాత నైదవభిల్లముఁ డుద్భవించి శౌర్య సాహసములకుఁ బ్రఖ్యాతిఁ జెంది చళుక్యులగెలిచి, యాదవులదివఱకుఁ జళుక్యులకు సామంతులన్న యగౌరవముఁ బోఁగొట్టుకొని స్వతంత్రుఁ డయ్యెను. ఈతఁడు క్రీ. శ. ౧౧౮౭వ సంవత్సర ప్రాంతమున దక్షిణములోని ద్వారసముద్రపుయాదవులను, చళుక్యులను పూర్తిగఁ బరాభవించి, చళుక్యరాజధానియగు కల్యాణపట్టణమును స్వాధీనపఱుచుకొనియె. కృష్ణానదికి నుత్తరముననున్న రాజ్యమంతయు నాక్రమించు

కొనెను. కృష్ణకు దక్షిణమునందున్న మహారాష్ట్రదేశమున కప్పుడుకుంతల దేశమని పేరు. వీరబల్లాలుఁడు కుంతలదేశము నాక్రమించుకొని యుండెను. భిల్లముఁడు వానిమీఁదికి దండెత్తి పోయెను. ఇద్దఱకును ధార్వాడ్ జిల్లాలోని లక్కుండీయను చోట ఘోరయుద్ధము జరిగి యందు భిల్లముఁ డోడింపబడెను (౧౧౯౧). ఈకాలమునందు నుత్తరహిందూదేశములో మహమ్మదుగోరీ పృథ్వీరాజుతోఁ బోరాడుచుండెను.

భిల్లముని తరువాత నతని కుమారుఁడైన జైత్రపాలుఁడు దేవగిరికి రాజయ్యెను (౧౧౯౧). ఇతఁడును తండ్రివలెనే పరాక్రమవంతుడై రాజ్యాభివృద్ధి చేసెను. ఇతఁడు విద్వాంసుఁడు; విద్వత్ప్రియుఁడు. భాస్కరాచార్యులవారి కుమారుఁడగు లక్ష్మీధరుఁ డితని యాస్థానమునందు జ్యోతిర్విదుఁడుగాఁ నుండెను.

సింగణయాదవుఁడు (౧౨౧౦-౧౨౪౭).—ఇతఁడు జైత్రపాలుని కుమారుఁడు. ఇతని ప్రభుత్వకాలమందు యాదవుల ప్రభుత్వ మపారముగ నభివృద్ధిఁజెందెను. ఇతఁడు కుంతల, మాలవ, గుజరాత్, కన్నాశా, ఛత్తీస్‌గడము లను దేశములలోని రాజులను జయించెను. కన్నాశా యనుగ్రామములో నప్పుడు శిలాహారవంశజుఁడయిన భోజరాజు రాజ్యము చేయుచుండెను. శిలాహారవంశ మింతటితో నంతరించినట్లు గానవచ్చుచున్నది. సింగణుఁడు గుజరాత్ దేశముమీఁదికి ననేక పర్యాయములు దండెత్తిపోయెను. ఈయుద్ధములలో నతనికి ముద్గలగోత్రజుఁడగు ఖోలేశ్వరుఁడను బ్రాహ్మణుఁడు సేనా

ధీశుఁడుగా నుండెను. గుజరాత్ దేశమం దప్పుడు వాఘేల్ వంశ జులు రాజ్యముచేయుచుండిరి. ఖోలేశ్వరుఁ డీరాజుల నెన్నిమా సాసు లోడించెను. గుజరాత్ దేశపురాజయిన లవణప్రసా దుఁడును, అతని పుత్త్రుఁడైన వీరధవలుఁడును ఈతనితో సంధిచేసికొనిరి. ఒకయుద్ధములో ఖోలేశ్వరుని కుమారుఁడైన రాముఁడు వీసరదేవునితోఁ బోరాడుచు వీరశయనము నొం దెను. ఖోలేశ్వరునికి బిచ్చణుఁడను మఱియొక పుత్త్రుఁ డుండెను. ఇతఁడును సేనాధీశుఁడుగానుండి రాజుకొఱకు దక్షిణ కొంకణ, దక్షిణమహారాష్ట్రదేశములను జయించెను. సింగణ రాజు భూషణగడదుర్గమును, సింఘణాపురమును గట్టించెను. ఇతఁ డనేక దేవాలయములను నిర్మించెను. ఇతఁ డప్పటి కాలపు రాజులలో శ్రేష్ఠుడని విఖ్యాతిఁగాంచెను. 'పృథ్వీవల్లభ' 'విష్ణు వంశోద్భవ' అనుబిరుదు లీతనికిఁగలవు. ఈతనియొక్కయు, ఈతనికంటెఁ బూర్వము రాజ్యముచేసిన యిద్దరురాజుల యొక్కయు మంత్రులకు 'శ్రీకరణాధిప' అనుబిరుదుండెను. సోఢలుండనువాఁ డీతనిమంత్రి. ఈతనికుమారుఁడగు శార్ఙ్గ ధరుఁడనువాఁడు సంగీతరత్నాకర మనుగ్రంథమును ఈ రాజు ప్రభుత్వకాలములోనే రచించెను. భాస్కరాచార్యుని మను మఁడగు చాంగదేవుఁ డీతని యాస్థానమందుండెను. భాస్కరా చార్యులవారికి శ్రీపతి యను తమ్ముఁడు గలఁడు. అతని కుమా రుఁడు గజపతి, అతని కుమారుఁ డనంతదేవుఁడు. వీరందఱును జ్యోతిషశాస్త్రమునందు నిపుణులు; యాదవుల రాజ్యములోనే యభివృద్ధిఁజెందిరి. ఖానదేశమందలి చాలీస్‌గాం తాలూకా

లోనున్న పాటణాయను గ్రామమందు భాస్కరాచార్యుల మనుమండగు చాంగదేవుఁడు సిద్ధాంతశిరోమణి గ్రంథమును నేర్పుటకై యొకపాఠశాలను స్థాపించెను. అనంతదేవుఁ డొక భవానీదేవాలయముఁ గట్టించెను (౧౨౨౨). విద్వాంసుఁ డును పరాక్రమవంతుఁడును అగు, జైత్రపాలుఁ డను సింఘముని పుత్త్రుఁడు తండ్రియెదుటనే స్వర్గస్థుఁడయ్యెను.

కృష్ణుఁడు. (౧౨౪౭-౧౨౬౦)—ఇతనికి కన్హార్, కంధార్ అని మాఱుపేళ్లు. ఇతఁడును క్షాత్త్రతేజముచే శోభించెను. ఇతఁడు గుజరాత్ దేశముపై దండెత్తిపోయెను. ఇతనికి లక్ష్మీదేవుఁడనువాడు ముఖ్యమంత్రిగ నుండెను. ఈరాజు బహు యజ్ఞములఁజేసి బ్రాహ్మణులకు ననేకాగ్రహారము లిచ్చెను. లక్ష్మీదేవుని తరువాతి నతని జ్యేష్ఠపుత్త్రుఁడగు జహ్లణుఁడు రాజునకు మంత్రిగానుండెను. ఇతఁడు విద్వాంసుఁడు; సూక్తి ముక్తావళియను గ్రంథమును రచించెను. వేదాంతసూత్ర భాష్యముమీఁద టీకవ్రాసిన అమలానందుఁ డనువాఁడు కృష్ణుని యాస్థానమందుండెను.

మహాదేవుఁడు— (౧౨౬౦-౧౨౭౧) మహాదేవుఁడు కృష్ణుని తమ్ముఁడు. ఇత డాంధ్ర, గుజరాత్, కొంకణదేశముల రాజులను నోడించెను. ఇతని కాలమువఱకు యాదవుల దేశమునకు సేఉణదేశమని పేరుండెను. దేవగిరి సేఉణదేశములో దండకారణ్యపు సీమమీఁద నుండెనని యప్పటివారిచే వ్రాయబడినది. ఈరాజుచేతిక్రింద ననేకసామంతరాజు లున్నందున నితఁడు చక్రవర్తి బిరుదును వహించెను. కాశ్యపగోత్రజుఁ

డయిన కేశవుడను బ్రాహ్మణుడు ఋత్విజుడుగా నుండ నీరాజు అప్తోర్యామయజ్ఞమును చేసెను.

రామదేవుడు (౧౨౭౧-౧౩౦౯)— ఇతడు కృష్ణుని కుమారుడు. ఈతనిని అన్నివిధములను ఓరుగంటి ప్రతాపరుద్రునితోం బోల్పవచ్చును. ఇద్దఱును మొదట గొప్పవైభవము ననుభవించిరి. ఇద్దఱును తుదకుం దురుష్కులు ఓడించి ఢిల్లీకిం గొంపోయిరి. ఇద్దఱితోడనే వారివారివంశముల వైభవము లంతరించెను.

ఈ రాజునకు రామచంద్రుడనియుం బేరుండెను. ఇతడు ౧౨౭౧-లో నేబదియేడుగురు బ్రాహ్మణులకు మూడు గ్రామము లగ్రహారములుగా నిచ్చెను. దానమిచ్చునపుడేర్పఱిచిన నిబంధన లందఱును గమనించుటకుం దగినవిగా నున్నవి. ఆబ్రాహ్మణులును, వారివంశజులును ఆగ్రామములోనే కాంపుర ముండవలెను. తమయగ్రహారములం గుదువం బెట్టరాదు; ఆగ్రామములో వేశ్యల నుంపంగూడదు: ఆబ్రాహ్మణులు జూదమాడంగూడదు; శస్త్రముల ధరింపంగూడదు; అందఱును సత్కర్మమునందుం గాలముంగడపవలయును.

ఈరాజునొద్ద హేమాద్రి బోపదేవులను ఇద్దఱు విద్వాంసులుండిరి. హేమాద్రి యనునాతడు మహాదేవ రామచంద్రులకిద్దఱకును మంత్రిగానుండెను. ఇతనిది శ్రీవత్స గోత్రము. ఇతనికి శ్రీకంఠాధిపుడనియు, కరణాధిపుడనియు బిరుదులుండెను. కరణాధిపుడనంగాం గరణముల కధికారియని యర్థము. ఈతడు ధర్మశాస్త్రములను గుఱించి గ్రంథము

లనేకములు వ్రాసెను. ఇతని గ్రంథములలోఁ జతుర్వర్గచింతామణి యనునది మిక్కిలిపెద్దది. ఇందు వ్రతఖండము, దానఖండము, తీర్థఖండము, మోక్షఖండము, పరిశేషఖండము అను నైదు భాగములు కలవు. ఈతనిని మరాటిలో హేమాడ్ పంత్ అనియెదరు. ఇతఁడు మరాటిలో నుత్తరప్రత్యుత్తరములు త్వరగావ్రాయుటకై 'మోడీ' యను నక్షరముల నిర్మించెను. ఈ మోడీ మన తెలుఁగులోని గొలుసుకట్టువంటిది. ఇతఁడింష్లుకట్టెడి నూతన విధము నేర్పఱిచెను.

బోపదేవుఁడను మఱియొక విద్వాంసుఁడీ రాజు నొద్ద నుండెనని ఇదివఱకే చెప్పియుంటిమి. ఇతఁడు ముక్తాఫల హరిలీల లను గ్రంథములను, ముగ్ధబోధమను సంస్కృతవ్యాకరణమును రచించెను. ఇవిగాక యీతఁడు కొన్ని వైద్య గ్రంథములను వ్రాసెనఁట!

మహారాష్ట్రదేశమునందు మిక్కిలి విఖ్యాతుఁడగు జ్ఞానేశ్వరుఁడను సాధు వీ రాజు సమకాలీనుఁడు. ఇతఁడొక గొప్పకవి. భగవద్గీతమీఁద మరాటిలో టీకవ్రాసెను. దానికి జ్ఞానేశ్వరియని పేరు. కావ్యముగను, వేదాంత గ్రంథముగను జ్ఞానేశ్వరిని ఇప్పటికిని మహారాష్ట్రులు భక్తితోఁ జదివెదరు. ఈగ్రంథము వ్రాయుట ౧౨౯౦ లో ముగిసెను.

రామదేవుఁడు స్వాతంత్ర్యమును వైభవమును గొంత కాలము వఱకు ననుభవించిన కడసారి మరాటిరాజు. మరల శివాజియుదయించు వఱకును (౧౬౭౪) మహారాష్ట్రదేశము పారతంత్ర్యమునందే యుండెను.

౧౨౯౪ లో అల్లాఉద్దీన్‌ఖిల్జీయనువాఁడు దేవగిరిపై దండెత్తి రామదేవుని నోడించి యపారసంపత్తిని నపహరించెను. ౧౩౦౭ లో అల్లాఉద్దీన్ యొక్క సరదారుఁడగు మలిక్ కాఫుర్ అనువాఁడు వచ్చి రామదేవునిఁ జెఱఁబట్టి ఢిల్లీకిఁ దీసికొనిపోయెను. అచ్చట నాఱునెలలుండి చెఱవిడిపించుకొని తన రాజ్యమునకువచ్చి ౧౩౦౯ లోఁ గాలధర్మము జెందెను. ఈ కథాభాగమంతయు మహారాష్ట్రదీయ మహాయుగములో సవిస్తరముగా వర్ణింపఁబడినది.

ఓరుగంటి గణపతిరాజులు.

తూర్పుచళుక్యరాజుల తరువాత నాంధ్రదేశమును బరిపాలించి మిక్కిలి ఘనతఁజెందిన రాజులీ గణపతి వంశజులు. వీరికి కాకతీయవంశజులనియు మాఱుపేరు గలదు. వీరికి రాజధాని ఓరుగల్లు. ప్రస్తుత మిది నైజాము రాజ్యములో వరంగల్ అనుపేరిట వ్యవహరింపఁ బడుచున్నది. ఈ యోరుగంటివద్దనే అనుమకొండ యను గ్రామముకలదు. మొదటఁ గాకతీయరాజు లచ్చటనే రాజ్యము చేయుచుండిరి. ఈ కాకతీయరాజులు గంగవంశపువారని కొందఱును, చోళవంశపువారని కొందఱును, యాదవవంశపువారనికొందఱును, వ్రాసియున్నారు. ఈరాజులు మొదట చిన్న సంస్థానాధిపతులుగానున్నను పండ్రెండవ పదమూఁడవ శతాబ్దములలో వీరు మహాబలవంతులై తెనుఁగుదేశమంతయు నాక్రమించుకొనిరి. అందువలననే 'తెలంగాణ' అనఁగా ఓరుగంటిరాజ్యమని హిందూదేశమంతటను వాడుకయయ్యెను.

ఈ వంశపువారి మూలపురుషుఁడు సోమదేవరాజు కుమారుఁడగు మాధవవర్మయని చెప్పెదరు. ఈవంశములో నయిదవవాఁడగు పెంటిగుండమరాజు కటకవల్లభుని, గొందరు తురుష్కులను నోడించెను. ఏడవవాఁడగు ఎరుకదేవరాజు దేవగిరిపై దండెత్తివెడలి యప్పనము గైకొనియె. ఎనిమిదవ వాఁడగు భువనైకమల్లునివరకు రాజులు అనుమకొండలోనే వాసముచేయుచుండిరి. ఈ రాజులచే అనుమకొండలో దివ్యమయిన శివమందిరములు నిర్మింపఁబడియె. అందు వేయిస్తంభములగుడి యనునది మిక్కిలి శిథిలమైపోయినను, దాని పనితనము ఇప్పటికిని చూచువారికి మిక్కిలి యానందమును గలుగఁజేయుచున్నది. పదియవవాఁడగు కాకతిప్రోలరాజు ౧౧౧౮ సంవత్సరమువరకు రాజ్యముచేసి ఓరుగంటిదుర్గమును గట్టించెను. ఈ దుర్గము పూర్వము మహాఖ్యాతినిగన్నట్టి గొప్ప దుర్గమై యున్నది. ప్రస్తుతము పాడుపడి నామావశిష్టమైపోయినను తనపూర్వవైభవమును సూచించుచున్నది. ఈరాజు మిక్కిలి ప్రతాపవంతుఁడై పశ్చిమ చాళుక్యరాజులను గెలిచెను. ఈతని రాజ్యము ఉత్తరమున కటకమువఱకును, దక్షిణమున శ్రీశైలమువఱకును, తూర్పున సముద్రమువఱకును, పశ్చిమమున మాల్యవంతమను పర్వతమువఱకును వ్యాపించియుండెనని యొక శ్లోకము కలదు.

ప్రోలరాజుకుమారుఁడు మొదటి ప్రతాపరుద్రదేవుడు. ఇతఁడు ౧౧౬౮ సంవత్సరమువఱకు రాజ్యముచేసెను. ఇతఁడనేకశివాలయములను గట్టించి శైవమతాభివృద్ధిఁజేసెను.


ఉత్తరము.
దేవగిరి.
ఓరుగల్లు.
తూర్పుచాళుక్యులు
కృష్ణానది.
తుంగభద్ర.
ద్వారసముద్రము.
కాంచి
మధుర.
పౌరాణికయుగములోని
దక్షిణ
హిందూదేశము.

ఈతని తమ్ముఁ డగు మహాదేవరా జీతనిఁ జంపి రాజయ్యెను.
కాని యాతఁడు ౧౧౯౦ సంవత్సరములో దేవగిరిమీఁదికి
దండు వెడలిపోయి యచ్చటి యుద్ధమున హతుఁడయ్యెను.

గణపతిరాజు:— ఇతఁడు మొదటి ప్రతాపరుద్రుని
కుమారుఁడు. పినతండ్రి మరణానంతర మీతఁడు రాజ్యమునకు
వచ్చెను. తనపినతండ్రిని దేవగిరిరాజులు చంపినకసితీర్చుకొన
నతఁడు దండుతో వెడలి దేవగిరికోటను ముట్టడించి ఘోరముగాఁ
బోరెను. దేవగిరియాదవు లాతనిదాడికి నోర్వలేక యుప్ప
నంబులును, రాజపుత్రికయగు రుద్రమదేవిని నాతనికిచ్చి సంధి
చేసికొనిరి. ఈ దేవగిరిరాజులనేగాక చోళకటకరాజులను
మన్నెదొరలను గెలిచిన ట్లాతనిశాసనములవలనఁ గానవచ్చుచు
న్నది. ఇతని శాసనములలో 'పరనారీసహోదర' అను
బిరుదొక విశేషణముగా నున్నది. ఇందువలన నీతఁడు మిక్కిలి
పవిత్రాచరణము గలరాజని తోఁచుచున్నది.

ఇతఁ డనేకతటాకంబులను, గ్రామంబులను, దేవాలయం
బులను దనపేరటఁ గట్టించి ధర్మాత్ముఁడని మిక్కిలి ఖ్యాతి
వహించెను. అందుఁ గొన్ని నేఁటివఱకును గాన్పించుచున్నవి.
ఇతనికి శైవమతమునందుఁ బూర్ణాభిమానమును, జైనమతము
నందు మిక్కిలి ద్వేషమును గలిగియుండెను. ఇతఁడు లింగధా
రులగు ఆరాధ్యబ్రాహ్మణులను గురువులుగాఁ జేసికొని వారి
బోధనల ననుసరించి కాఁబోలు వేలకొలఁది జైనుల సంహరిం
చెను. అప్పుడు ఓరుగంటిరాజ్యములో జైనమతము ప్రబలి
యుండెను. అనుముకొండలో పద్మాక్షిదేవాలయ మున్న కొండ

మీఁద నిప్పటికిని ననేక జైనశాసనములును, అనేక జైనప్రతిమలును గానవచ్చు చున్నవి. ఇట్లుప్రబలిన జైనులనణఁచి శైవు లోర్వలేకపోయిరి. వారు తమ కనుకూలుఁడగు రాజుచే నీ నిరపరాధులఁ జంపించిరి "ముప్పదియారు జైనగ్రామములు నామములేకుండఁ జేసిరి; అనేకుల నటికి అసంఖ్యజైనులను దోమలవలెఁ జంపిరి; మిగిలిన వారిని దేశమునుండి వెడలఁగొట్టిరి" అని యొక గ్రంథకారుఁడు వ్రాసియున్నాఁడు. ఈపనిచేయించుటకుఁ దిక్కనసోమయాజియే ముఖ్యకారకుఁడని కొందఱు వ్రాసియున్నారు. ఇటులీ రాజును, నీతని మనుమఁడగు రెండవప్రతాపరుద్రుఁడును, తమ ప్రజలగు జైనులమతము నెడ సహిష్ణుతలేనివారై వారిని అపరిమితబాధలు పెట్టినందుననే యీరాజ్యమందలి జైనుల కందఱకు రాజునెడ ననూయకలిగి వారు తురుష్కులకు ననుకూలురుగా నుండిరనియు, అందువలన నీరాజ్య మడుగంటెననియుఁ గొందఱు విద్వాంసుల యభిప్రాయము. పరమతసహిష్ణుతయే పరమధర్మముగదా!

## తిక్కన సోమయాజి.

ఆంధ్రభాషావిషయమునఁగవిబ్రహ్మయనఁబడు తిక్కన సోమయాజి యీరాజునకు సమకాలీనుఁడు. ఆకాలమందు మనుమసిద్ధియను నొకచిన్నరాజు నెల్లూరిమండలము నేలుచుండెను. అతఁడు సూర్యవంశపురాజు. అతనియొద్ద తిక్కనసోమయాజి మంత్రిగానుండెను. తిక్కనయింటిపేరు కొట్టరువువారు వీరు నియోగిబ్రాహ్మణులు. పాకనాఁటి నియోగులని కొం

డఱు చెప్పెదరు * ఇతనిది గౌతమసగోత్రము. తండ్రి కొమ్మన, తల్లి అన్నమ్మ, మల్లనసిద్దన లనువారు పెదతండ్రులు; భాస్కరమంత్రి యాతని తాత. ఇతని వంశము వారు రాజులయొద్ద గొప్ప నైయోగికులుగా నుండి రాజుల యాస్థానములయందు మంత్రిత్వకవిత్వములచే సమ్మానము బొందుచుండిరి. తిక్కనతండ్రియగు కొమ్మన గుంటూరునకు దండనాథుఁడుగానుండెను; తాతయగు భాస్కరుఁడు గుంటూరున కధిపతిగానుండి కవిత్వవిభవంబుచే మంత్రిభాస్కరుఁడని విఖ్యాతుఁడయ్యెను. మొట్టమొదట వాల్మీకిరామాయణము నీతఁడే తెనిఁగించె ననియెదరు. తిక్కన సోమయాజి యనేకయజ్ఞములఁ జేసి సోమయాజి యనుబిరుదును సంస్కృతాంధ్రభాషలలో నిరుపమాన పాండిత్య కవిత్వసామర్థ్యముగలవాఁడై యుభయభాషాకవులను గౌరవించుటవలన ఉభయకవిమిత్రుఁడను బిరుదును వహించియుండెను. ఈతని మేము వేఱుగఁ బొగడుటకంటెను నాతని సమకాలీనుఁడగు కేతనకవిచేఁ జెప్పఁబడిన యత్యంతస్వభావోక్తియగు నీక్రిందిపద్యము నిచ్చట నుదాహరించుచున్నారము. అందువలన నాతని యనుపమానయోగ్యత తేటపడఁగలదు.

---

* ప్రస్తుతము తిక్కన సోమయాజివంశమువారు నెల్లూరియొద్దనున్న పాటూరులోఁ గరణములుగా నున్నారు. వీరు పాకనాఁటినియోగులయినందున వీరిపూర్వుఁడగు సోమయాజికూడ పాకనాఁటినియోగిగా నుండవలెనని మామిత్రులును, తెలుఁగు ట్రాన్స్‌లేటరు కచ్చేరిలో హెడ్ మున్‌షీగారునగు మ-రా-రా-శ్రీ. దూబగుంట రాఘవయ్యగారియభిప్రాయమైయున్నది. కాని

సీ॥ పరసకవీంద్రుల సత్ప్రబంధము లొప్పఁ
గొను నను టధికకీర్తనకుఁ దెరువు
లలితనానాకావ్యములు చెప్పు నుభయభా
షలయందు ననుట ప్రశంసతోఁ ద్రవ
యర్థిమైఁ బెక్కాళ్ళ నగ్రహారంబులు
గా నిచ్చు ననుట పౌగడ్తపాలము
మహితదక్షిణలైన బహువిధయాగంబు
లొనరించు ననుట వర్ణనముదారి
గీ॥ పరుని నొక్కని కిన్నియుఁ బ్రకటవృత్తి
నిజములై పెంపుసొంపారి నెగడునట్టి
కొమ్మనామాత్యు తిక్కనకొలఁదిసచివు
లింక నొక్కరుఁ డెన్నంగ నెందుఁ గలఁడు.

ఈపద్యములోని ప్రతిమాటయు సత్యమైనది; యిందొ నసత్య మేమియులేదు. అతిశయోక్తి యని తలఁపగూడదు. ఈతఁడు కేతనకృతమైన దశకుమారచరిత్రమునకుఁ గృతిభర్త; నిర్వచనోత్తర రామాయణమునకును, మహాభారతములోని పదునైదుపర్వములకును కృతికర్త. ఇతనికిఁ గవిబ్రహ్మయనుకీర్తి మహాభారతములోని పదునైదుపర్వములఁ దెని

---

ఉత్తరసర్కారులోని యారువేలనియోగులే పాకనాఁటికి, (నెల్లూరు మండలమునకుఁ) బోయి పాకనాఁటి నియోగులైనందున ఈ విభేద మనావశ్యకమనియు తిక్కనకాలమున నిట్టిభేద మున్నదో లేదో సంశయింపవలసి యున్నదనియు మాయభిప్రాయము.

గించుటవలన ముఖ్యముగ వచ్చెను. తిక్కనకృతమైన మహాభారతములోని పద్యసంఖ్య యిరువదివేలు. ఈకావ్యము తెనుఁగుబాసలో నద్వితీయము. ఇన్నినియమములఁ బాటించుచు నింతచక్కఁగా నింతకావ్యము జగత్తులోని మఱి యే కవియు వ్రాయలేదని చెప్పినఁ జెప్పవచ్చును. ఒక్కయాంధ్రంబున నననేల? పృథివియందలి యన్నిభాషలలోను గల యుత్తమకావ్యములలో నిదియొక్కటి యని చెప్పక తప్పదు. ఇందలి శబ్దసౌరస్యమును, అర్థసౌలభ్యమును, యతిప్రాసల సహజగతులును, వర్ణనవిషయములు ప్రత్యక్షములా యను సంశయముఁ గలిగించునట్టి ప్రసంగవర్ణనములును మొదలగు నీకవిగుణవిశేషంబు లత్యద్భుతములు. ఇతరుల కసాధ్యములు. తిక్కనకృతభారతము సంస్కృతమహాభారతమునకు భాషాంతరీకరణమని మనవారంద ఱనుకొనుచున్నారు. కాని యిది యొక గొప్పపొరబాటు. ఇట్లనుకొనుట మనము తిక్కనయెడ నొక యపరాధము సేయుటయే. సంస్కృతాంధ్ర మహాభారతముల నొద్దఁ బెట్టుకొని సాంతముగఁ జదివిచూచిన యెడల ఆంధ్రమహాభారతము సంస్కృతమహాభారతములో నుండి కథమాత్రము గ్రహించి దానికంటె వేయిరెట్లు అధికమనోహరముగా రచించిన స్వతంత్ర మహాకావ్య మని చెప్పకతప్పదు. మూలములోలేని అర్థాలంకారములును రసభావములును, మానవస్వభావవర్ణనలును, తెనుఁగుమహాభారతమునం దెచ్చటఁజూచినను విచ్చలవిడిగాఁ గానవచ్చును. మూలములోని విసుగుపుట్టించెడి యనేక దీర్ఘకథానకములును,

వర్ణనలును, వేదాంతఘట్టములును, తెనుఁగునందు లేనేలేవు. తిక్కన నిజమైనకవి యగుటచే నిరంకుశుఁడై మూలములోని ముఖ్యకథను మాత్రము తీసికొని కడమభాగము నిష్టమువచ్చి నటులు తగ్గించి, పెంచి మార్చివ్రాసెను. ఇట్లు చేయక సంస్కృతములోనున్న 'చ'కుఁ దెనుఁగునను' పడ్డదా లేదాయని యిప్పటికొందఱు కవులవలెఁ జూచుకొనుచుఁ దిక్కన తెనిఁగించి యుండినచో నతనికావ్యము పృథివిలోని యుత్తమకావ్యములలో నొక్కటియై యుండదు. కావున తిక్కన కృతమహాభారతము స్వతంత్రకావ్యమనియే చెప్పవలసియున్నది. ఇట్లనుట వలన సంస్కృతమహాభారతమునుండి తిక్కన యేమియుఁ గైకొనియుండలేదని గాని యది మిక్కిలి తక్కువయోగ్యత గలదనిగాని చెప్పుట మాయుద్దేశము కాదు. సంస్కృతమహాభారతము మా కత్యంతపూజనీయమే. కావ్యముగను, ఇతిహాసముగను దానియోగ్యత గొప్పదని మే మెఱుంగుదుము. కాని మూలములోని ప్రతిశబ్దమునకుఁ దూచినట్లు దెనుఁగైన నొకశబ్ద ముండినఁగాని యది మంచికావ్యము గానేరదని యనేకాంధ్రవిద్వాంసుల యభిప్రాయ మయినందున నది యసత్యమని చూపుటయే మాయుద్దేశము. సంస్కృతభారతము బంగారపుముద్దవంటిది. ఆంధ్రభారతము ఆముద్దలోనుండి కావలయునంత బంగారమును దీసికొని స్వర్ణకారుని బుద్ధివైభవముతోఁ జేయఁబడిన చక్కని సువర్ణకమలము వంటిది. ఉభయ భారతములలోని యీభేదముఁ జూపి స్వర్ణకారుని బుద్ధివైభవము వెల్లడిచేయుటయే మాయుద్దేశము. ఇదివఱకు మే

తెనుఁగువా రాంధ్రభారతమును కథాశ్రవణలోలురై విను చున్నారు. షేక్సుపియరు, మిల్టను మొదలగు కవులగ్రంథ ములను నింగ్లీషువారు చదివినట్టుల మనవారింక సంస్కృతాం ధ్రభారతములను కావ్యరసాస్వాదనలోలురై చదువుచుండరేని యాంధ్రభారతముయొక్క నిజమైనవైభవము వారికిఁ గానవచ్చును.

ఇట్టి మహాకవీంద్రుఁడగు తిక్కనసోమయాజియొక్క ప్రభువగు మనుమసిద్ధిని, అతనిజ్ఞాతుఁడగు అక్కన బయ్యనలు రాజ్యపదచ్యుతునిఁ జేసిరి. అందుపై సాహాయ్యమువేఁడుటకై ఓరుగంటి గణపతిరాజునొద్దకు సోమయాజి వెళ్ళెను. ఆరాజు సోమయాజిని మిక్కిలిగౌరవించి యాతని కోరికప్రకారము గొప్పసైన్యముతో వెడలి అక్కనబయ్యనలను వెడలఁదోలి మనుమసిద్ధికి మరల రాజ్య మొసంగెను.

ఈ గణపతిరాజు క్రీ. శ. ౧౨౫౭-లో మృతుఁడయ్యెను. ఈతనికిఁ గుమారుఁడు లేఁడు. రుద్రమదేవియను కూతురు మాత్ర ముండెను.

రుద్రమదేవి—ఈమె గణపతిరాజు కూతురు*. తండ్రి మరణానంతర మీామె క్రీ. శ. ౧౨౫౭ మొదలు క్రీ. శ. ౧౨౯౫

* ఈమె గణపతిరాజు భార్యయని విదేశీయుఁడగు మార్కోపోలో వ్రాసియున్నాఁడు. కాని యీామె గణపతిరాజుకూఁతురని అనితల్లి మొదలగు శాసనములవలన స్పష్టమగుచున్నది. (ఆంధ్రులచరిత్రము: ద్వితీయ భాగము. 305 వ పుట చూడనగును.)

సంవత్సరముల వఱకు ముప్పదియెనిమిది సంవత్సరములు రాజ్యము చేసి తనయపరిమితసద్గుణములచే మిక్కిలి విఖ్యాతిఁ జెందెను. శివదేవయ్య యను శైవబ్రాహ్మణుఁ డీమెకు మంత్రిగా నుండెను. గణపతిరాజు కాలములోఁ గూడ నితఁడే మంత్రిగా నుండినట్లు గానవచ్చుచున్నది. ఈమె యోరుగంటికోటను మరలఁ గట్టించి శత్రులకు భేద్యము కానట్లు దృఢపఱిపించెను. దేవగిరిరాజులు తన రాజధానిపై దండెత్తి రాఁగా నీమె మిక్కిలి ధైర్యముతో వారి నెదిరించి పాఱఁదోలెను. ఈమె ప్రజలను బిడ్డలవలెఁ గాపాడినందున జను లీమె దేవియొక్కయవతారమని తలంచుచుండిరి. ఈమె రాజ్యము చేయుచున్నప్పుడు మార్కోపోలో యను యూరోపుదేశస్థుఁడు మనదేశమునకు వచ్చియుండెను. ఆతఁ డీమెనుగురించి యిట్లు వ్రాసియున్నాఁడు: "పూర్వ మొక రాజీరాజ్యమును బాలించుచుండెను. అతని మరణానంతరము రమారమి నలుబది సంవత్సరములనుండి యాతని భార్యచే నీరాజ్యము పాలింపఁబడుచున్నది. ఈమె మిక్కిలి వివేకవంతురాలు. పెనిమిటియెడఁగల ప్రేమాతిశయము వలన మరల వివాహమాడినది కాదు. ఈనలుబది సంవత్సరములును నీమె పెనిమిటికాలముకంటె నెక్కుడు బాగుగ రాజ్యమేలెను. ఈమె తనరాజ్యములో నెప్పుడును శాంతి, దయ, న్యాయము మొదలగువానినే యభివృద్ధిపఱుచుచుండును. అందువలనఁ బ్రజలందఱును నీమెయెడల మిక్కిలిభక్తిగలవారై యుందురు. తక్కిన యేరాజునెడలను, మఱి యేరాణియెడలను ప్రజలకింత

భక్తి లేదని నేను నిశ్చయముగాఁ జెప్పగలను' ఈమొదమార్తియగు ఉమ్మక్కకు ప్రతాపరుద్రుఁడు, అన్నమదేవుఁడు అను సిద్ధలు పుత్రులుగలిగిరి. అందు ప్రతాపరుద్రుఁడనువానికి రాజ్యమొసఁగి రుద్రమదేవి ౧౨౯౫-వ సంవత్సరములో గీర్తిశేషురా లాయెను.

ప్రతాపరుద్రుఁడు—ఈతడు క్రీ. శ. ౧౨౯౬ మొదలుకొని ౧౩౨౩- వఱకు రాజ్యముచేసెను. ఇతడు మహాశూరుఁడై యనేక రాజులను గెల్చి మహావైభవము ననుభవించెను. ఇతని తాతవలెనే యీతఁడును జైనమతస్థుల మిక్కిలి బాధపెట్టెను. ఈరాజు సంస్కృతవిద్యాభివృద్ధికి మిక్కిలి తోడ్పడినట్లు కనఁబడుచున్నది. విద్యానాథకవి యనువాఁడు ప్రతాపరుద్రీయ మను సాహిత్యగ్రంథమును రచియించి యీతని కంకితముచేసెను. ఈరాజు స్వయముగా ప్రతాపమార్తాండ మనుగ్రంథమును రచించెనఁట. ఇతఁడు వెలమవారికిని రెడ్డివారికిని తనసైన్యములో నాయకత్వములొసంగి యీ తెగవారలు రణశూరులగునట్లుచేసెను. ఇతఁ డనేకతటాకములును దేవాలయములును నిర్మించినట్లు శాసనములవలనఁగానవచ్చుచున్నది. నైజాంరాజ్యములో పాకాలచెఱువు అను పేరుగల సముద్రమును బోలిన యొక చెఱువుగలదు. అదియీరాజుచే వేయింపఁబడిన దని వాడుక గలదు. రెండుపర్వతముల నడుమనున్న యంతరము రాతితోఁ బూడ్చబడి యీచెఱువు బహు విచిత్రముగ నిర్మింపఁబడినది.

క్రీ. శ. ౧౩౦౩-లో డిల్లీశ్వరుని సేనానాయకుఁడగు మాలిక్ కాఫర్ అను తురుష్కుఁడు ఓరుగంటిపై దండెత్తి వచ్చెను. అప్పు డామ్లేచ్ఛుఁడు సంపూర్ణపరాభూతుఁడై వచ్చినమార్గమునఁ దిరిగి వెళ్ళవలసిన వాఁడాయెను. కాని ౧౩౧౯-వ సంవత్సరములోఁ దిరిగి గొప్పసైన్యమును గూర్చుకొని యా తురకవాఁడు ఓరుగంటి కోటను ముట్టడించెను. కోటలోని వా రనేకదినములవఱకు ఘోరముగాఁ బోరాడిరి. కాని దేశద్రోహియైనకటకరాజు తురుష్కులకు సాహాయ్యము చేసినందువలనను, మాతృద్రోహులగు కోటలోని కొందఱు నాయకులు ధనాశచేఁ దురుష్కులకు ననుకూలురైనందువలనను, అదివఱకు బాధచెందియున్న జైనులు రాజ్యములోని గుట్టును తురుష్కులకుఁ జెప్పినందువలనను ప్రతాపరుద్రుఁడు డిల్లీశ్వరునకుఁ గప్పము కట్టునట్లు సంధిచేసికొనవలసినవాఁడాయెను. తరువాత హిందూరాజు లందఱొక్కటై పరదేశీయులను మనదేశమునుండి వెడలఁ గొట్టదలంచిరి. ప్రతాపరుద్రుఁడు దేవగిరిరాజుతో మైత్రిచేసికొని తురకలతోఁ బోరు ప్రారంభించెను. అందుపై డిల్లీనుండి ౧౩౨౦-లో తురుష్కసైన్యము దక్షిణమునకువచ్చి వుల్గూఖాన్ అనువాని యాధిపత్యముక్రింద ఓరంగల్లును ముట్టడించెను. కాని యాసైన్యములన్నియుఁ బ్రతాపరుద్రుని శౌర్యమును సహింపలేక పూర్తిగా నాశముఁ జెందెను. క్రీ. శ. ౧౩౨౩-లో మఱియొక గొప్పసైన్యము డిల్లీనుండి పంపఁబడియె. అప్పటివఱకు అంతఃకలహములు మెండైనందున ప్రతాపరుద్రునికిఁ బరాభవము కలిగి

ఆతనిఁ జెఱఁబట్టి ఢిల్లికిఁ గొనిపోయిరి. తరువాత నీతని మంత్రీశ్వరుఁడగు యుగంధరుఁ డనువాఁడు తనయుక్తి ప్రభావముచేఁ బ్రతాపరుద్రుని మరల దీసికొనివచ్చెనఁట. ప్రతాపరుద్రుని చెఱతోనే యీవంశముయొక్క వైభవ మంతరించె నని చెప్పవచ్చును. తరువాత ప్రతాపరుద్రుని కుమారుఁడగుకృష్ణుఁ డనువాఁడు ఓరుగంటిలోఁ గొన్నిదినములు రాజ్యముచేసి కొందఱు హిందూరాజులను గల్పుకొని తురుష్కులను వెడలఁ గొట్టెను. కాని తిరిగి పూర్వవైభవమా రాజ్యమునకు రాలేదు. ఒకటి రెండు తరములకుఁ దరువాత నారాజ్యము బహామని రాజ్యములోఁ గలిసి పోయెను.

## పాండ్య చోళ చేర రాజ్యములు.

హిందూదేశమునకు మిక్కిలి దక్షిణమున నీ మూఁడు రాజ్యములు బహుపురాతనకాలమునుండియుఁ బ్రఖ్యాతిఁ జెంది యున్నవి. ఈ రాజ్యములలోని ప్రజలు ముఖ్యముగా నఱవ బాష మాటలాడుచుండిరి. చేర రాజ్యాంతర్గతమైన కేరళదేశములో మాత్రము మళయాళము మాటలాడుచుండిరి. పాండ్యదేశ మన్నిటికంటె దక్షిణమున నుండెను. ప్రస్తుతపుఁ దిరునల్వేలి, మధురజిల్లా లందులోనివి. పాండ్యదేశమునకు నుత్తరమునను తూర్పుసముద్రము నంటియుఁ జోళరాజ్యముం డెను. కావేరీనదీప్రాంతమును, దానికి నుత్తరప్రదేశంబును నీ రాజ్యములోనివి. దీనికి గాంచీపట్టణము రాజధానియై యొప్పెను. చేరదేశము పశ్చిమసముద్రము నంటియుండెను; మలబారు, ట్రావన్కూరు దేశము లిందలివియె. ఈ మూఁడు

దేశముల సీమ లనేక కాలములందు ననేకవిధముల మారెను. కానఁ బైని మిక్కిలి తక్కువసంఖ్యగల సీమలే ఉదాహరింపఁబడినవి.

పాండ్యరాజ్యము

పై మూఁడు రాజ్యములలోను పాండ్యరాజ్యము కడు పురాతనమైనదియు మిక్కిలి పేరువడసినదియునై యున్నది. పాండవవంశజులగు కొందఱు రాజు లుత్తరదేశమునుండి వచ్చి యీరాజ్యమును స్థాపించినందున దీనికిఁ బాండ్యదేశమని పేరు వచ్చెనని కొందఱు చెప్పెదరు. అగస్త్యఋషి యుత్తరము నుండి వచ్చి యీపాండ్యమండలములలో నాశ్రమము కట్టుకొని యుండెనని చెప్పెడి కథనుబట్టి చూచినను ఉత్తరము నుండి వచ్చిన యార్యులమాహాత్మ్యమే యీ దేశమున నెక్కుడుగ నుండినట్లు గానవచ్చుచున్నది. అగస్త్యుఁడు మొదటఁ గాశిలో నుండెను. తరువాత రామాయణకాలమున నాఋషి యొక్క యాశ్రమము గోదావరినదికి నుత్తరమున నుండెనని చదువరులు క్షాత్త్రియుగ వర్ణనలోఁ జేయబడిన రామాయణీయ స్థలనిర్ణయములోఁ జదివి యున్నారు. తరువాత సూత్రయుగములోనో బౌద్ధయుగములోనో యీ యగస్త్యవంశము వారు పాండ్యదేశమునకుఁ బోయి యుందురు. ఇదియే యగస్త్యుఁడు పాండ్యదేశమునకుఁ బోయినవాఁడనుటకు నర్థమని తోఁచెడిని.

మహావంశ మను సింహళచరిత్రలో సింహళరాజగు విజయుఁడు పాండ్యరాజకూఁతును వివాహమాడి యేడువందల

చెలికత్తెలతో నామెను దన రాజ్యమునకుఁ దీసికొనిపోయి నట్లు వ్రాయఁబడియున్నది. ఈ సమాచారము నిజమైన యెడల ఈ రాజ్యము క్రీ. పూ. ౫౪౩-లో నుండెనని చెప్ప వచ్చును. క్రీ. పూ. ౩౦౨-లోఁ జంద్రగుప్తునియొద్ద రాయ బారిగానున్న మెగస్తనీసనువాఁడు దక్షిణాపథమునఁ బాండ్య రాజ్యమున్నట్లు వ్రాసియున్నాఁడు. కావున నప్పటి కీరాజ్య మున్నదని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. క్రీ. పూ. ౨౭ నుండి క్రీ. శ. ౧౪ వఱకు రాజ్యము చేసినవాఁడును, క్రైస్తవ మతస్థాపనాచార్యుఁడగు జీసెస్ క్రీస్తువునకు సమకాలీనుఁ డును అగు అగస్టస్ అను విఖ్యాతరోమకచక్రవర్తియొద్దకుఁ బాండ్యరాజు రాయబారులఁ బంపినట్లు స్ట్రాబోయను నా కాలపుగ్రంథకర్త యొకఁడు వ్రాసియున్నాఁడు. ఈచక్రవర్తి యొక్క నాణెములును, టైబేరియస్ ( క్రీ. శ. ౧౪-౩౭ ), థియోడోసియస్ ( క్రీ.శ. ౩౯౩ ) మొదలయిన యితరరాజుల బంగారు నాణెములును, పాండ్యమండలములో ననేకము దొరకినందున క్రీ. శ. [illegible] బూర్వమును, తరువాత నాలు గైదువందల సంవత్సరములవఱకును పాండ్యదేశమువారు రోమకరాజ్యముతో వర్తకము చేయుచుండిరని విద్వాంసులు నిశ్చయించి యున్నారు. గొప్పదైన యీ వర్తకములనుబట్టి చూచినను పాండ్యదేశము మిక్కిలి వైభవదశలో నున్నట్లు గానవచ్చుచున్నది.

మధురజిల్లాలో నిప్పుడు చిన్నపల్లెగానున్న కొరయూరను గ్రామ మీమండలమునకు రాజధానియై యుండెను. కాని తరువాత మధుర ముఖ్యపట్టణమయ్యెను.

చరిత్రవ్రాయు నాచారము మనదేశమందు లేనందున నింత ఘనత చెందిన రాజ్యమును గురించి మనకు విశేషాంశము లేమియు దెలియవు. కొన్ని సంగతులే తెలియును. పాండ్యదేశమును రెండువంశములవా రేలినటులును, అందు మొదటివంశములో డెబ్బదిమగ్గురు, రెండవ వంశములో నలువదియొకరు రాజు లుండినటులును, స్థలపురాణములలో వ్రాయఁబడి యున్నది.

మొదటివంశములోని మొట్టమొదటిరాజు కులశేఖరుడు. ఈతఁడీరాజ్యమును స్థాపించి భూముల నపురకపరచి, కొందరకు గ్రామాదులిచ్చి వారినిఁ దన దండనాయకులుగా నేర్పఱచుకొని, బలసమేతుఁడయి యొప్పెను. ఈతఁడు శివభక్తుడు. మధురలోని దేవాలయముఁ గట్టించెను.

మూఁడవ రాజు సుందరేశుడు. ఈతఁడు మీనాక్షియను భార్యతోఁ గలిసి రాజ్యముచేసెను. అప్పటినుండి యచ్చటి శివునికి సుందరేశుఁడనియు పార్వతికి మీనాక్షియనియుఁ బేళ్లు వచ్చెను.

నాల్గవరాజు ఉగ్రపాండ్యుఁ డనువాఁడు చోళకన్యకను వివాహమాడెను. ఏడవరాజగు రాజశేఖరుఁడు చోళరాజుల నోడించెను. ఎనిమిదవవాఁడగు అనంతగుణుఁడు తనరాజ్యముపై దండెత్తివచ్చిన చోళుల నోడించి పాఱఁదోలెను.

పదమూఁడవవాఁడగు వరగుణుఁడు విద్వాంసుఁడును విద్వత్ప్రియుఁడును అయి యుండెను. ఈతనిభార్యయు గొప్ప విదుషి. ఈ లక్ష్మీసరస్వతీప్రియులగు నద్వితీయదంపతులు దూర దూర దేశములనుండి విద్వాంసులను రప్పించి వారియోగ్య తానుసారముగ వారిని సత్కరించుచుండిరి. బాణభద్రుఁడు అనువాఁడు వీరి యాస్థాన కవీశ్వరుఁడు.

ఈ వంశములోఁబదునాల్గవవాఁడు వంశశేఖరుఁడు. ఈతఁడనేకవిధములఁ దనరాజ్యమును అభివృద్ధిచేసి మిక్కిలివిఖ్యాతుఁడయ్యెను. మధురాపురమును సుదీర్ఘమయినదిగను చక్కనిదిగను గట్టించి చుట్టు నభేద్యమైనదుర్గమును నిర్మించెను. ఇవిగాక భవ్యమయిన రాజమందిరమును, ఎన్నియోదేవాలయములును గట్టించెను. విగ్రహములను రథముపై నెక్కించి జనులు లాగుచు దీసికొనిపోవు పద్ధతి యీతని రాజ్యకాలములోఁ బ్రారంభమయ్యెనఁట! ఈ రాజు చేసిన యన్నిపనులకంటె మిక్కిలి గొప్పదియు ద్రావిడభాషాభివృద్ధికి నత్యంత సహకారియైనదియు నగు నొకపని గలదు. అది ద్రావిడకవుల సంఘ మేర్పరుచుటయే. అసామాన్యకవియైనఁగాని యీ సంఘములోఁ జేరుటకు వీలులేక యుండెను. ఈసంఘములోని వారందఱును ద్రావిడభాషాలలామభూతులయినందున ఈ సంఘములోని సభాసదులగుట ఇప్పటి ఎల్. ఎల్. డీ., పదవి సంపాదించుటకంటెను, ఇప్పటి రాయల్‌సొసైటీలలో సభాసదులగుటకంటెను నధికగౌరవాస్పదముగా నెంచఁబడుచుండెను. ఎవఁడైనఁ గ్రొత్తకావ్యము చేసి తెచ్చినతోడనే

యీసంఘములోని సభాసదులు దానిని బరిశీలించి యోగ్య
మైనదియగునేని యాకవిని తమ సంఘములోఁ జేర్చుకొను
చుండిరి. ఇందువలన అరవములోఁ బూర్వకాలముననే యనే
కములైన చక్కని కబ్బములు వ్రాయబడినవి. తరువాతి రాజులు
గూడ నీసంఘమును బోషించిరి. ఇట్టిసంఘ మంతరించిపోఁగా
దానిని మరల రెండుపర్యాయములు స్థాపించిరట. తిరువళ్లువర్
అనువిఖ్యాత ద్రావిడకవి మాలవాడయినను ఈసంఘమునందుఁ
జేర్చుకొనఁబడియెనఁట! ఇతఁడు కురళ్ అను గ్రంథమును
రచించెను.

పదునేడవవాఁడగు అరిమర్దనునికి మాణిక్యవాసుఁ
డనువాఁడు మంత్రిగ నుండెను. ఈతఁడు శివభక్తుఁడయిన
పరమసాధువని విఖ్యాతిఁగాంచి, పాండ్యరాజ్యములోని యనే
కులను వాదములో నోడించెను.

తరువాత ననేకరాజులయిరి. కాని వారనామధేయులు.
కడపటిరాజగు కూన్‌పాండ్యుఁడనువాఁడుమాత్రము విఖ్యాత
యశుఁడు. కూన్ అనఁగా గూనివాఁడని యర్థము. మొదట
నీతనికి గూను ఉండెననియు నందువలన నీపేరువచ్చె తరువాత
నది యొక మహాత్ముని దయచేతఁ బోయి యీతఁడు చక్కని
వాఁడుకాఁగా నితనికి సుందరపాండ్యుఁడను పేరు వచ్చెననియు
నొక కథ కలదు. ఈతఁడు చోళమండలముపై దండెత్తి
అప్పటిరాజధానియగు తంజాపూరును చేరమండలముపై
దాడివెడలి దాని రాజధానియగు ఉరయూరును కాల్చెను.
ఈరాజు చోళవంశమువారికూతురగు వనితేశ్వరి యను

నామెను వివాహమాడెను. ఆకాలమందుఁ బాండ్య దేశమున జైనమతము ప్రబలియుండెను. రాజుకూడ వారిమతమును స్వీకరించెను. కాని యాతనిభార్యమాత్రము శైవమతమునందు నమ్మిక కలది. కావున జ్ఞానసంబంధమూర్తి నాయనార్ అను శైవమతాచార్యునిఁ బిలిపించి, యాతని బోధవలన కూన్ రాజు శైవమతాభిమాని యగునట్లు చేసెను. అందుమీఁద నారాజు ఎనిమిదివేలజైనులఁ దన రాజ్యములోనుండి వెడలఁ గొట్టించెను. వారనందఱను పైనివర్ణింపఁబడిన నాయనార్ అను శైవసాధువు జయించెనఁట! ఈశైవసాధువునకు ద్రావిడ దేశమున మిక్కిలి గౌరవము గలదు. ఈతనికిఁ బార్వతీదేవి పాలిచ్చినందున నీతఁడు మిక్కిలి జ్ఞానవంతుఁడయ్యెనని చెప్పఁబడు కథవలన నీతఁడు తత్త్వజ్ఞానవిశారదుఁడని తోఁచుచున్నది. శ్రీశంకరాచార్యులవారు తమ సౌందర్యలహరీ యను దేవీస్తుతిలో నీసాధువును "ద్రవిడశిశు" వని పేర్కొని యున్నారు. శంకరాచార్యు లెనిమిదవ శతాబ్దంబున నున్నవారు కావున నీ నాయనారును, కూన్ పాండ్యన్ రాజును అంతకు నొక్కశతాబ్దమునకుఁ బూర్వ మనఁగా క్రీ. శ. ౭-వ శతాబ్దమునందుండిరని విద్వాంసులు నిర్ణయించినారు. ఈ రాజు, ఆతనిభార్య అతని గురువగు నాయనారు వీరు ముగ్గురును శైవ భక్తులలో గొప్పవారని ద్రావిడపురాణములలో వర్ణింపఁబడినది.

కూన్ పాండ్యరాజుతో మొదటి వంశ మంతరించినది. తరువాతఁ బాండ్యరాజులకు శూద్రస్త్రీలవలనఁ బుట్టినరాజులు

నలుబదియొక్కరు క్రీ. శ. ౭-వ శతాబ్దమునుండి ౧౧-వ శతాబ్దము వఱకు రాజ్యముచేసిరి. కాని వా రంతగాఁ బేరుఁ బ్రతిష్ఠయుఁ గలిగినవారుకారు. వీరికాలములో నీరాజ్యము తిన్నతిన్నగాఁ జోళరాజ్యములోఁ గలిసెను. క్రీ. శ. ౧౦౬౪ లోఁ బాండ్యవంశమునఁ జివరవాఁడగు వీరపాండ్యరాజును రాజేంద్రచోళుఁడనఁబడు కులోత్తుంగచోళదేవుఁడు పూర్తిగా నోడించి గంగైకొండచోళుఁడను తనతమ్మునికి సుందరపాండ్యుఁడను పేరుపెట్టి పాఁడ్యరాజ్యమునకు నధిపతిగఁ జేసెను. ఇట్లు సింహళము, జావా, బర్మా, పారసీకము, రోమ్ మొదలయిన రాజ్యములతోఁ బ్రతిస్పర్ధిగా వర్తకముచేసిన యీ రాజ్య మస్తమించెను.

పాండ్యరాజ్యమునకువచ్చిన చోళరాజుతమ్మునివంశము వారు కొన్నిదినములు రాజ్యము చేసినతరువాత వారు మైసూరురాజులగు బల్లాలవంశీయులకు లోఁబడిరి. తరువాతఁ గొంతకాలమునకు నీబల్లాలులఁ దురుష్కులోడించిరి. తుదకు నీరాజ్యము పదునాఱవశతాబ్దారంభమునఁ గృష్ణరాయని చేతఁ బంపఁబడిన నాగమనాయకునికి స్వాధీనమైనది. అనఁగా ఈరాజ్యమును తెలుఁగువా రాక్రమించుకొనిరి. ఈవృత్తాంత మంతయు రెండవభాగమందు విజయనగరరాజ్యవర్ణనలో రాఁగలదు.

## చోళమండలము.

ఉత్తరమున పెన్నేరును, దక్షిణమునఁ బాండ్యదేశమును, పూర్వమున సముద్రమును, పశ్చిమమున చేర చాళుక్య

రాజ్యములును గలది చోళదేశము. దీనిచరిత్ర పాండ్యచరిత్ర యంత సాకల్యముగాఁ దెలియదు. క్రీ. పూ. ౧౦౮ లో చోళదేశమునుండి వెళ్లి యొకానొక మళయాళదేశస్థుఁడు సింహళమును గెలిచి నలువదినాల్గేండ్లు రాజ్యముచేసెనఁట. క్రీ. శ. ౧౮-లోఁ చోళరాజు సింహళముమీఁదికి దండెత్తి వెళ్ళి అనేకజనులను చెఱఁబట్టి తీసికొనివచ్చెను. ఇందు మీఁద క్రీ. శ. ౧౧౩-లో సింహళపురాజు చోళదేశముపై దండెత్తివచ్చి యనేకజనులఁ జెఱఁబట్టుకొని తన కసి తీర్చుకొనియె. అప్పటినుండి యేడవశతాబ్దమువఱకు వీరిచరిత్ర మనకేమియుఁ దెలియదు.

క్రీ. శ. ౮౫౦ మొదలు ౧౦.౭౩ వఱకుఁ జోళులు తమరాజ్యమునకు నుత్తరమున నున్న రాజ్యము లనేకము లాక్రమించుకొనిరి.

క్రీ. శ. ౮౬౮-వ సంవత్సరప్రాంతమున ఆదిత్యవర్మ యను చోళరాజు చేరమండలమును నాక్రమించుకొనియె. పదవ శతాబ్దమున హొయిసలబల్లాళరాజులు ప్రబలువఱకు నీరాజ్యము వీరిస్వాధీనముందే యుండెను. క్రీ. శ. ౬౫౮-లోఁ బాండ్య రాజును, సింహళరాజును కలిసి చోళులపై దండెత్తిరి. కాని చోళరాజే వారినోడించెను.

కరికాలుఁడనురాజు క్రీ. శ. ౯౯౦-లో సింహళము మీఁదికి దండెత్తివెళ్ళెను. కాని పరాభూతుఁడయి తిరిగి రావలసినవాఁ డాయెను. ఈతనితరువాత రాజరాజను చాళుక్య రాజు చోళరాజుకూఁతును వివాహము చేసికొన్నట్లును

క్రీ. శ. ౧౦౭౨ మొదలు ౧౦౬౩ వఱకు రాజ్యముచేసి నట్లును వ్రాసియున్నది. కావున నీతఁడు భారతకృతిపతియైన రాజరాజనరేంద్రుఁడని మనము చెప్పవచ్చును.

ఈరాజు మిక్కిలి ప్రతాపవంతుఁడయి క్రీ. శ. ౧౦౫౯ లో సింహళముపై దండువెడలి మహీంద్రుఁడను రాజును జెఱఁ బట్టి యచ్చటఁ దన ప్రతినిధిని (Viceroy) రాజ్యముచేయు టకై యుంచివచ్చెను.

రాజరాజుకుమారుఁడు కులోత్తుంగచోళదేవుఁడు (క్రీ. శ. ౧౦౬౪-౧౧౧౨). ఈతనికి వీర, రాజేంద్ర, కొప్ప కేసరివర్మ, కవిరాజశేఖర మొదలయిన బిరుదు లుండెను. ఈతనిరాజ్యము ఓరిసావఱకు వ్యాపించియుండెను. ఈతఁడే పాండ్యుల జయించి క్రీ. శ. ౧౦౬౪-లోఁ దన తమ్ముని నచ్చట నాయకుని జేసెనని యిదివఱకు వ్రాసియున్నాము. క్రీ. శ. ౧౦౬౪-లో నీతని దాసీపుత్రుఁడు ఆతొండఁ డను వాఁడు పల్లవులనోడించి వారిరాజ్యమగు తొండమండలము తమరాజ్యములోఁ గలుపుకొనియె. పెన్నేరు పాలేర్లనడుము నున్నది తొండమండలము. ఈరాజుకాలముననే చోళులు పశ్చిమచాళుక్యరాజగు ఆహవమల్లుఁడను నామాంతరముగల ప్రథమసోమేశ్వరదేవుని తుంగభద్రానదియొద్దన నోడించి ఆతని రాజ్యములోని కొంతభాగ మాక్రమించుకొనిరి. కాని యది వారికి విశేషదినములు దక్కలేదు. కులోత్తుంగుఁడు తంజావూరుదేవాలయమునకు నెన్నియో దానము లిచ్చి

వల్లు ఆతని శాసనములవలనఁ గానవచ్చుచున్నది. అచ్చటి దేవాలయమును అతఁడే కట్టించియుండును.

తరువాతి రాజులనుగుఱించి యంతగా విశేషము లేమియు లేవు. పండ్రెండవ శతాబ్దాంతమువఱకు నీరాజ్యములోనియధికభాగమును ఓరుగంటి కాకతీయరాజు లాక్రమించుకొనిరి.

## చేరదేశము.

చేరశబ్దమునకు నఱవములో తాటికల్లని యర్థము. ఈ దేశమునందుఁ దాటిచెట్లు విశేషముగా నున్నందున ఈదేశమున కీపేరు వచ్చియుండును. ఒకప్పు డీ చేరమండలములో మైసూరు, కోయంబుత్తూరు, సేలము, ప్రాంతకొండనాడు, దక్షిణమలబారు, కొచ్చి అను మండలములు చేరియుండెనని చెప్పవచ్చును. ఈదేశపురాజులకు మలయమాన్ అను బిరుదుండెను. చేరశబ్దము కొన్నిదినములకు కేరగా మాఱి యందుండియె కేరళశబ్దము పుట్టెను.

మొట్టమొదటి చేరరాజులనుగుఱించి మనకు పేళ్ళు తప్ప మఱేమియుఁ దెలియదు. కొంతకాలమును కొంగులను వారు చేరదేశములోని మధ్యభాగమును ఆక్రమించుకొన్నందున ఈ చేరరాజులు తిరువానుకూరులో రాజ్యము చేయఁ జొచ్చిరి. అచ్చట క్రీ. శ. 300-లో వీరకేరళవర్మ రాజుగనుండెను. ఇతఁడు ప్రజానురంజకుఁడై బహుకాలము వీరకేరళపుర మను రాజధానిలో రాజ్యముచేసెను. తిరువాన్కూ రనుగ్రామము తరువాత రాజధాని యయ్యె. అందు

వలననే యీరాజ్యమునకు తిరువాన్కూరురాజ్యమని పేరు వచ్చెను. పదునాల్గవశతాబ్దమునం గాంబోలును నిప్పుడు తిరువనంతపురమనంబడు తిరువేండ్రమునకు రాజధాని మార్పంబడియె. క్రీ. శ. ౮౨౫-లో ఉదయమార్తాండవర్మ యను రాజు కొల్లమనంబడు శకమునకుం (Quilon era) గర్త యయ్యెను. ఇందులకుం దరువాత నైదాఱుశతాబ్దంబులవఱకు నీదేశపుంజరిత్ర మన కంతగాం దెలియదు.

పశ్చిమ సముద్రము నంటుకొని సాతారాయొద్దనుండి కన్యాకుమారివఱకుం బడమటికనుమలకును సముద్రమునకును నడుమనున్న భూభాగమంతయుం బరశురాముండు సముద్రుని వద్దనుండి సంపాదించిన భూమియని పౌరాణికగాథ కలదు. అనంగా నచ్చట మొదట సముద్ర ముండెననియుం దరువాతం గ్రమముగా భూమి యేర్పడెననియు నర్థము. ఈ భూభాగమున కంతటికిని సప్తకొంకణమని పేరు. ఈయేడుకొంకణములలో నత్యంతదక్షిణమున నున్న కేరళము, దానికి నుత్తరమున నున్న తుళువదేశము ఈచేరరాజ్యములోనివియై యుండెను. ఈదేశములోని యాచారవ్యవహారము లతిచిత్రములైనవి. ఇచ్చట నితరజాతివారుగాక నంబూద్రిబ్రాహ్మణులును, నాయరులనంబడు శూద్రులును విశేషముగ నుందురు. నంబూద్రిబ్రాహ్మణుల కుటుంబములో పెద్దకొడుకు తప్ప యితరులు వివాహమాడరు. నాయరుస్త్రీల నుంచుకొనియెదరు. నాయరుస్త్రీలకు వివాహములేదు. ఈస్త్రీ లిష్టము వచ్చిన పురుషులతో నిష్టమువచ్చినంతకాలము భార్యలవలె

ఘుండెదరు. ఇచ్చటి దాయభాగపద్ధతియు మిగుల వింతగ నుండును. ఒకపురుషునిసొత్తు వానికుమారునికిఁబోదు. అతని మేనల్లునికిఁ జెందును. తండ్రికొడుకుల యింటిపేరొకటిగ నుండదు. మేనమామ మేనల్లుర యింటిపేరొకటిగ నుండును. ఇట్టి విపరీతాచారంబు లచ్చట నుండుటకుఁ గారణమేమని విచారింపఁగా కేరళదేశస్థు లాదిమకాలమున నార్యులతో సంబంధములేని యనార్యజనులనియుఁ, బరశురాముని కాలమున నార్యబ్రాహ్మణు లచ్చటికిఁ బోయి వారిని వశులను జేసికొని బ్రాహ్మణసంతుష్టియే పరమధర్మముగా వారికి బోధపఱిచినందున వారిలో వివాహబంధనములు లేక స్త్రీప్రధానమైన (Matriarchal) కుటుంబము లేర్పడెననియు, నందువలన నిట్టివిపరీతాచారములు పుట్టిననియు విద్వాంసుల యభిప్రాయమై యున్నది. అయినను ప్రస్తుతము మళయాళములోఁ బూర్వాచారములు తగ్గుచు వివాహబంధము లితరదేశముల వలెనే యధికదృఢ మగుచున్నందులకు మనమెంతయు సంతసింపవలసి యున్నది.

ఓరిసా.

ఈదేశమునకే ఓఢ్రదేశమని పేరు. మగధదేశము నుండి మొదట నార్యు లీదేశమునకు వచ్చిరి. బుద్ధధర్మంబును నచ్చటనుండియే వచ్చెను. అశోకునికిఁబూర్వమే యనేకబౌద్ధభిక్షు లచ్చటికివచ్చి కొండగుహాలలో వాసము చేయుచు ధర్మోపదేశ మొనరించుచుండిరి. అశోకుఁడు కళింగమును జయించినతరువాత నీరెండు రాజ్యములసంబంధము దృఢమయ్యెను.

తరువాత నిచ్చట ననేక బౌద్ధరాజులు రాజ్యముచేసిరి. వీరి శాసనములు ఖండగిరియుందలిగుహాలలోఁగానవచ్చెడిని. క్రీ.శ. అయిదవశతాబ్దంబున నీబౌద్ధరాజుల వంశ మంతరించి హిందూ మతము ప్రబలసాగెను.

క్రీ. శ. ౪౭౬-లో యయాతికేసరియనువాడు 'కేసరి' వంశకర్తయయ్యె. ఈరాజులు భువనేశ్వరమనుపురమున రాజ్యముఁ జేయుచు నప్పటి శిల్పవిద్యానైపుణ్యముఁగనంబఱచు నట్టి చక్కని శివాలయంబులఁ గట్టించిరి. కొన్నిదినములు వీరికి జయపురమను పట్టణము రాజధానిగా నుండెను. నృపకేసరి యనురాజు క్రీ. శ. ౯౫౧-లోఁ గటక మనుపట్టణముఁ గట్టించె. ౧౧౩౨-లో నీవంశ మంతరించెను. ౧౧౩౭ మొదలు ౧౫౩౪-వఱకు గంగవంశమువారు రాజ్యమేలిరి. వీరికి విష్ణువు కులదేవత. ఈవంశజుఁడగు ననంగభీముఁ డనువాఁడు ౧౧౭౪లో జగన్నాథదేవాలయముఁ గట్టించెను. పదునైదవ శతాబ్దాంతమునం దుండిన పురుషోత్తమగంగరాజు దక్షిణదేశము వఱకును దాడివెడలి కాంచీరాజు నోడించి యతనికూఁతుఁ బెండ్లియాడెను. తరువాత ప్రతాపరుద్రుఁడనువాఁడు రాజ్యము చేయుచుండఁగా చైతన్యుఁడను వైష్ణవభక్తుఁడు అచ్చటికి వచ్చెనఁట.

గంగవంశానంతరమున నయిదుగురు హిందూరాజులు రాజ్యముచేసిరి. కాని ౧౫౬౦-లో మురుష్కులీరాజ్యమును జయించిరి.

## బంగాళము.

తొమ్మిదవ శతాబ్దమున బంగాళదేశమునందు రాజపుత్రులలో నొకవంశమువారు రాజ్యము చేయసాగిరి. దీనికి 'పాల' వంశమని పేరు. దీనికి మూలపురుషుఁడగు గోపాలుఁడను రాజు క్రీ. శ. ౭౫౦-లో రాజ్యమునకు వచ్చెను. బంగాళదేశమునకును మగధదేశమునకును నీతఁడు రాజుగ నుండెను. ౮౦౦-లో రాజ్యమునకు వచ్చిన దేవపాలుఁడు వింధ్యపర్వతము మొదలు హిమాలయమువఱకునందు ఉత్తరహిందూదేశమంతయు అసాంవఱకుఁ దూర్పుదేశమును జయించెను. గజనిమహమ్మదు కనౌజునకు వచ్చినప్పుడు (క్రీ. శ. ౧౦౧౮) రాజ్యపాలుఁడనురాజు ఈదేశమున రాజ్యము చేయుచుండెను.

౧౦౨౬-లో మహాపాలుఁడనురాజుఁ బరీపట్టణమును రాజధానిఁజేసికొనియె. ఈతఁ డేఁబదిరెండు సంవత్సరముల వఱకును రాజ్యముచేసెను. ఈవంశపురాజులలో పేర్కొనవలసిన కడపటిరా జీతఁడే. తరువాత పూర్వ (తూర్పు) బంగాళపురాజులగు 'సేన' వంశజులు బలవంతులై బంగాళరాజ్యమంతయు నాక్రమించుకొనిరి.

వీరసేనుఁ డనువాఁడు సేనరాజుల మూలపురుషుఁడు. ఈతఁడు పదవ శతాబ్దమువాఁడై యుండును. కొందరు బ్రాహ్మణులను కాయస్థులనబడు గణకవృత్తివారిని నీతఁడు కనౌజ్ నుండి పిలిపించెను. అప్పుడు వచ్చిన బ్రాహ్మణులే యిప్పుడు బంగాళమునందలి కులీనబ్రాహ్మణులు. బనర్జి (బందోపాధ్యా

యు,) ముకర్జీ (ముఖోపాధ్యాయ,) చటర్జీ (చట్టోపాధ్యాయ), గ్యాంగోలి(గంగోపాధ్యాయ) అను గృహనామములు కలవా రందఱును కులీను లనఁబడుదురు. వీ రితర బ్రాహ్మణులకంటె నెక్కువవారమని చెప్పుకొనియెదరు. లక్ష్మణేయుఁ డను వాఁ డీసేనవంశపురాజులలోఁ దుదవాఁడు. ఈతఁడు ఎఱువదిసంవత్సరములవఱకును వైభవముతో రాజ్యముఁ జేసెను. కాని యాతఁడు వృద్ధదశలో నుండఁగ దురుష్కులు ౧౨౦౩.లో బంగాళమును గెలిచిరి.

## ఉపసంహారము.

### హిందూదేశ పారతంత్ర్యమునకుఁ గారణములు.

ఇట్లు హిందూమహాయుగములో మహోన్నత దశయం దుండిన హిందూదేశము పదవశతాబ్దమునుండి తురుష్కుల దండయాత్రలకు లోనయి పండ్రెండవశతాబ్దాంతమువఱకుఁ దురుష్కులస్వాధీనమై తన స్వాతంత్ర్యమును బోఁగొట్టుకొనియె. ఇట్లీ దేశములోని జనులు మేకలయి పరరాజులకు లోఁబడిన కారణము లనేకములు గలవు. అందుఁ గొన్నిటిని ఈ క్రిందఁ బొందుపఱిచెదము.

#### ౧. జాతిబంధనములు దృఢమగుట.

క్రమక్రమముగా జాతిసంబంధమైన బంధనములు గట్టిగ బిగింపఁబడి చాతుర్వర్ణ్యమే కాక చతుస్సహస్రవర్ణంబు లయ్యెను. ఒక్కొక జాతిలో నసంఖ్యములయిన యుపజాతులు

పుట్టెను. గుణకర్మవిభాగానుసార ముత్పన్నమైన నాలుగు జాతులు వృత్తిననుసరించియు దేశములననుసరించియు నసంఖ్యా జాతులయ్యెను. కుండలుచేయువానిది యొకజాతి; కఱ్ఱచెక్కు వానిది యింకొకజాతి; బట్ట నేయువానిది మఱియొకజాతి; వేదము చదువుకొని జీవనముచేయువాఁడు వైదికియయ్యె; రాజ నియోగములలో నుండువాఁడు నియోగియయ్యె; ఈలాగు వాయువేగ మనోవేగములతో నసంఖ్యజాతులు ప్రబలి ప్రతి జాతివారును తామే యెక్కువవారమనియు,నితరులు తమకంటెఁ దక్కువవారనియుఁ జెప్పుచుఁ బరస్పరద్వేషంబులు ప్రబలఁ జేసిరి. పైజాతివా రగు బ్రాహ్మణ క్షత్రియులకు విద్యాసామర్థ్యబలంబు లెక్కువగుటవలన వారు అధికారమంతయుఁ దమ చేతిలోనే యుంచుకొనిరి. కొన్నిదినములకు రాజులు విషయలంపటులైనందునను, పూర్వక్షత్రియవంశములు నశించుచుఁ బోయినందునను క్షత్రియులబలమును, నాధిక్యమును తగ్గి బ్రాహ్మణులచేతికే సాంఘికాధికారమంతయు వచ్చి వారు 'కలియుగములో సర్వశ్రేష్ఠులమైన మేము, మాకు సేవచేయుటకు శూద్రులు, ఈ రెండుజాతులు తప్ప మూఁడవజాతి లేనే లే' దని చెప్పసాగిరి. ఈజాతిద్వేషమునకుఁ దోడు మతద్వేషములును హెచ్చెను. ఒకతెగవారగు బ్రాహ్మణులలో వాఁడు వైష్ణవుఁడనియు, వీఁడు స్మార్తుఁడనియు, ఇంకొకఁడు మాధ్వుఁడనియు భేదములుపుట్టి ఒకరియింటిలో నొకరు భోజనము చేయకపోవుటయేగాక యొకరినొకరు చూచుటయుఁ దప్పని చెప్పసాగిరి.

జాతిమతద్వేషము లింతవఱకునైన నాఁగియుండిన చింత లేదు. ఏలయన, అధికారము, ధనము, కులీనత్వము మొదలగు కారణములచే జనులలోఁ గొందఱు హెచ్చనియుఁ, గొందఱు తక్కువయనియు జాతిభేదము లితరదేశములలోను గలవు. రోమ్‌దేశములోని ప్యాట్రిషియన్ ప్లెబియన్, ఇంగ్లండ్‌లోని రాజసరదారులు, సామాన్యజనులు అనుభేదమును మన మెఱిఁగియే యున్నారము. కాని యట్టిభేదము లాయాదేశములందుఁ గ్రమక్రమముగాఁ బోయి యందఱును సమానమనెడి సిద్ధాంతము క్రిందితరగతివారియశ్రాంతప్రయత్నము వలన స్థిరపడి యాదేశములు మహోన్నతస్థితిఁ జెందెను. కాని మనదేశములోఁ గ్రిందిజాతివారు పైకివచ్చుటకు మారుగా లోఁతునకుఁ ద్రొక్కఁబడుచుండిరి. అందుచే నైక్యభావము సున్నయయ్యెను.

అన్నిటికంటె నీజాతిబంధనములు చేసిన గొప్పకీడు మనలను కూపమండూకములఁ జేయుట. అన్యజాతీయునిఁ దగులుటయే మహాదోషముగాఁ దలంచునప్పు డన్యదేశమునకుఁ బోవుట యెట్లు తటస్థించును? ఆసేతుహిమాలయప్రాంతమున దప్ప యీజాతిభేద మెచ్చటను లేదు. కావున ఉత్తరమున అటక్‌నది (శిలానది) దాఁటఁ గూడదనిరి. సముద్రయానము పనికిరా దనిరి. ఇంకేమున్నది? ఇట్లు హిందువులు తమ్మునొక దివిగడ్డలోఁ గైదుచేసికొనినందున, వెలుపలనున్న దేశములలో నేమి జరుగుచున్నది వీరికిఁ దెలియుమార్గము లేకపో

మెను. తురుష్కులగుంపు గడపలోనికి వచ్చువఱకుఁ దురుష్కులను గుఱించి గాని, వారిధర్మములగుఱించిగాని, వారు చేయుచుండిన యితరదేశముల నాశమును గుఱించిగాని మన వారేమియుఁ దెలిసికొనక సుఖనిద్రపోవుచుండిరి. ఇట్లు గడప దాఁటి తొంగిచూచినఁ బాపము వచ్చునని తలంచి యిరుగు పొరుగున నిప్పంటుకొనినను ఆ సమాచారము తెలిసికొనక యింట సుఖనిద్ర పోయెడువారు పారతంత్ర్యాగ్నిలో వేఁగుట సహజమేకదా! ఈ ప్రకార మీ జాతిబంధనములు మిక్కిలి బిగింపఁబడి దేశమునకు నురిపోయఁబడియె.

## ౨. నీతిబంధనములు శిథిలమగుట.

నీతియనఁ బరిశుద్ధప్రవర్తన. ఏదేశముయొక్క నీతిబంధనములు శిథిలమగునో యది తప్పక యధోగతికిఁ బోవునని మనము ఈజిప్టు, రోమ్ మొదలగు దేశముల చరిత్రలవలనఁ దెలిసికొనవచ్చును. హిందూదేశము తురుష్కుల పాలగుటకు నీదేశమందు నప్పుడు వ్యాపించిన యనీతి యొకగొప్ప కారణమై యున్నది. ధర్మము పేరిట నీ యనీతి జనులలోఁ బ్రసరించినందున నది మిక్కిలి యపాయమునకుఁ గారణమయ్యెను. పాంచరాత్రులనియుఁ, బాశుపతులనియు, శాక్తులనియు, కాపాలికులనియు, భైరవులనియు, ననేక నూతన సాంప్రదాయములవా రీ దేశమున వ్యాపించిరి. ఇందు గొందఱు దేవీపూజయను పేరిట మద్యపానము చేయుట నేర్పిరి; కొందరు 'నేను భైరవుడను, నీవు భైరవివి' అని చెప్పి వ్యభిచా

రము చేసిన దోషము లేదనిరి; కొందఱు శ్మశానములో వసించుటయు, తలపుఱ్ఱెలు మాలగ వేసికొనుటయు ధర్మ మనిరి. కొందరు దేవికిని భైరవునికిని నరబలి యిచ్చుట ముక్తిదాయక మనిరి. ఇట్లనీతి యెంతదూరము పోవలయునో యంత దూరము పోయెను. ఈమతములలోని యొకానొక మతమువారి ఘోరకృత్యముఁ జూడవలయునేని భవభూతికృత మాలతీమాధవీయములోని ౧-వ యంకముఁ జదువనగు. ఈమతములలో ననేకమతములు శ్రీశంకరాచార్యులవారు ఖండించి వానిని రూపుమాప యత్నించిరి. కాని యవి యప్పుడు కొంచెము తగ్గినను మరలఁ బ్రబలి నేఁటివరకు నచ్చటచ్చట రహస్యస్థలములలో డాఁగియున్నవి. జనులిట్టి యనీతుల పాలయినందున విషయలంపటులయి పరవశులగుఁ జక్కని త్రోవ చేసిపెట్టుకొనిరి.

౩. స్వదేశరాజులలో నైకమత్యము లేకపోవుట.

ఇదియే యీదేశ పారతంత్ర్యమునకు ముఖ్యకారణము. పదవ శతాబ్దమునుండి పండ్రెండవశతాబ్దాంతమువఱకు నీదేశమున సార్వభౌమరాజవంశ మొకటియు లేనందున ఎవ్వరికి వారే స్వతంత్రులై, సార్వభౌముల మని చెప్పుకొనుచు, నితరరాజుల శ్రేయస్సు నోర్వలేక యెల్లపుడును ఒకరితో నొకరు పోరాడుచుండిరి. అందువలన వారిలో నైకమత్యము లేక ద్వేషములు ముదిరి, తురుష్కుఁడు వచ్చి యొకానొక రాజను బాధపెట్టునప్పుడు ఇతర రాజులు వానికి సాహాయము

చేయుక యూరక చూచుచు వానినాశము విని సంతసించు చుండిరి. కాని యట్లు ఊరకుండుట తమనాశమునకు త్రోవ చేసికొనుట యనినమాట తలఁపరైరి. వీనిలో నెవ్వరెవ్వరి వైరమువలన నీదేశమున కెట్లెట్లు పారతంత్ర్యపు సంకెలలు కలిగెనో యీగ్రంథముయొక్క రెండవభాగమందు వివరింపఁ బడెను. కాని యిచ్చట విస్తరింప నవసరములేదు.

౮. ఈ దేశస్థుల శరీరసామర్థ్యము తగ్గుట.

హూణశకవంశజులగు పరదేశీయుల నీదేశమునుండి వెడలఁగొట్టిననాఁడుగల శరీరసామర్థ్యమును శౌర్యమును ఈ దేశమునఁ గ్రమక్రమముగ తగ్గి తురుష్కులకాలమువఱకు మిక్కిలి తక్కువయైనట్లు గానవచ్చుచున్నది. అట్లుగాకున్నఁ దమకంటె మిక్కిలి తక్కువ సంఖ్యగల తురుష్కసైన్యములకు వారనేక యుద్ధములలో నోడుట తటస్థింపదు. ఇట్లు వీరు బల హీనులగుటకు ముఖ్యకారణ మతిబాల్యవివాహాప్రచారమే యని చెప్పవచ్చును. ఆఁడుపిల్లలకెంత శీఘ్రముగా వివాహము చేసిన నంతమంచిది యనిన నమ్మిక పెరిఁగినందునఁ బదు మూఁడు పదునాల్గు సంవత్సరముల కుమారికలు పిల్లలఁ గనుట సంభవించెను. ఇట్టి పసికూనలకుఁ బుట్టినవారికిఁ బచ్చితురక లతోఁ బోరున నిల్చి యెదిరించునట్టి బల మెట్లు కలుగును? చిన్నవయసులో గర్భోత్పత్తియగునేని పిల్లలు బలహీను లగుదురనిన సిద్ధాంత మింగ్లీషువైద్యులు చెప్పుమాటగాని మనహిందువులు చెప్పెడిమాటకాదు అని కొందఱు ఘోరపడ

వచ్చును. కాని యది నిజముగాదు. ఈ యంశమును మన వైద్యశాస్త్రాచార్యు లగు చరకసుశ్రుతాదులుగూడ వ్రాసి యున్నారు. ఇదియుఁగాక యీవిషయ మనుభవైకవేద్యము. కావున నిందునుగుఱించి పెంచి వ్రాయనక్కరలేదు.



# మహమ్మదీయ మహాయుగము

# MOHAMMEDAN PERIOD

రెండు సంపుటములు! ముద్రిత మగుచున్నది. అనేక పటములు!!

ఇది యాఱు ప్రకరణముల గ్రంథము. మొదటి ప్రకరణములో ముసల్మానుల పూర్వవృత్తాంతములును వారీదేశమునకు మొదట వచ్చినప్పటినుండియు స్థానేశ్వరయుద్ధములో (క్రీ॥ శ॥ 1193) హిందూదేశస్వాతంత్ర్యము పోయినంతవఱకును, గలదు. రెండవ ప్రకరణమునందు అఫ్గనుల ప్రభుత్వము వర్ణింపబడినది. మూడవప్రకరణములో మొగలాయి చక్రవర్తుల రాజ్యపరిపాలనము యొక్క వృత్తాంతము గలదు. నాల్గవప్రకరణములో బహమనీరాజుల వృత్తాంతమును అందుండి పుట్టిన ఐదురాజ్యముల కథలును చెప్పబడినవి. ఇంతవఱకు వ్రాయఁబడిన చరిత్రగ్రంథముల ననుసరించినయెడల నీపుస్తక మీనాలుగు ప్రకరణములతో ముగిసియుండవలెను. అట్లుగాక తక్కిన రెండు ప్రకరణములలో హిందూసామ్రాజ్యములు వర్ణింపఁబడినవి.

కొందరు తలచినట్లు హిందూదేశము మహమ్మదీయులకు సులభముగా వశము కాలేదనియు, హిందువులు అభిమన్యునివలెనే యపరిమితపరాక్రమమును జూపి మోసమునకును స్వామిద్రోహమునకు లోనై యోడిపోయిరనియు నీగ్రంథము సప్రమాణముగా జాటుచున్నది.

ఇందు శ్రీకృష్ణదేవరాయలు, పృథ్వీరాజు, రాణాప్రతాప్, అక్బరు, మానసింగ్, నానక్ మొదలయిన మహాత్ముల దివ్యమైనపటములు కలవు.

గ్రంథకర్త: కీ. శే. శ్రీయుత కె. వి. లక్ష్మణరావు, ఎం. ఏ., గారు.

వలయువారు:—

[illegible], బి. ఏ., ఎల్. టి.,

మేనేజరు, లక్ష్మణరాయ పరిశోధకమండలి,

గవర్నరుపేట,

బెజవాడ.

# భారతి

## సచిత్రమాసపత్రిక

ప్రతిచాంద్రమాసాదిని ప్రచురింపఁబడును.

సచిత్రమాసపత్రిక-ప్రతిసంచికయందును 3, 4 రంగుల పటములు కలిగి ఇతరచిత్రపటములతో ప్రచురింపబడును. వాఙ్మయము, చిత్రకళలు, గానము, కథలు, నాటకములు మున్నగు అనేక విషయములతో ప్రతిమాసమునను 200 పుటలు కలిగియుండును.

సంవత్సరచందా రూ 6-0-0 అర్ధసంవత్సరము రూ 3-0-0 విడిపత్రిక రూ 0-10-0 :—

☞ ప్రస్తుతము పోస్టలు రూల్సుప్రకారము. 0-2-0 రిజిస్టరుచార్జి 0-3-0. తపాలుచార్జి అధికమగుచున్నది. మీరాగే స్వామ్ము మాకు ముందుగ మణియార్డరుపంపిన ఈఖర్చు తగ్గును. వీ. పీ. లు పంపినచో ఒక్కొక్కప్పుడు ఆలస్యముగ చేర్పుటయు పత్రికలు పంపుట ఆలస్యమగుటయు సంభవించును.

మేనేజరు, భారతి, తపాలపెట్టెనెంబరు 212 మద్రాసు.